

సంపు. ౧౩ ధాత సంవత్సరము, భాద్రపదమాసము (సెప్టెంబరు ౧౯౩౬) సంఖ్య

# ఆంధ్ర వాగ్దేవి

రాజరాజ నరేంద్రు రాజమందిరమున నఖిలాంగ సౌష్ఠవం బలరఁ బెరిఁగి,
మన్మసిద్ధిమహీశు మణిసౌధములయందు భాగ్యభోగ్యంబులఁ బరిఢవిల్లి,
దక్షిణాధీశు ముత్యాలమండపమునఁ గనకాభిషేకయోగంబు గాంచి,
శ్రీ కృష్ణరాయలసిరిఁ గూడి పల్లకీ లేనుంగు లెక్కి యూరేగి మెఱసి,

వేర్మి నంద్యాల కృష్ణభూవిభుని నగర-ధగధగాయిత నూతనతారహార
మఱుత ధరియించి విబుధలోకార్చలందు నాంధ్రవాగ్దేవి యైశ్వర్య మభినుతింతు.

రామాయణంబుపారాయణంబును వీనులారంగ నాసక్తి నాలకించి,
హరివంశ ముత్తరహరివంశ మిరుగేల నాసతోఁ గొని కన్నులారఁ గాంచి,
భాగవతంబునా భవ్యదివ్యఫలంబు హాయిగా మనసార నారగించి,
కాళహస్తీశ్వరు ఘనత నాకర్ణించి వసుపాండురంగాదివార్త లెంచి,

భద్ర గౌరన శంకరప్రముఖులొసఁగు-పూజలం గొని, మూర్కొని వైజయంతి,
విజయులీలలు చూచుచు వేడ్కమీఱు-నాంధ్రవాగ్దేవి వైభవ మభినుతింతు.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

# తెనుగు కైత

## కొండూరు వీరరాఘవాచార్యులు



తేనెనద్దిన తీపిపదములఁ
దీర్చిదిద్దిన సరసకవితా
శ్రీలహరిలో హృదయనౌకలు
తేలియాడెడును.

వద్దియపురతనాల మూటలు
ముద్దులూరఁగఁ గట్టుచుండిరి,
తెనుఁగుగుండెలలోన నింతటి
తేజ మున్నదియా ?

మాటమాటకు రసము చిప్పిలు
తేఁటకవితలు తెల్గునాడుల
నాఁటుకొనె; నీనవ్యయుగ మే
నాఁటఁ దలయెత్తెఁ ?

భారతామృతవృష్టి తెలుఁగుల
పైన నేక్షణమందుఁ గురిసెనొ,
నన్నపార్యుఁడు; నూత్నమధువులు
నాఁడె చిందినవి.

పల్లవులలోఁ బుట్టి రాయల
ప్రతిభచేఁ బెంపొందినాఁ డీ
యాంధ్రమునఁ బైదెలింగభారతి
యాడె నొకఠీవిఁ.

భక్తిసురభిళపుష్పదామము
ముకుఁ డొటకు-పోతనార్యుఁడు
ఆంధ్రభారతి రమ్యకంధర
నంకితము జేసెఁ.

లలిత లలితకళాధ్వజమ్ములు
తెలుఁగుతేరున నెగురఁగట్టిన
మధురకవి శ్రీనాథుఁ డడుగో
మఱపునకు రాఁడు.



తెలుఁగుదేవికి మంగళము శ
బ్దించుచున్నది కవికుమారుల
లలితవాఙ్మయ విలసితోపవ
నాళిలో నేఁడు.

నవయుగస్వాతంత్ర్య కవితా
నర్తకీకలగానములలో
బయలుదేఱిన దొకవినూతన
భావబంధురము.

ఆపురాస్వాతంత్ర్యమే నా
కమరియుండినఁ దెల్గురాజుల
ఆశ్రయంబే యున్న నభమున
ఆడుకొనఁబోనే ?

తెనుఁగువీరుల తేజ మెఱయఁగ,
తెనుఁగుకత్తులు పదునుదేరఁగ,
తెనుఁగుశిల్పము వెలయఁ బాదర
తెనుఁగు గీతములు.

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"



రేడియో గ్రామఫోన్

మాడల్ 474 A. C.

**వెల రూ. 570.**

రికార్డులను స్వతః మార్చగల పరికరముతోనుండు

మాడల్ 475 A. C.

**వెల రూ. 700.**

ఈ మెషీనులందు మీ నాటకపుసెట్టు రికార్డు లెంత శ్రావ్యముగ నున్నవో విని, కనుగొనుడు !

వివరములకు నేడే వ్రాయుడు.

## రేడియో గ్రామఫోనులు!

శబ్దపునరుత్పన్నమున ప్రఖ్యాతి బడసిన "హిస్ మాస్టర్స వాయ్స్" వారు రేడియోవార్తలను, సంగీతమును సహజమాధుర్యముతో ప్రతిఫలింపగల రేడియోయంత్రములను తయారుచేసియున్నారు. ఈ రేడియో గ్రామఫోను రికార్డులందలి సంగీతమునుకూడ విద్యుచ్ఛక్తిద్వారా ప్రతిఫలింపచేసి నిరంతర సంగీతశ్రవణమునుగూర్చును. జగద్విఖ్యాత "హిస్ మాస్టర్స వాయ్స్" వారి శ్రేష్ఠతమమైన పరికరముచే సమర్పబడిన యీ రేడియో గ్రామఫోనును నేడే కొని విని ఇంటిలి ఔన్నత్యమును కనుగొనుడు.

D. C. స్థలములం దుపయోగించుటకు

రోటరీ కన్వర్టర్ :

వెల రూ. 150/- (ప్రత్యేకము)




# ది గ్రామఫోన్ కంపెని

లిమిటెడ్,

**45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.**



# బలహీనతకు దాగియున్న కారణము

యెట్లు చెదలు పురుగులు గట్టిధూలమును లోలోన క్షీణింపజేసి బడద్రోయుచున్నదో ఆప్రకారమే బలహీనతను నీ శరీరముకూడ దాగియున్న కారణముచే దుర్బలమగును. దేహమునందు కొన్ని "మినరల్సు" (ఖనిజములు) లోపించుటచే తెలుసుకొనవచ్చును.

దుర్బలులుగాను, అనారోగ్యవంతులుగాను నున్నవారిలో అనేకులయందు యీ "మినరల్సు" (ఖనిజములు) లోపించుచున్నవి. పోగొట్టుకొనిన మంచి ఆరోగ్యమును మరల పొందుటకు లోపించినట్టి ఖనిజసత్వములను మరల దేహమునందు చేర్చవలెను. ప్రసిద్ధవైద్యులు కల్జానాను కనిపెట్టియుండుటచే ప్రస్తుత మిది సాధ్యమేను. ప్రతిదినము కొన్ని కల్జానా బిళ్లలను సేవించిన ఆరోగ్యమునకు మూలకారణమును నాటికి బలముగలుగును, శరీరము మరల దృఢవంతముగాను, ఆరోగ్యకరముగా నుండుచున్నది.

ఒకానొకప్పుడు సదా అనారోగ్యముగానుండిన యొకరు వ్రాసినది చదువుడు:

> “పూర్వము తరుచు నేను తలనొప్పి, పిత్తపాండువవలన బాధ పడుచుంటిని. అయితే కల్జానాను వాడిన తరువాత నాకష్టము లన్నియు ఇంద్రజాలమువలె మాయమైనవి ప్రస్తుతము నేను పూర్తిగా తాజాగా యున్నాను. నాకు అద్వితీయమైన ఆరోగ్యమును, జీవశక్తిని గలిగించిన కల్జానాకు వందనములు.”

తక్షణమే కల్జానాను సేవింపుటకు ప్రారంభింపుము. పిమ్మట మీరు కూడ అద్వితీయమగు ఆరోగ్యమును జీవశక్తిని పొందగలరు.




చేతితో తాకబడుట లేదు.

# Kalzana

ఆరోగ్యాభివృద్ధికి ఖనిజసంబంధమైన ఆహారము.

అందరు కెమిస్టులవద్దను, దుకాణము లన్నిటిలోను దొరకును.

# భవభూతి ద్విజేంద్రులు

చర్ల గణపతిశాస్త్రి

వ్రాళ్లు చివురుగొత్త, గండశిలలు ద్రవింపఁగఠోర వజ్రములుసైతము బ్రీలిపోవఁ దన లేఖినిని నడపించి 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అని సంస్కృత సాహిత్య ప్రపంచమునఁ బేరు వడసినవాఁడు భవభూతి. అన్నదమ్ముల కలహములందుఁ, బ్రేయసీప్రియుల ఘోరప్రతిజ్ఞలముంగు హింసామహస్తుదీయుల క్రూరవేదనల నొగుర నలిగిపోయిన ప్రేమరస వాహినిని జాలువాఱఁజేసి 'నాట్యాచార్యుఁ'డని వంగ వాఙ్మయంబునఁ గీర్తిగడించినవాఁడు ద్విజేంద్రలాల్ రాయి. భవభూతి వీరవిహారమునకు మహావీరచరితము విమలాదర్శము. ద్విజేంద్రుని దుర్గాదాసు నాటకము వీరుల పరాకాష్ఠకుఁ బ్రతిబింబము. భవభూతి మాలతీ మాధవము చిత్రకల్పనాశక్తికిఁ బెట్టినది పేరు. చంద్రగుప్తలోఁ జాణక్యనీతికల్పనమున ద్విజేంద్రబాబు చూపిన కౌశలము శ్లాఘనీయము.

కవిచంద్రు లిరువురు భిన్నభిన్న దేశములందు భిన్నభిన్నకాలములలో మహావిప్లవముల నడుమఁ గవితా చంద్రికల వెల్లివిరియఁజేసి లోకమున కాలోకము గూర్చియున్నారు. భవభూతి ప్రాచీన సమీచీన కావ్యరసముల రుచిచూచినవాఁడు. ద్విజేంద్రుఁడు ప్రాచీనార్వాచీన కావ్యంబులఁ బరిశీలించినవాఁడు. ద్విజేంద్రునకు భవభూతి కవితామృతమును జుఱ్ఱుకొను వీలు చిక్కినది. ఈపట్టున భవభూతి యుత్తరరామచరిత్రమునకు ద్విజేంద్రుఁడు శిష్యుఁడుగ నుండకతప్పినదికాదు. దీనికి ఫలితమే ద్విజేంద్రుని 'కాళిదాస భవభూతులు' అను విమర్శ గ్రంథము. అంతతోఁ దృప్తిగలుగలేదు. 'సీత' అను నాటకమును వంగభాషలో రచించి సంతృప్తి పొందినాఁడు.

ద్విజేంద్రుని ప్రతిభ యసమానమైనది. కలము క్రొంగ్రొత్తరుచుల నాస్వాదించినది. బుద్ధి యుత్తర రామచరితము ననుసరించుచుఁ గ్రొత్తదారి త్రొక్కినది. కౌశలము దివ్యత్వముకన్న మనుష్యత్వమును బ్రదర్శించుటలోఁ బ్రసరించినది. మనుష్యాతీతమగు శక్తులను బ్రతిఫలింపఁజేయుట యితని కిష్టముకాలేదు. రామాది పాత్రములకు దివ్యత్వపుమంచుతెరను దొలఁగించి మానవత్వము నంకితముచేసినాఁడు. తాను వ్రాసిన 'సీత' నాటకమును 'ఇతిహాసదృష్టితోఁగాని, ధర్మగ్రంథవిచారణతోఁగాని పరిశీలింపక కావ్యకళాదృష్టితో మాత్రమే పరికింపుఁ'డని భూమికలో వ్రాసికొన్నాఁడు.

ప్రధానాంశములను మార్పక యున్నదానికి మంచిగంధపుఁబూఁతలు పూసి మృదులసురభిళములగు మల్లెపూవుపత్తియలఁ దుఱిమి జగ్గునిగ్గులు దేఱఁ దియ్యని తావులు గ్రుమ్మరింపఁ బాఠకులు చొక్కి సోల రచన కూర్పవలయునని భవభూతియాశయము. స్వరూపమును మార్చి నలుసులఁ దీసివేసి పాత్రముల హృదయములకు నూత్నభావములు పోసి సర్వాంగసుందరముగ నూత్న సృష్టి చేయవలయునని ద్విజేంద్రుని యుద్దేశము. భవభూతి కవి. ద్విజేంద్రుఁడు విమర్శకుఁడు. భవభూతి సంస్కర్త. ద్విజేంద్రుఁడు నిర్మాత. కావ్యకళకు వన్నెగూర్చి భవభూతి పఠితల మనస్సునకు మైమఱపుగూర్పఁగలఁడు. కావ్యకళను సృజించి ద్విజేంద్రబాబు పరిశీలకుల హృదయము నానందింపఁ జేయఁగలఁడు. భవభూతి రామునికిఁ బ్రాధాన్య మిచ్చి యుత్తరరామచరిత మని పేరిడినాఁడు. ద్విజేంద్రుఁడు సీతారాముల సృష్టిలో సీతకుఁ బ్రాముఖ్య మిచ్చి 'సీత'యని నామముంచినాఁడు.

ఇతివృత్తమునఁ బ్రధానాంశములలో భవభూతికిని ద్విజేంద్రునికిని భేదాభిప్రాయము లంతగాఁ గనుపట్టవు. 'సీతావనవాసవిషయమున మహాకవి భవభూతి ననుసరించియుంటి' నని ద్విజేంద్రుఁడు భూమికలోనే తెలిపికొన్నాఁడు. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాం

తాని చ ప్రథంతే' అను ప్రాచీనపద్ధతి ననుసరించి భవభూతి మూలకథలో సంస్కారము చేసియున్నాఁడు. 'క్రౌంచద్వంద్వవియోగోత్థః శోకః శ్లోకత్వ మాగతః' అనునట్లు రామాయణ కావ్యమంతయు శోకాదిగనే పుట్టినది, శోకమధ్యముగనే పెరిగినది, శోకాంతముగనే ముగిసినది. ద్విజేంద్రుఁడు కొత్తరుచులను గ్రోలినవాఁడగుటచే మూలమును మార్చవలసిన యావశ్యకత యతనికి గోచరింపలేదు. సీతను త్యజించుటలో నొకముఖ్యమగుమార్పు గావించినాఁడు.

## కథావస్తువు

'అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రస స్యోపనిష త్పరా'

అని యనౌచిత్యమును బహిష్కరించి తీఱవలయునని శబ్దతత్త్వవేత్తలు నిర్వచించియున్నారు. కావున ననౌచిత్య పరిహారమునకై కవు లెక్కువ శ్రద్ధ తీసికొనవలసిన పరిస్థితి తటస్థించినది. రామాయణమునఁ జరిత్ర కిచ్చిన ప్రాధాన్యము కళ కీయకపోవుటచే నందలి దోషములు పూర్ణముగాఁ బరిహరింపఁబడలేదు. ఉత్తరరామచరిత్రము నందును, 'సీత' యందును మూలగత దోషములు యథాశక్తిగఁ గళాప్రవీణులగు నీకవులచేఁ జాలవఱకుఁ దొలఁగింపఁబడినవి.

ఉత్తరరామాయణమున రాముని నెత్తిపై మోపఁబడిన దూషణములు రెండు. అందు నిష్కారణ సీతాపరిత్యాగము మొదటిది. రెండవది శంబూకవధ. ఈ దూషణములను బహిష్కరించుటకు 'యుక్తః ప్రజానా మనురంజనే స్యాః' అను వసిష్ఠుని యాదేశమును భవభూతి సాధనముగాఁ జేసికొనియున్నాఁడు. వసిష్ఠుని యాదేశము విని

'స్నేహం దయాం తథా సౌఖ్యం యదివా జానకీమపి,
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా "

అని రాముఁడు సీతసమ్ముఖమునఁ జెప్పినపుడు 'అతఏవ రాఘవధురంధర ఆర్యపుత్రః' అని సీత మెచ్చుకొనునట్లు భవభూతి కథ నడిపించినాఁడు. ప్రజానురంజనమునకై సర్వమును, చివరకు సీతనుగూడ సమర్పించుట రామునికి ముఖ్యకర్తవ్యమైనది. లోకకల్యాణమునకై ప్రేమమయులిరువురును స్వార్థత్యాగము చేసిరని తెలుపుటయే భవభూతియాశయము. ఇక్కడ రెండుప్రశ్నలుదయించుచున్నవి. ఒకటి-సీతాసౌశీల్యమునుగూర్చి రాముఁడు ప్రజలకు ఏందుకు నచ్చఁజెప్పలేదు? రెండు - ప్రజలు భ్రమపడినంతమాత్రమున నిరపరాధినియగు జానకిని బహిష్కరించుట యుచితమా? మొదటిప్రశ్నకు జవాబు గ్రంథమునందే చెప్పినాఁడు

'యచ్చాద్భుతం కర్మ విశుద్ధికాలే
ప్రత్యేతు క స్తద్యదిదూరవృత్తమ్' అని.

ఇందువల్లఁ బ్రజలకు నచ్చఁజెప్ప పనినుండి విరమించుకొన్నాఁడు. ఇంక సీత నిరపరాధిని యని తనకు విశ్వాసమున్నపుడు ప్రజల వాక్యములను గణింపకపోవుట యుచితము కాదా యని మనకుఁ దోఁచిన ప్రశ్న. రాముఁడు వనము నుండి వచ్చి యెంతోకాలము కాలేదు. రామరాజ్యపరిపాలనము కన్నులారఁ జూచుటకుఁ బదునాలుగేండ్లనుండి కన్నులు కాయలుకాయ నెదురు తెన్నులు పరికించుచు నప్పుడే తృప్తిఁబొందిన లోకమును 'నీవన్నది భ్రాంతి' అని ధిక్కరింపఁగలుగుట యెట్లు? రాముఁడు వచ్చినాఁడన్న సంతోషములోఁ గొత్తరోజులు గడచినవి. రోజులు ప్రాఁతగిల్లినప్పటికిఁ బ్రజలలో గుసగుసలు ప్రారంభమైనవి. అది చాకలికోటినుండి యెట్లో పాకి బయటఁబడినది. 'ఎపుడో మన రాముఁడువచ్చును మనరాముఁడువచ్చును' అని యంతకాలమునుండియు నువ్విళ్లూరు ప్రజలను దాను రాజ్యమునఁ గాలిడినమాత్రముననే ధిక్కరించుటకు రాజధర్మమును దెలియనివాఁడు కాఁడు రాముఁడు. 'రాజ్యమదాంధతవలన జనులవాక్యము పాటింపకున్నాఁడు' అను నింద నెత్తిపై కెక్కించుకొనువాఁడును గాఁడు. తమకుఁ బ్రతినిధిగా నెన్నుకొని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టినపుడు 'ఇప్పుడు మీ లెక్కయేమి' యనునంతటివాఁడును గాకపోవుటవలననే యిట్టిపని యాచరింపవలసివచ్చినది. ప్రజలు మూర్ఖులనుటకుఁగూడ రాముఁ డంగీకరింపలేదు. దుర్ముఖుఁడు 'ప్రజలు దుర్జను'లని యన్నమాత్రమున 'శాంతం, కథం

దుర్జనాః పౌరజానపదాః' అని దుర్ముఖునిపై మండిపడినాఁడు. 'మిషపెట్టి యడవికి మోసగించి పంపుట యేల? సీతకుఁ దెలిపియే పంపరాదా?' అను ప్రశ్నలు రాకుండఁగనే ప్రజానురంజనమునకై సీతను గూడఁ ద్యజింతు నని రాముఁ డన్నప్పుడు 'అట్లు చేయువాఁడు గావుననే యార్యపుత్రుఁడు రాఘవధురంధరుఁ' డని మెచ్చుకొని ప్రజానురంజనమునకుఁ దన్నర్పింప సీత రామునికి స్వాతంత్ర్యమిచ్చినది. తననోటితోఁ జెప్పఁజాలక లక్ష్మణునిచేఁ జెప్పించి ప్రాణేశ్వరి దీనాననమును గనుఁగొనలేక యటు మిషపెట్టి పంపించునట్లు చేసిన భవభూతికౌశలము మెచ్చుకొనఁదగియున్నది. పోనీ, రామునికిఁ బ్రియురాలియందు విశ్వాసము లేదనుటకు నొకింతయైనను ప్రమాపకము లేకపోవుట సరిగదా పైఁగా జానకియందు రామునికిట్టి పూజ్యభావముగలదో యతని యీక్రింది వాక్యములు వెల్లడించుచున్నవి.

'త్వయా జగంతి పుణ్యాని త్వ య్యపుణ్యా జనోక్తయః,
నాథవంత స్త్వయా లోకా స్త్వమనాథా విపత్స్యసే'

ఇట్టి వాక్యములతో మాత్రమే సంతృప్తిపడలేదు. సీతాపాదరజస్సును శిరమున ధరించి 'తత్కిమస్పృశ్యనీయః పాతకీ దేవీం దూషయామి' అని తన్ను నిందించుకొన్నాఁడు రాముఁడు. ఆయపవాదము వినకపూర్వము చిత్రదర్శనములో లక్ష్మణుఁడు 'అగ్నిశుద్ధి పర్యంతము' అను మాట యన్నంతమాత్రముననే రాముఁడు

'ఉత్పత్తిపరిపూతాయాః కిమస్యాః పావనాంతరైః,
తీర్థోదకంచ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః'

'దేవి! దేవయజనసంభవే! ప్రసీద ఏష తే జీవితావధిః ప్రవాదః' అని మనస్సున నెంతయో నొచ్చుకొన్నాఁడు.

ఇంక రెండవది శంబూకవధవిషయము. రాముని మనస్సులో నిదికూడ నధర్మమనియే స్థిరపడినది. ఇది కూడ నవశ్యాచరణీయమే యైనది.

'రే హస్త దక్షిణ మృతస్య శిశో ర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్,
రామస్య బాహు రసి దుర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుతస్తే'

ఇట్లు, పాపము, వాపోయి యెట్లో శూద్రకుని జంపి 'రామునికిఁ దగిన పని చేసితిని. ఆ బ్రాహ్మణపుత్రుఁడు జీవించునా?' అని నిట్టూర్చినాఁడు. ప్రతము చెడినను ఫలము దక్కలేదనునట్లు మునిని జంపిన పాపము మూటగట్టుకొన్నను బ్రాహ్మణపుత్త్రుఁడు బ్రతుకఁడేమో యని పాపము భీతి రామునికి జనించినది. వర్ణాశ్రమధర్మ విచ్ఛిత్తి నివారణకై రాముని కది యావశ్యకమైనది. రాముఁడు శంబూకునిఁ జంపినవెంటనే శూద్రకునికి దివ్యత్వము వచ్చినట్లు భవభూతికల్పనము జరిగినది. శంబూకుఁడు వచ్చి రామునికి స్వాగతమిచ్చి తన దివ్యత్వమును, బ్రాహ్మణపుత్ర సంజీవనమును జెప్పఁ

స్వయముం ప్ర

తగ్గించుకొన్నాఁడు. పిదప శంబూకుని వీడ్కొలుపుచు 'భద్ర! శివాస్తే పంథానః. దేవయానం ప్రతిపద్యస్వ పుణ్యేభ్యో లోకేభ్యః' అని యాశీర్వదించి సంతృప్తుఁడయినాఁడు.

ద్విజేంద్రుఁడు సీతాత్యాగవిషయమునఁ ద్రొక్కిన మార్గమే వేఱు. రాముఁడు దుర్ముఖుని నోటినుండి సీతాపవాదవార్త విన్నాఁడు. ఆఁగలేకపోయినాఁడు. వెళ్లి వసిష్ఠుని యాశ్రమమున వ్రాలినాఁడు. వసిష్ఠుని వాక్యములు రామునికి నచ్చలేదు. 'నాకిదేమియుఁ దెలియదు. మీయాజ్ఞప్రకారము నడతును, ఆజ్ఞాపింపుఁ' డన్నాఁడు. వసిష్ఠుఁడు సీతాత్యాగమే ప్రస్తుత మవశ్యకర్తవ్య మని చెప్పినాఁడు. సరే యని యక్కడనెట్లో యొప్పుకొని యయోధ్యకు వచ్చినాఁడు. మనస్సులో వేదన బయలుదేఱినది. ఈవార్త అంతఃపురములోఁ బొక్కినది. భరతుఁడు, శాంత యిద్దఱును వచ్చి ప్రబోధించినారు కాని వారి వాక్యములు రామునిముందు పనికిరాలేదు. తల్లి కౌసల్యవచ్చి సీతను విడిచిపెట్టనీయనని పంతముపట్టినది. 'నీకు మాతృవాక్యపరిపాలనము తప్ప' దన్నది. చివరకు మాతృవాక్యము రాముఁ డంగీకరింపక తప్పినదికాదు. సరే నీమాట చెల్లింతు నన్నాఁడు. సంతోషించి కౌసల్య వెళ్లిపోయినది. వసిష్ఠుని కిచ్చినమాట గుర్తువచ్చినది. హృదయములో ద్వంద్వ యుద్ధము బయలుదేఱినది. తండ్రియగు దశరథుని యవస్థ తటస్థించినది. కింకర్తవ్యతా

మూర్ఛుఁ డైనాఁడు. ఇంతలోఁ బ్రేయసి జానకి ప్రత్యక్షమైనది. సీత భర్తృదుఃఖవార్తయైనను వినలేనిది. భర్తృదుఃఖ మన్న సంగతి వినఁగానే యామె హృదయమును వేయివహనములు తగులఁబెట్టుచున్నట్లు తోఁచినది. 'నే నిదిగో పోవుచున్నాను. విచారింపక ధైర్యముతో లేచి కూర్చుండుమని ప్రియునితో నన్నది. పితృవాక్యపరిపాలనము గావించి రాముఁ డడవికిఁ బోయినట్లు సీత భర్తృవాక్యపరిపాలనము గావించి వనమునకేఁగ సమకట్టినది. లేవలేక కూలఁబడిన రామునిని హృదయమున నద్దుకొని జానకి భర్తను వీడ్కొనినది. ఇది ద్విజేంద్రుని నూత్న సృష్టి.

శూద్రకుని విషయమునుగూర్చి ద్విజేంద్రుఁ డిట్లు భూమికలో వ్రాసియున్నాఁడు. 'శూద్రకుని విషయములో రాముని దోషమును గప్పిపుచ్చుటకుఁగాని, దానికేదో యాధ్యాత్మికవ్యాఖ్యను గల్పించుటకుఁగాని నేను యత్నింపలేను. ఆకాలములో శూద్రులవిషయమున బ్రాహ్మణుల వ్యవహార మట్లుండెడిదని నాయాశయము. కాని నే నీవిషయములో మాత్రము రామునిని దోషినిగాఁ బరిగణింపక దానిని వసిష్ఠునికిఁ గూర్చియుంటిని' అని.

భవభూతిద్విజేంద్రు లిరువురు నిట్లు ఆరెండువిషయములనుగూర్చి తమయుద్దేశము ననుసరించి రామాదులను జిత్రించిరి. మిగిలిన విషయములలో రామాయణమునకును ద్విజేంద్రుని 'సీత'కును భేదము కనుపట్టదు. భవభూతిమాత్రము ఇంకను గొన్ని చమత్కారవిషయములను గూర్చినాఁడు. ఒకటి చిత్రదర్శనము. రెండు సీతారాముల పునర్దండకాప్రవేశము. మూఁడు అంతర్నాటిక.

జనకమహారాజు రామపట్టాభిషేకము చూచుటకై వచ్చి వెళ్లినపిదపఁ దండ్రివియోగమునకు విచారించు సీత నూరడించుటకు రాముఁ డుపాయము వెదకినాఁడు. తమ పదునాల్గు సంవత్సరముల చరితమును జిత్రించిన చిత్రము స్ఫురణకు వచ్చినది. లక్ష్మణుఁడు దీసికొనివచ్చినాఁడు. విశ్వామిత్రుని యాగరక్షణకై అడవికిఁ బోవు ఘట్టము వచ్చినది. జృంభకాస్త్రముల యుపదేశము చూడఁగనే గుర్తువచ్చి సీతాసంతోషమునకై తన సంతానమున కాయస్త్రములను బ్రసాదించినాఁడు. ఆజృంభకాస్త్రములే కుశలవులు రాముని తనయులని తెలిసికొనుటకు సాధనములైనవి. చిత్రగత భాగీరథీవర్ణనమున 'సా త్వ మంబ స్నుషాయా మరుంధతీవ సీతాయాం శివానుధ్యానపరా భవ' అను రాముని మాటలు సీత గంగలోఁ బడినపుడు గంగ సీతను రక్షించుటకుఁ గారణములైనట్లు కవియే సప్తమాంకమునఁ దెలిపినాఁడు. సీత లంకలో నున్నపుడు రాముఁ డెట్టి దుర్భరవియోగవేదన ననుభవించెనో దానిని 'జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితై, రపి గ్రావా రోదిత్యపి దలతి వజ్రస్య హృదయం' అని కవి సంగ్రహముగాఁ దెలుపుటకు వీలైనది. చిత్రదర్శనమున కన్నిటికంటె ముఖ్యప్రయోజన మిది. చిత్రదర్శనమునకుఁ బిదప సీత యిట్లన్నది. 'ఆర్యపుత్ర! ఏతేన చిత్రదర్శనేన ప్రత్యుత్పన్నదోహదా యా అస్తి మే విజ్ఞాప్యం. జానే పునరపి ప్రసన్నగంభీరాసు వనరాజిషు విహరిష్యామి' అని ఇట్లు చిత్రదర్శనమువలన సీత తానే వనగమనమును గోరుకొన్నది. చిత్రదర్శనములేక సీత యిట్లు కోరకపోయినచో రాముఁ డేమిషపెట్టి జానకిని వనమునకుఁ బంపియుండెడివాఁడో.

ఇంక రెండవది సీతారాముల దండకాప్రవేశము. మూఁడవయంక మంతయు దీనితోనే నిండియున్నది. శంబూకునిఁ జంపుటకై రాముఁడు పుష్పకవిమానము నధిరోహించి దండకను బ్రవేశింపవలసివచ్చినది. పూర్వము ప్రియురాలితోఁగూడ సుఖముగా విహరించిన దండకలో రాముఁ డొంటిగఁ దిరిగి జీవనము ధరింపలేఁడు. రాముని సుజ్జీవింపఁజేయుటకై సీతాసాన్నిధ్య మత్యావశ్యక మైనది. అపుడు రాముని హృదయమునఁ దన మీఁద నెంతటి యగాధప్రేమ యున్నదో సీత కన్నులారఁ జూచి యానందించుట తటస్థించినది. సీత తిరస్కరణీవిద్యచే నంతర్హితయైయుండుటవలన రామునికిఁ గన్పింపలేదు. సీతను సమావేశపఱచుట వనదేవతలచే గూర్పఁబడినది. దీనిలోఁ గవి యెంతటి కళాప్రావీణ్యము చూపించినాఁడో ముందు తెలియఁజేయుదును. సీతామనమునను 'రాముఁడు నిష్కారణపరి

త్యాగి' అను హృదయశల్యమును దీసివేయుట కిది ముఖ్య కారణము. 'సహధర్మిణినిగా సీతాస్వర్ణప్రతిమను బూజించుచుంటి' నని రాముని వాక్యములు వీనులార రాముని నోటినుండి విను భాగ్యము తటస్థించుటకు దండకారణ్య ప్రవేశమే ముఖ్యాధారమైనది. భవభూతి యీసమావేశముకొఱకే, రాముని యగాధప్రేమమును జానకికిఁ జూపుటకొఱకే ఈనాటకమురచించెనని చెప్పఁ బడియున్నది.

ఇంక మూఁడవది యంతర్నాటిక. ఇది సీతా హృదయవేదనను రామునికిని, పౌరులకును సాక్షాత్కరింప జేసి వారి మనస్సుల నార్ద్రీకరింపఁజేసి సీతాస్వీకారమునకుఁ దోడ్పడుటకు వాల్మీకిచే నయోధ్యానగరమున నేర్పాటుచేయఁబడిన నాటిక. నాటికలోని సీతాచరితముఁ జూచి యోఁగలేక రాముఁడు మూర్ఛిల్లును. జలము నుండి పృథ్వీభాగీరథులు సీతను లేవఁదీయుదురు. సీత త్వరగా వచ్చి రామునిని స్పృశించి మూర్ఛనుండి తేర్చును. పిదప నరుంధతి లేచి యిట్లుపన్యసించును.

'ఓపౌరజానపదులారా, యీజానకి యిపుడు పృథ్వీ భాగీరథులచేత నిట్లు కొనిరాఁబడి యరుంధతి నగు నాకు సమర్పింపఁబడినది. పూర్వము భగవంతుఁడగు వైశ్వానరుం డీమె పుణ్యచారిత్రమును నిర్ణయించినాఁడు. బ్రహ్మాది దేవతలు కొనియాడియుండిరి. ఈమె సూర్య కులవధువు. దేవయాజన సంభూత. సీతను బరిగ్రహించుట మీకు సమ్మతమే కదా' అని. అందులకు లక్ష్మణుఁడు దేవమానవులంగీకరించినట్లు సాక్ష్య మిచ్చినాఁడు. సీతారాముల సమాగమసిద్ధికొఱకేగదా యీయంతర్నాటిక కల్పింపఁబడినది. అది దీనివలన సిద్ధించినది.

ద్విజేంద్రుఁడు తన నాటకమునఁ బాత్రములకు మానవత్వమునే నిరూపించియున్నాఁడు. మానవానుభవములనే ప్రదర్శించుట యితని కభిమతమై యున్నది. భవభూతిమాత్రము మానవానుభవాతీతములనుగూడఁ బ్రదర్శించును. ద్విజేంద్రుఁడు తన నాటకమున మొదటి దృశ్యములో నలుగురు సోదరులను బ్రవేశపెట్టినాఁడు. రాముఁ డడవికిఁ బోయివచ్చినపిదపఁ బట్టాభిషేకపుఁ దొందరలో సోదరులు కలిసి కష్టసుఖములు చెప్పుకొనుటకు వీలు చిక్కినది కాదు. తొందరలు అడఁగినవి. కావునఁ గవి నలుగురుసోదరులను సమావేశపఱచినాఁడు. రామునికిఁ బ్రకృతిశోభాలోకనమున నున్న యను భవము రాజ్యకార్యావలోకనమున లేనందునఁ బరిపాలన పద్ధతులు, రాజదోషములను దెలిసికొనుటకు వలయు నీతులు భరతుని నడిగి తెలిసికొన్నాఁడు. నలుగురు సోదరులను గష్టసుఖములు చెప్పుకొననిచ్చినటే నలుగురు చెల్లెండ్రను వదినెగారగు శాంతను జేర్చి కష్టసుఖములనుగూర్చియు, వనవాసపర్ణశాలనివాససౌఖ్యములనుగుఱించియుఁ జెప్పుకొనునట్లు చేసినాఁడు. ఒక దృశ్యములో బదునాలుగు సంవత్సరములును విరహవ్రతమును బూని ఘోరవియోగవేదనను అణఁచికొనియున్న ఊర్మిళాలక్ష్మణులను జేర్చినాఁడు. ఊర్మిళాలక్ష్మణుల సమావేశపఱచినది యీద్విజేంద్రుని కరుణాదృష్టి యొక్కటియే. పాపము ఊర్మిళాలక్ష్మణులను మఱవనందులకు ద్విజేంద్రునికి ధన్యవాదములు. భవభూతి సీతారాముల కరుణరసమున మగ్నుఁడైయుండుటచే నతనికి మఱి యొకటి గోచరింపనేలేదు.

రాముఁడు దుర్ముఖునినుండి సీతాపవాదవార్తను విని యాసంగతి చెప్పినందుల కతనిపైఁ గోపపడి యిట్లు నిందించినాఁడు. 'దుర్ముఖా! ఏమంటివి? నీ కింత పొగరా దుర్మతీ! ఆమె యెట్టిదో నీ వెట్టివాఁడవో యెఱుఁగుదువా? విశ్వాసఘాతుకుఁడా' అని యింతలో సద్దుకొని నీవు చేసినది మంచిదే యని మెచ్చుకొన్నాఁడు. తిరిగి మానవసహజమగు మోహములోఁ బడి 'జానకి పవిత్రురా లగుఁగాక యపవిత్రురా లగుఁగాక, యామె నాప్రాణము. ఇతరుల యిచ్ఛనుబట్టి సీతను ద్యజింతునా? ఎప్పుడును అట్లు చేయను. ప్రజల కిష్టము గానిచోఁ గానిమ్ము. నేను నాచేతులతో నాకళ్లు పెఱికికొందునా? ఓదుర్ముఖా! పాపీ! నాయుప్పుతిని నాయింటివాసములు లెక్కపెట్టుదువా? కృతఘ్నా!' అని యిట్లు నిందించుచుఁ దిరిగి తెలివితెచ్చుకొని కర్తవ్య పాలనకై కడంగుచుండును. చివరకుఁ బ్రజారంజనము సర్వవిధముల నాచరింపుమని యాజ్ఞ

యుడిన గురువును వసిష్ఠునిఁగూడ నిందింపకుండ నుండ లేకపోయినది యతని మానవస్వభావము. సమస్తరాజ్యము మట్టిలోఁ గలిసిపోయినను సీతను త్యజింపనని తలఁచినాఁడు. మరల బుద్ధి మాఱినది. వసిష్ఠుని దగ్గఱకుఁబోయి యాలోచన చేసినాఁడు. వసిష్ఠుని యనుమతిప్రకారము సీతను త్యజింతునన్నాఁడు. దానిని కౌసల్య మరలమార్చి వేసినది. రామునికి నిర్ణయశక్తి క్షీణించినది సీత వచ్చి తానే సెలవుతీసికొని పడలిపోయినది. పై ఘట్టములో ద్విజేంద్రుఁడు రాముని మానవునిగానే నిర్మించినాఁడు. ఇట్లే భరతునికూడ నిర్మించినాఁడు. సీతను త్యజించిన తోడనే భరతుఁడు రాముని యవమానకృత్యమును సహింపలేక రామునిఁ ద్యజించి మేనమామయింటికిఁ బోయినాఁడు. రాముఁడు తన తండ్రి యని తెలిసినప్పుడు కూడ లవుఁడు తండ్రికి నమస్కరింపనని రామునితో నిట్లు నిశ్చితిగా నన్నాఁడు. 'నీవు పృథ్వీపతి వగుదువుగాక, ధర్మపరాయణుఁడ వగుదువుగాక. నీవు కాపురుషుఁడవు, పాపివి. నీపాపమున కంతము లేదు. ఈకళంకము నీముఖముపైఁ జిరకాలము నిలుచుఁగాక. నాతల్లి నిన్ను క్షమించుఁగాక. నీవు తండ్రివి. నేను గొడుకును. అహో! ఇట్టి సంబంధము తెలుపునపుడు నేను సిగ్గువలనఁ దలవంచుకొనవలసివచ్చుచున్నది.' అని ఇట్లే యింకను ద్విజేంద్రుఁడు శూద్రకపత్నిచే రాముని నిందగావించినాఁడు. రాముని దివ్యునిఁగా నంగీకరింపకపోవుటకుఁ బైవి ప్రబలకారణములుగాఁ జూపి యున్నాఁడు కవి.

భవభూతిమాత్రము రామునిని కేవలము దివ్యునిఁగానే చూపలేదు. మధ్యమధ్య మానవునిగాఁ గూడఁ జూపినాఁడు. వాసంతి రామునితో మాట్లాడునపుడు అతనిని మానవునిగానే తలఁచి యిట్లు నిందించినది.

'అయి కఠోర! యశః కిల తే ప్రియం
కిమయశో నను ఘోరమతః పరం' అని.

లవుఁడుగూడ రాముని మనుజునిగానే తలఁచి 'వృద్ధాస్తే న విచారణీయచరితాస్తిష్ఠంతు కిం వర్ణ్యతే' అని యాక్షేపించినాఁడు. జనకమహారాజు దృష్టిలోఁ గూడ రాముఁడు మానవుఁడుగనే యున్నట్లు కన్పట్టుచున్నది. కనకనే 'అహో దుర్మర్యాదతా పౌరాణాం, అహో చ క్షిప్రకారితా రామస్య' అని రాముని నిందించి యతనికి శాప మీయఁబోయినాఁడు. ఇట్లు బహు విరళముగా రాముని మానవునిగా నిరూపించియున్నను ప్రతిస్థలమునందును రామునికి దివ్యత్వమే నిరూపింపఁబడినది. తన్ను వధించిన రామునిఁగూడ శంబూకుఁడు దివ్యునిగానే తలఁచియున్నాఁడు. పైఁగా నతనికిఁ బూజచేసి రామదర్శనమునఁ దన్నుఁ బవిత్రునిఁగాఁ దలచియున్నాఁడు.

ధర్మనిర్ణయ పద్ధతిలో నీ రవలంబించిన మార్గములు వేఱు. ధర్మాధర్మములను బాత్రల ముఖమున వాదించి ద్విజేంద్రుఁడు నిర్ణయింపఁజేసినాఁడు. వాదనలో నతని శక్తి యద్వితీయమైనది. గురువునాజ్ఞను దిరస్కరింపలేక సీతాత్యాగవిషయమునఁ గృతనిశ్చయుఁడగు రామునితో వాదించి గురునాజ్ఞకన్న మాత్రాజ్ఞ యుత్తమమని కౌసల్య రాముని నిరుత్తరునిఁ జేసి తన యభిప్రాయము నంగీకరింపఁజేసినది. శంబూకుఁడు రామునితో మనుష్యధర్మమును గూర్చి వాదించును. ఆవాదములో రామునినిలా శంబూకుఁడు చిత్తుచేసినచును. 'బ్రాహ్మణక్షత్రియ వైశ్యభేదము ఎవరు చేసినది? జాతిభేదమే కల్పింపఁదలఁచినచో నీశ్వరుని నీతి ననుసరించి కల్పింపుఁడు. సింహ మెద్దు ఎన్నటికిని గాఁజాలదు. ఎద్దు సింహ మెన్నటికిని గాఁజాలదు. కుక్క యెంతటి బుద్ధి గలదైనను కుక్క కుక్కగానే యుండును. కాని మనుష్యుని కొకవేళఁ బిచ్చియెత్తినను అతనినుండి మనుష్యత్వము పోదు. శూద్రునియందుఁగూడ బ్రాహ్మణునితోఁ దుల్యముగా విద్య, బుద్ధి, న్యాయము, ధర్మనిష్ఠ యుండుట యసంభవము కాదు. ఇట్లే బ్రాహ్మణుఁడుకూడ శూద్రునికంటెఁగూడ నధముఁడుగా నుండనువచ్చును. జన్మమంతయు శూద్రుఁడు సేవకుఁడుగానే యుండవలయుననుట యేమి ధర్మము? ఈ నియమము స్వాభావికమా? ఇట్లు చేయుట విధాతకుఁ గళంకముఁగూర్చుట గాదా? నేనుజేసిన యపరాధ మేమి? హత్య చేయలేదు దొంగతనము చేయలేదు. నేను జేసిన యపరాధ మిది. నేను సంసారమునందలి కలుషచింతలవలనఁ జీవికి

పోయి నామనస్సును ఆపరబ్రహ్మమువైపునకుఁ ద్రిప్పితిని. శూద్రునికి మెదడు లేదా? కేవలము సేవకవృత్తికే శూద్రజన్మ మయినచో నీశ్వరుఁడు కాలుసేతులుమాత్రమే యీయక మిగిలిన యింద్రియములుకూడ నేల యిచ్చినాఁడు?' ఈవాదనకు రాముఁ డొక్కటే సమాధాన మిచ్చినాఁడు. 'ఇది సత్యమో, యసత్యమో, లేక భ్రాంతియో నాకుఁ దెలియదు. రాజనియమము నుల్లంఘించితివి కనుక దండనార్హుఁడవు' అని. ఇట్లే సీతాస్వీకారవిషయమున వాల్మీకివసిష్ఠులకు వాదము జరిగినది. కర్తవ్యముకన్నఁ బ్రేమ యుత్తమమని వాల్మీకి వాదము. చివరకు వసిష్ఠుఁడు తన పరాజయము నంగీకరించినాఁడు.

సీతాత్యాగమువిషయమున వసిష్ఠుని వాదము రామునికి నచ్చలేదు. రాముఁ డచలుఁడై యతనివాదము నంగీకరింపఁడు. ద్విజేంద్రుఁ డిచ్చట రాముని జక్కఁగాఁ జిత్రించినాఁడు. 'నిరపరాధినియగు జానకిని ఏదోషమువల్లఁ బరిత్యజింతు'నని రాముఁడు ప్రశ్నించును. దానికి వసిష్ఠుఁడు "వెనుక నీకు వనవాసము తటస్థించినదిగదా, నీవేమి యపరాధము చేసితి వని యది సంభవించినది? నీవు కుంభకర్ణాదుల నే యపరాధమువలన సంహరించితివి? నిర్ధనుఁ డే యపరాధమువలన దారిద్ర్య యాతన ననుభవించుచున్నాఁడు? నీ వెవఁడవు? నే నెవఁడను? ప్రతివాఁడును సంఘముచే రక్షింపఁబడెడువాఁడె. అందఱిమీఁదను సంఘమున కధికారము గలదు. ప్రతివ్యక్తికిని సంఘము పాదముల పయిఁ దన సంపద, స్వేచ్ఛ, సుఖము సర్వము సమర్పణము చేయవలసియుండును. స్వర్గనరకములు, పాపపుణ్యములు విధాతసృష్టించినవి కావు. ఇఁక యపరాధముసంగతియా? ఈజగములో ఎవఁడు ఎవనికి న్యాయవిచారము చేయఁగలఁడు? నరహత్య పాపమని సంఘము చెప్పుచున్నది. కాని యుద్ధములలో వేలకొలఁది నరహత్యలు జరుగుచున్నవి. వానిని బాపమని యెవరు చెప్పఁగలరు" అని సమాధానము చెప్పినాఁడు. అపుడు 'అట్లయినఁ బాపపుణ్యములు లేనేలేవా?' అని రాముని ప్రశ్న. దానికి వసిష్ఠుని సమాధాన మిది. 'అవును, లేనేలేవు. ఈప్రశ్న తుపాను నడుగుము. అది లేవని చెప్పును. పిడుగు నడుగుము. భూకంపమును బ్రశ్నింపుము. దావానలమొసఁగు సమాధాన మాలకింపుము. క్షామము చెప్పు సంగతియేమి? ముసలితన మేమి చెప్పునో తెలియునా? ఇవియన్నియు నైకకంఠ్యముగఁ బాపపుణ్యములు లేవని చెప్పుచున్నది. ఏ పనులు చేసిన సమాజమున కశుభము వాటిల్లునో యవియే పాపములు. పాపపుణ్యములు సమాజము శాసించు కృత్యములు. ఆ సమాజమునకుఁ బ్రతినిధియగు పదవి నధిష్ఠించియుంటివి. సమాజమునకు భృత్యుఁడవు.' అని. ఈ గంభీరోపన్యాసము రాముని గించిత్తయినను గదల్పలేకపోయినది వాదము నంగీకరింపలేదు. కాని 'నా కిది తెలియదు. ఆజ్ఞయిడుము. అట్లు చేయుదు'నని యతని యాజ్ఞానుసారము చేయ నిశ్చయించినాఁడు. ఇట్లు ప్రతిస్థలమునందును బాత్రలముఖముననే ధర్మాధర్మములను ద్విజేంద్రుఁడు నిర్ణయింపఁజేసినాఁడు. వసిష్ఠుని వాదము సీతాత్యాగమువిషయమున విన్నవాఁ డగుటచే శంబూకుని వధవిషయమునఁ దాను వాదింపలేదు. తదాజ్ఞనుమాత్రము నిర్వర్తించినాఁడు రాముఁడు.

భవభూతిపద్ధతి వేఱు. అతఁడు ఆపాత్రలచేఁ బ్రత్యక్షముగా వాదింపించి ధర్మాధర్మ నిర్ణయమునకుఁ బూనుకొనఁడు. మధ్యవర్తి తీర్పు చెప్పినట్లు పరోక్షమున నితరపాత్రములచే ధర్మనిర్ణయము గావించును. యుక్తివాదము పఠితలకు వదలిపెట్టును.

'స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః' అని సూత్రధారునిచేఁ బలికించి యదియును సరిపోదని తలఁచి నటునిచే 'అతిదుర్జన ఇతి వక్తవ్యం' అని పలికించినాఁడు. సీతాశీలమువిషయమున 'తత్క మస్పర్శనీయః పాతకీ దేవీం దూషయామి' అని రామునిచే సీతాసౌశీల్యముగూర్చి యనిపించినాఁడు. శంబూకవధ యనుచిత మనుమాట 'కృతం రామసదృశం కర్మ' అని రామునిచే ననిపించియున్నాఁడు భవభూతి. ఇట్లు దోషములు దోషములుగా సూచించియున్నను దోషనివారణము చేయుటలో నతని కల్పన యద్భుతమై యున్నది.

ద్విజేంద్రుఁడు తన నాటకమును గావ్యకళా దృష్టితోఁ జూడవలయు నని భూమికయందే తెలిపి యున్నాఁడు. గేయముల ప్రసక్తి వచ్చిననే కాని తన నాటకములందు గీతికలను ద్విజేంద్రుఁడు రచింపలేదు. వచననాటకము లాధునిక కవిసమ్మతములై యుండుట చేతను, అవియే తన రుచితములుగాఁ దోఁచుటచేతను ఈకవి యట్లే వచనరచన గావించియున్నాఁడు. ఇకఁ దే విషయములను జెప్పినను ఆవేశపూరిత హృదయముతోఁ జెప్పును. రచనలో శివమున్నది. ప్రేమవిషయము వచ్చినపుడు ఔచితిని విడనాడక పాత్రములను ప్రకృతిముగ్ధులను గావించి తాను ముగ్ధుఁడై పాఠకులను ముగ్ధులను గావించివైచును. వీరము ప్రదర్శింపవలసివచ్చినపుడు పాఠకుల హృదయమందలి రక్తము పొంగి పొరలిపోవునట్లు రచింపఁగలఁడు. ఏ పాత్రను జూపవలసివచ్చినపు డాపాత్రయై తాను వెంటనే యటఁ బ్రత్యక్షమగును. తనకు నచ్చని విషయములను ఎవఁడుదగ్గఱనైనను 'నాకు నచ్చవు' అని నిర్ణయముగాఁ జెప్పును. తన కులగురువు సీతాత్యాగ విషయమునఁ జెప్పిన వాక్యములనుగూర్చి 'నా కివి నచ్చలేదు. మీరు చేయుమని యాజ్ఞాపించినచో మాత్రము చేయుదు' నని రామునిచేఁ జెప్పించినాఁడు. కర్తవ్యపాలనములో వసిష్ఠుని నతినిష్ఠురునిగనే చూపినాఁడు. శంబూకుఁడు రాముఁడు మహారాజైనంతమాత్రమున నోరు మూసికొని దోసిలొగ్గలేదు. నిర్భీతిగాఁ దన వాదము విన్పించినాఁడు. లవుఁడు తన్ను నిందించినప్పుడుకూడఁ దన తప్పులను దెలిసికొని లవుని మెచ్చుకొనునట్లు రాముని పాత్రము నుచితముగాఁ గవి పోషించినాఁడు. భరతుని పాత్రనుగూడ నిట్లే నడపినాఁడు. రామునియం దధిక భక్తిగల భరతుఁడు సీతాత్యాగ విషయమునఁ దన యసమ్మతిఁ జూపి యక్కడినుండి వెడలిపోయినాఁడు. వాల్మీకివాదము నంగీకరించి వసిష్ఠుఁడు తన గౌరవభంగమునకు వెఱవక యాత్మపరాజయమునకు సిగ్గుపడక సత్యమునందే దృష్టియుంచి బ్రహ్మర్షిపదవి కౌచిత్యమును బోషించియున్నాఁడు. ఈ పాత్రముల యన్నిటికంటె సీతపాత్ర కత్యధిక ప్రాముఖ్యమిచ్చినాఁడు కవి. రాముని యర్ధాంగియయి 'ముందు నూయి వెనుక గోయి' యన్నట్లు రాముఁ డెట్లును జేయలేని స్థితిలోనున్న సమయమున నాత్మార్పణముగావించినట్లు సీతను జూపి సీతపాత్ర కెంతయును గవి యౌచిత్యమును నిర్వహించియున్నాఁడు. సీతపాత్రను సీత యుదారహృదయమును జూపుటకుమాత్రమే కవి తన నాటకము వ్రాసినట్లును గన్పట్టుచున్నది. సీతావనవాసమునకు, రామప్రతిజ్ఞాపాలనమునకుఁ, బ్రజారంజనమునకు, వేయేల రాఘవవంశప్రతిష్ఠకు సీతయుదారహృదయమే కారణమని కవి నిరూపింపఁదలఁచి సీతాపాత్రము నట్లు నిరూపించినాఁడు. అందువలననే యీనాటకమునకు 'సీత' అను నామముంచి ద్విజేంద్రుఁడు ధన్యుఁడైనాఁడు. సీతపాత్రమునకుఁ బిదప శ్లాఘింపఁదగినది యాత్రేయి. లక్ష్మణుఁడు వచ్చి 'ఎన్నిదినములకుఁబిదప?' అని పలికినాఁడు.

ఆత్రేయి: — నాథా! నా కిది తెలియదు. నాథుని దర్శనము లభించినదిమొదలు గడచిన విరహవేదన విస్మరింపఁబడినది. కొంచెమైనను దుఃఖము గలుగుటలేదు. కేవలము తృప్తిలో మునిఁగియున్నదానను. నా కిపుడు జగము సుఖమయముగాఁ దోఁచుచున్నది. దివ్యహాసము విన్పించుచున్నది."

ఆహా యేమి యాత్రేయియొక్క మధురవాక్యములు! ఇన్నినాళ్లకు భర్త వచ్చిన పిదప దర్శనమాత్రముననే విరహవేదన మఱచిపోయినది. సంతృప్తి యామెయందు మూర్తీభవించినది. ఇట్లు ప్రతిపాత్రయందును ఔచిత్యమును మధురముగాఁ బ్రకటించినాఁడు.

కవి ప్రణయవర్ణనము చూపవలసిన సమయములలోఁ బ్రణయమునకుఁ దోడుగాఁ బ్రకృతిసౌందర్యము నూఁతగొనుచుండును. ఒకదృశ్యములో సీతాత్యాగమునకుఁ బూర్వము సీతారాములు పూవుఁదోఁటలో విహరించుచుందురు. అపుడు వారికి మారుతవిహారము, చంద్రికలంగ్రోలు చకోరంబుల కేరింతలు, పండుటాకుల మర్మరనినాదంబులు, చిఱునవ్వునవ్వు పువ్వుల ఖేలనంబులు మొదలగునవి మిత్రంబు లయినవి.

ఊర్మిళాలక్ష్మణుల ప్రణయమునఁ గూడఁ గవి ప్రకృతిదృశ్యములనుజూపి యున్నాఁడు. ఊర్మిళప్రియునకుఁ జూపుచున్నది. అదిగో క్రొంజివుళ్లునిండిన పూవుఁదోఁటలోఁ బూఁబెదవులనుండి కోమల మంజుహాసమర్మర నినాదంబులు చెవులకింపుగూర్చుచున్నవి. దట్టంపుటీరంబులలోఁ బచ్చని చెట్టుకొమ్మలపయిఁ బక్షులు కోకిలారవము గావించుచున్నవి. హరిణి తన చిన్నిసూనలతో పర్యాటము లాడుచున్నది. పారావతమిథునంబులు రహస్యసమావేశంబున నానంద మందుచున్నవి. నదీతీరంబున గోవులు పచ్చికబయళ్లలో మేయుచున్నవి." వీనిని జూచి లక్ష్మణుఁడు ముగ్ధుఁడగును.

సీతాత్యాగమువిదప రాముఁడు ప్రకృతిదృశ్యములను వీక్షించియే కాలయాపనము గావించుకొనెను. చంద్రుని యస్తమయము, సప్తర్షిమండల సంకోచము, నీలాకాశమండలి నక్షత్రప్రకాశము ఇతనికి వినోదభూము లయినవి. విరహికాన నాకాశమండలి ఘనాంధకారములో అనంతప్రకాశము మృత్యువును జయించు ప్రేమవలెఁ గన్పించినది. సరయూనదీప్రవాహము తనవలె విలపించుచున్నట్లు గోచరించినది. ఇట్టివిధముగఁ గావ్యకళయందు ద్విజేంద్రుఁడు తనప్రతిభను వెలడించియున్నాఁడు.

భవభూతి పాత్రముల యౌచితిని బాగుగఁ బోషించినాఁడు. గ్రంథవిస్తరభయముచే మచ్చున కొకయుదాహరణము మాత్రము చూపుదును. చిత్రదర్శనములో లక్ష్మణుఁడు మంథరనుజూపి కైకావృత్తాంతము స్మృతికిఁ దెచ్చునప్పటికి రాముఁ డదిత్రోసివేసి వేఱొక చిత్రమును జూపించినాఁడు. లక్ష్మణుఁడు సీతతో నప్పుడు 'మధ్యమాంబవృత్తాంతమును దాఁటించినాఁడు రాముఁ'డని పలుకును. ఇంతకుఁ బూర్వము పరశురామ గర్వభంగమువిషయమునుగూడ నిట్లే దాఁటించినాఁడు. భవభూతిరాముని యందు సీత ఎప్పుడు నుండకమాదచుండను. ధర్మనిర్ణయసమయమున సీతామూర్తి, అటవీదర్శనమున సీతామూర్తి, యుద్ధరంగముల సీతామూర్తి ప్రతిసమయమందును సీతామూర్తియే రాముని ముఖమున సాక్షాత్కరించుచుండును. పంచమషష్ఠాంకములలోఁదక్కఁ బ్రతియంకమునందును రాముని ప్రవేశము గలదు. రాముని హృదయమును సీతా నిష్కారణ పరిత్యాగశల్యము అనుక్షణమును వేధించుచునేయున్నది. ఆశల్యము నూడఁదీయుటకు భవభూతి యావచ్ఛక్తి నుపయోగించినాఁడు. కనుకనే యుత్తరరామచరిత మని పేరుపెట్టినాఁడు భవభూతి. సీతచేతనే యాహృదయశల్యమును ద్వితీయాంకమునఁ దీయించినాఁడు, ధన్యుఁ డయినాఁడు. తృతీయాంకముఁ గల్పించుటలోని యాశయ మిదే. సీతకు భర్తృహృదయము తెలియును. ఆపైని గన్నులార రాముని చరితమును జూచిన సీత, పవిత్రప్రేమయుత సీత, రామునిని బల్లెత్తుమాటయైన ననలేదుసరిగదా, పైఁగా రామునిని మెచ్చుకొన్నది.

ప్రాచీనలక్ష్యలక్షణ నిర్మాతలు జరిగిపోయిన కథనుగాని, ముందు జరుగఁబోవు నితివృత్తమునుగాని సంగ్రహముగా నప్రధానపాత్రల ముఖమున విష్కంభాదులలో సూచింపవలయు నందురు. భవభూతి ప్రాచీనపద్ధతినే యనుసరించెను. ద్విజేంద్రుఁడు మాత్ర మట్లు సూచింపకుండ భిన్నభిన్నదృశ్యములలో నావిషయములను బ్రదర్శించినాఁడు.

మఱియుఁ బాత్ర యొకరసములో మునిఁగిపోయియున్నపుడు రెండవ రసములోనికి వెంటనే త్రిప్పునప్పుడు ఒక యపూర్వసంఘటనము కూర్పఁబడుట మహాకవిప్రభూతమై యున్నది. దుష్యంతుఁడు శకుంతలా విరహమున దుఃఖమగ్నుఁడై యున్నపుడు అతని క్షాత్తేజము వెలిగించుటకై మాతలిని గల్పించి విదూషకునిఁ జంపుచున్నట్లు నటింపఁజేసి దుష్యంతుని కుద్రేకము గలుగునట్లు అతినిపుణముగాఁ గాళిదాసు సంఘటనము చేసినాఁడు. అట్లే భవభూతి రాముఁడు సీతాపవార్త విని నిశ్చేతనుఁడై యుండ మృత బ్రాహ్మణ శిశురక్షణమునకై రాముని క్షాత్తేజమును గల్పించినాఁడు. ద్విజేంద్రుఁ డీ పద్ధతి ననుసరింపక యొక దృశ్యములో రామునిని ఋష్యాదులను బ్రవేశపెట్టి వారిచే మామూలుగనే చెప్పించినాఁడు. ఇట్లు కవు లిరువురును గావ్యకళను బోషించుటలో భిన్న భిన్నమార్గము లవలంబించియుండిరి.

## రస పోషణము

రసనిర్వచనము ననేకులు అనేకరీతులఁ గావించి యున్నారు. కావ్యమున కాత్మ రసము. రసమయము కావ్యము. రసములేని కావ్యము సౌరభములేని కుసుమము; చల్లఁదనములేని సమీరము. కావ్యామృతరసము హృదయానంద మివ్వఁది. తన్మయముఁ బొందింపనిది రస మనిపించుకొనదు. అట్టి రసనిర్వహణము చేయఁబడని కావ్యము జీవములేని శరీరము. ద్విజేంద్రుఁడు రచించిన సీతలో రసఘట్టములు సహజముగాఁ దక్కువ. ఉన్న ఘట్టములలోఁ గవి రసపోషణము యుక్తముగాఁ గావించినాఁడు. సీత త్యాగమునకుఁ బూర్వము సీతారాములయొక్కయు, నూర్మిళాలక్ష్మణులయొక్కయుఁ బ్రణయమున రస ముచితముగా నిర్వహింపఁబడినది. సీత తన ప్రియునితో మట్లాడునపుడు 'నాథా! యొక గడియకూడ నా కన్నులకుఁ జాటుగా నీవున్నచోఁ దిరిగి నీ పాదముల సన్నిధినుండి వేఱుగుదునేమో యని భయము వొడముచున్నది.' అని యిట్లు రసోచిత భాషణములఁ గావ్యమునకు వన్నెగూర్చియున్నాఁడు. సీతాత్యాగానంతరము రామలక్ష్మణులు పంచవటి ప్రవేశించిన ఘట్టములోఁ గవి పంచవటీ రమ్యప్రదేశములను జూపుచు మేఘములు లేని యుపాసమయంబున నాకసమునుండి దిగివచ్చిన యుషాదేవివలె సీత నిత్యమును గూర్చుండు శిలాతలమును జూపించినాఁడు. అక్కడనే నిలుచుండి సూర్యుని మెఱుంగు బంగరుకిరణంబులు గనుఁగొను సీతాదృశ్యమును గన్నులఁ గట్టునట్లు చేసినాఁడు. అంతటితో నక్కడ వదలి యంతఃపురమునఁ గౌసల్యారాములను బ్రవేశపెట్టినాఁడు. కౌసల్య రాముని నూరడించును. అప్పుడు రాముఁడు చెప్పిన వాక్యములు రసమయములు. 'తల్లీ! నే నిప్పటికిని జీవించియేయున్నాను. ఇదియే నా కాశ్చర్యముగా నున్నది. నా దేహము పోయినపుడు నాకు బ్రతుకుగలుగును. అమ్మా! నా హృదయమున నెట్టివేదన, యెట్టివిచారము దహించుచున్నదో నీ వెఱుఁగవు. అబ్బా! ఇంక సహింపఁజాలను. హృదయము బ్రద్దలై పోవుచున్నది. అసలికి నాపై నెంతనమ్మక మున్నది? ఎంత ప్రేమ మున్నది? అయ్యో! ఆమె కెట్టి యన్యాయము గావించితిని. నిర్వాసనసమయమున నే నెట్టి ఘాతుక కృత్యము నొనరించుచుంటినో యాలోచింపలేదు. తమ్ముఁడు భరతుఁడు, అక్క శాంతి నాకాళ్లపైఁ బడి యెంత బోధించినారు. అప్పుడును నాకుఁ దోఁచలేదు. తల్లివి నీవుగూడ బలిమాలి యడ్డగించి యాపతికై భిక్ష యడిగితివి. అప్పుడను మూఢుఁడనైన నేను జెవిని బెట్టనైతిని. అట్టి సందిగ్ధసమయమునఁ బ్రాణేశ్వరి జానకి చిఱునవ్వు మోమునఁ దాండవింప వచ్చి చేయిపట్టుకొని 'నాథా! సెలవు. నేను వనవాసమునకుఁ బోవుచున్నాను. ఈసేవకురాలికై చింతింపకుము. సుఖముగా నుండు' మని వచించునప్పుడును నాకుఁ దెలివి రాలేదు. అమ్మా! ఇట్టిదారుణచింత, ఇట్టి మనస్తాపము వేధించుచున్నను నాప్రాణములు పోవు. ఎవరి శాపమో తెలియదు."

ఇట్టిఘటనయే యశ్వమేధయాగమునకై సహధర్మిణిని స్వీకరింపవలెనని దని వసిష్ఠుఁడు రామునితోఁ జెప్పినపుడు జరిగినది. పత్నిని స్వీకరింప నని రాముఁ డన్నాఁడు. 'అయిన యజ్ఞ మాఁగవలసినదేనా? అధీరుఁడవు కాక స్థిరచిత్తుఁడవు గమ్ము' అని వసిష్ఠుని వాక్యము. అపుడు రాముఁ డన్నాఁడు. "అధీరుఁడని యేల నంటిరి? ఈపది వత్సరములనుండి రేయింబవళ్లు ఈహృదయమున నెట్టి నరకవేదన వేధించుచున్నదో తెలియునా? ఈశిథిల శరీరమును నరకయాతన యెట్లు లోలోపలఁ దగులఁబెట్టుచున్నదో చూడుఁడు. నిద్ర లేదు. పిచ్చివానివలె రేయింబవళ్లు మహలునకు వెలుపల లోనఁ దిరుగుచునుందును. ఇట్లు ఎన్నిరాత్రులు తెల్లవారుచున్నవో. శాంతి దొఁరకలేదు. నిద్ర రాదు. రాత్రులు గడచుచున్నవి. దినములు గడచుచున్నవి. ఇంకను అధీరుఁడనై యుండవలెయునా? మహాత్మా! నాయీ వేదనను ఈయవస్థను మీరు తెలిసికొనఁగలరా? ప్రభుసమానులై యాసనమునఁగూర్చుండి భృత్యుఁడనను నా కాజ్ఞ యిడుచుందురు. ఆ యాజ్ఞాపరిపాలన మెంత కఠోరమైనదో యూహింపఁగలరా? తెలిసికొనఁగలరా?" ఇట్లు చెప్పి ద్వితీయ వివాహము చేసికొనననని కఠినముగాఁ జెప్పె.

గా 'వసిష్ఠునిఁ దిరస్కరింతువా' యని ముని మండిపడును. దానికి రాముఁడు జంకలేదు. 'ఇంకను మీమనోరథ మీడేఱలేదా? నాహృదయపిండమును జీల్చివేయఁదలఁచెదరా? అయినచోఁ జురకత్తిఁ బూనుఁడు. అట్లు చేయుఁడు. సీతను, నిరపరాధినియగు సీతను నేను బరిత్యజించితిని. ఇంకను గావలయునా? అయినచో నీదేహము నుండి ప్రాణమును వేఱుచేయుఁడు. రాముఁ డింక సహింపలేఁడు భస్మము చేయుఁడు. స్వర్గద్వారము మూసివేయించుఁడు. రెండవవివాహము చేసికొనను ఎందఱు మునుల వాక్యములను దిరస్కరింపవలసివచ్చినను జానకీ పవిత్రస్మరణమునకై సిద్ధుఁడుగా నుంటిని."

ఆహా యేమి రాముని ప్రణయము! చివరకు సీతా స్వర్ణప్రతిమ కంగీకారము కుదిరినది. ఇట్టి సంఘటనములలో ద్విజేంద్రుఁడు రసపుష్టి యద్భుతముగాఁ జూపినాఁడు. ఒకమాఱు రాముఁ డొంటిగా నుండుట ద్విజేంద్రుఁడు చూపినాఁడు. ద్విజేంద్రుఁడు సామాన్యుఁడా? రసపుష్టిలోఁ దీసిపోవుటకు ఛాయారూపిణియగు సీతను రాముని కందిచ్చి తా నీవలఁబడి యమ్మయ్య యని యనుకొన్నాఁడు. మిగిలిన ఘట్టములలోని రచనమాత్రము విమర్శనరూపమై ధర్మాధర్మ నిర్ణయములఁ దగుల్కొనినది.

భవభూతి యన్నిటికన్నను రసపుష్టికే యెక్కువ ప్రాధాన్య మొసఁగియున్నాఁడు. రామాయణమును దఱచితఱచి యుత్తరరామచరిత్ర పీయూషమును బైకిఁ దీసినాఁడు. కాని యాయమృతమాధురిని మూఁడవయంకములో ముద్దచేసి నిగ్గులుదేలఁ గూర్చినాఁడు. అది చదివినచో నిజముగా

'వికలకరణై రార్యచరితై
రపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్'

అని కవి చెప్పిన వాక్యము ఎంతయు సమంజసమై యున్నదని సహృదయులకుఁ దోఁచకమానదు. అందు రసపుష్టికై భవభూతి చూపిన కౌశలము నిరుపమానము. శంబూకునిఁ జంపుటకై రాముఁడు పంచవటిలోఁ గాలు పెట్టవలసివచ్చినది. అతనికిఁ బంచవటీదర్శనోత్సుక్యము కల్పించినాఁడు. అసలే రాముఁడు సీతావియోగవేదనాబాధితుఁడు. పంచవటిలోఁ గొన్నియేండ్లు ప్రియాసహచరుఁడై విహరించినాఁడు. విహరించిన తావు లన్నియు నిపుడు సీతావియుక్తుఁడై చూడవలసివచ్చినది. అతని మన స్సెట్లుండునో? ఆపైని సీతాదేవి స్వహస్తములతోఁ బెంచిన గజకలభమును బ్రవేశపెట్టినాఁడు. రంగము ప్రారంభమైనది. సహృదయుల మనముల నెట్లు చట్టున నాకర్షింపవలయునో భవభూతికి బాగుగాఁ దెలియును.

'అయ్యో ప్రమాదము ప్రమాదము' అనుచు వాసంతి సీతాస్నేహితురాలు ప్రవేశించినది. 'ప్రమాద' మనుమాట వినుటతోడనే సీతహృదయ మావైపునకుఁ బరువెత్తికొని పోయినది. అప్పుడు తెరలో వాసంతి

'సీతాదేవ్యాః స్వకరకలితైః సల్లకీపల్లవాగ్రై
రగ్రే లోలః కరికలభకో యః పురా పోషితో భూత్'

అనుచుఁ గంగారుపడుచున్నది. తాను బెంచిన కరికలభమసంగతి రాఁగానే 'దానికేమి సంభవించినది?' అని సీత యడుగకుండ నుండలేకపోయినది. దానికి తెరలో నుండియే

'వధ్వాసార్ధం పయసి విహరన్ సోయమన్యేన దర్పా
దుద్దామేన ద్విరదపతినా సన్నిపత్యాభియుక్తః'

అని సమాధానము వచ్చినది. వినుచున్న తాను బెంచినది. అది ప్రియురాలితో విహరించుచున్నది. దాని కిపు డపాయము సంభవించినది. దానిని రక్షింపవలసిన సమయ మిది. తా నిపు డేస్థితిలో నున్నదో మఱచిపోయినది. పూర్వపరిచితములైన యక్షరములు రాక తప్పినవికావు. 'ఆర్యపుత్ర! రక్షింపుము. నాపుత్రుని రక్షింపుము' అనియన్నది. ఇంతలోఁ దన స్థితి స్మృతిఁ దెచ్చుకొని మూర్ఛిల్లును. కవికి సమయము దొరకినది. జానకిని మూర్ఛనుండి తేర్పవలయును. ఎట్లు? రాముని బుష్పకవిమానముతోఁ గూడఁ బంచవటీ దర్శనమునకై ప్రవేశపెట్టినాఁడు. 'విమానరాజమా! యిచటనే నిలువుము' అను రాముని మధురగంభీర వాక్యములు గ్రీష్మతప్తయగు మయూరికి జలదనిర్ఘోషములవలె

జానకి కమృతపసనిమ్యంబు లైనవి. మూర్ఛ దేఱినది. రాముఁడు శంబూకవధకై జనస్థానమునకు వచ్చెనని తమస చెప్పినపుడు కోపము కల్లడింపకపోవుటయేకాక 'దిష్ట్యా అపరిహీనరాజధర్మః ఖలు స రాజా' అని సీత మెచ్చుకొన్నది. రాముని యాళయముఁ దెలిసిన సీతకు రామునిపయిఁ గోప మెట్లు గలుగును? కాని ప్రజాను రంజనమునకై యెట్టి పనియైనఁ జేయుననుసుద్దేశముతో 'ఆర్యపుత్ర' అనుటకు బదులు 'రాజ' అని యన్నది. పిదప గంభీరానుభావమాత్రముచేతనే రాముఁ డని తెలియఁదగిన యతని పరిక్షామదుర్బలంబులగు నంగ ములఁజూచి మూర్ఛిల్లక యుంపలేకపోయినది. అవును. రామునియం దంతటి ప్రేమగల సీత రాముని దీనావస్థం జూచి మూర్ఛిల్లక యెట్లుండఁగలదు? సరే, కవి యింక నిట్లు సహృదయులఁ జూపనీయలేదు. కరుణ రసాంబు ధిలో ముంచివేసినాఁడు. ఇంతలో రాముని విలాపము నకు నాంది యయినది.

"అనేన పంచవటీదర్శనేన
అంతర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః,
ఉత్పీడ ఇవ ధూమస్య మోహః ప్రాగావృణోతిమామ్

హా దేవి! దండకారణ్యవాసప్రియసఖి! విదేహ రాజపుత్త్రి!" అని రాముఁడు మూర్ఛిల్లినాఁడు. జానకి తమసకాళ్లపైఁ బడి రామునిని రక్షింపు మని ప్రార్థిం చును. నీవే జగత్పతిని రక్షింపవలయును. వల్లి యతనిని స్పృశింపు మని తమస చెప్పినది.

రాముఁడు మూర్ఛనుండి తేఱఁగానే సీత పట్ట రానంత సంతోషముచే నుప్పొంగిపోయి యున్నినది: 'జానే పునరపి ప్రత్యాగతం జీవితం త్రైలోక్య నాథస్య' అని.

వడగొట్టినవానిపయి మంచిగందంపుఁ గ్రొంజి వుర్ల రసము చిలికించినట్లు, వల్లివిరియ వెన్నెలల నుండి పిండిన రసముల మేనిపయిఁ జల్లినపగిది, సం జీవనావధిరసమును గిలకరించినవడువున రాముఁడు సీతాకోమలకరపల్లవంబులచేత స్పృశింపఁబడి యమం దానంద మనుభవించి యి ట్లనుకొనును. 'నఖలు వత్స లయా సీతాదేవ్యాభ్యుపపన్నోస్మి' అని. ఆహా యేమి యమృతమయవచనములు. కవి సీతారాములఁ బ్రవేశ పెట్టినాఁడు. ప్రళయము సంభవించినప్పుడెల్ల నమృత రససేచనము గావించుచున్నాఁడు. ఒకమాఱు సీతా రాముల యగాధప్రేమము, ఒకమాఱు వారి యతిదీన మగు నవస్థ ఈరెంటిని బ్రదర్శింపుమఁ గవి తమసచేతఁ బ్రేమోపన్యాస మిప్పించుచుండును. రాముని దీనావస్థ సీతాహృదయశల్యమును దీసివేయుటయేకాక యామె జన్మము ధన్యమయినట్లుగూడ జానకియే చెప్పునట్లు కవి కూర్చినాఁడు. "ఏతేఖలు అగాధప్రేమదర్శిత స్నేహ సంభారా ఆనందనిష్యందినః శ్రుతా మయా ఆర్య పుత్త్రి స్యోల్లాపాః, యేషాం ప్రత్యయేన నిష్కారణ పరిత్యాగశల్యితోఽపి బహుమతో మే జన్మలాభః" అని. ఇట్లు కూర్చిన భవభూతిశక్తి యెంతటిదో చెప్ప వీలగునా?

ఇంతలో 'ప్రమాదము ప్రమాదము' అనుచు వెను కటిపద్యము నందుకొని సీతారాములముందు వాసంతి ప్రవేశించినది.

'ఆతంకస్ఫురిత కఠోరగర్భ గుర్వీం
క్రవ్యాద్భ్యో బలిమివ నిర్ఘృణః క్షిపామి'

అన్న రామునికి సీతాక్షేమముయొక్క యాళ గాని, ప్రుత్తాళగాని లేవు. వాసంతివాక్యములు వినఁగానే కృతకపుత్త్రిప్రేమ యొక్కమాఱు వల్లివిరిసినది. సీతను ద్యజించినాఁడు. హృదయాధిదేవత సీత లేదు. ఇంక నెవ రిని జూచి యానందింపఁగలఁడు పాపము. ప్రియు రాలు సీతాదేవి స్వయముగాఁ బెంచిన కరికలభమునకు విపత్తు సంభవించినది. ఒడలు తెలియలేదు. 'ఎవఁడురా దురాత్ముఁడు' అని లేచి బయలుదేఱినాఁడు. వాసంతి వచ్చి రామునిని దొందరపెట్టినది. ఈకథోద్ఘాతములు రామునికి హృదయమర్మచ్ఛిదము లైనవి. పిదపఁ గరికల భముయొక్క విజయముఁజూచి సీతారాములు నిర్వృతిఁ బొందుదురు. ఇక్కడికిఁ గరికలభపాత్రము ముగియఁగనే పూర్వము సీత కరకిసలయములతోఁ దాళము వేయుచు నాడించిన గిరిమయూరమును బ్రవేశపెట్టినాఁడు. రంగ మింతతో ముగియలేదు. వాసంతి యొక్కొక్కప్రదే శమే చూపింప మొదలుపెట్టినది. కదలీవన మధ్యమునఁ బ్రియాసహితుఁడయి రాముఁడు కూర్చుండు శిలాతలముం

జూపించినది. అందు హరిణములకు సీత తృణము లందిచ్చుచుండెడివి. ఆహరిణము లొండొకటిపై పైఁబడుచు వదలక యుండెడివి. ఇదిచూచి రాముఁడు 'ఇదంతావ దళక్యమేవ ద్రష్టుం' అని విలపించినాఁడు. ఇట్టి దృశ్యములను అట్టి రామునికిఁ గన్పఱచు వాసంతిని సీత 'కఠిన రాలవు సుమీ' యని నిందించినది. వాసంతి 'రాముని యవస్థను జూడకుంటివిగదా జానకీ!' అనుచు. అపుడు తిరస్కరిణిచే నంతర్హితయగు సీత 'మాచు చు నే యు న్నా ను' అన్నది. అప్పటి సీతమాపు వీవ్రజములను గరఁగింపఁజాలదు? హా దేవ! నన్ను విడిచి యితఁడు, ఇతనిని వీడి నేను ఇట్లుండవలసివచ్చునని యెవరేని యూహించినారా? కనుక నీ ముహూర్తకాలమైనను జన్మాంతరంబునం బోలె లబ్ధదర్శనుండగు వత్సలుఁడయిన యార్యపుత్రునిఁ గన్నీటిజడులమధ్యఁ గనుగొందును' అను సీతవాక్యము లెంతటి వాతిగుండెనయిన బ్రద్దలుచేయవా? భవభూతి యింతటి రసవాహినిఁ బ్రవహింపఁజేసి ధన్యుఁడయినాఁడు. రాముని దుఃఖము నెంతగా నిరూపింపవలయునో యంతవఱకు నిరూపించి పాఠకులను దుఃఖసముద్రములో ముంచివేసినాఁడు. పాపము రాముని యవస్థ యెంతటిదోకదా. ఈవిశ్వమును వ్యాయాముగాఁ జాలింపవలయును. ప్రియాశోకము హృదయమును విదారింపఁ జేయుచున్నది. మర్మములను ఛేదించుచున్నది. రాముఁ డెట్లు నిలువఁగలఁడు. రామునికిఁ బాపము స్వేచ్ఛగా నేడ్చుటకుఁగూడ వీలులేకపోయినది. స్వయంకృతమగు పనినిగూర్చి విలపించుట యెట్లు? ప్రజలనుగూర్చి యిట్లు పలికినాఁడు.

"నఖలు భవతాం స్థానం దేవ్యా గృహేభిమతం తత
స్తృణమివ వనే శూన్యే త్యక్తా నచాప్యనుశోచితా,
చిరపరిచితాస్తే తే భావాః పరిద్రవయంతి మా
మిద మశరణై రద్యాప్యేవం ప్రసీదత రుద్యతే."

వాసంతి రామునిని ధైర్య మవలంబింపు మని యన్నపుడు 'ఇంకను ధైర్యమా?

'దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః,
నష్టం సీతేతి నామాపి నచ రామో నజీవతి'

అని రాముఁడు విలపించినాఁడు. ఈమాటలు సీత విని మోహితురాలగును. వాసంతి రాముని నంతతో వదలలేదు. ఒక మనోహర దృశ్యము చూపి రాముని హృదయ మింకను బ్రద్దలుచేసివైచినది. "సీత గోదావరీ సైకతములందు హంసలతోఁ గృతకౌతుకరాయి చాల కాలము గడిపినది. ప్రియురాలెప్పటికిని వచ్చుటలేదు. రాముఁడు శిలాతలము దగ్గరి పొదరింట్లలో సీతామార్గము నిరీక్షించుచుఁ గూర్చున్నాఁడు. సీత బయలుదేఱినది. రామునిని జూచినది. కొంచెము రాముని మోమునఁ గోపచిహ్నము లున్నట్లు చూచినది. ఆ ముద్దరాలికి మనస్సునఁ గాతరత్వము జనించినది. తెల్లఁదమ్మి మొగ్గవోని మృదులకరయుగళము దోయిలించినది." ఈ దృశ్యము చూచి రాముని ధైర్యము పటాపంచలైనది. దారుణురాల వని సీత వాసంతిని నిందించినది. రాముఁ డాఁగలేకపోయినాఁడు. మూర్ఛ వచ్చినది. రాముఁడు మరల మూర్ఛనుండి తేఱుటకు సీతామృదుల కరకిసలయస్పర్శయే జీవాతువైనది. రామునిని స్పృశించినసీత తన పాణిపల్లవమును రామునినుండి తీసికొనలేకపోయినది. వజ్రలేపఘటితమైనదివలెఁ దన కరకమల మూడిరాలేదు. రాముఁ డాచేయి గ్రహించినాఁడు. అమృత శిశిరస్పర్శ గలిగి, మంచు వడగండ్ల స్పర్శవలె సుభగమయి, లలితలవలీకందళ నిభమగు వివాహకాలపు సీతాకరపల్లవము రామునికి స్మృతికి వచ్చినది. ఇంతలో సీత భయముచేఁ దనచేయి లాగుకొన్నది. రామునికి సీత కన్పింపలేదు. తిరిగి రామునిని స్వప్నభ్రాంతి యలముకొన్నది. రామునికి స్వప్న మేమి? నిద్రమొఱుఁగని రామునికి స్వప్నముగూడ భాగ్యమేయైనను అది యెట్లు వచ్చును? ఇప్పటికి వాసంతి రాముని నోదార్పఁదలఁచినది. జటాయువు విఱుగఁగొట్టిన రావణుని రథము చూపినది. రాముని కదియు దుఃఖకరమే యైనది. వెనుకటి విరహము జ్ఞప్తికి వచ్చినది. అప్పుడు శత్రువును వధించి జానకిని దీసికొనివచ్చుటకు వీలైనది. కాన శత్రువధవఱకు నెట్లో విరహము సహించినాఁడు. ఇపుడు తాను జేతులార విడిచిన సీతను గ్రహించుటెట్లు? ఈ విరహము నిరవధిక మని యిట్లు విలపించినాఁడు.

'వియోగో ముగ్ధాక్ష్యా స్సఖలు రిపుఘాతావధి రభూత్,
కథం తూష్ణీం సహ్యో నిరవధి రిదానీంతువిరహః' అని,

నిరవధిక మనుమాట వినఁగానే పాపము ఇంక నెప్పుడో ఒకప్పుడు కలిసికొనవచ్చు నని యాశపెట్టుకొనియున్న జానకి హతాశురా లయి బోరుమని యేడ్చినది. రాముఁడు అయోధ్యకు వెళ్లుననివినఁగానే పాపము చిన్నబిల్ల యయిపోయినది. తమసతో నిట్లు 'భగవతి! తమసా! ఆర్యపుత్రుఁడు వెళ్లుచున్నాఁడే' అని మొఱపెట్టుకొన్నది. పాపము దీనురాలు సీత యేమిచేయఁగలదు. సీతతోఁ దమస 'మనముకూడ మనయాశ్రమమునకు వెళ్లుద మని యనఁగానే సీత 'భగవతి! అనుగ్రహింపుము. దుర్లభదర్శనుఁడగు నార్యపుత్త్రుని నొకక్షణ మైనను జూచివచ్చెదను' అని సెలవు గైకొనినది. అప్పటి సీతదైన్యపుచూపు హృదయవిదారకము. రాముఁడు తన కళ్యమేధమునకై సహధర్మచారిణి యొకతె యున్నదని చెప్పఁగానే యామె కాందోళనము గలిగినది. 'ఎవ రామె' అని సీత యడుగకుండ నుండలేకపోయినది. రాముఁడు 'స్వర్ణమయి సీత' అని చెప్పినప్పటికి సీత యిట్లనినది: 'ఇప్పు డార్యపుత్త్రుఁడ వయితివి. ఇపు డార్యపుత్త్రునిచేత మత్పరిత్యాగశల్యము తీసివేయఁబడినది.' అని. పాపము రాముఁడింక నిలువలేకపోయినాఁడు. అయోధ్య కరిగి యా సీతాప్రతిమయందయినను బాష్పపూరితలోచనములను నిల్పి సంతృప్తిపడుచుకొందు ననినాఁడు. సీత యాప్రతిమను ధన్యురాలినిగాఁ దలఁచినది. చివరకు సీత ప్రేమపరవశయై 'నమో ఽపూర్వపుణ్య జనితదర్శనాభ్యా మార్యపుత్రచరణకమలాభ్యాం' అని నమస్కరించి మూర్ఛిల్లినది. పాపము ప్రియుఁడు వెళ్లిపోవుచున్నాఁడు. మరల నతని దర్శనము దుర్లభము. ఆహా ఏమి యెట్టి సంఘటనము. 'కియచ్చిరంవా మేఘాంతరేణ పూర్ణిమాచంద్రదర్శనం' అని సీత పాపము తన యవస్థను గూర్చి వాపోయినది. ఇట్లు భవభూతి రసపూరము నుద్వేలముగాఁ బ్రవహింపఁజేసి ధన్యుఁడైనాఁడు. ముందు పంచవటిలో రాముని ప్రవేశపెట్టిననేకాని కరుణమును బరిపూర్ణముగాఁ బ్రదర్శించుటకు వీలుకాదని కవి తలఁచినాఁడు. తరువాత నంతతో నతనికి సంతృప్తి యయినదా? కాలేదు. కుశలవుల ద్వాదశవత్సరసంఖ్యా మంగళగ్రంథిబంధన మహోత్సవమునకై పుష్పాపచయవ్యాజమున సీతను దమసతోఁగూడ నరిగా నచ్చటికే కవి పంపించినాఁడు. ఇక్కడి కాలంబనములను గూర్చినాఁడు. ఉద్దీపనము పంచవటి యుండనే యున్నది. ఇంతతో నరిపోలేదు. సీతాసఖురాలిని వాసంతిని ప్రవేశపెట్టి యామెచేఁ గరికలభాదిదృశ్యములను బ్రదర్శింపఁజేసినాఁడు. ఆమెచే మర్మచ్ఛేదకరంబులగు పలుకు లనిపించి పాత్రములచే నాటక మాడించినాఁడు. ఇంతటి సామగ్రిని గూర్చి తానను కొన్నట్లు రసపోషణము గావించి సంతృప్తుఁడయినాఁడు. ఇంతతో భవభూతిజన్మము ధన్య మైనది. అతని నాటకరసలహరింగ్రోలి సహృదయులగు పాఠకులు నిర్భరానందపరవశు లయి ధన్యు లయినారు.

## ఉపసంహారము

ఇట్లు కవిచంద్రు లిరువురు నిరుపమానమగు శక్తిని జూపినారు. ఒక్క రసపోషణలోఁదక్క మిగిలినవానిలో భవభూతికి ద్విజేంద్రుఁ డన్నివిధములఁ దుల్యుఁడని చెప్పవచ్చును. ద్విజేంద్రుఁడు రసపుష్టికై భవభూతివలె రంగమును బూర్ణముగ నలంకరించుకొనలేదు. లేక యతఁ డిట్లు చూపఁదలఁపకయే యుండెనో. ద్విజేంద్రుఁడు ఔచిత్యమునకే యొక్కువ ప్రాధాన్య మిచ్చినాఁడు. భవభూతి యొకప్రక్క నౌచిత్యమును నిర్వర్తించుకొనుచు రసమునకుఁ దగిన వస్తుసామగ్రి నంతయు నొకచోఁ గూర్చుకొని రంగమును బ్రారంభించినాఁడు. సహృదయులఁ దన్మయులఁ గావించినాఁడు. ద్విజేంద్రుఁడు తన యప్రతిహతములగు వాదములచేతను, ఔచిత్యనిర్వహణముచేతను నివులకంటె విమర్శకులను నధికముగా వశపఱచుకొన్నాఁడు.

ఇట్లు కవిలోకమునకు ముదము గూర్చిన భవభూతి ద్విజేంద్రుల నామములు చిరస్మరణీయములు గదా. భాషాయోషకు సురభిళ రసభరితమృదుల సుమంబుల నర్పించిన ధన్యులకు లోక మెట్లు కృతజ్ఞత తెలుపఁగలదో. ఇట్టి కవిచంద్రుల నామములు నిత్యస్మరణీయములై యాంధ్రకవిపుంగవుల ముఖకమలంబుల విహరించుఁగాక యని కోరుచు నా ధన్యవాదము లర్పించుచు నింతతో ముగించుచున్నాను.

# శ్రీ రాధామాధవము *

బులుసు వేంకటరమణయ్య

ఆంధ్రప్రబంధ వాఙ్మయమునకు సంస్కృతానువాదరూపమగు పారతంత్ర్యమును తొలఁగించి, ప్రత్యేకతను ప్రసాదించిన స్వర్ణయుగము రాయలయుగము. కర్ణాట రాజ్యాధీశ్వరుఁడగు కృష్ణరాయలు తెలుఁగు తేటదనమునకు ముగ్ధుఁడయి 'దేశభాషలందు తెలుఁగు లెస్స' యని కొనియాడినాఁడు; వాఙ్మయయుగమున ఒక నూతనశకము నవతరింపఁజేసినాఁడు. అతనియాస్థానమందలి 'అష్టదిగ్గజములు' ను ఆమార్గమునే అనుసరించిరి. వారందరును రసికులు. వారి ప్రబంధములు సరసములు. నాఁడు కవిత్వతత్త్వపరిశీలనమునకు నికషోపలలు. వారి గ్రంథములు అనంతర ప్రబంధవాఙ్మయమున కాదర్శములు. అవియే కాదు, ఆ కాలమున వెలువడిన గ్రంథము లన్నియు ఆచంద్రతారార్కస్థిరములు; ఆంధ్రవాణికి అమూల్యమగు నలంకారములు అట్టి యుద్గ్రంథములలో 'శ్రీ రాధామాధవ' మొకటి.

'రాధామాధవ' కర్తయగు చింతలపూఁడి యెల్లనార్యుని నివాసముంగూర్చి యభిప్రాయభేదములు కలవు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి మతమున నితఁడు కడపమండల నివాసి. ఇతని గ్రంథాంతరమగు 'విష్ణుమాయానాటకము' లోని వర్ణనలంబట్టి ఎల్లనార్యుఁడు గోదావరీమండల ప్రాంతమువాఁడని చెప్పవచ్చునని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి అభిప్రాయము. ఈ కవి తొలుత గుంటూరుజిల్లావాఁడుకాని, నెల్లూరు జిల్లావాఁడుకాని యై యుండుననీ, కృష్ణదేవరాయల ప్రాపుగాంచి పిదప విజయనగరమున నివాస మేర్పఱచుకొని విజయనగర సామ్రాజ్యవినాశానంతరము తననివాసమును కృష్ణా, గోదావరీ మధ్యభాగమునకు మార్చి యుండవచ్చునని శ్రీ నడకుదుటి వీరరాజుగారు రాధామాధవము 'మునిపలుకు' లో వివరించి యున్నారు.

ఇందు శ్రీ రామకృష్ణయ్యగారిమతము యుక్తిసహము. శ్రీ వీరరాజుగారు కవినివాసమును మూఁడుచోట్లకు మార్చుటలో హేతువు లపేక్షితములు. రేపల్లె తాలూకావాఁడు దూరస్థమగు విజయనగరమునకుఁ బోవుట సంభవమగుచో ఏలూరుతాలూకావాఁడు పోవుటయు సంభవమే. మఱియు నాంధ్రభోజుని దర్శించి యమితధనము లార్జింపఁగోరు సరసకవి దూరాంతికములను లెక్క-

* రాధామాధవబిరుదాంక చింతలపూఁడి యెల్లనార్య ప్రణీతము; శ్రీ కపిలేశ్వరపురాధినాయకా ప్రకటితము. ౧/౮ క్రౌను, ౧౪+౩౮౬ పుటలు. క్యాలికోబయిండు. వెల రు. ౧-౮-౦.

చేయఁడు. మన కవి విజయనగరము స్థిర నివాస మేర్పఱచుకొనినట్లు ఊహింప వీలు లేదు. తనపని తీరినపిదప నిజనివాసస్థానమునకు మఱలియుండఁగూడదా ?

ఇప్పటికి ఎల్లనార్యుఁడు రచియించిన గ్రంథములు మూఁడే యుపలబ్ధములు. అందు మొదటిదే రాధామాధవము; రెండవది తారకబ్రహ్మరాజము; మూఁడవది విష్ణుమాయానాటకము. వీనిలో నాద్యంతములు రెండును శృంగార ప్రబంధములు. విష్ణుమాయానాటకము రచనమున ప్రథమేతరమయినను ప్రాశస్త్యమున అద్వితీయము; రాధామాధవము రచనమున ప్రథమమయినను ద్వితీయము. ఈ రెండిటికిని ఇట్టి తారతమ్యము కలదు. దానికిఁ గారణము రాధామాధవము కవి ప్రథమప్రయత్న మగుట కావచ్చును. ప్రబంధాంతరములనుబట్టి చూడ రాధామాధవము ఉత్తమము. ఇది పండిత, కవిసార్వభౌముఁడగు కృష్ణరాయల పేరోలగమున అగ్నిపరీక్షకు గురియయి నిలిచి విఖ్యాతిని గడించి, కవికి ఒక అపూర్వబిరుదనామమును సంపాదించిపెట్టినది ! ఈ యంశమును కవియే సగర్వముగ

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ
బ్రౌఢక్రియం జెప్పి, త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గ
ర్ణాటేశు మెప్పించి, నా
నాధాత్రప్రతిమాన సత్కవులలో
నన్ భూమణ్ణాశేణితో
'రాధామాధవ' నామ మరదిన జగ
త్ప్రఖ్యాత చారిత్రుఁడన్.'
[రాధా. పుట ౯.]

అని కవి చెప్పియున్నాఁడు.

'రాధామాధవ' మూలమును గూర్చి అభిప్రాయభేదములు కలవు. జయదేవమహాకవి 'రాధామాధవంబు' చెప్పినట్లు కవి చెప్పినాఁడు. గీతగోవిందమును వ్రాసిన జయదేవకవియే యితఁడయియుండునని శ్రీ రామకృష్ణయ్యగారి అభిప్రాయము. శ్రీ వీరరాజుగారు "గీతగోవిందకారుని రాధ స్వీయమైనట్లు తోఁచదు. రాధామాధవములోని రాధాదేవి కేవలము వివాహితమహిళా రత్నము; లక్ష్మ్యంశసంభూతురాలు. కావున నీ జయదేవులిద్దఱును భిన్నులై యుందురు." అని వ్రాసియున్నారు. జయదేవకవికృతమగు రాధామాధవ మింతవఱకు ఎచ్చటను దొరకలేదు. ఎల్లనార్యుఁడు పేర్కొనిన రాధామాధవము ప్రత్యేకగ్రంథమో, లేక అతఁడు గీతగోవిందమున కిడిన నామాంతరమో నిశ్చయించి చెప్ప నవకాశము లేదు. రాధామాధవములోని రాధ పరకీయ కాకున్నను వీరరాజుగారు చెప్పినట్లు పరిణీత కాదు. మాధవుఁడు స్వయంవరలబ్ధరాధా సహితుఁడై యమునాతీరమున, బృందావనమున విహరించుటయే యిందు వర్ణితము; వివాహము వర్ణింపఁబడనేలేదు. యమునాతటమునకు వచ్చిన దేవతలలోని 'ఆర్యావల్లభుండు' మాత్రము "మీ యిద్దఱకు నితరేతరప్రణయ

సంగమ సౌభాగ్యంబు పరిణతుమహోత్సవం” బని రాధామాధవులంగూర్చి పలికెను. దీనిం బట్టియు వారికి వివాహము జరుగలేదనియే చెప్పవలెను. గ్రంథముకూడ కేళీవిహారవర్ణనముతోడనే తుదముట్టుచున్నది. ఇట్టి సందిగ్ధవిషయముల నాధారముచేసికొని కవినిర్ణయమును, గ్రంథనిర్ణయమును చేయఁబూనుట దుష్కరము!

రాధామాధవ మైదాశ్వాసముల ప్రబంధము. తిక్కన ఆంధ్రప్రబంధములందువలె ఇందును కథాభాగ మత్యల్పము. మాధవుఁడు సహస్రగోపుని పుత్రిక యగు రాధయి మరులుకొని ఆమెం దనకుఁ గూర్ప భారతీదేవిని ప్రార్థించుటయు, ఆమె మధురవాణీ రూపమున రాధంజేరి యామెకు మాధవునిపై యనురాగము కల్గించుటయు, సహస్రగోపుఁడు రాధను మాధవున కీయఁదలంప అతని పుత్రుఁడు భద్రకుఁ డంగీకరింపక స్వయంవరమును చాటింప నంగీకరించుటయు, స్వయంవరమున రాధ మాధవుని వరించుటయు, తన తేరి కడ్డుపడిన శత్రువులం జయించి మాధవుఁడు రాధను బృందావనమునకుఁ దీసికొని పోవుటయు, రాధామాధవుల జలక్రీడాది విహారవర్ణనము నిందలి కథాంశము. వర్ణనము లధికములు. అయినను రసనిష్యందనమున సహృదయరంజకములు. రచన సంస్కృతాంధ్రపదభూయిష్ఠము. శైలి నాతికఠిన మయ్యును ప్రౌఢము. కల్పనలు క్రొత్తలు. ధార యనర్గళము. మచ్చునకు కొన్ని పట్టులు-

రాధికావర్ణనము:

“సీ. తోరంపుఁగ్రొత్తలత్తుకదూది తేకుల
 నెనయు ముత్తెపుఁజేరు లిడ్డయట్లు,
సైకతస్థలమున శరలక్ష్యముగఁ జేసి
 వలరాజు పూఁదీఁగె నిలిపినట్లు,
నెలకొని బిలములో నిద్రించి ఫణిరాజు
 వడి మేల్కొని వెడలివచ్చినట్లు,
పరిపక్వబింబికాఫలముపై నందంద
 తుహినబిందుశ్రేణి దొరఁగినట్లు,
త్రిజగతీమోహనాకారరేఖ కలిమిఁ
జారి నొప్పారు నా పూర్ణచంద్రవదన
యడుగులుంగోళ్లుఁబిరుదునెన్నడుమునాభి
యూరుఁగెమ్మోవి లేనవ్వు నందమొందు.”
 [పుట ౪౮.]

మాధవుని వర్ణన:

సీ. ‘చారుపీతాంబరచ్ఛాయలు తొలకరి
 మెఱుఁగుఁదీఁగలగతిఁ దుఱఁగలింపఁ
గమనీయ దివ్యవిగ్రహసుషమాంశులు
 నెరసి నీలప్రభల్ నిగలునిగుడఁ
జూళికామండన సుభగబర్హాంశువు
 లింద్రధనుష్కోటి నీనుచుండఁ
గారుణ్యరసపూర్ణ కలిత నేత్రప్రభా
 వితతి చూపఱసుధావృష్టిఁ దోఁప
సకలనక్షత్ర మధ్యదేశమునఁ జంద
మామయనుబోలె లోకదృక్పథురలీల
రాజగణములలో దివ్యతేజమునను
జక్రధరుఁడు పురప్రవేశంబుసేసె.’
 [పుట ౧౭౫]

పయి వర్ణనములు ఆ యా వ్యక్తులను కన్నులకుఁ గట్టించుచున్నవి. సామ్యకల్పనమునను, సంభావనయందును ఈకవి ఆరితేరినవాఁడు. పయి పద్యములే ఈ యంశమును తెలుపఁగలవు. ఇట్టివర్ణన లింక నెన్నియేని కలవు.

ఎల్లనార్యుఁడు తన 'రాధామాధవ' రచనమునకు శ్రీనాథుని రచనను మేలుబంతిగ గ్రహించినాఁడు. కథాకల్పనము, వర్ణనముల కూర్పు ఈ యభిప్రాయమును సమర్థింపఁగలవు. కొన్నిమొడల శ్రీనాథుని పద్యములే ఇం దనుకరింపఁబడినవి. మచ్చున కొక్కటి—

సీ. 'ఎకసక్కెముగ నాడు నేదైన నొకమాట
పాడు నొయ్యన పాట పాటపాట,
యఁతియద్దపుబిళ్ల యలవోక వీక్షించుఁ
గొనగోరఁ బదనిచ్చి కురులు దువ్వు,
పయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
దిస్సువారఁగ నవ్వుఁ దీగనవ్వు,
ధవళతాళపలాశ తాటంకములు త్రిప్పు
కలికిచూపులఁ జూపు గర్వరేఖ'
గీ. ... ... ...
[క్రీడాభిరామము, పుట ౨౧.]

సీ. 'కన్నులార్చుచుఁ గొన్నిసన్నలుగావించుఁ
దీగనవ్వులు నవ్వు దిస్సునాఁబ,[1]
పయ్యెద దిగజార్చి పాలిండ్లు పసరించు
నటితిపేరులు చక్క నలవరించు,[2]
గాజులచప్పుళ్లు గలుగల్లు మనఁజేయుఁ[3]
గొనగోళ్ల నందంద కురులు దీటు,[4]
నీలరాగము నెలయించు నించుకజాడఁ[5]
దగవుమాటల జాణతనములాడు,
గీ. ..........................
[రాధామాధవము, పుట ౨౯౪, ౯౫.]

శ్రీ వీరరాజుగారు పింగళి సూర్యనార్యుఁడు రాధామాధవము ననుసరించి ప్రభావతీప్రద్యుమ్నమును రచించెనని సోదాహరణముగ వివరించి యున్నారు. కాని రాధామాధవకవి ఎవ్వరి ననుసరించినది వివరింపలేదు. శ్రీనాథుని పోలిక లిం దనేకము లున్నవనుట స్పష్టము. ప్రాగుదాహృతమగు 'కన్నులార్చుచు' అను పద్యము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే క్రీడాభిరామపుటుపోద్ఘాతమున ఉదాహరింపఁబడినది. శ్రీ వీరరాజుగారు దానిని చూచి యుండలేదేమో!

రాధామాధవము సుప్రసిద్ధ పండితకవుల చేతులలోఁ బడుటచే దిద్దుబాటులుగఁ దయారయినది! కాని కొలఁదిచోట్ల మాత్రము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందలి మాతృకకును, ముద్రిత ప్రతికిని భేదము కన్పించుచున్నది.

---

౧. 'దీఁగనవ్వులు నవ్వి దిస్సువాటు' అనిముద్రితపాఠము.
౨. 'నటుతఁ బేరులు చక్క.........' అని ముద్రితపాఠము.
౩. 'గాజులచప్పుళ్లు ఘలఘల మనఁజేయు' అని ము. పా.
౪. '......కురులు దిద్దు' అని ము. పా.
౫. 'నీలపాటలనెల్ల నించుకించుక పాడు' అనిము. పా.

౧. ముద్రితప్రతిలో ప్రథమాశ్వాసము లోని ౬ వ పద్యమగు సీసములోని గీతమునందును, ౭ వ పద్యమునందును శైథిల్య మీ క్రిందివిధమునఁ జూపఁబడియున్నది—

తే. 'చంద్రకాంత........................
..........................
.......పొగడంగఁ గిన్నెరమీటి పాడు
వాణి దయచేయు నాకు వాగ్వై
భవములు.' ౬

చ. 'అలికుల .........
గండయుగంబు.........
..................
..................
......గ ముదంబున నుండు
గజాననుండు నా
తలఁపునఁ జింతితార్థఫల
దాయకుఁడై విహరించుఁ గావు
తన్.' ౭

లిఖిత పుస్తకములో పయి పద్యములలో నెట్టి శైథిల్యము లేదు. అం దీ క్రింది రీతి కలదు—

తే. 'చంద్రకాంతమనోహరస్థలమునందు
ముని మెఱపుంగఁ గెంగేలి ముద్దుఁజిలుక
మెచ్చి పొగడంగఁ గిన్నెరమీటి పాడు
వాణి దయచేయు నాకువాగ్వైభవములు.

చ. అలికులరూప మొంది నిగ
మావళి గండయుగంబునందుఁ గొం
దలమునఁ జైపయిం దొరుగు
దానజలంబులుం గ్రోలి క్రొవ్విమ్రోఁ
తలఁ జెవికింపుచూడఁగ ము
దంబున నుండు గజాననుండు నా
తలఁపునఁ జింతితార్థఫల
దాయకుఁడై విహరించుఁ గావుతన్.'

౨. ముద్రితప్రతిలో ప్రథమాశ్వాసపు ౧౮ వ పద్యము చివరిపాదము 'కంటి నా మది నొక నీలకంధరంబు' అని కలదు. వ్రాఁత ప్రతిలో మాత్రము 'కంటి.........నీలకంధళంబు' అని కలదు. కంధరము = మేఘము; కందళము = గుబురు. ఇచట వ్రాఁతప్రతి పాఠమే ఉచితము. విష్ణు, నీలమేఘముల కిచట అభేదరూపకమని తలఁచి కంధరపదము సాధువని చెప్ప వీలులేదు. రూపకము నాశ్రయించినచో రత్నకాంచన పీతాంబరరంబుతోడ, నరబున హారాగమణికిరీటంబుతోడ'... మొదలగు విశేషణములను కుదర్చుట కష్టము. కష్టించి కుదర్చినను సరసముగ నుండఁజాలదు. ౧౯ వ పద్యమునఁగూడ ముద్రితప్రతిలో 'కంధర'మనియు, మాతృకలో 'కందళ'మనియుఁ గలదు.

3. ప్రథమాశ్వాసమున ౨౦ వ పద్యమున

'అంబుదచ్ఛాయ మువ్వన్నెయై ప్రసన్న
మదనగోపాలమూర్తి సమగ్రకరుణ—

అని ముద్రితపుస్తకమునఁ గలదు. వ్రాఁత ప్రతిలో 'మువ్వన్నె'కు బదులు 'మువ్వంక' అని కలదు. మువ్వంక యన 'త్రిభంగి'. సం

దర్భానుసారముగ 'ముప్వంక'యే సాధు వనుట సహృదయవిదితము.

౮. ప్రథమాశ్వాసము ౨౯ వ పద్యమున

'.........నెల్ల సత్కవిచంద్రుండ
సరసహిత చకోరసఖ్య మలర'.

అనునది ముద్రిత పాఠము. వ్రాతప్రతిలో మాత్రము 'చకోరసఖ్యము' నకు బదులు 'చకోరసంఘ' మని యున్నది. అదియే యుచితమగు పాఠము.

౫. ప్రథమాశ్వాసమునందే ౩౮ వ పద్యమున

'సకృపా! తోడగుమమ్మ యియ్యెడల న
స్మత్కావ్యబంధాళికిన్'

అని ముద్రితపాఠము కలదు. మాతృకలో ఇయ్యెడ 'సకృపం దోడగుమమ్మ యెయ్యెడల నస్మత్కావ్య బంధాళికిఁ'

అని కలదు. మాతృకాపాఠమే యొప్పు.

ఇట్టివే మఱికొన్ని యందందు పాఠభేదములు కలవు. 'కన్నులార్చుచు......' అను పద్యమునఁ గల పాఠభేదము లీవఱకే చూపఁబడినవి. కాని యాచితిని సహృదయపాఠకు లెఱుఁగకపోరు.

ఏతన్ముద్రణము కడు జాగరూకతతో ఒనరింపఁబడుటచే అనివార్యములగు కొలఁదియే తప్ప అచ్చుతప్పు లెక్కువగా దొరల లేదు.

గ్రంథముత్తమమును కొంచెము ఎఱుకపఱచుటకు పయి పాఠభేదములు చూపవలసి వచ్చినవి; కాని అవి గొప్ప లోపము లని చెప్పుటకుఁ గాదు.

వాఙ్మయపోషకులగు శ్రీ కపిలేశ్వరపురప్రభువులు విశేష వ్యయమున కోర్చి ఈ గ్రంథమును ప్రకటించినారు. సుప్రసిద్ధ పండితులగు బ్ర. శ్రీ. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు చాల శ్రమపడి పరిష్కరించిరి." "శ్రీ పీఠికాపుర సంస్థానకవులగు శ్రీ ఓలేటి వేంకటరామ శాస్త్రులుగారు పరిచూచిరి". "విమర్శకాదర్శకులగు నడకుదిటి వీరరాజకవిగారు" విశేషాంశములను వెల్లడించు విపులమగు "మునిపలుకు"ను రచించి గ్రంథమునకు శోభను గూర్చినారు. ఇట్టి విబుధుల సాయమున వెలువడుటచే ఈ గ్రంథమునకు వాసియు, వన్నెయు చేకూరినవి.

వాఙ్మయ పోషణమే ప్రధానలక్ష్యమగుటచే శ్రీ జమీందారుగారు రాధామాధవము వెలను స్వల్పముగ నిర్ణయించినారు. 'ఇంకను నిట్టిగ్రంథములను ప్రకాశ మొనర్ప వలయునను నాశ' శ్రీ వారికి 'ఎంతయేని కలదు. కాని అట్టి యవకాశమును' వారికి 'లభింపఁజేయు భార మా జగన్నియంత మీఁదను, ఆంధ్రలోకముమీఁదను గల'దు. ఆంధ్రలోకము ఈ యమూల్యగ్రంథము నాదరించి శ్రీ వారికి ప్రోత్సాహ మొసఁగ వలసియున్నది.

# సాంఖ్యదర్శనము

'చైతన్య'

సాంఖ్యదర్శన ప్రథమాచార్యుడు కపిల మహర్షి. ఆసురి కపిలుని శిష్యుడు. పంచశిఖాచార్యుడు కపిలుని ప్రశిష్యుడు. ఈ యన సాంఖ్యశాస్త్రమును విశదీకరించు పెక్కు గ్రంథములను విరచించెను. అవన్నియు కాలప్రవాహమునం బడి విస్మృతితీరముం జేరుకొనినవి; కాలార్కభక్షితము లైపోయి నవి. అదియునుగాక ప్రథమాచార్యుడగు కపిలు డెప్పటివాడో, ఎవరో నిర్ణయించుటకైన దగిన సామగ్రి లేదు. శ్వేతాశ్వతరశ్రుత్యుక్త కపిలు డొకడు, విష్ణువుయొక్క అవతార మగు కపిలు డొకడు, అగ్నిదేవుని అవతార మగు కపిలు డొకడు; మొత్తము మీద ముగ్గురు కపిలు లగపడుచున్నారు. శ్రుత్యుక్త కపిలుడు సాంఖ్యదర్శనాచార్యుడు కాజాలడని శంకరాచార్యులవారు సాంఖ్యస్మృతిని, ఖండించు సందర్భములో తమసంశయమును వెలిపుచ్చియున్నారు. సాంఖ్యస్మృతి లేక దర్శనము శ్రుతివిరోధి యగుటవలన, శ్రుతిచే ప్రశంసింపబడిన కపిలుడే దర్శనరచయిత కాజాలడని ఆచార్యులవారి అభిమతము. విష్ణ్వవతారకపిలుని ప్రసంగము శ్రీమద్భాగవతములో కానవచ్చుచున్నది. కాని తత్కపిలోక్త తత్త్వమునకును ప్రచలిత సాంఖ్యతత్త్వమునకును విశేషప్రభేద మగుపడుచున్నది. అందువలన ఆకపిలుడే సాంఖ్యశాస్త్రప్రణేత యని నుడువ నాలుక వెనుకాడుచున్నది. మఱి, అగ్న్యవతారమగు కపిలుడు సాంఖ్యదర్శనాచార్యుడా ?

ప్రస్తుతము మనకు లభించు సాంఖ్యశాస్త్రగ్రంథము లన్నింటిలో ప్రాచీనమైనది 'తత్త్వసమాస'యను సూత్రగ్రంథము. అనేకు లిద్దానిని కపిలోద్దిష్టమగు మూలగ్రంథముగా పరిగణింతురు. సాంఖ్యదర్శనాభిజ్ఞుడగు విజ్ఞానభిక్షు విట్లనుచున్నాడు :

'న చైవమపి తత్త్వసమాసాఖ్యసూత్రైః సహాస్యాః షడధ్యాయ్యాః పౌనరుక్త్యమితిచేత్ మైవమ్, సంక్షేప విస్తరరూపేణ ఉభయోరపి అపౌనరుక్త్యాత్.'

—సాంఖ్యప్రవచనభాష్యభూమికా.

కాని సంక్షిప్తాతిసంక్షిప్తమగు ఈగ్రంథమును మూలదర్శన గ్రంథముగా గ్రహింప వీలు లేదు. 'తత్త్వసమాసను'ఒకగ్రంథ మనుట కంటె విషయసూచిక యనదెల్లును. సువిశద మగు వృత్తి యొకటి ఈ సూత్రగ్రంథముపై రచింపబడినది లభించుచున్నది. దీని కర్తృత్వము ఆసురి కంటగట్టబడినది.

కపిలోక్తముగ గ్రహింపబడు మఱియొక గ్రంథము సాంఖ్యప్రవచనసూత్రము. ఈగ్రంథమును ఉద్దేశించుచు విజ్ఞానభిక్షువు 'శ్రుత్యవిరోధినీరుపపత్తీః షడధ్యాయీరూపేణ వివేకశాస్త్రేణ కపిలమూర్తి ర్భగవాన్ ఉపదిదేశ' అని పల్కియున్నాడు. కాని ఇయ్యదియు కపిల

విరచితము కాజాలదని వచింప సాహసించినందులకు ప్రాచీనపండితులు మమ్ము క్షమింతురు గాక. ఈశ్వర కృష్ణవిరచితమగు సాంఖ్యకారికలనుండి గైకొనంబడిన వాక్యములనేకములు యథాతథముగ తమ ఛందోరూపమును వీడకుండ ఈ సూత్రములు నిల్చియున్నవి. శంకరులుగాని, మాధవాచార్యులవారుగాని, వాచస్పతిమిశ్రగాని ఈ సూత్రముల నామమునైన తడవియుండలేదు. ఇది వారికాలమున నుండిన ఇట్లు నిర్లక్ష్యింతురా? కొంద అనునట్లు విజ్ఞానభిక్షువే ఈసూత్రముల కూర్చినాడని నిస్సందేహముగ చెప్పగల యోగశక్తి మాకు లేదు కాని, ప్రాచీనుడగు కపిలు డీసూత్రరచయిత కాడని నుడువగలము.

అనిరుద్ధునివృత్తి, విజ్ఞానభిక్షుని భాష్యము. ఈసూత్రార్థముల విశదీకరించు రచనలు.

వీటి అన్నిటికంటె ప్రామాణికమగు గ్రంథము ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలు. ఈకారికలకు షడ్దర్శనవ్యాఖ్యాతయగు వాచస్పతిమిశ్ర తత్వకౌముది యను టీకను విరచించెను. శంకరుని పరమగురులగు గౌడపాదులు భాష్యమును రచించిరి. ఈశ్వరకృష్ణుడు తన్ను కపిలునినుండి ప్రవహించిన గురుశిష్యపరంపరకుం జెందినవానిగ చెప్పికొనినాడు. ఈకారికలు క్రీ. శ. ౬ వ శతాబ్దమున చైనాభాషలోని కనువదింపబడినవి. ఆచార్యశంకరులు, సర్వదర్శనసంగ్రహకర్త యగు మాధవులు ఈకారికలనే సమ్మగ్రంథముల నుదాహరించిరి

కొందఱు, ఈకారికలు షష్ఠీతంత్ర మన బడు ప్రవచనసూత్రముల ననుసరించియే వ్రాయబడినవని వచించుచు తమపక్షమును సమర్థించుకొనుటకుగాను, కారికల శేష భాగముననున్న, ఏతదర్థవ్యంజకములగు శ్లోకద్వయమును చూపింతురు కాని, గౌడపాద భాష్యప్రతియందా శ్లోకములు కానరావు.

వివాదగ్రస్తమును, సందిగ్ధమును నగు ఈ గ్రంథకర్తృ శ్వచర్చ నింతటితో ముగించి, ప్రకృత మనుసరామః.

ఇతరదర్శనములవలె సాంఖ్యదర్శనము కూడ దుఃఖవాదముతో ప్రారంభ మగుచున్నది. జీవుడుమన్న రెండుమూడురోజులు దుఃఖముతో సయ్యమునకు బాల్పడి దానిచే నాఘాతముల బడవలసివచ్చుచున్నది. ఆ దుఃఖము మూడు తెఱగుల గానవచ్చుచున్నది. 'త్రివిధం దుఃఖమ్' ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికనామముల నీత్రివిధదుఃఖము వ్యవహరింపబడుచున్నది. ఈదుఃఖస్వరూప మెట్టిది? రోగాదిరూపక మగు శారీర క్లేశములు, కామాదిరూపములగు మానసిక కష్టములు ఆధ్యాత్మికదుఃఖము నాబడుచున్నవి. మనుష్యులు, పశువులు, స్థావరములు మున్నగు వానినుండి సంభవించు దుఃఖము అధిభౌతికము. శీతగ్రీష్మవర్షాదులవలన కలుగు దుఃఖము అధిదైవికము. శరీర మున్నంతవఱకు ఈ

దుఃఖము తప్పనిసరి. అయ్యది మనకు రుచింపదు; మన మద్దానిని గోరము. అందువలన నది హేయము. మనము దానియొక్క అంతమును, లేక హానిని గోరుదుము. ఈశ్వరకృష్ణు డనుచున్నాడుకదా,

"తత్ర జరామరణకృతం దుఃఖం ప్రాప్నోతి చేతనః పురుషః, లింగస్యావినివృత్తేః. తస్మా ద్దుఃఖం స్వభావేన."　　　　—సాం. కా. ౫౫.

గీతలలోగూడ భగవాను డీజగత్తును పునర్జన్మ దుఃఖాలయ మనియు, అశాశ్వత మనియు, అనిత్యమనియు వచించి దుఃఖ స్వరూపమును సూచించియున్నాడు.[౧]

ప్రపంచమునందు సుఖము బొత్తిగా లేదనికాదు. ఎప్పుడో ఒకప్పుడు ఒకానొక నికి భాగ్యవశమున నొకింతసుఖము లభించును. అదియు దుఃఖమిశ్రితము అగుటజేసి దానిని కూడ దుఃఖమనియే ఎన్నఁగును.[౨] కాన పైన వర్ణింపబడిన త్రివిధాత్మక దుఃఖ నివృత్తియే వాంఛనీయము ఈదుఃఖనివారణోపాయమును సూచించుటకే దర్శనశాస్త్రములు జన్మించినవి. కాని, ఈ నివృత్తి తాత్కాలికమైన లాభము లేదు. ఆత్యంతిక నివృత్తి అయిన మేలు. ఇదియే పరమ పురుషార్థము. 'అథ త్రివిధదుఃఖాత్యన్త నివృత్తి రత్యన్తపురుషార్థః'　　　(సా. సూ. ౧. ౧)

ఈ ఆత్యంతికనివృత్తి ఎట్లు సిద్ధించును? లౌకికోపాయములవలన సిద్ధింపదను సంగతి సర్వజనవిదితము. ఔషధసేవలవలనగాని ఇష్టప్రాప్తివలనగాని అగు దుఃఖనివృత్తి తాత్కాలికమును, అవ్యభిచారియుగాదు. పిదప, వైదికోపాయము ననుసరించి స్వర్గలోకమున కరిగి దుఃఖమును తప్పించుకొందమన్నను వీలు పడుటలేదు. ఏలయన, ఒనర్చిన యజ్ఞాది క్రియల ఎచ్చుతగ్గుల ననుసరించి, పొందెడి సుఖములలో భేదము కల్గును. అందువలన స్వర్గవాసుల నడుమ ఉత్కర్షాపకర్షలవలన దుఃఖ మనివార్యమై వాటిల్లును అదియునుగాక యజ్ఞాదిక్రియలు హింసాబహుళములు. హింసవలన సంభవించు పాపమును అనుభవింపవలెను. అందువలన దుఃఖము తప్పుట లేదు. మఱియు, ఈలోకములు నిత్యములు కావు. పుణ్యభోగానంతరము మనుష్యలోకమున జన్మనెత్తవలెను. కనుక లౌకికవైదికోపాయములు రెండును దుఃఖనివృత్తికి తోడ్పడలేవు. అగుచో, నుపాయ మేమి?

ఈ ఉపాయనిర్ధారణార్థమే సాంఖ్యదర్శనావతరణము.

౧. సమానం జరామరణాదిజం దుఃఖం—సాం.సూ. 3-౫3. ఊర్ధ్వాగతానాం బ్రహ్మాదిస్థావరాంతానాం సర్వేషాం ఏవ జరామరణాదిజం దుఃఖం సాధారణం. —విజ్ఞానభిక్షువు.

౨. కుత్రాపి కోఽపి సుఖీతి. సా. సూ. ౬-౭
తదపి దుఃఖశబలమ్. సా. సూ. ౬-౮
ఇతి దుఃఖపక్షే నిక్షిపన్తి వివేచకాః. సా. సూ. ౬-౮.

సాంఖ్యదర్శనానుసారము దుఃఖనివృత్తికగు ఉపాయము జ్ఞానము. 'జ్ఞానాన్ముక్తిః' (సా. సూ. 3-౨3) జ్ఞానమనగా నెద్దాని జ్ఞానము? ప్రకృతిపురుషుల భేదజ్ఞానము.[3] ఈజ్ఞానము ప్రకృతి, వికృతి, పురుషుల గుఱించి లెస్సగా తెలుసుకొనుటవలన లభించును. (ఈమూడింటిని 'అవ్యక్త, వ్యక్త, జ్ఞ' అనియు సాంఖ్యులు వ్యవహరింతురు.) వీటి తత్త్వమును మాటిమాటికి పర్యాలోచన మొనర్చిన భ్రమరహితమును, సంశయవిహీనమును, పరమపవిత్రమును అగు జ్ఞానము లభించును. ఈ జ్ఞానలాభానంతరము మనుజుడు జీవన్ముక్తుడై ప్రారబ్ధకర్మలు క్షీణము లగువఱకు శరీరము నాశ్రయించుకొని యుండును. ఆజీవన్ముక్తవ్యక్తి తన్ను కర్తృత్వభోక్తృత్వరహితుడగు చిన్మాత్రునిగా తెలిసికొనును. అట్టి నిర్మమనిరహంకార పురుషుని పట్ల ధర్మాధర్మ బీజములు నిష్ఫలములు; జననమరణస్రోతమునం ద్రోయజాలవు. సలిలసిక్తమగు క్షేత్రముననే బీజము అంకురించును. నిదాఘసూర్యకిరణముల జలము ఇగిరిపోయినచో నామరుభూమియందు మొక్క మొలుచునా? జ్ఞానమువలన అవివేకము దూరీకరింపబడిన చిత్తమున కర్మబీజములు అంకురింపజాలవు. జీవన్ముక్తపురుషుని శరీరము నాశనమైనప్పుడు, ప్రకృతి అంతటితో నివృత్తయైపోవును. ఆపురుషుడు ఆత్యంతిక కైవల్యమును బొందును. సుఖదుఃఖము లంతర్హితము లగును.[4]

ఇట్టి తత్వజ్ఞానిని ప్రశంసించు శ్లోకము నొకదానిని గౌడపాదు లుదాహరించినారు. అది:

'పంచవింశతితత్త్వజ్ఞో యత్రతత్రాశ్రమే వసేత్,
జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః.'

పై శ్లోకమున నాకొనబడిన పంచవింశతి (౨౫) తత్త్వములు ఏవేవి?

సత్త్వరజస్తమము లను త్రిగుణముల సామ్యావస్థయగు మూలప్రకృతియు, దాని వికారమగు మహత్తత్త్వమును, దాని వికారమగు అహంకారమును, దాని వికారమగు పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములును, పంచతన్మాత్రల వికారములగు పంచమహాభూతములును, పురుషుడును గలసి పంచవింశతి తత్త్వములు. వాటినే 'తత్త్వసమాస' అష్టప్రకృతులు, షోడశవికారములు, పురుషుడు అని పేర్కొనుచున్నది.[5]

సామాన్యముగా ప్రకృతియనిన మూలప్రకృతియే. కాని బుద్ధి, అహంకారము,

3. వివేకఖ్యాతిరవిప్లవాహానోపాయః (సాధన. పా. ౨౬ సూ) అను సూత్రమున పతంజలి ఈవిషయము నంగీకరించినాడు. గీతలలో ౧౩-వ అధ్యాయము ౩౪ వ శ్లోకములో నీమతము సమర్థింపబడినది.

౪. నోభయంచ తత్త్వాఖ్యానే —సాం. సూ. ౧. ౧౦౭.

౫. చూడుడు. సాం. సూ. ౧-౬౧.

చూడుడు. గర్భోపనిషత్తు. 3.

# జగత్కథ

## అపూర్వగ్రంథము

భూమి ఉత్పత్తి మొదలు, జీవవికాసము, నరజాతి ఆరంభము, ఆయామతములు, నాగరికత ఉత్పత్తి, వాని సంబంధము, నేటివరకు యావత్తు ప్రపంచపు చరిత్రము, ఇందు గలవు. వెల్సుగారి ఆంగ్లగ్రంథపువిషయములు, అందులేని చాల విశేషసంగతులును ఉన్నవి. డా॥ రాధాకృష్ణగారి ఉపోద్ఘాతము, 22 పటములలో, సుమారు 760 పుటలు, చక్కని అచ్చు కాలికోబైండు వెల రు 3-0-0.

---

# తాతాచరిత్రము

వెల రు 0-10-0

ఆధునిక దేశీయపరిశ్రమల స్థాపించిన జంషెడ్జితాతా, జీవితము, లోహపరిశ్రమ, నౌకావ్యాపారము, విజ్ఞానాలయము, కార్మికసమస్య, మున్నగు అనేక సంగతులు చిత్రింపబడినవి. చిత్రపటములు, రమారమి 190 పుటలు.

కొ॥ శఠగోపాచార్యులు,

వకీలు (కాకినాడ) యొద్దను, ఆంధ్రపత్రికాలయమందును దొరుకును.



# ROYAL

## తెలుగు అండ్ యింగ్లీషు

### పోర్టబుల్ లేక స్టాండర్డు టైపురైటర్లు

కేవలము అసాధ్యమని తలంపబడినది పానగల్ రాజాగారి పెక్కు సంవత్సరముల క్రుషిఫలితముగా సుసాధ్యమయ్యెను. ఒకే టైపురైటరుతో, తెలుగు యింగ్లీషు రెండుభాషలలోను టైపుచేయుటకు వీలుపడునట్లుగా రాజాగారు తెలుగుఅక్షరములను తయారుచేసిరి. ఈ టైపురైటరు కీబోర్డు, బొబ్బిలిరాజాగారియొక్కయు, ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయములయొక్కయు అంగీకారము బడసియుండెను.

తెలుగు, యింగ్లీషు అక్షరములతో అమర్చిన ఈ రాయల్ టైపురైటరు, పోర్టబుల్ మోడల్‌లోను, స్టాండర్డు మోడల్‌లోను దొరకును.

మా ప్రతినిధులు ప్రస్తుతము తెలుగుజిల్లాలయందు పర్యటనముచేయుచు ఈ టైపురైటరులను ప్రదర్శించుచున్నారు. కావలసినవారు మాకు ముందుగా వ్రాసినచో వారివద్దకు మా ప్రతినిధులు వెళ్లి టైపురైటరును చూపునట్లుగా యేర్పాటు గావించెదము.

**శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావు బహదూరువారినుండి, వుయ్యూరుజమీందారు.**

అయ్యా,

మీ తెలుగు-యింగ్లీషు టైపురైటరు నాయెదుట ప్రదర్శింపబడెను. నూతన పద్ధతిలో తెలుగుఅక్షరములను మీ మిషనునందు యేర్పాటుచేయుటలో మీరు సాధించిన ఫలితమునకు మిమ్ము అభినందించుచున్నాను.

ఈ టైపురైటరులను ఈక్రిందిచోట్లయందుగూడ చూడవచ్చును.

## ఆడిసన్ అండ్ కో., లిమిటెడ్, మదరాసు.

అడిసన్ అండ్ కో, లిమిటెడ్,
పిల్లవీధి, బెజవాడ.

గుప్త బ్రదర్సు,
మెయిన్‌రోడ్, విశాఖపట్టణము.

బి. పాడంగి అండ్ సన్స్,
మెయిన్ రోడ్డు, బరంపురం.



పంచతన్మాత్రలుగూడ గౌణభావమున ప్రకృతి యని పేర్కొనబడుచుండును.

పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, క్షిత్యప్తేజోవాయ్వాకాశము లను పంచమహాభూతములు కలసి షోడశవికారము లనబడుచున్నవి. ఇవి కాని వాడు పురుషుడు. ఇతడు ప్రకృతియు కాడు, వికృతియు కాడు.

ప్రకృతి యన నేమి? జగత్సృష్టి కగు ఉపాదానము. 'ప్రకరోతి ఇతి ప్రకృతిః' అపరిచ్ఛిన్నమును, నిర్విశేషమును అగు మూలోపాదానమే సాంఖ్యులు సూచించునది. దీని కాద్యంతములు లేవు. అతిసూక్ష్మము, లింగరహితము, నిరవయవము. దీనిపరిణామమే ఈ విచిత్రజగత్తు. ప్రకృతియొక్క అన్యనామము అవ్యక్తము. సృష్టికి పూర్వము జగత్తు అవ్యక్తమై (Unmanifested) యుండును. దీనియొక్క వ్యక్తావస్థనే సృష్టి యందుము. ప్రళయాంతమున అవ్యక్తమునుండి వ్యక్తజగత్తు ఆవిర్భవించును. మరల సృష్ట్యవసానమున వ్యక్తజగత్తు అవ్యక్తప్రకృతిలో లీనమగును.[౬] ఈ అనులోమవిలోమములను 'తత్వసమాస' సూత్రకారుడు సంచారప్రతిసంచారము లనినాడు.

ప్రకృతి నాశరహిత మను సిద్ధాంతమును పాశ్చాత్యదార్శనికులు కూడ ఒప్పుకొనుచున్నారు.[౭] శ్వేతాశ్వతరశ్రుతి అజ అనియు, లోహితశుక్లకృష్ణవర్ణ అనియు ప్రకృతిని వర్ణించినది. లోహితశుక్లకృష్ణవర్ణ యనగా త్రిగుణమయి యని. ఈగుణత్రయముల నామములు సత్వరజస్తమములు.[౮] ప్రకాశము, ప్రవృత్తి, ఆవరణములు వీటి స్వాభావములు. మానవదేహమున కఫవాతపిత్తములకు సంగ్రామము నిరంతరము జరుగుచుండునట్లు మూలప్రకృతియందీగుణములు సదా ఒకదానినొకటి అతిక్రమించిపోవుటకు యత్నించుచుండునని సాంఖ్యులు వచింతురు. ప్రకాశగుణియగు సత్త్వము జయమందిన సుఖముత్పన్నమగును. ప్రవృత్తిస్వభావ యగు రజస్సు విజయమందిన ప్రవృత్తి, దుఃఖము, చాంచల్యములు జన్మించును. జడరూపియగు తమోగుణము గెలుపందిన మోహముకలుగుచున్నది. ప్రళయకాలమున ఈపోరాట ముండదు.

ప్రకృతియొక్క స్వభావమే పరిణామము. ఇయ్యది సాంఖ్యుల భాషలో 'ప్రసవధర్మి'. అందువలననే సృష్టి. అగుచో ప్రళయకాలమున ప్రకృతి స్థిరత్వమును దాల్చి యెట్లుండగలదు? అని ప్రశ్నించిన, 'సదృశపరిణామము' ప్రకృతియందు దప్పుడు వర్తిల్లుచుండునని సాంఖ్యులు వచింతురు. అనగా, గుణములు వాటివాటి రూపముల నందుచుండును.

౬. చూ. గీత. ౮-౧౮

౭. చూ. Herbert Spencer's 'First Principles.'

౮. సత్వరజస్తమాంసీతి త్రైగుణ్యమ్.

సృష్టికాలీన ప్రకృతిపరిణామమును 'విసదృశ పరిణామము' అని వ్యవహరింతురు.

సాంఖ్యులు ఈశ్వరుని అంగీకరింపరు. తత్త్వసమాసగ్రంథమున ఈశ్వరప్రసంగమే లేదు. సాంఖ్యసూత్రమున అనేకసూత్రములు ఈశ్వరాసిద్ధికొఱకు వచ్చింపబడినవి. అందువలననే ఈ శాస్త్రమునకు నిరీశ్వరసాంఖ్యమను పేరు రూఢమైనది. ప్రకృతి దానియంతట అదే పురుషుని భోగాపవర్గముల కొఱకుగాను పరిణతి నందుననియు, ఈశ్వరసాహాయ్యము నపేక్షింపదనియు సాంఖ్యుల ప్రతిపాదన. ఉష్ట్రము పరార్థమై కుంకుమమును మోయునీతి ప్రకృతియొక్క పరిణామము పురుషుని భోగాపవర్గములకొఱకు. అచేతనయగు ప్రకృతియందు కృతి ఎట్లు సంభవించును అని ప్రశ్నించిన: పాలు స్వతస్సిద్ధముగనే పెరుగగునట్లు, ఋతువు లొకదానిపిదప మరొకటి పరివర్తనమగునట్లు, అయస్కాంత సన్నిధిని లోహము చలించునట్లు, నీరు పల్లమునకు పారునట్లు, వత్సవివృద్ధినిమిత్తము క్షీరము ప్రవహించునట్లు పురుషుని భోగాపవర్గార్థము ప్రకృతి సహజముగానే పరిణమించుచున్నదని సాంఖ్యులు పల్కుదురు. అప్పుడు మహత్తత్త్వము, అహంకారతత్త్వము, పంచతన్మాత్రలు కలుగుచున్నవి. వాటినుండి స్థూలభూతములు, ఏకాదశేంద్రియములు జనించుచున్నవి.

అహంకార తత్త్వమున తమోగుణము ప్రబలమైన పంచతన్మాత్రలు, సత్త్వగుణము ప్రబలమైన ఏకాదశేంద్రియములు ఉత్పన్నమగుచున్నవి. పంచ తన్మాత్రలనుండి పంచ భూతములు ఇంద్రియముల కుపభోగములగు విషయములు జనించుచున్నవి. ఈ విషయములు సుఖదాయకములు, దుఃఖకరములు, మోహాత్మకములును అగుటచేసి శాంత ఘోర మూఢ నామములం బేర్కొనంబడుచున్నవి. ఇయ్యది సాంఖ్యుల ప్రకృతి స్వరూపము.

ఇక పురుషుడు నిత్యుడు, అపరిచ్ఛిన్నుడు, నిష్క్రియుడు, స్వతంత్రుడు, లింగహీనుడు, నిరవయవి, చేతనుడు, పరిణామ రహితుడు, ద్రష్ట, కూటస్థుడు, కేవలుడు, అసంగుడు అని వర్ణింపబడినాడు. ఇతని భోగాపవర్గముల కొఱకే ప్రకృతి పతివ్రతవలె చరించుచున్నది. ప్రకృతి ఒక్కటియే. కాని పురుషులనేకులు. అందఱును సర్వవ్యాపులు.

సృష్టికాలమున ప్రకృతిపురుషు లిర్వురును సంయుక్తులై యుందురు. కనుకనే ఒకరి గుణము లింకొకరికి ఆరోపింపబడును. ఫలతః, అచేతనమగు ప్రకృతి చేతనముగాను, అకర్తయగు పురుషుడు కర్తగాను తోచుదురు.

సద్గురుని ఆశ్రయించి శ్రవణ మనన నిదిధ్యాసనల నొనర్చి ప్రకృతినుండి పురుషుడు తన్ను వేరుగా తెలుసుకొనవలయును. (సాంఖ్యుల సాధనకు పతంజలిసాధనకు భేద మంతగా లేదు.)

నర్తకి ప్రేక్షకులకు తన నాట్యమును జూప అదృశ్య యగునట్లు, ప్రకృతియు పురుషునకు తన రూపమును జూప అదృశ్యమగును. ప్రకృతి అసూర్యంపశ్య యగు రమణివంటిది. పురుషు డొకసారి వీక్షించిన మరల వాని కన్నులం బడదు.

ఇట్లు ప్రకృతి పురుషునకు తన రూపమును దర్శింపజేసి, కైవల్యము నందించును.

'అజా మేకాం లోహితశుక్లకృష్ణాం
బహ్వీః ప్రజాః సృజ్యమానాం సమానాః
అజో హ్యేకో జుషమాణో௨నుశేతే
జహా త్యేనాం భుక్తభోగా మజో௨న్యః.
—తత్వకౌముది.



వృషభవిజృంభణము [గ్రాఫిక్ మాగజీన్ నుండి]




వెంపటి నాగభూషణం

'రా...

'అక్కా డేం చేస్తున్నావు...రావేం... లోపలికి...'

— మాటలు అర్థమయినా, భావోద్వేగాన్ని సరిగా అర్థం చేసుకోలేని... చిన్నతనపు చాపల్యాన...అమాయికత్వాన...బాల, వినీవినిపించుకోకుండా...తువ్వాయితో గంతులువేస్తూ ... చెంగిస్తూ ... ఆ ధ్యానంలోనే ఉండిపోయింది...

మళ్లా పిలిచింది...లోపలనుంచి...మళ్లా ...ఇంకోసారి...

ఊహుఁ...

రాజమ్మ...నిలువెల్లా కోపం తెప్పించుకుని...తలుపు విసిరివేసినట్లు తెరిచి...ధూకుడుగా, బయటికి...వచ్చింది...

—వచ్చి...ముందరికి అడుగు వేయబోయి ... పరవశిల్లి ... ఆలా ... ఆలా ...

మోహనగాన మానిత ప్రౌఢ కురంగాంగనా విభ్రమతో...నిలవబడిపోయింది...

వె

న్నె

ల...

...నున్నని ... ఒరపులులేని ... తెల్లదనం...పండి... వెల్లివిరిసిపోతూన్నది.

రేకెత్తిన కోరికలను జతచేసుకుని... చిరుగాలిఅలలమీద ... సుడివారకుండా... తేలిపోయే మనసును ... చిక్కబట్టుకుని... ధీరాలాపంతో...ప్రకృతాన్ని అవధరించుకుని...

'రా...తల్లీ ... ప్రొద్దుపోతూన్నది... పండుకుందువుగాని...'—అని లాలించింది..

'నేను...రానే...'

ఇంకా బుజ్జగించింది...

ఊహుఁ...

'చూడు... వెన్నెల ఎంతచక్కగా ఉన్న దో... నాకు నిద్రరావడంలేదు. — లక్ష్మి కూడా...ఎలా ... ఆడుకుంటూందో. దానికీ... నిద్ర...'

'—పద, ముందు... నీవేషాలూ, నీవూ నూ. పో... లోపలికి పోయి... పడుకో. అల్లా దిక్కులుచూస్తావేం... పో...'

—రాయి అయిపోయిన గుండెకు... కిరాతకాఠిన్యం - నిర్దయ... మెరపించడం... ఎంతసులువు?...

బాలకు... ఈ అన్యాయము బోధపడ లేదు. వెన్నెలలో...హాయిగా ఆడుకోవ డం... అపరాధమా?...అమ్మకు... వెన్నెల అంటే ఎందుకు అంతకోపం?...మిగతా విష యాల్లో...సమయాల్లో ... ఎంతోఆపేక్షగా ప్రేమించి...లాలించే...కన్నతల్లి... వెన్నెల మాట ఎత్తితే ... అంత మండిపడటం... ఎందుకూ?... అందరుపిల్లలూ ... సావాసగత్తె లు... చక్కగా కబుర్లు చెప్పుకుంటూ... చందమామతో కేరింతలాడుతూ ... ఆరు బయట... వెన్నెలలో మునిగితేలుతూ... పడుకుని ... నిద్రపోతారే! ... అంతదాకా అక్కర్లేదు ... అడగటానికీ భయమే... కా స్సేపు...ఆడుకోకూడదూ?

— బాల... బెదురుతూ...తల్లికి దూ రంగా ... తలవంచుకుని ... లోపలకు వెళ్లి పోయింది...

— వెంట ... రాజమ్మకూడా తిరిగి పోయింది: బాల...మంచంమీద...ఎగుడు దిగుడుగా ... తలగడమీదకు బోర్లపడు కుని... వెక్కి-వెక్కి...

పక్కను కూర్చుని...ముఖం తిప్పి... ముంగురులు సరిజేస్తూ:...

'ఎందుకమ్మా...ఊరుకో. నే నేమన్నా ననీ...ఎబ్బె...తప్పు. అలా...ఏడవకూడ దు. సరిగా పడుకో...తపళ...వినవూ...'

సముదాయించి...జోకొట్టినట్లు... కర లాలనతో ... స్పర్శతో ... నిద్రబుచ్చింది. తానుకూడా... ప్రక్కన...సర్దుకునిపడుకుని ...మసలి...చప్పుడుచేయకుండా బయటికి వచ్చి... వెన్నెలలో...కూర్చున్నది...

వె

న్నె

ల...

వె... న్నె ...ల...

వలిపెపు ... తెలి ... నులిపొరలు... ఎన్నివంచనలను...దాచుకున్నాయి. వెన్నెల వెలుగులో ... మనసు నిలపలేకపోయినందు చేతనేకాదూ ... తనజీవితమంతా ... ఇలా చీకటి అయిపోయింది...

మానవంతుల వంశమర్యాదను...తన మానధనాన్ని ...అంతా కబళించివేసింది... ఈ...వన్నెల...వెన్నె లేకదూ...

అతడు ... ఎక్కడ ఉన్నాడో ... ఏం చేస్తున్నాడో? ఎందుకు...ఇంకా మమత? ...చేసిపోయిన ఘనకార్యం చాలదూ... ఎన్నడో మరచిపోయిఉంటాడు. అభయూ—

శుభమూ ఎరుగని ... ఐనయింటిపిల్లను... తనఅందంతో మోసంజేసి ...నమ్మికలిచ్చి తన దాన్ని చేసుకుని ... పనితీరిన వెనుక ... తిరిగీ చూడకుండా ... మాయమైపోయినాడు ...

—అతని కేం ... ?

రాజమ్మకు ... కుటుంబవారందరిలో ... తలవంపులై,తల్లి-తండ్రి...తనవారందరూ ... ఇంటనిలువనీయక ... తరిమివేయగా ... ఫల పరిపాకంకోసరం ... పసిపాపకోసం ... అన్ని అగచాట్లూ పడి ... ఒంటరిగా ... ఎవరూ ఎరుగనిచోట ... తలదాచుకోవలసిన యోగం పట్టింది ...

ఏటివొడ్డున కూర్చుని ... నగంలోతుకు వెళ్లి ...ఎన్నిసార్లు ప్రయత్నంచేసింది — ఈమాయలోకం వదలిపోవాలని ... కాని ...

బాల ... కన్నకడుపు ...

వెన్నెల ... మాయావాగురలో చిక్కకుండా ... ఆపిల్లను రక్షించి ... విజయగౌరవంతో ... అప్పుడూ ...ఉత్తరలో కాలవిషయం ... యోచనచేయడం ...

*          *          *

మనోహరాఖ్యాయికాపాఠక కరోద్వేగ చాలన ప్రవర్తితపత్రనైఖరిని ... చకచకా ... సంవత్సరములు తరలిపోయినవి.

వసంతలక్ష్మి మధుమాధవులకు ... ప్రణయ-విప్రలంభములు ... యథాక్రమాన— ఎన్నిసార్లో ... ఎన్నో ... సార్లు ... వంతులు తీరిపోయినవి ...

—ఎప్పుడూ ... ఆకొంటుదనంతో ... అదే ... వెన్నెల ! ...

*          *          *

గోధూళివేళ ... దాటిపోయింది ...

ఇంకా ...

బాల ... ఇంటికి రాలేదు.

చాలాపెందలకడనే ... ప్రొద్దు ఉండగానే ... వాడుకగా పాలుపోయడానికి-వెళ్లింది. నిత్యమూ ... అంతకన్న ముందే ... పోనీ-అప్పటికైనా ... తిరిగివచ్చేది ...

ఏమో ... ఎక్కడనైనా ఆలస్యం అయిందేమో. పనీపాటాలేని తీరికసంసారులు ... నిలవేసి ... మాటలలో పెట్టి-కదలనీయరు. భోజనంవేళదాకా, ఎలాగో వారికి కాలక్షేపం కావాలి. ఎదుటివాళ్ల తొందరతో ... పనేమిటి వాళ్లకు ...

—ఇంకా రాలేదు ...

ఎందుచేతనో ... వెనుకా-ముందూ చూడదు. తగనిసరదా ...

ఏమన్నా చూస్తూ ...ఆలకిస్తూ ... ఇంటిమాట మరచిపోతుంది. అయినా, ఎంత జాగైనా ...ఈపాటికి ...ఏమో? ప్రొద్దుపోతున్నది.— బాల రాలేదు ...

రాజమ్మమనస్సు ... నిలవడంలేదు — పరిపరివిధాల పోతూన్నది ...తగనిదిగులు— భయం ...పుట్టుకొస్తూన్నవి. కాలు కుదరడం లేదు ... ఏం చేయడానికీ ...తోచడంలేదు ...

—ఈలకూతలాగా ... సన్నగా మొదలుపెట్టి, గాలి హోరుగా మారిపోయింది. టప...టప ... దూరంగా, దూరంగా ... పెద్ద చినుకులు రాలుతూన్నవి...సన్నజల్లు ...

...ఇంకా రాలేదు...బాల...

ఎదురువెళుదామని...వాన పెద్దది అవుతుందేమోనని...గొడుగు తీసుకుని బయలుదేరింది:— మసకచీకటిలో...త్రోవను పోయే ప్రతి ఆరినీ ... భ్రాంతితో తారసిల్లుతూ... అడుగడుగుకీ గమనవేగం అధికంచేస్తూ... పోయింది...పోయింది...

—అదే!...చూచాయగా ఆకారం.. నడకకూడా...అలాగే ఉన్నది. 'అమ్మయ్య' అనుకుని, తెప్పరిల్లి దగ్గరకు వెళ్లి...ఆప్యాయంగా:

'ఏమమ్మా...'

—బాలు కాదు! ఉలిక్కిపడి...వెనుకకు తగ్గింది. ఆపిల్లవాడు...ఏమనుకున్నాడో...హుంకరించి...వడివడి నడచిపోయినాడు: రాజమ్మకు...మనసు చచ్చిపోయింద...

ఊరు మాటుమణుగుతూన్నది: అప్పుడే...ఎక్కడా...సడీ చప్పుడూ లేదు...

చూడక...దోవలో అడ్డంగా పడుకుని ఉన్న కుక్కపిల్లమీద కాలువేసి...దద్దరిల్లి తప్పుకున్నది: శ్వానకిశోరం...గగ్గోలుగా... కంయి...కంయ్...లాడుతూ... కులంవారినందరినీ...లేపెట్టి పురికొల్పి—కాలుదువ్వించింది...

ఒకటి—రెండు...దూరంగానే ఉండి... రణదుందుభులు ప్రమోగించినవి. మరో అతిరథుడు...సింహనాదంతో...మీదికి లంఘించబోయి ... ఛత్రప్రహారంతో ... కుంచితవాలంతో...ఉడాయించాడు...

—ఎక్కనగడప ఎక్కకుండా...ఎరిగి ఉన్న యిళ్లన్నీ తిరిగింది. పాలుపోసి... అప్పటికప్పుడే వెళ్లిపోయిందని...అందరూ... ఆశ్చర్యపడుతూ సమాధానమిచ్చారు...

వీలుదొరికితే...ఎకసక్కెం చేయడానికి తయారయ్యే జాణలకు ... బదులుతీర్చలేని అలుసురాలు కాదు, రాజమ్మ, వస్తుతః— కాని అప్పటిస్థితిలో అవిఏమీ గమనించలేదు...

అడుగులు సీసపుదిమ్మలైపోయినవి: కదల్చలేకపోతూన్నది. తూలుకుంటూ... వచ్చి, వచ్చి...ఇల్లుచేరుకుంటూ,...జారిన మనసును, కాలు అనుకరించడముచేత... బురదలో పడిపోయింది...

వెక్కిరించినట్లు...మబ్బులు చిమ్మేసుకుని...వెన్నెల...'నవ్వు...నవ్వు...బంగారంవంటి పిల్లను...మింగేశావు. నవ్వు... నవ్వు...నీపొంగు ఎంత కాలమో...'

చేతులు...ఎంతఊతంగా చాచి శపించినా, — అందడుగనుక ... ధీమాతో...

చందమామ నవ్వుతూనేఉన్నాడు, — సిగ్గుపడకుండా...వన్నెతరగకుండా...

* * *

క్రొత్తలో...క్షణం యుగదీర్ఘమై...కదలక బాధపెట్టినా...కాలం, లోకమర్యాదాను...క్రమాన గడచిపోతూనే ఉన్నది...

రాజమ్మకు...ఒంటరితనం...అలవాటు అయిపోయింది. బాలను, తలచుకోవడం...తలచుకొని...భరించలేక...మానివేసింది..

—ఒకటి...రెండు...మూడు...ఆలా, ఆలా...ఎనిమిదినెలలు...పరిణతపద్మదళములుగా...రాలిపోయినవి...

అదేవేళ...

పశువులశాలలోనుంచి వచ్చి...గోడ ఓరను ఉన్న మంచం...గుమ్మందగ్గరగా వాల్చుకుని ... రాజమ్మ ... అప్పుడే వెన్ను వాల్చింది...

పాలేరుకుర్రవాళ్లు ... పనుము సామి వద్దకు చేరవేస్తున్నారు...

అంతలో...ఎవరు...?

పాలుతీసి పట్టుకువచ్చాడు ... కమతగాడు, అనుకుని... చూడకుండా...తన ధ్యాసలో ఉండిపోయింది; కాని, వాడు పోయి...పనిచూసుకోకుండా...ఆలాగా నిలవబడిఉన్నాడేం?...



" బాల ఏడుస్తూ తల్లిఒడిలో తలదాచుకొని వాలిపోయింది. "

తీరుబడిగా ... ఒత్తిగిలి ... చూసి... చూపును నమ్మలేక ... చూసి ... ఎగిసిపడి ... అమాంతం— కౌగిలించుకున్నది ...

'అమ్మా ... అ ... మ్మా ...'

'మాతల్లి ... మా ... అమ్మ' ...

మరీ అనుకున్నది. తనకు ... అంత అదృష్టమా ... లేచిన వేళ ఎంతమంచిది ...

కౌగిలి వదలకుండానే ... తనపసిని కూర్చోబెట్టుకున్నది— నిమురుతూ ... పులకరించి, మైమరచిపోయింది ...

కలవరపడి ... మెళకువ తెచ్చుకున్నది ... ఎందుకో, బాల ... ఏడుస్తూ, తల్లిఒడిలో తలదాచుకుని ... వాలిపోయింది ...

లేవదీసి ... సంగట పొదివిపట్టుకుని ... ఊరడించాలని ప్రయత్నంచేసింది. అంతకంతకు మన్యువేగం ... అతిశయం మైపోయింది ... ఏమీ చేయలేక, దిచ్చపడి ... అలా చూస్తూ ... చూస్తూ ... ఊరుకోక ... ఏం ... చేయగలదు ...

'అమ్మా ... నన్ను ... క్షమించు ...'

— బాల ... గాద్గదకంఠంతో ... వేడుకోవడం ... ఆమె ధైర్యకవచానికి వజ్రఘాత మైనది:—కూతుర్ని అనుకరించింది ...

ఇద్దరిసందునా సలిగి ... రోదనాలాపం ... సీరసిల్లి ... క్రమంగా ... ఓక్రమానకు అంతరించింది ...

'అమ్మా ...'

'అమ్మ ...'

'నేను...ఎంత...పాపం...చేశాను...'

'లేదమ్మా...పిచ్చితల్లి...ఊరుకో...'

'అతని....మాటలు....దొంగమాటలు : నిజమని ... నమ్మి ...'

'... ... ... ...'

'వెన్నెలలో ... భ్రమసిపోయి ...'

వె ...

న్నె ...

ల ...

వె ... న్నె ... ల ... — ఆ మా ట తో రాజమ్మకు ఆవేశం ముమ్మరమైపోయింది. కాని ... చలించనట్టు కనబడకుండా, గొంతు మారనీయకుండా :

'అంతేనమ్మా...అజాతిలక్షణమే, అది! మగవాడన్న ప్రతీవాడూ ... అంతే ...'

'నేను ... తెలుసుకోలేక ... పోయినానమ్మా ...'

'అవును ... తల్లీ ...'

'నేను ... బ్రతకను ...'

'అమ్మా ... నాకోసం, ... నన్ను చూసుకుని ... వ న్నెంచేసి పోదలచుకున్నావు ...'

'ఇంతమంచిదానివి ... ఋషివి ... దేవతవు ... నిన్ను ... మోసంచేశాను ... నేను... నే ... ను ...'

—ఈమారు ... కౌగిలిలో ... బాల, క్షమా— ఆశీర్వాదాన్ని ... స్వీకరించుకుని ... కలకలలాడిపోయింది ...

మళ్లా...ఇల్లు—కలకలలాడింది...

బాల...ఓపలేనితనం...ఆతల్లి ఆనం దాన్ని లేతపరవళ్లు కొట్టించింది...

ముచ్చటగా...మూడురోజులు...

బద్ధకం...కనబడకుండానే, ... పెళ పెళ...నవ్వులు,...కేరు...కే...రు...

—పొత్తిళ్లలో బాలమీద చేయివేసుకుని...బాల...నీరసంగా:

'అమ్మా...'—అని పిలిచింది.

వినిపించుకుని వచ్చే లోపల...మరీ నీరసంగా:

'అ...మ్మా...'

తల్లి దగ్గరకు వెళ్లి...నిలుచున్నది

దగ్గరగా...వొంగమని...బాల...సైగ చేసి...

-'ఈ...పసి గుడ్డును...ఎలా పెంచి..'

'ఛ్ ... అలాంటిమాటలుఅనబోకు ... నీకువచ్చినభయమేం... లేదు, తల్లీ...'

'ఎలా...పెంచి...పెద్దదాన్ని...చేస్తావో: నేను చేసినది...చాలక...నీమెడకు... ఈ...ఈ...'

రాజమ్మ...ఆవురుమన్నది...

—'నీ...ఋణం...తీర్చ...లేను. తల్లిలేని...పక్షి...ఎలా...ఎలా. వెన్నెల ...లో, వె...న్నె...లమోసం...చేస్తుంది, జాగ్రత...వె...న్నె...ల...'

... మధ్యమందలోపి ... ప్రథమావతరణ మొనది...ఆ...సంసారం...

*  *

యౌవన...వార్ధక్యాలు—ఏక దోహదాన్నే...ప్రవృత్తివ్యత్యస్తాస — వృద్ధిచెందకం...సృష్టినిసర్గవిశేషం...

సుందరి...తల్లిచక్కదనాన్ని ... మరపిస్తూన్నా, తల్లితల్లికి...ఆమెకన్నతల్లిని...అనుక్షణం...జ్ఞాపకంచేస్తూన్నది. వయసువచ్చిన కొద్ది...మరీని...

రాజమ్మ ... వెనుక ... తెలియక చేసిన ...తప్పును ఉద్దుకున్నది. దాచకుండా... బాలతో... ఆమె జననవృత్తాంతానికి... పూర్వరంగగా తను విశదీకరించినట్లయితే... తెలివిగలిగ, ...అలా ...మోసపోయి ...చివరకు...అమాదిరిగా అయిపోయేదికాదా కదా ...అని...ఒకొక్కప్పుడు—చాలా ...వేదన పడేది...

—అందువల్ని, సుందరికి...బుద్ధితెలియగానే...తమయిద్దరి...కథలూ...జరిగినదానికన్న...మరీదారుణంగా...చిత్రి భయ పెట్టింది. మరచిపోకుండా..చూస్తూన్నది...

ఒకనిమిషం ... ఎడబాయదు. ... ఎవరితోనూ...తనకు...నచ్చనివాళ్లతో ... మాటాడనీయదు. మొగపురుగునైనా...సుందరి చాయల...వాలనీయదు...

ఆపిల్ల కూడా...ఆజన్మ సిద్ధపురుష ద్వేషిణీ భూమికను ... చక్కగా ...నిర్వహించుకొని వస్తున్నది.

*    *    *

రసవిలాసంలో ... కరగి, కలసి... ఒకటైపోతూ ... ఆజంట ... ఈ ముదుసలి ... విధూత గమనాన్ని ... గమనించే అవసరం ... ఏమున్నది ...?



"ఒకరికొకరు.... చేతులు వెన వేసుకొని నడచిపోయినారు."

—చెరువుగట్టున ... నారుమడి ముదురాకు వేస్తున్న దేమోనని ... చూసుకుని, — చేలోకి దిగబోతున్న మందను మళ్లేసి ... వంగతోటదగ్గర ఆగి, ఒడినింపుకుని ... తిరిగి వచ్చేస్తూ ... నిర్జీవ ప్రతిమ అయిపోయింది ...

మాటనొక్కితే ... వెలుగులు విడబడినట్లు ... వెన్నెల ... వె ... న్నె ... ల ...

నేలమీదకు వాలిపోయిన ప్రమాను మీద ... ఒకరికౌగిలిలో ... ఒకరు ...—ఇద్దరు వ్యక్తులు! ...

—స్పష్టంగా ... మాటలు ... వినబడుతూన్నవి ...

'నిన్ను ... విడిచి ... ఉండలేను ...'

ఆ ... వంచకుడు ... కుహూయించుతున్నాడు :

'నేనూ ... వదలలేను ...'—అని, తడబడకుండా అంటూంది ... కృతఘ్నురాలు ...

'అయితే ... పోదాం ... పద ...'

—ఒకరికొకరు ... భుజాలమీద చేతులు

పెనవేసుకుని...తిరిగిఅయినా చూడకుండా ...నడచిపోయినారు...

రాజమ్మ ... కూలిపోయే మంటిగోడ లాగా...దించుకుపోయి...వంగి సగమై ... కర్రను అనుకుంటూ...నిటారై...శూన్య దృష్టితో చూసి...ఆచూపే...పొలిమేర నుంచి...కనుచూపుమేరలో వున్న ఇంటి మీదికి మరల్చి...ఒక్కక్షణం నిలిపి... వంగి...నేలకు అంటుకునిపోయినట్లు అయి ...నెమ్మదిగా ... నె...మ్మ...ది...గా... నడుచుకుంటూ — ఇంటికి దూరమైపోయే త్రోవను...వెన్నెలఅంచుల కదను త్రొక్కే ...చీకటిగింపులో...కలసిపోయింది...

...నర్మగర్భంగా...నవ్వుతూనే ఉన్న ది, వె...న్నె...ల...



# మహారాష్ట్ర ప్రజాస్వాతంత్ర్య సమరము

మొసలికంటి సంజీవరావు

౧

మహారాష్ట్ర ప్రజ యుద్ధము హిందూదేశ చరిత్ర యం దొక యపూర్వఘట్టమై యలరారును. అజేయుఁడగు నౌరంగజేబుపాదుషా దక్కనునందలి బీజపురగోలకొండ రాజ్యముల నాక్రమించి, మహారాష్ట్ర నృపాలుఁడగు శంభాజీని దారుణముగా వధించి, దుర్నిరీక్ష్యుఁడై దీపించెను. మహారాష్ట్రు లట్టి యోధాగ్రేసరుని మహారాష్ట్రమునుండియేకాక దక్షిణదేశమునం దెచ్చటను నిలువనీయక పాఱఁదోలి తమ స్వాతంత్ర్యమును నిలుపుకొనఁజాలిన యద్భుతచరిత్ర నిక్కముగ స్మరణీయము.

ఔరంగజేబుపాదుషాకు సింహస్వప్నముగ నుండిన శివాజీమహారాజు 1680 లోఁ గీర్తిశేషుఁ డయ్యెను. ఇఁక మహారాష్ట్రమే కాక బీజపురగోలకొండ రాజ్యములనుగూడ జయించి, తన యాలంగీరుబిరుదము సార్థకమగునట్లు భరతఖండమంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలింపఁ జాలుదు నని యౌరంగజేబుపాదుషా యుప్పొంగెను. కాని, అతఁ డాసమయమున రసపుత్రయుద్ధనిమగ్నుఁడై యుండెను.

రసపుత్రయుద్ధ మధర్మము; కేవల మవివేకము. రసపుత్రనృపాలురు మొగలుపాదుషాలను సేవించి తదీయసామ్రాజ్యవిస్తారకారకులై, తదాధారభూతులై, కృతజ్ఞతాపాత్రులై రాజిల్లిరి. వివేకనిధియగు నక్బరు సార్వభౌముఁడు వారినిఁ జేరఁదీసెను. జహాంగీరు షాజహానుచక్రవర్తు లన్యథా చరించినవారు కారు. కాని ఔరంగజేబుపాదుషా రాజనీతి కేవలము విరుద్ధముగ నుండెను. హిందువుల నడంచి, హిందూస్థానమును మహమ్మదీయస్థాన మొనరింపవలయునని యాతఁడు కృతనిశ్చయుఁ డయ్యెను. దురంతమగు మతావేశమున నౌరంగజేబు పాదుషా యుచితానుచితములను దలంపలేదు. ఐనను, ఉద్దండ సాహసోదగ్రుఁ డగు యశవంతసింహమహారాజునకు వెఱచి యాతఁడు మరణించువఱకుఁ బాదుషా సహించి యూరకుండెను. * మార్వారుదేశాధిపతియగు యశవంతసింహుఁ డౌరంగజేబును సభక్తికముగా సేవించి, యనారోగ్యనిలయమగు కాబూలునకు దరలింపఁబడి, యచట దివంగతుఁ డయ్యెను (1679). తోడనే యౌరంగజేబు మహాసైన్యసమేతుఁడై బయలువెడలి, మార్వారు రాజ్యము నాక్రమించి, తదీయదేశాంతరపవిత్ర హైందవదేవాలయంబులం బగులఁగొట్టి, దుస్సహమగు 'జిజియా' సుంకము గూడ విధించెను. యశవంతసింహున కిరువురు పసిబాలురు గలరు. ఔరంగజేబు వారికి రాజ్య మీయ నొల్లక, వారిని బంధించెను.

అపూర్వమహిమాన్వితుఁడగు దుర్గాదాసు మొగల సింహగహ్వరమునఁ జిక్కిన రసపుత్ర హరిణకిశోరముల నుద్ధరించిన యద్భుతవిషయ మభివర్ణించుట కీయెడ వలను గాదు.

పాదుషా యొనరించిన [illegible]ర్త్యముగాంచి, మేవారు రాజ్యాధిపతియగు రాజసింహుఁడు క్రోధైకధురీణుఁ డయ్యెను. ఔరంగజేబుచర్యలను గర్హించి యాతఁడు రాజపుత్ర స్వాతంత్ర్యోద్ధరణతత్పరుఁడై తానును యుద్ధమునకు సంసిద్ధుఁడయ్యెను. రసపుత్రయుద్ధము రెండు సంవత్సరములు మీఱియుండెను. రసపుత్రులు చూపిన ధైర్యసాహస గాంభీర్యములు నిక్కముగా నిరుపమానములు. కాని మనకథకు సందర్భించు విషయమునుమాత్ర మరయుదము. ఔరంగజేబుపాదుషా యాజ

*. Cf. "The death of Jaswant Singh emboldened the imperial bigot to reimpose the hated 'jizya' or poll-tax on non-Muslims, which Akbar had wisely abolished early in his reign." V. A. Smith, Oxford History of India p. 438.

మీరు నగరమున విడిసియుండ, నాతని కుమారులు ముగ్గురును మూడురంగములందు యుద్ధనిమగ్నులై యుండిరి. పాదుషాపుత్రులలో 'సుల్తాను అక్బరు' నామధేయుడు మూడవవాఁడు. అక్బరు ఇరువదిమూఁడేండ్లప్రాయపు దరుణవయస్కుఁడు; తండ్రికిమురిపెంపు బిడ్డఁడు. చతురుపాయధురీణుఁడగు దుర్గాదాసుఁ డాతనితోడ రహస్యపుమంతన మొనరించెను. రసపుత్రయోధుల సాహాయ్యమునం దన జనకుని బంధించి, మొగలాయీసామ్రాజ్యాధిపత్యము వహించి, తాతయగు నక్బరుపాదుషావలె హైందవప్రజానురంజకముగ, సర్వజన సమ్మతముగఁ బరిపాలింపవలయు నని యక్బరు సంకల్పించెను.

ఔరంగజేబు నిక్కముగ నపాయకరమగు స్థితియందుండెను. పాదుషా యత్యల్పసైన్య పరిరక్షితుఁడై యుండెను. అక్బరు వృథాకాలహరణ మొనరింపక బయల్వెడలెనేని, సఫలీకృత మనోరథుఁడై యుండెడివాఁడు. ఔరంగజేబు సఖుప్రగా బందీకృతుఁడై యుండెడివాఁడు. కాని అక్బరు మూఢుఁడై కాలవిలంబన మొనరించెను. ఔరంగజేబు నిశ్చలచిత్తుఁడై చక్రని మాయోపాయమున నపాయవిముక్తుఁడయ్యెను. ఆ మేధావి తన తనయున కొక జాబువ్రాసి, అయ్యది దుర్గాదాసున కందునట్లు చేసెను. అం దిట్లుండెను. "ప్రియకుమారా! నీచేయిదము ప్రశంసనీయము. నేర్పుమెయి వైరులచెలిమి సంపాదించితివి. రేపు రసపుత్ర సైన్యమును ముందేయుంచుము. మన యుభయసైన్యమధ్యమునఁబడి మ్రగ్గఁగలదు" రసపుత్రు లాయుత్తరముగాంచి, అక్బరు విశ్వాసఘాతకుఁడు, ద్రోహి యని విశ్వసించి, భయభ్రాంతులై యానిశీథమునం దక్షణము పలాయన మొనరించిరి. అతని మొగలుసైన్యముకూడ నట్టులే మాయమయ్యెను. ఉదయమునంతనే యుద్ధమొనరింప నాయత్తుఁడైన యక్బరు ముహూర్తమాత్రమున మహాపద్గ్రస్తుఁడయ్యెను. అట్టి మహాపరాధమును బాదుషా సైరింపఁడు. తొల్లి, యాతని జ్యేష్ఠకుమారుఁడు మహమ్మదుసుల్తాను భ్రాతృసమరమునందు షూజాకుఁదోడ్పడి, పట్టువడి, బంధితుఁడై 1677 లో రహస్యవధకుఁ బాల్పడినవిషయ మక్బరునకుఁ గరతలామలకము. కావున దారుణమగు పితృక్రోధాగ్నికాహుతి కానొల్లక, యౌదార్యమూర్తి యగు దుర్గాదాసు సాహాయ్యమున నక్బరు మహారాష్ట్రముం జేరి, శివాజీకుమారుఁడగు శంభాజీనృపాలు నాశ్రయించెను.

అక్బరశంభాజీ లేకమగుట మొగలాయీసామ్రాజ్యమున కనర్థదాయకము. అక్బరు మహారాష్ట్ర సేనాముఖంబున దండెత్తిరాఁగలఁడు. క్రోధానలతప్తులైన రసపుత్రు లాతనికిఁ దప్పక తోడ్పడుదురు. ఆ తెఱంగున నక్బరకుమారుఁ డజేయుఁడగునని యౌరంగజేబు భీతిల్లెను. అక్బరు దుర్గాదాసుల యాశయ మట్టులే యుండెను. కావున తన కుమారుఁడు భయకారణుఁడు కాకమున్నె యక్బరుశంభాజీల నడంచుట పాదుషాకుఁ బ్రధానకర్తవ్య మయ్యెను. అతఁ డాకారణమున రాజపుత్రులతోడ సంధియొనరించుకొని (14-6-1681), సహస్రసహస్ర యోధజన మండితుఁడై, నిజరాజ్ఞీ సమేతుఁడై, వైభవాభిరాముఁడై 1681 సెప్టెంబరు మాసమున బయల్వెడలెను. ఆ మహనీయుఁ డెట్టి దుర్ముహూర్తమునఁ బ్రస్థానమొనరించెనో కాని, తిరిగి గృహాభిగతుఁడు కాలేదు.

ఔరంగజేబు బురహాన్పురమునందును, ఔరంగబాదునందును విడిసి 1683 వ సంవత్సరాంతమున నహమ్మదునగరము వచ్చెను. పాదుషాపుత్రులగు 'షా ఆలము' 'అజాముషా'లు మహాసేనాముఖంబున మహారాష్ట్రముఁ జొచ్చి కొన్నివిజయములు గాంచిరి. మహారాష్ట్రనృపాలుఁ డాసమయమున సిద్దీలతోడను, పోర్చుగీసులతోడను యుద్ధమొనరించుచుండెను. శరణుఁ జొచ్చిన యక్బరును బురస్కరించుకొని యయ్యెన మొగలాయీ రాజ్యముపై దండెత్తక, శంభాజీ యనవసర యుద్ధమునఁ గాలహరణ మొనరించుట యవివేకమనియు, విశాలాశయ రహితమగు నల్పత్వమనియుఁ జరిత్రకారులు కొందఱు నిరసింతురు.* ఐనను, మొగలులు

* Cf. "...But vanity and anger are more active stimulants to common minds than ambition or glory: no speculation of that kind diverted Sambhajee from the more humble design of reducing Jinjeera..." History of the Mahrattas by Grant Duff: Part 1 p. 239.

సాధించిన దేదియుఁ గానరాదు. దుర్గమమహారాష్ట్ర పర్వతాంతర ప్రదేశముం జొచ్చిన శత్రుసైన్యము పడరానిపాట్లు పడి, తఱిగి విఱిగెను. ఈలోపున శంభాజీ నృపాలుఁడు మెఱుపు మెఱసిన చందమున, మొగలు రాజధానియగు బరహాన్పురమును, తదనంతరము 'బ్రోచి' యను ప్రసిద్ధమైన రేవుపట్టణమును దోచుకొని, మొగలుల నెంతయుఁ గలంచెను.

కాని శంభాజీ శివాజీవంటి ప్రతిభాశాలి కాఁడు. మహారాష్ట్రరాజ్యము నిర్మూలమగునేని తమరాజ్యములు గూడ మొగల్‌రాహుగ్రస్తమగుట తథ్యమని బీజపుర గోలుకొండ సుల్తానులెఱింగి మహారాష్ట్ర నృపాలునకుఁ దోడ్పడఁగలరు. శంభాజీ తదీయసంయుక్తబలంబులను గూర్చి యౌరంగజేబు పాదుషాను బ్రతిఘటింపవలయును. అక్బరునకి వారికెంతయు లాభకరము కాని శంభాజీ మూఢుఁడై యుపేక్షించెను. అమేయ ప్రజ్ఞాధురంధరుఁడగు నౌరంగజేబు శంభాజీవలన భయము రాకుండ మహారాష్ట్రమునం దొక మహాసైన్యమును నిలిపి, తాను స్వయముగా నాయకత్వము వహించి, మహత్తరప్రయత్నము లొనరించి, 1686,-87 లో బీజపుర గోలుకొండరాజ్యములను జయించి, ఆ సుల్తానులను యావజ్జీవము చెఱయందుంచెను. పాదుషా తద్గర్వాతిశయమున మహారాష్ట్రమునుగూడ నట్లనే సాధించి ఢిల్లీకిఁ బోఁజాలుదునని యూహించెను. కాని, ప్రతి మహారాష్ట్రుఁడు నొక్కొక్క మహాయోధుఁడై, తన బృహత్ప్రయత్నమును బూర్తిగ భగ్నపఱచు ననియు, మహారాష్ట్రజాతి క్రమముగ నొక మహార్ణవమై తన మహాసామ్రాజ్యమును ముంచివేయుననియు నౌరంగజేబెట్లు గ్రహింపఁగలఁడు? *

ఔరంగజేబు బీజపుర గోలుకొండరాజ్యములను జయించుటవలనఁ బ్రతిష్ఠాగరిష్ఠుఁ డయ్యెను గాని, విశేషప్రయోజనము లేకపోయెను. గోలుకొండదుర్గమునం దెనిమిదికోట్ల ధనము చిక్కెను. కాని, యుద్ధవ్యయ మంతకు మించిపోయెను. సారవంతమై సువర్ణసన్నిభముగ నుండిన గోలుకొండదేశము, నిరంతరయుద్ధానర్థమున హాలికులు పేదవడి కృషిచేయనికారణమునఁ, బేదవడి సామ్రాజ్యమునకు లాభము చేకూర్పకపోయెను. బీజపురరాజ్యాక్రమణము మఱియు నష్టకరముగాఁ బరిణమించెను. మహారాష్ట్రనాయకులు పెక్కండ్రు బీజపురసుల్తానును సేవించుచుండిరి. పాదుషా యనాదరించుటచేత వారందఱు శంభాజీ నాశ్రయించిరి. ఆయోగవరుల సాహాయ్యమున శంభాజీనృపాలుఁడు బీజపురార్ధరాజ్యము నాక్రమించెను. అనుభవజ్ఞులగు గోలుకొండ రాజోద్యోగులను దొలఁగఁ జేసియు, నౌరంగజేబు వారిని పడఁగొట్టెను. ఆకారణమున గోలుకొండరాజ్యభాగముకూడ మహారాష్ట్రప్రజాధీన మయ్యెను. అనంతసైన్యములు వెచ్చించి జయించిన దేశ మాతీరున శత్రుహస్తగత మగుటఁ గాంచి యౌరంగజేబు దుర్భరక్రోధావమాన ఘూర్ణితమనస్కుఁడై, యున్మత్తుఁడై, శంభాజీరుధిరార్ద్రమస్తకము గాంచినఁగాని ఢిల్లికి మగుడనని ప్రతినయొనరించెను.

ఔరంగజేబుశపథము సులువుగా నెఱవేఱెను. శంభాజీ స్వయముగాఁ దన చేటు తానే తెచ్చుకొనెను. శంభాజీ నిక్కముగా నిర్వక్రపరాక్రమశాలి యయ్యుఁ గ్రూరుఁడై, రాజ్యపాలనావిముఖుఁడై, ప్రజాకంటకుఁ డయ్యెను. కవికులేశుఁ డను మిత్రుఁ డాతనికి దాపురించెను. వాఁడు సర్వానర్థకారకుఁ డగుటచేత మహారాష్ట్రజాతికి 'కవికలుషుఁ' డని పేరిడిరి. రాజ్యాధికారము వాని యధీన మొనరించి, శంభాజీ దుర్వ్యసనమునం దవిలి, దీపాకృష్ట శలభసన్నిభముగ భయంకరమరణమునకుఁ బాల్పడెను. అతఁడు తన రాజ్యము మఱచి, క్షేమము మఱచి, అలకనందావరణానదీ మధ్యస్థమగు శీశల సంగమేశ్వరగ్రామమున సమరేంద్రభోగము

* Cf. "The mists cf birth, prejudice, pride, and training prevented Aurangazeb from seeing in the Maharattas the cloud no bigger than a man's hand, though before his, it was indeed a cloud of cognisable dimensions." J. P. Rees

అనుభవించుచుండ, షేకునిజాము హైదరాబాది యను మొగలుసేనాని దుర్గమారణ్యము ఛేదించి, యల్పసేనా ముఖమ్మున రయమ్మునఁ దోఁచి, నిరోధింపఁగ సెంగిన మహారాష్ట్రభటులను జక్కాడి, శంభాజీకవికులేశులను నిగళబద్ధుల నొనరించి, పాదుషాసన్నిధికిఁ గొంపోయెను (28-12-1688) ఔరంగజేబు అస్లూజునం దుండెను. శంభాజీ తులాపురమునందు వధింపఁబడెను.

మహారాష్ట్రకంఠీరవము పట్టువడినంతనే మొగలాయీ సేనాసముద్ర మవిరళానందతరంగఘూర్ణిత మయ్యెను. పాదుషా సంతోష మనిర్వచనీయము. అతఁడు షేకునిజామునకు ఘనతరమగు స్వాగత మిచ్చి, ఏఁబదవేల రూప్యముల కట్న మొసఁగి యెంతయు సమ్మానించెను. ఆయోధున కాతని కుమారుఁడగు నిఖలసుఖానుఁడు తోడ్పడెను. వాఁడును, తదితరులునుగూడ మన్నన గాంచిరి. తదనంతరము పాదుషా తులాపురమునకుం దరలెను.

శంభాజీ మహారాష్ట్రదుర్గము లన్నిటిని తన కప్పగించినయెడల నౌరంగజే బాతని వధింపక సైరింపఁ బోయెను. కాని, ఆమహాభిమాని యట్టి హేయకృత్య మొనరించి మొగలుబందియందు మనఁగోరుటకంటె మరణించుట మేలని యెంచి, యౌరంగజేబునేకాక, యాతని ప్రవక్తనుగూడ దూషించెను. వాని ధైర్య మసామాన్యమేకాని వివేకరహితము. ఔరంగజేబు పాదుషా క్రోధోద్దీపితుఁడై, వానిని వధింప నాజ్ఞాపించెను. వెంటనే పరిజనులు శంభాజీ కవికులేశులను విదూషకులనువలె నీచముగఁ దయారుచేసి, లొట్టియలపై నపహాస్యముగఁ గూర్చుండఁబెట్టి యూరేగించిరి. తన యాగ్రహ మంతఁ జల్లార, శంభాజీ మహమ్మదీయుఁడగునేని చంపకుందునని పాదుషా యనెను. అత్యధమ దైన్యమునకుఁ బాల్పడిన మహారాష్ట్రనృపాలుని చిత్తము తదీయవక్రాలాపానలమున భగ్గున మండ, పాదుషాపుత్రికను దనకు భార్యగా నిచ్చినయెడల మత భ్రష్టుఁడ నగుదునని యాతఁడు గంభీరముగాఁ బ్రత్యుత్తరమిచ్చి, మహాదేవుని సంస్తుతించి, మహమ్మదును దూషించెను. మూర్తీభవించిన క్రౌర్యమాయన నౌరంగజేబు ప్రజ్వరిల్లెను. వెంటనే శంభాజీజిహ్వ యుత్తరింపఁబడెను. కండ్లు పెకలింపఁబడెను. హృదయమును తక్కుంగల యవయవములును ఛేదింపఁబడి కుక్కలకు వేయఁబడెను. కవికులేశాదులుగూడఁ జిత్రవధకుఁ బాల్పడిరి. మహారాష్ట్రనృపాలుని యుత్తమాంగము దక్కను దేశమునందలి ప్రధాననగరములలోఁ బ్రదర్శింపఁబడెను. (11-3-1689)

అట్టి దుర్మరణము గాంచిన శంభాజీ ప్రజాభిమానమును జూరఁగొనెను. అతని లోపములను మహారాష్ట్రులు విస్మరించిరి. మొగలులతోడి సంధిఁ దలంపరాదనియు, శివాజీ నిర్మించిన స్వాతంత్ర్యము నిలుపుకొనవలెననియు వారు కృతనిశ్చయులైరి. శంభాజీకి శివాజీ యను కుమారుఁడు కలఁడు. అతఁడే కొంతకాలమునకు 'సాహూ' యని ప్రసిద్ధుఁడయ్యెను. కాని సాహూ యేడేండ్ల బాలుఁడు. మహారాష్ట్రరాజ్యము మొగలాయీ దావానలావృతమైయున్న సమయమున బాలకుఁడు పాలకుఁడగుట యనర్థదాయకము. కావున శివాజీ ద్వితీయభార్యాపుత్రుఁడగు రాజారాము ప్రజాసమ్మతమున రాజ్యభారము వహించెను. అతనిప్రాయ మప్పుడిరువదితొమ్మిది సంవత్సరములు. రాజారాము రాజత్వము వహించినంతనే దుర్గములను బాగుచేయించి సైన్యముల నాయితపఱచెను. రాజ్యపరిపాలనార్థ మతఁడును శివాజీవలెనే సప్తప్రధానవర్గము నేర్పఱచుకొని, వారి యనుభవ వివేకములను నిజదేశ స్వాతంత్ర్య రక్షణార్థము శ్లాఘనీయముగ వినియోగించెను. రాజారాముఁ డెటు వెడలినను జనులెల్లరు భయభక్తివినమ్రులై, అభిమానపూరితులై, రణోత్సాహులై, తమ సర్వస్వము ధారవోయుటకు సంసిద్ధులైయుండిరి.

రాజారాముఁడు తన వారలను హెచ్చరించిన విధం బరయఁదగును. "శంభాజీపై ద్వేషము గలదేని దాని నిఁకఁ దలంపకుఁడు. మీరు శివాజీని స్మరించి, ఆ మహాపురుషునియెడల మీరును, మీపెద్దలును జూపిన భక్తి విశ్వాసముల నాతని పౌత్రుఁడగు శివాజీయెడఁ జూపవలయు. తాను యశోబాయిగర్భమునఁ బునర్జన్మము గాంతునని శివాజీమహారాజు వచించియుండ్,

గదా. శివాజీనామము ధరించువాఁడు ఆసేతు శీతాచల పర్యంత మహాసామ్రాజ్యమును జిరకాలము పాలించునని భవానీదేవి సెలవీయలేదే? నేను మహారాష్ట్రనృపాలుని సేవకుఁడనుమాత్రమే. నాకు మీరు విధేయులరై ఉండవలయు, నిక్కమే: కాని మనకెల్లరకు నేడుగడయగు శివాజీయెడ సాహాయ్యెడల మీరు రాజభక్తి పరాయణులై యుండవలయు. అయ్యలారా! మీరు అటులొనరింతురేని మనము దేశోద్ధరణ మొనరించుటయే కాదు; భవానీదేవి వాక్కులుగూడ తథ్యముగ సిద్ధింపఁగలవు." రాజారాముఁ డిట్లు ధీరోదాత్తచిత్తంబున గంభీరముగా నుపన్యసించి శపథమొనరింప, మంత్రులందఱు నుద్రిక్త మనస్కులై సావేశముగా ననుకరించిరి.

శంభాజీ మరణానంతరము మహారాష్ట్రప్రజా యుద్ధము ప్రారంభమయ్యెను. పేరునకు సాహూ రాజై యుండినను, రాజారాముఁడు రాజత్వము వహించినను, దుర్జయుఁడగు నౌరంగజేబుపాదుషాను సుమారిరువది సంవత్సరములు జయప్రదముగఁ బరిఘటించి, యాతఁడు భగ్నమనోరథుఁడై విశీర్ణహృదయుఁడై మరణించినయనంతరము మహారాష్ట్ర సామ్రాజ్యస్థాపన మొనరించినది మహారాష్ట్రప్రజయే యని యెఱుంగవలయును. మహారాష్ట్ర ప్రజానాయకు లెల్లెడలఁ జొచ్చుకొని, యొక్కొకపుడు వెనుజాఱుచు, వంటనే మొగలాయీసైన్యములపైఁ గవిసి చెండాడుచు మహారాష్ట్ర దుర్గముల నాక్రమించితిమని విఱ్ఱవీగు మొగలాయీ యోధులను వెంటనే చెంపగొట్టి వానిని దిరిగి స్వాధీనపఱచుకొనుచు వీలగునపుడెల్ల మొగలాయీ ధనంబులను యథేచ్ఛగాఁ గొల్లగొనుచు నౌరంగజేబుపాదుషాను నానావిధముల భంగపఱచి తుదకు దక్కనునుండి పాఱఁద్రోలిన యద్భుతచరిత్ర యిఁక నగయునేము.

బీజపుర గోలుకొండ రాజ్యములు మొగలాయీ సామ్రాజ్యాంతర్భాగము లయ్యెను. మహారాష్ట్ర నృపాలుఁడు మరణించెను. ఇఁక దక్కను తన యధీనమయ్యెననియే సంతసించి, పాదుషా పరహిందూసైనికులను పాదుషా తొలఁగించెను. వారందఱు మహారాష్ట్ర దేశాధీశుఁడగు రాజారాము నాశ్రయించిరి. మొగలుసైనికులు కొన్ని మహారాష్ట్రదుర్గముల నాక్రమించిరి. మహారాష్ట్రహృదయమగు రాయగడదుర్గమునుగూడ సాధించి, యితర దేశాక్రమణముం జన యుద్యోగులకు విడిచి, తాను రాజధానికి మఱలవలయునని యౌరంగజేబు యోచించెను. అతని ప్రధానమంత్రిపుత్రుఁడగు నిటికదుఖాను రాయగడదుర్గ మాక్రమింపఁబోయెను. శంభాజీనృపాలుని రాణియగు యశోబాయియును, కుమారుఁడు సాహూయును నందే యుండిరి.

ఇటికదుఖాను రాయగడను ముట్టడించుచుండెను. ఆ సమయమున ధనాజీజాదవుఁడను మహారాష్ట్రప్రముఖుని నాయకత్వమున నలుబదివేల సైన్యము సమకూడెను. ఈ మహాయోధునియొక్కయు, తాదృశుఁడగు శాంతాజీ ఘోర్పడేయొక్కయు నద్భుతచర్యలు సువ్యక్తములగును. శాంతాజీ యుద్ధంపసాహసమొనర్చి వైరిని దిగ్భ్రమపఱచెను. మహారాష్ట్రనృపాలుని దారుణముగ వధించి, మహారాష్ట్రమును మొగలాయీరాష్ట్ర మొనరించుటకు సమకట్టిన యౌరంగజేబు పాదుషాను బరిమార్చుటకే శాంతాజీ సంకల్పించెను. ఆ మహావీరుఁడు సాయంసమయమున రెండువేల సైన్యముతోడ బయలుదేరి, పగటిపూట నరణ్యమునదాఁగి, నిశీథమునఁ బ్రయాణించి, తాము పాదుషా నాశ్రయించిన నవీన సైనికుల మని యెదురైన శత్రుసైన్యమునకు నిశ్చలముగాఁ దెలిపి, వేకువనే తులాపురముం జేరి, నిద్రాధీనులగు పారాల నతిక్రమించి, పాదుషా శిబిరరజ్జువులం దెగఁగోసి, తదంతరజనానీకమును వధించెను! ఔరంగజేబు పాదుషా భాగ్యవశమున నాఁటిరేయి వేఱొక గుడారమున శయనించియుండెనియెడల శాంతాజీఖడ్గధారావిదళితుఁడు కావలసినదే. అతఁడంతటఁ దచ్ఛిబిర స్తంభాగ్ర విరాజిత సువర్ణ కలశాదులను జయచిహ్నములుగాఁ గొనిపోయి తన నృపాలున కర్పించెను. అంతటి ఘనకార్యమొనరించిన శాంతాజీ మహారాష్ట్ర సర్వసైన్యాధ్యక్షుఁడయ్యెను. రాజారాము తక్కుంగల యోధులనుగూడ సముచితముగ బహూకరించెను. మహారాష్ట్రుల ధైర్యోత్సాహములు పెంపొందెను. ధనాజీజాదవుఁడు వేఱొక శత్రుసైన్యమును భంజించి దీపిం

చెను. రాజారామురాజత్వ మిట్లు శుభప్రదముగా నారంభించెను.

కాని, మహారాష్ట్రుల యుత్సాహ మంతరించెను. రాయగడ నాక్రమింపవలయునని పాదుషా కృతనిశ్చయుఁ డయ్యెను. రాజారాముఁడు వసించియుండిన పన్హాలాదుర్గమునుగూడ మొగలులు ముట్టడించిరి. అతఁ డెట్టులో తప్పించుకొని విశాలగడఁ జేర, నదియును ముట్టడింపఁబడెను. మొగలాయీ సైన్య మనంత మగుటచేత ధనాజీశాంతాజీలను నిరోధించి రాజారాముని విశాలగడయందు బంధించి, రాయగడను ముట్టడించుటకుఁ జాలియుండెను. ఆకార్యభారము వహించిన యిటికదుఖానుఁ డప్రమత్తుఁడై, నిశ్చలచిత్తుఁడై ముట్టడి సాగించెను. ఆదుర్గ మిఁక శాత్రవాధీనమగుట తథ్యము. రాయగడను దనయధీన మొనరించినయెడల సాహూ యశోబాయిల కపాయము రానీయనని యిటికదుఖానుఁ డభయమిచ్చెను. మహారాష్ట్రమహారాణి, చేయునది లేక, యటు లొనరించెను. రాయగడ యిట్లు సులువుగాఁ బాదుషావశ మయ్యెను (19-10-1689).

సాహూ యశోబాయిలు పాదుషాశిబిరమునకుఁ దరలింపఁబడిరి. బాలుఁడగు మహారాష్ట్ర నృపాలుని మహమ్మదీయమతస్థు నొనరింపవలయునని యౌరంగజేబు వాంఛించెను. ఇటికదుఖానుని వాక్కులను విశ్వసించివచ్చిన సాహూ అపాయగ్రస్తుఁడు కావలసినది. కాని 'జినతున్నిసా' యను పాదుషాపుత్రిక సాహూ పాలిటి తల్లియై వాని నుద్ధరించెను. మఱియు ప్రతాపరావుఖండోజీ యనువాఁడు సాహూకు బదులుగా మహమ్మదీయుఁ డగుటచేతఁగూడ నౌరంగజేబుహృదయము దయార్ద్ర మయ్యెను. సాహూ మహారాష్ట్ర రాజ్యస్వామి యైనపిమ్మట నాస్వామిభక్తిపరాయణునకు, ఆస్వార్థత్యాగికి—ఖండోజీకి నలువది గ్రామము లిచ్చి తన కృతజ్ఞత వ్యక్తపఱచెను. ఔరంగజేబు శంభాజీకుమారునిపై దయగొని సాహూ యని నామకరణ మొనరించెను. సాహూ యన సాధువని భావము. శివాజీ శంభాజీలపైఁ గల క్రోధావేశమున నౌరంగజేబు వారిని దొంగలు, హంతకులు అని దూషించుచుండెను.

ఆకారణమున బాలుఁడగు శంభాజీకుమారుఁడు సాహూ యయ్యెను. సాహూ యను నామధేయమె చరిత్ర ప్రసిద్ధము. రాయగడతోఁబాటు మహారాష్ట్ర సింహాసనాది రాజలాంఛనములును, శివాజీసంచితానంత ధనంబును మొగలులకుఁ జిక్కెను. ఆమహాదుర్గమును జయించిన యిటికదుఖానుఁడు జల్ఫికారుఖానుఁ డను బిరుదము గాంచి, యచిరకాలమున 'పన్హాలా' యను దుర్గమును గూడ సాధించెను.

రాజారాముఁడు విశాలగడయం దుండెను. రాయగడపన్హాలాదుర్గముల నాక్రమించిన యౌరంగజేబు విశాలగడనుగూడ సాధింపఁగలఁడు. తాను శంభాజీవలెఁ బట్టువడి చిత్రవధకుఁ బాల్పడకుండ విశాలగడనుండి తప్పించుకొని మహారాష్ట్రమునుండి పలాయన మొనరించి కర్ణాటకదేశాంతర మహారాష్ట్రరాజధానియగు జింజీదుర్గమునకుఁ బోవలయునని రాజారాముఁడు నిశ్చయించెను. రామచంద్రబవేడ్కరు మహారాష్ట్రమునం దుండి మొగలులను వారించుటకు సంసిద్ధుఁ డయ్యెను.

మార్గమంతయు శత్రుజన సంకీర్ణ మగుటచేత మహారాష్ట్ర ప్రముఖులు ప్రచ్ఛన్నవేషమున జట్టులుజట్టులుగా విశాలగడనుండి నిశాసమయమున వెలువడి ప్రయాణ మొనరించిరి. శాంతాజీ ధనాజీలును, ఖండేరావుదభాడ ప్రహ్లాదనీరాజీ ఖందోబల్లాలు చిట్నీసులును మహారాష్ట్ర నృపాలు నంటియుండిరి. వారందఱు యాత్రాపరుల వలె వేషముల దాల్చి చాలవఱకు సహ్యాద్రికొండల నంటివెడలిరి. అనంతరము సొందాయందు నిలిచి, పిమ్మట బెద్నూరు చేరిరి. మహారాష్ట్ర నృపాలుని సామంత రాజ్ఞియగు బెద్నూరు రాజ్యేశ్వరి వారిని సగౌరవముగా నాదరించెను. అంతలో మొగలు సైనికులు ప్రబోధితులై దశదిశలు గాలించి, చేఁజిక్కిన జట్టులను మడియించిరి. రాజారాముఁ డంతలో సురక్షితముగా బెంగుళూరు వచ్చి, యొక పాంథశాలయందు విడిసెను. బెంగుళూరు మహారాష్ట్ర రాజ్యములోనిది. కాని, ప్రకృత మయ్యది మొగలులవశమై యుండెను. అచటి మొగలుచారు లప్రమత్తులై యుండిరి. మహారాష్ట్రసేవకులు ప్రమత్తులై తమ రేనికి యథావిధమున

నుపచారములు సలుపఁదొడంగిరి. ఒక సేవకుఁ డాతని పాదములు కడిగెను. మఱియొక్కఁడు వస్త్రముం గొని తడి యొత్తెను. అట్టి పరిచర్యలు సాధారణయాత్రికున కనుచితమని యందున్న కన్నడమార్గస్థులు గుసగుసలాడి నగరాధిపతికిఁ దెలియఁబఱచిరి.

ఆభావ మెఱింగిన రాజారాముని సహచరుఁ డా విషయమును వెంటనే తెలియఁజేసెను. మహారాష్ట్ర నృపాలుఁడు నిక్కముగ మహాపద్గ్రస్తుఁడయ్యెను. కాని, స్వామిభక్తిపరాయణుఁడగు ఖండోబల్లాలుఁడు సంస్తవనీయమగు స్వార్థత్యాగమునకు దొరకొని మహారాష్ట్రము నుద్ధరించెను. ఆతని హిత మాలించి, రాజారాముఁడును శాంతాజీ ధనాజీ ఖంశేరావులును తత్క్షణ మాతావువీడిరి. ప్రహ్లాదనీరాజీ వేఱొకమార్గమున మాయ మయ్యెను. మొగలుసైనికు లంత నరుదెంచి. ఖండో బల్లాలుని నిర్బంధించి నిశితముగాఁ బ్రశ్నించిరి. తాను రామేశ్వరమునకుఁ బోవుచుంటిననియు, ఎవ్వరో యట విడిసి తమదారిని వెడలిరనియు, వారిజాడ తన కణుమాత్రముఁ దెలియదనియు నిశ్చలముగాఁ బలికెను. నగరాధిపతి యింకను నాతని ననుమానించి, కొరడాలతోఁ గొట్టించి, చెఱయందుంచి యెంతబాధించినను ఆ మహాత్యాగి సహించి గంభీరముగ నుండెను. నగరాధిపతి యనుమాన మంతరించెను. ఖండోజీ విముక్తిగాంచి యనతి కాలమున రాజారామునిం గలసికొనెను. జింజీయందలి రాజప్రతినిధి యగు హర్జీమహదీకుఁడు * రాజారామునిఁ గలసికొని యాతని సురక్షితముగా జింజీదుర్గమునకుఁ దోడ్కొనెను.

మహారాష్ట్రదేశమున కాపద సంభవించునపు డక్కఱకు వచ్చునని యే మహాప్రజ్ఞాధురంధరుఁడగు శివాజీమహారాజు ప్రాచ్యమహారాష్ట్ర రాజ్యమును స్థాపించెను. అయ్యది సిద్ధించిన యద్భుతచరిత్ర యరయఁ గలము.

మహారాష్ట్రనృపాలుఁడగు సాహూ మొగలాయి పాదుషావశంవదుఁ డయ్యెఁగదా. ఆకారణమున మహారాష్ట్ర మరాజకభూయిష్ఠ మగుననియు, దక్షిణదేశమంతయుఁ దన క్రిందఁ బాదాక్రాంత మయ్యెననియు నలంగీరు సంతసించెను. యశోబాయీ రాజారాములు సామాన్యమానవు లైనయెడల నౌరంగజేబు సులువుగా సఫలీకృతమనోరథుఁడు కావలసినదే. కాని, వారు మహారాష్ట్రమునకు దాపురించిన మహాపాయమును గుర్తించి, సవివేకముగాఁ బ్రవర్తించి యఖర్వగర్వోద్ధతుఁడగు పాదుషాకు శృంగభంగ మొనరించిరి. తన యన్నకుమారుఁడు సాహూ పట్టువడెనని రాజారాముఁడు రాజత్వము వహింపనొల్లక, ఇంకను నాతని పేరనే రాజ్యనిర్వహణ మొనరింపఁ గోరెను. ధీమంతురాలగు యశోబాయి తదనర్థము గుర్తించెను. తమ నృపాలుఁడు బంధితుఁడయ్యెనని మహారాష్ట్రులు నిరుత్సాహు లగుదురు. కావున, రాజ్యక్షేమము దలంచి రాజారాముఁడు తత్క్షణము రాజ్యారూఢుఁడు కావలయునని మొగలాయీశిబిరాంతరవాసినియగు యశోబాయి రహస్యముగ వర్తమాన మంపెను. అంతయైనను రాజారాముఁడు రాజ్యమునకై ఆశపడక, సాహూ విముక్తుఁ డగువఱకు మాత్రము తాను రాజై యుండుట కొడఁబడి, మహారాష్ట్ర సంప్రదాయసిద్ధముగా యథావిధమున రాజ్యాభిషిక్తుఁడయ్యెను. ఆమహాకష్ట సమయమునఁ గాలహరణము తగదు. కావున రాజారాముఁడు తన యష్టప్రధానవర్గమును వెంటనే కూర్చుకొని, కార్యోద్యోగుఁ డయ్యెను. రామచంద్రబావేద్కరుఁడు మహారాష్ట్రమున రాజప్రతినిధి యైయుండి, యచటి కార్యముల నతిశ్లాఘనీయముగా నిర్వర్తింపఁబూనెను. బీజపుర గోలుకొండప్రభుత్వములు విధ్వంసములగుట వలన నావిశాలదేశమున దోపిడిమూఁకలు చెలరేఁగిరి. శాంతాజీరామచంద్రులు కొందఱను జక్కాడి, కొందఱను దమసైన్యమునఁ జేర్చుకొని, కొంతవఱకు శాంతిస్థాపన మొనరించిరి.

ఔరంగజేబుస్థితి కడువిషమముగ నుండెను. మహారాష్ట్రదుర్గముల నొక్కొక్కటి సాధింపవలయునా? లేక, మహారాష్ట్రనృపాలుఁడు విడిసిన జింజీదుర్గ

* ఈతఁడు శివాజీ జామాత : శంభాజీ సోదరీభర్త.

మును వెంటనే ముట్టడించి యాక్రమింపవలయునా? రాజారాము నుపేక్షించినయెడల నాతఁడు సారవంతమగు సముద్రప్రాంతమంతయు జయించి యసాధ్యుఁ డగును. అట్లని, తా నటు వెడలినయెడల దక్కనుదేశమంతయు మహారాష్ట్రనలప్రజ్వలిత మగును. పాదుషా యోచించి యోచించి, తాను దక్కనుదేశమును వశపఱచుకొనుటకును, అంతవఱకు రాజారామును జింజీదుర్గమునం దరికట్టియుంచుటకును నిశ్చయించెను. శాంతాజీ, ధనాజీ, ప్రహ్లాదనీరాజీ లుద్దండ ధైర్యసాహసోపేతులై, ఝంఝానిలజవంబున విజృంభింపనియెడల నౌరంగజేబు పాదుషా కృతకృత్యుఁ డయ్యెడివాఁడు.

ఔరంగజేబుపాదుషా దక్కనుదేశాక్రమణాసక్తుఁడైయుండ, దన్నవసనుండిన రాజారాముఁ డపూర్వముగ విజృంభించెను. జింజీని ముట్టడింపఁబోయిన మొగలుసైన్యములను శాంతాజీ ధనాజీలు మర్దించి వెనుదఱిమిరి. అంతమాత్రమున నూరకుండక, శాంతాజీ మహారాష్ట్రమునఁ జొరఁబడి, శత్రువశమైన దుర్గములను వశపఱచుకొనఁగడంగెను. మహారాష్ట్రనృపాలుఁ డొక మహోపాయ మాలోచించి, యౌరంగజేబును దిగ్భ్రమ పఱచెను ప్రస్తుతము పాదుషాయధీనమైన మహారాష్ట్రదేశమునందలి యినాములను,జాగీరులను సమర్థమహారాష్ట్రనాయకులకు రాజారాముఁడు దానమిచ్చెను. ఆయా భూఖండములను స్వాధీనపఱచుకొనుటకై యాయా నాయకులు స్వీయధనంబు వెచ్చించి సైన్యములను సమకూర్చుకొని యప్రతిహతస్వార్థోత్సాహధుర్యులై బయల్వెడలిరి. అట్లు ఖాండేషు, దక్షిణగుజరాతు, మధ్యరాష్ట్రములు, ప్రస్తుతనైజాము రాజ్యమునందునుగూడ మహారాష్ట్రనాయకులు చొరఁబడి వీలగునట్లు 'చౌతు' 'సర్దేశముఖి' పన్నులను రాఁబట్టఁబూనిరి. ఈలోపున రాజప్రతినిధియగు రామచంద్రుఁడు క్రొత్తసైన్యముల నాయత్తపఱచి విశేషదేశము నాక్రమించెను. తా నొకవంక జయించుచుండఁగనే, మహారాష్ట్రులు వేఱొకవంక విపరీతముగా విజృంభించు నద్భుతపరిణామముగాంచి యౌరంగజేబు నిర్విణ్ణుఁడయ్యెను. శివాజీనృపాలసంతతి యెవ్వఁడైనను సజీవుఁడైయుండునంతకాలము తన యాశయము విఫలమగునని గ్రహించి, జింజీదుర్గ మాక్రమించి రాజారాముని బట్టవలయునని నిశ్చయించి, తన్మహాత్కార్యనిర్వహణమునకు సమర్థుఁడగు జుల్ఫికారుఖానును బాదుషా నియోగించెను (1691).

జుల్ఫికారుఖాను నిక్కముగా బహుసమర్థుఁడైనను, జింజీమహాదుర్గమును జయప్రదముగా ముట్టడించుట కాతని సైన్యము చాలదు. దృఢతమములగు ప్రాకారపరంపరలను నిర్భిన్నమొనరించుట కాతని శతఘ్నులల్పములై నిరర్థకము లయ్యెను. మహారాష్ట్రదుర్గ మట్లు దుర్భేద్యముగ నుండుటయేకాక, ఖానున కొక యాశ జనించెను. ఔరంగజేబుపాదుషా వృద్ధుఁడుగదా. అతఁడు మరణించునంతనే తా నొక స్వతంత్రరాజ్యాధిపతి కాఁగోరి, రాజారామునితోడ మంతన మొనరించెను. మొగలాయిముట్టడివలన రాజారామునకును, రాజారామునివలన మొగలాయిసైన్యమునకును బాధ కలుగకుండ కొంత కాలహరణమయ్యెను. ఈలోపున శాంతాజీ మొదలగు మహారాష్ట్రనాయకు లెట్లు విచిత్రముగ విజృంభించిరో ముందరయుందము.

జింజీదుర్గము నాక్రమింపకుండిన జుల్ఫికారుఖానునిపైఁ బాదుషా గినిసి, యాకార్యము సాధించుటకుఁ దన కుమారుఁడగు కాంబక్షునుగూడ నియోగించెను. జుల్ఫికారుఖానుఁ డాతనిపై మాత్సర్యము వహించి, సైన్యమునం దాతని మాటకుఁ జెల్లుబడి లేనట్లు చేసెను. పాదుషాతనయుఁ డాకారణమున ఖానునిపైఁ గ్రోధము వహించియుండుట సహజముగదా. ఆకారణమున జింజీముట్టడి మఱియు నుపేక్షింపఁబడెను. ఈసమయమున మొగలులకు మఱియొక యుపద్రవము సంభవించెను. ఔరంగజేబును మహారాష్ట్రమునం దరికట్టియుంచుటకై తగుసైన్యము నం దుంచి, సాహసోదగ్రుఁడగు శాంతాజీ యిరువదివేల సేనాముఖంబున భయంకరవాతూలమువలె మహాజవంబున వచ్చి, జింజీదుర్గమును ముట్టడించు మొగలుసైన్యములు కలసి యెదిరించుట కవకాశమీయక, యొకసైన్యమును భగ్నపఱచి తదీయశిబిరమును నిరాఘాటముగాఁ గొల్లగొనుటయేకాక యాసైన్యాధిపతినిం బట్టి బంధించెను. అతని వారింపఁబోయిన మఱియొక

సైన్యముగూడ నట్లులే పరాజితమై పటాపంచలయ్యెను. మహారాష్ట్రసైన్యాధ్యక్షులు దంతమాత్రమున నూఱకుండక, పాదుషా మరణించెనని ప్రకటించి, పాదుషాపుత్రుఁడగు కాంబక్షుని విడఁదీసెను. షాజాదా (పాదుషాపుత్రుఁడు) యంతట మహారాష్ట్ర సాహాయ్యమునఁ బాదుషా కాఁగోరెను. సమయ మరసి యాతఁడు మహారాష్ట్రశిబిరము జేరుటకు సన్నాహము లొనరించుచుండెను. కాని, పాదుషాప్రధానమంత్రియు, జుల్ఫికారుఖానుని జనకుఁడును నగు నసదుఖానుఁ డాసమయమున నరుదెంచి, కాంబక్షుని దుశ్చరిత మరసి, వెంటనే యాతని బందీకృతు నొనరించెను.

ఈలోపున మహారాష్ట్రులెట్లు విజృంభించిరో గమనింతము. శంకరనారాయణ కృష్ణాజీలు రాయగడ పన్హాలాదుర్గములను మరల నాక్రమించిరి. మహారాష్ట్ర నాయకు లనేకశత్రుసైన్యములను వెంటాడి, ఆయా సేనానులను బట్టి, యప్పనములం గొనఁజొచ్చిరి. అందు శాంతాజీ ధనాజీలు మిక్కిలిఁ బ్రసిద్ధులై, మొగలులకు సింహస్వప్నముగా నుండిరి. వారి పేరు వినినంతనే మొగలులు భయవిహ్వలులై, వారి నెదిరించుటకు వెనుదీయుచుండిరి. తమ గుఱ్ఱములు నీరు త్రావనియెడల, ధనాజీ శాంతాజీలు నీరమున గోచరించిరేమో యని మొగలు రౌతులు దిగులుపడుచుండిరి.*

జింజీదుర్గమును ముట్టడించు జుల్ఫికారుఖానుని సాహాయ్యార్థము పాదుషా పంపిన సైన్యములు ప్రచండ మారుతోద్ధూత మేఘపటలములవలెఁ బటాపంచలయ్యెను. ఆకారణముననే యౌరంగజేబుపాదుషా యాగ్రహపరవశుఁడై తన కుమారు నంపెను. శాంతాజీ యట్లు రణరంగములం దల్లెపల శత్రువులను గనిమసంగి చిచ్చరపిడుగవలె జుల్ఫికారును దాఁకెను. జింజీముట్టడి నెత్తివేయించుటయే మహారాష్ట్రుల యాశయము. పాదుషానండి వేలుచేయఁబడిన ఖానుఁడు చేయునదిలేక, రాజారామతోడ సంధి యొనరించుకొనెను. మహారాష్ట్రులు ఖానుని నిరపాయముగా స్థలాంతరమునకుఁ బోనిచ్చిరి (1696).

ఆసంధి పాదుషాకు దుస్సహమయ్యెను. చేఁజిక్కిన శత్రుసైన్యమును హతమార్పకుండ మహారాష్ట్ర నృపాలుఁడు పోనిచ్చుట శాంతాజీకిఁగూడ దుస్సహమయ్యెను. పాదుషా యాజ్ఞాపింప, జింజీదుర్గమును ముట్టడించుటకు జుల్ఫికారుఖాను మరల దొరఁకొనెను. శాంతాజీ యీలోన దక్షిణబీజపురరాజ్యముఁ జొచ్చి, తన నెదిరించుటకు సాహసించు వైరిసైన్యములను నిజ ప్రతాపానలమున భస్మీభూత మొనరించి, జింజీముందఱ జివ్వునఁ బ్రత్యక్షమై, ఖానుని బాఱఁద్రోలుటకుఁ బ్రయత్నించెను. కాని, ఖానుఁ డసాధ్యుఁడు. ఐనను, తనఁ దఱిమివేయఁ బ్రయత్నించు శాంతాజీని సరకుగొనక ఖానుఁడు నిలిచియుండినను, జింజీదుర్గము నాక్రమింపఁజాలకపోయెనని యౌరంగజేబు పాదుషా క్రోధాయత్తచిత్తుఁడై, యాతఁ డాదుర్గము సాధింపనియెడలఁ బదభ్రష్టుఁ డగునని యదలించెను. ఖానుఁ డింకను గాలహరణ మొనరించు టపాయకరము. అతఁ డాదుర్గము సాధింపనియెడల నిక్కముగ భంగపడును. ఆకారణమున రాజారాముని రహస్యముగా హెచ్చరించి, జుల్ఫికారుఖానుఁడు జింజీని తీవ్రతరముగ ముట్టడించెను. ఖానుఁ డిఁకఁ గృతకృత్యుఁడగుట తథ్యము. దుర్గాంతర మహారాష్ట్రసైన్యమునకు బాహ్యప్రపంచముతోడ సంబంధములేనటు లాతఁడు గట్టిమను కట్టుదిట్టము లొనరించెను. రాజారాముఁ డాదుర్గము వీడుటయే యవశ్యకర్తవ్యము. మహారాష్ట్రనృపాలుని బంధుజనులు కొందఱు పాదుషాసేనానులై యొకవంకఁ గావలియుండిరి. వారి

* Cf. "...So great was the fear that prevailed among them both of Santaji and of Dhanaji Jadav, that the Musulman troopers used, when their horses refused to drink, to ask them whether they saw the face of Santaji or of Dhanaji in the water." — p. 94, "A History of the Maratha People"- Kincaid and Parasis (vol. II)

సాహాయ్యమున రాజారాముఁడు తప్పించుకొని, సురక్షితముగా విశాలగడ చేరెను (డిసెంబరు, 1697).

1698 జనవరిమాసమున జుల్ఫికారుఖాను జింజీ దుర్గము నాక్రమించెను. పాదుషాకు విజయము చేకూరినను ప్రయోజనము లేకపోయెను. జింజీముట్టడి సామ్రాజ్యమును బీల్చి పిప్పిచేసెను. మహారాష్ట్రకంఠీరవము మఱల దుర్గమమహారాష్ట్రముం జొచ్చెను. మహారాష్ట్రులు దళాధికస్థైర్యబలోత్సాహులై ఢిల్లీపాదుషాను దృణీకరింపఁజాలిరి.

(సశేషము)



పోయిన ఉంగరం. -వాసన్



రాజగిరి దుర్గము : ఎదుట మూడవప్రాకారము ద్వారము కుడివైపున 'కల్యాణమహల్

౨. రాజగిరి దుర్గమున
ధ్వజస్తంభము గోపురము





3 .రాజగిరి దుర్గమున ‘కైదీల నూయి

౪. రాజగిరిదుర్గమున జలాశయమున్న
గుహ లోపలివైపు





౫. రాజగిరి దుర్గము; జలాశయము
నకు పోవు గొందివాకిలి



౬. కృష్ణగిరిదుర్గము: 'కల్యాణమహల్' గోపురముమీదినుండి కనుపడుదృశ్యము

# బృందావనం

బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం

రాధ తనదుఃఖం ఇంక భరించుకోలేకపోయింది. ఆ చెట్టునీడని కూర్చుని మ్రానుమీద శరీరంవాల్చి చంటిపిల్లలా ఏడవడం ప్రారంభించింది. రెండు గంటల క్రిందట రావలసినవాడు ఇంకా రాలేదు. తప్పకుండా వస్తానని మాటకూడా ఇచ్చాడు. తనంటే ఇంతనిర్లక్ష్యంగా ఉన్నాడన్నమాట. ఈ రాదలచుకోనివాడి కోసం తను సిగ్గులేక అరగంటా, గంటా, రెండుగంటలూ కూడా ఇలా ఆశపెట్టుకుని కాచుకునేఉంది. తనమీద అతనికిలేని ఇంతఅనురాగం అతనిమీద తనకి ఎందుకుండాలో తనకి బోధపడలేదు. కొంత పౌరుషంకూడా కలిగింది. ఇకమీదట అతనితో మాట్లాడనైనా మాట్లాడకూడదని నిశ్చయించుకుంది. తనజీవితంలో అతనికింక సంబంధం లేదనుకుంది. తనదారి తనది.

ప్రత్యేకంగా ఈవాళ కొన్ని విషయాలగురించి మాట్లాడాలనికూడా ముందటిరోజున హడావిడిగా కలుసుకున్నప్పుడు అతనికి తను బోధపరచింది. "సరే" అన్నాడు. "ఆవిషయాలేమిటో నాకిప్పుడే తెలుసును" అనికూడా చెప్పేడు, నవ్వుతూ...... తెలుసుకున్నాడేమోకూడా! తెలుసుకుంటే ఆ నవ్వేమిటి?

అదికాక, రోజులుగడుస్తున్నకొద్దీ అతను శాంభవివలలో మరీసులభంగా పడిపోతున్నట్టుకూడా కనిపిస్తోంది. వారంరోజులక్రిందట సాయంత్రం పక్షం చీకట్లు క్రమ్మేక చెఱువుగట్టుమీద అతను శాంభవితో మాట్లాడుతూ పచార్లుచెయ్యడం తను కళ్లారాచూసింది. తర్వాత అతన్ని కలుసుకున్నప్పుడల్లా ఎన్నోసార్లు ఆసాయంత్రం వాళ్లిద్దరూ తనకంటబడ్డట్టు చెప్పాలని నాలుకచివరుదాకా వచ్చేది కాని, ఎల్లీ చెప్పడానికి మనసొప్పేదికాదు. చెప్తే అతనిమీద తను కాపలా కాస్తున్నట్టు భావిస్తాడేమోనని భయంకలిగింది. తను చెప్పినాకూడా, తీరాశాంభవిని ఆనాడు కలుసుకోనేలేదని అతను అబద్ధం ఆడితే, ముఖ్యంగా అతనికి కాకుండా తనకే ఎక్కువ చిన్నతనంగా ఉంటుందని రాధకి తెలుసును. ఎప్పుడైనా శాంభవినిగురించి అతనంతట అతనే మాట్లాడుతాడేమోనని ఎదురుచూస్తే, లోకంలోఉన్న ప్రతివాళ్లగురించీ మాట్లాడుతాడు కాని శాంభవిపేరెత్తడు. అతనిచర్యలకి వేరే రుజువెందుకు?

ఈ రోజునకూడా చెప్పినవేళకి అతను రాకుండా ఉండడానికి కారణం అతను శాంభవితో కూర్చుని ఆనందంగా కాలంగడుపుతూ ఉండడమేనని రాధ నిశ్చయించుకుంది. శాంభవిని తలచుకున్నప్పుడల్లా రాధకి ఈ జీవితం భరింపరానిదనిపించింది. దానికితోడు శాంభవిమాట తను ఏక్షణంకూడా మరచిపోవడం అంటూ లేదు. ఎలామరచిపోవడం, తనప్రాణంతో సమానమైనవాడిని శాంభవి అపహరింపదలచుకున్నప్పుడు?

ఇంతట్లోనే తనుకూర్చున్న ప్రదేశానికి కొంచెం దూరంలో శాంభవి కనిపించింది. అవును, శాంభవే. ఒంటరిగా వస్తోంది. ఇటూఅటూ ఎంతచూసినా అతను మట్టుకు కనుమేరచూపులో ఎక్కడా లేడు. అయితే ఇంతసేపూ శాంభవితో లేనేలేడేమో అతను! తన అన్యాయపు అనుమానాలేనా ఇవన్నీ? శాంభవితో లేనట్టయితే అనుకున్నవేళకి రాకపోవడం ఎందుకల్ల? తీరా, శాంభవితో ఒక్కత్తితోనేకాకుండా మిగిలిన వాళ్లతోకూడా ఎక్కువగా స్నేహం చేస్తున్నాడేమో! తను కనిపెట్టడంమట్టుకే శాంభవి నొక్కత్తెనీ కనిపెట్టడం అయిందేమో? అతను హాస్యపుకబుర్లు చెప్తూ నిర్లక్ష్యంగా నవ్వుతున్నప్పుడు చూసి ఎటువంటివాళ్లైనా లోబడిపోతారు. ఎవరితోఉన్నా అలాగే నవ్వుతాడతను. ఆ నవ్వులన్నీ తనకిమట్టుకే అందివ్వకుండా లోకానికంతకీ సమర్పిస్తాడని రాధకి కోపం......

మిగిలినవాళ్లెవరున్నారసలు? మల్లిక, సౌదామిని, మందాకిని,— అశ్నే, వీళ్లని సమంగా చూడనైనా చూడలేదతను, తనకి తెలిసినంతవరకు. తనకి తెలిసినంత వరకు!

శాంభవి రాధకూర్చున్న స్థలానికే వచ్చింది. కాసేపు రాధకేసి పరీక్షగా చూస్తూనుంచుంది. రాధ కూడా మాట్లాడకుండా ఉండేసరికి శాంభవే ముందు మాట్లాడింది.

"ఈ మారుమూలకి వచ్చికూర్చున్నావెందుకు రాధా?"

"ఇక్కడ కూర్చునేందుకు నాకు హక్కు లేదా?"

"నీకు హక్కులేదనికాదు. ఒంటరిగావచ్చి కూర్చున్నావుకదా అని అడిగేను."

"నా ఇష్టం నాదీ. నాకు ఒంటరిగా ఉండడం ఇష్టంకనుక వచ్చి ఇలాకూర్చున్నాను. నువ్వుమట్టుకు ఈ మారుమూలకి ఒంటరిగా ఎందుకు రావాలి?"

"నాతో వచ్చేవాళ్లు మరెవరూ లేరుకనుక."

"నాతో వచ్చేవాళ్లుమట్టుకు ఎవరున్నారు?"

"లేకేమి? పల్లెలో నీకందరూ స్నేహితులే. అందరూ నువ్వంటే అభిమానం ఉన్నవాళ్లే — చిన్నవాళ్లూ, పెద్దవాళ్లూ, ఆడవాళ్లూ, మొగవాళ్లూ కూడాను."

"అలాగా? మొగవాళ్లకికూడా నేనంటే అభిమానమేనని ఎవరుచెప్పేరు నీకు?"

"ఒకరు చెప్పాలా? అదికాక, వినయుడు సాటుతున్నాడుగా — ఈ పల్లెలో నిన్నుమించినపిల్ల లేదనీ, ...నిన్నతను పెళ్లి చేసుకునేట్టు స్థిరపడిందనీ."

వినయుడు ఈ విధంగా అందరితోనూ చెప్తున్నాడన్నవిషయం తనకి తెలిసినదైనప్పటికీ, ఆమాటే శాంభవి చెప్పగానే రాధ ఒక్కక్షణం తనగుండె కొట్టుకోడం మానేసినట్టుగా కంగారుపడింది. మారు మాట్లాడలేకపోయింది. ఎంతవెదికినా మాట్లాడేందుకేమీ తనకి మరొకవిషయం కనబడలేదు. తెల్లబోయి శాంభవి ఏమిటేమిటో చెప్తుంటే వింటూ, శాంభవికేసిచూస్తూ కూర్చుంది.

ఇంతట్లో శాంభవిమాటలలో రాధకి వినయుడి పేరుమాత్రమే కాకుండా.....అతని పేరుకూడా వినబడినట్టు తోచింది. అవును. అతనిమాటే. శాంభవి సంభాషణలోకి అతని పేరు ఏవిధంగా తీసుకువచ్చిందో, అతనిగురించి మొదట ఏమిటిమాట్లాడిందో రాధ సరిగ్గా విననైనా లేదు. కాని శాంభవి ఇప్పుడు మాట్లాడుతున్నది అతనిగురించే.

"అతన్ని మళ్లీ ఇప్పుడే చూసేను, రాధా. పల్లెకి దక్షిణాన్నిఉన్న పెద్దమర్రిచెట్టు క్రింద వినయుడితో అతిగూఢంగా మాట్లాడుతున్నాడు. మొదట నాకేసైనా చూడలేదు ఇద్దరూకూడా. తర్వాత నేను పలకరించినా అతను పలకలేదు. వినయుడే నవ్వుతూ రెండుగంటలబట్టి ఇద్దరూ అక్కడేనుంచుని ఏమిటేమిటో మాట్లాడుకుంటున్నట్టు చెప్పేడు."

ప్రత్యేకంగా ఈరోజున వినయుడితో అతను రెండుగంటలు మాట్లాడుతున్నాడా? ఏ విషయమై మాట్లాడుతున్నాడో? ఒకవేళ తనవిషయమేనేమో!

"అలాకొంతదూరం నడద్దాం వస్తావా రాధా?"

"వద్దు. నాకు నడవాలని లేదు. అదికాక, కాసేపట్లో ఇంటికిపోవాలి."

"రావూ? సరే, నేను వెళ్తాను. ......అయితే నిజంగా వినయుడిని నువ్వు పెళ్లిచేసుకుంటున్నట్టేనా రాధా?"

"నాకావిషయమై ఏమీతెలియదు శాంభవీ."

"నీకు చెప్పాలని లేకపోతే చెప్పకు."

"అదికాదు ...... నిజంచెప్తే ఎవరితోనూ చెప్పవుకదా?"

"ఎందుకుచెప్తాను?"

"వినయుడికి నేనంటే ఇష్టంఅని మా అమ్మ గ్రహించి, నాతో చెప్పకుండా రెండువారాలక్రిందట

వినయుడిని పిలిపించి నన్ను పెళ్ళిచేసుకోమని అడిగిందట. వినయుడు సంతోషిస్తూ 'సరే' అన్నాడట. నిన్న ప్రొద్దున్న వినయుడూ, వినయుడి తల్లిదండ్రులూ వచ్చి నా ఎదురుగుండా మా అమ్మతో ముహూర్తం స్థిరపరచుకోడం విషయమై మాట్లాడడం మొదలు పెట్టేరు. నిన్నటినుంచి నాకేమీ తోచడంలేదు."

తన రహస్యం చెప్పేసేక 'ఇదంతా శాంభవికి చెప్పేసేనే!' అని రాధ విచారించడం మొదలు పెట్టింది.

"వినయుడిని పెళ్ళి చేసుకోవాలని లేదా నీకు?"

"అసలు పెళ్ళిచేసుకోవాలని లేదు నాకు.... నేను చెప్పినదంతా నువ్వెవరికీ తెలియపరచకూడదు."

"ఎవరికీ చెప్పనులే. వినయుడు నీకు పనికిరాలే దన్నమాట?"

"పనికిరాలేదని కాదు."

"వినయుడు దొరికితేచాలునన్నవాళ్ళనేకమందున్నారు ఈ పల్లెలో."

రాధకి కోపం వచ్చింది.

"నేను లేదనలేదు. వినయుడి లోటుపాట్లు చూసి నేను సందేహిస్తున్నానని కాదు. నాకు పెళ్ళంటేనే అయిష్టం."

"నేను పోతాను."

"ఎవరితోనూ చెప్పకు."

"చెప్పను."

శాంభవి వెళ్ళిపోయింది. రాధ దీర్ఘాలోచనలో పడింది. 'అనవసరంగా అతనిమీద అపనమ్మకాలు పెట్టుకున్నా'నని దుఃఖపడింది. వినయుడితో అతనేమి మాట్లాడేడో తెలుసుకోవాలని చాలా కుతూహల పడింది.......ఇంత ఆలస్యంచెయ్యడం వినయుడితో మాట్లాడుతూ ఉండడంవల్లనే. చెప్పినవేళకి తనదగ్గరకి రాకుండా వినయుడితో మాట్లాడుతూ ఉండిపోయాడంటే ఏదో చాలాముఖ్యమైన విషయమై మాట్లాడుతూ ఉండుండాలి. అంత ముఖ్యమైన విషయం తనదికాక మరొకటేమిటుంది?

మరొక పది పదిహేను నిముషాలలో అతనే వచ్చాడు.

సుఖంగానవ్వుతూ తను లేచినుంచుంది. తను అందిచ్చిన రెండుచేతులూ రెండుచేతులతోనూ పట్టుకున్నాడు.తర్వాత కౌగలించుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"ఇంత ఆలస్యం చేసినందుకు నన్ను పడతిట్టావని భయపడుతూ వచ్చాను రాధా, ఇక్కడికి."

"నీమీద ఎప్పుడూ నేను కోపంగా ఉంటున్నట్టు!"

"నామీద నీ కెన్నడూ కోపంరాలేదంటావా?"

"అవును. ఎప్పుడూ నువ్వంటే నాకు కోపమే"

"చూసేవా? నువ్వే ఒప్పుకుంటున్నావు.... అవునుకాని, ఈవాళ నీకెందుకు కోపంరాలేదు?"

"ఈవాళ నేను కోపంగాలేనని నీ కెలా తెలుసును?"

"కూర్చుందాం రా. ......... నిజంచెప్పు. ఆలస్యం ఎందుకయిందనైనా అడగలేదు నువ్వు."

"ఇంతసేపూ నువ్వెక్కడున్నావో నాకు తెలుసును."

"కొంపముంచేసేవు! నామీద ఎవరినైనా కాపలాపెట్టేవా?"

"రెండుగంటలబట్టి ఆ పెద్దమర్రిచెట్టుక్రింద నుంచుని వినయుడితో ఏమిటేమిటో మాట్లాడుతున్నావు."

"ఛా, ఛా. నేనక్కడ లేనే లేను. వినయుడిని నేనిప్పుడు కలుసుకోలేదే!"

"నిజంగా నువ్వక్కడ లేవూ? ఎక్కడున్నావు నువ్వింతసేపూ మరి? అక్కడలేకపోతే ఇంత ఆలస్యం ఎందుకుచేసేవు?"

"నువ్విక్కడికి రమ్మన్నావన్నమాటే మరచిపోయాను రాధా. ఇప్పుడిప్పుడే జ్ఞాపకం వచ్చింది."

"అవును, మరచిపోవుమనీ, నీ వ్యాపకాలన్నిటితోనూ ?"

"అదుగో, ఏడుపు ప్రారంభించకు."

"ఎందుకు ఏడవడం ? ...... నిజంగా నువ్వు వినయుడితో మాట్లాడటం లేదూ ? ... వేళాకోళానికి మరచిపోయానని అబద్ధం ఆడుతున్నావు. అవునా ?... ఇప్పటిమట్టుకు వేళాకోళం చెయ్యకు. ఇంతసేపూ వినయుడితో మాట్లాడటం లేదూ నువ్వు ?"

"లేదు రాధా. అబద్ధం చెప్పను."

మరి, ఆ మాయదారిపిల్ల నాతో అలా అబద్ధం ఎందుకుచెప్పింది ?"

"ఎవరా మాయదారిపిల్ల ?"

"శాంభవి. నీ ముఖ్య స్నేహితురాలు"

"ఏమని చెప్పింది ?"

"తనిప్పుడిలావస్తుంటే తోవలో నువ్వూ, వినయుడూ మాట్లాడుకుంటున్నారనీ, రెండుగంటలబట్టి అలా మాట్లాడుకుంటూ ఉన్నామని తనతో మీరు చెప్పేరనీ చెప్పింది."

"ఓహో, శాంభవి నీతో వచ్చి చెప్పేసిందా ? తను ఆతోవని వచ్చిందన్న మాటే నేను మరచిపోయాను. ఇంకా దాచి మరికొంతసేపు నిన్ను బాధపెట్టి తర్వాత చెప్పదాం అనుకున్నాను. .. ... శాంభవీ, నువ్వూ గొప్పస్నేహితులన్న మాట ఆలోచించుకోలేదు."

"నాకేమీ స్నేహితురాలు కాదు శాంభవి ... నిజంగా నువ్వు ఇంతసేపూ వినయుడితో మాట్లాడుతున్నావా ?"

"అవును రాధా."

"నిజంగా ?"

"నిజంగా."

"నిన్ను నమ్మలేకుండా ఉంది. ఇందాకా నిజం చెప్పేవో, ఇప్పుడు నిజం చెప్తున్నావో నాకెలా తెలుస్తుంది ?"

"ఇప్పుడు చెప్తున్నమాటే నిజం."

"నిజంగా ?"

"అవును."

"ఎలానమ్మడం ?"

"పోనీ, నమ్మకు. నమ్మక, దుఃఖపడు."

"అవును, దుఃఖమేమిటి ...... కాసేపయాక ఇప్పుడుచెప్పినమాట అబద్ధం అంటావు. ఇందాకానే చెప్పకూడదూ నిజమైనమాట ?"

"సరదాకి నిన్ను కొంచెం బాధపెట్టి తర్వాత నిజంచెప్దా మనుకున్నాను."

"నేనుబాధపడుతుంటే నీకు సరదా కాదూ ?"

"అవును నువ్వు కొంచెంబాధపడుతుంటే నాకు కొంచెం సంతోషం. నువ్వు చాలాబాధపడుతుంటే నాకు చాలాదుఃఖం."

"రెండవమాట నమ్మను."

"అబద్ధంకాదు. ......కాని, రాధా, ఎప్పుడూ నువ్వు మన ప్రేమనుగురించే ఆలోచిస్తూ, ఇరవై నాలుగు గంటలూకూడా అదే మనస్సులో పెట్టుకుంటే నీ జీవితం సంపూర్ణసాఫల్యం లేనిదవుతుంది."

"ఎందుకల్ల ?"

"ఎందుకేమిటి ? నీ వ్యక్తిత్వం నశిస్తుం . నువ్వు మరొకరిలో లీనమైపోతుంటే, వేరుగా ఒక వ్యక్తివై పుట్టిన లాభం ఏమిటి ?"

"నాకు వ్యక్తిత్వంతో పనిలేదు. నేను స్త్రీని. పురుషుడిలాగ ఒకసారి నిర్లక్ష్యంగా ప్రేమించి ఆ ప్రేమ మరచిపోయి నాదారిని నేను పోలేను."

"నిన్నిప్పుడు నేనుచెయ్యమంటున్నది అదికాదు. నీ జీవితం అంతా ఏ తెలివితక్కువ మొగపురుగుమీదనో ఈ నియమం నీకున్న ప్రేమపై ఆధారపడనివ్వకద్దని చెప్తున్నాను. నువ్వు మరొకరిలో లీనమైపోకూడదు. నీవ్యక్తిత్వం నువ్వు నిలబెట్టుకోవాలి."

"నాకు నీ వేదాంతం తలకెక్కడం లేదు. ... స్త్రీతత్వానికీ, పురుషతత్వానికీ చాలా భేదం ఉంది."

"ఆ తత్వభేదం సామాన్యస్త్రీలకీ, సామాన్య పురుషులకీ చెందుతుంది కాని......"

"నేను సామాన్యపు స్త్రీనే."

"నువ్వే సామాన్యపు స్త్రీవైతే, అందుకు గర్వ పడకు. ఈ సామాన్యపు స్త్రీలన్నా, సామాన్యపు పురుషులన్నా నాకు పరమ అసహ్యం. చిన్నపిల్లలైనా నయం. చిన్నపిల్లలకున్న జ్ఞానం పెద్దలకి చాలామందికి లేదు. ... ఒకమాట చెప్తాను. చిన్నపిల్లలు ఆడుకోడం ఎప్పుడైనా పరీక్షగా చూసేవా?"

"చూడకేమి? వాళ్ల చేష్టలన్నీ నాకెంతో ఇష్టం. నీకూను. నువ్వంటే పల్లెలో పిల్లలందరికీ......"

"అవునులే. విను. వాళ్ల ఆటలు చూస్తుంటే రెండు సంగతులు ప్రత్యేకంగా తేటబడతాయి. మొదటిది, వాళ్లకి బొమ్మలన్నా బొమ్మలతో ఆటలన్నా సరదా ఎల్లకాలం ఉండకపోవడం. రెండవది, ......"

"నాకివంతా ఎందుకిప్పుడు బోధపరచడం?"

"విను మరి...రెండవది, వాళ్లు బొమ్మలతో ఆడుకుంటున్నప్పుడుకూడా వాళ్ల బొమ్మలు నిజమైన జీవులు కావనీ, వాళ్ల ఆటలు నిజంగా జీవితం అనే పదార్థం కావనీ చిన్నపిల్లలుకూడా గ్రహించినట్టు మనకి నిర్ధారణ ఉండడం.

"ఏమిటి ఆ నిర్ధారణ?"

"ఏమిటా? ... అనేక సూచనలు కనిపిస్తాయి. ...చిన్న చిన్న పిడతలలో మన్నుపోసి ఆ మన్నే అన్నం అన్నట్టు పిల్లలందరూ ఆడుకుంటారు. కాని అది నిజమైన అన్నం కాదని వాళ్లకి తెలుసును. ఎప్పుడూ నోటిదాకా తెచ్చుకుంటారు కాని నోట్లో వేసుకోరు. అప్పుడప్పుడు పిడతలో ఏమీ లేకపోయినాకూడా అందులో అన్నం ఉన్నట్టు నటిస్తారు. ఆ అన్నం తింటున్నట్టు నటిస్తారు. నిజంగా అన్నం లేదన్న మాట వాళ్లకి కూడా తెలుసును. ఒప్పుకుంటావా? అయితే?"

"అయితే, స్నేహితులు బొమ్మలూ, వాళ్ల ఆటలూ ఎంతో శాశ్వతం అయినట్టూ, ఎంతో ముఖ్యం అయినట్టూ దీక్షగా ఆడుకుంటున్నప్పటికీ కూడా ఈ ఆటలూ ఈ బొమ్మలూ శాశ్వతంకావనీ, నిజం కావనీ వాళ్ల మెదడులో ఏదో ఒక భాగం ఏదో విధంగా గ్రహించే ఉంటుందో, అవిధంగానే......"

"అవిధంగానే?"

"అవిధంగానే పెద్దవాళ్లమైన మనం ఒకమూల మన మానవధర్మాలన్నీ దీక్షగా అవలంబిస్తూకూడా మన పెద్దబొమ్మరిళ్లలోనైనా ఇంకా ఆటలే ఆడుకుంటున్నామనీ, మన సామాన్యపు జీవితాలలోనైనా నిజంగా ఆత్మ సంతృప్తినిచ్చే పదార్థం లేదనీ గ్రహించాలి. అలా గ్రహించికూడా మామూలుగా జీవించగలిగే శక్తిని పొంది ఉండాలి."

"నువ్వు మాట్లాడేదేమీ నాకు బోధపడడం లేదు. నన్నెందుకు బాధపెట్తావు?"

"నీకు బోధపడకపోవడం పూర్తిగా నీ తప్పు కాదు, నాదికూడాను. సరిగ్గా చెప్పలేకపోతున్నాను. నేను మాట్లాడుతున్న విషయమై నాకున్న ఊహాలన్నీ ఇంకా మనస్సులో స్థిరమైన రూపం పొందలేదు. ఆరూపం వాటికిచ్చేందుకు తంటాలు పడుతున్నాను... నాలో నాకున్నంత నమ్మకం ఎవరికీ నామీద లేదు. అందుకల్లలోకానికంతకీ అసాధారణమైన వేదాంతజ్ఞానం ఏదో అందిచ్చికాని నేను ప్రాణం వదలనని అప్పుడప్పుడు నాకు తోస్తూ ఉంటుంది. అటువంటి సమయాలలో దేవుడే నాలో అవతారం ఎత్తేడేమోకూడా అనుకుంటూ ఉంటాను. అంత ఉత్సాహం కలుగుతూ ఉంటుంది నాకు......నేనెంతవాగినా, నీకేమీ ఉత్సాహం లేదు కాదూ?"

"ఉత్సాహంమాట నాకు తెలియదు. కాని నువ్వు మాట్లాడుతున్నంతసేపూ నీ పెదవులూ, నీకళ్లూ, నీ దివ్యమైనముఖం చూస్తుంటే నాకు అనేక ఆనందం. నువ్వు

ఏమిమాట్లాడనున్నావోకూడా సరిగ్గా వినడంలేను. నువ్వుఅన్నట్టు నువ్వు దేవుడివే అయినాకూడా నిన్ను నేనిప్పుడు ప్రేమిస్తున్నంతకంటె ఎక్కువ ప్రేమించలేను, నిన్ను నేనిప్పుడు పూజిస్తున్నంతకంటె ఎక్కువ పూజించలేను. నిజంగా."

"అలాఅనకు, రాధా. ...... నన్నంత పూజిస్తున్నానంటావుకదా, నేనొకసంగతి చెప్తాను — ఎంతవరకు భరించగలవో చూస్తాను."

"ఏమిటది?"

"నేనీ సాయంత్రం ఇంతసేపటివరకూ ఎక్కడున్నానో నిజంగా చెప్పనా?"

"వినయునితో కాదూ?"

"లేను."

"ఎవరితో ఉన్నావుమరి?"

"శాంభవితో."

"అబద్ధం ఆడుతున్నావు నువ్వు నన్నుమళ్లీ బాధపెట్టాలని."

"లేదు. నిజంచెప్తున్నాను."

"నేను నమ్మను."

"పోనీ నమ్మకు."

"శాంభవివచ్చి నాతో నిన్నూ, వినయునినీ అక్కడచూసేనని ఎందుకుచెప్పింది?"

"శాంభవిని నేనే ఇటుప్రక్కకివెళ్లమని పంపించాను, తనమీద నీకు అనుమానం ఉండకుండా చేసేందుకు."

"నీ పన్నాగమేనా తనురావడం? నీవలలో ఎంతసులభంగా పడ్డాను! ... ఇప్పుడైనా నిజంచెప్పు. ఇంతసేపూ శాంభవితో ఉన్నావా?"

"అవును రాధా."

"నిన్నూ, వినయునినీ అక్కడచూసినట్టు శాంభవిని నాతో చెప్పమన్నదికూడా నువ్వేనా?"

"కాదు. అది తనస్వంతకల్పన."

"ఇ మీదట నీతో అసలు మాట్లాడను నేను. ఇలా నన్ను చిన్నవిషయాలలోనూ, పెద్దవిషయాలలోనూకూడా మోసగించి అవమానపరుస్తుంటే చూస్తూ ఊరుకోనా?"

"చిన్నవిషయాలలోనూ, పెద్దవిషయాలలోనూ కూడానా?"

"కాదుమరి ... అంతసేపు శాంభవితో నువ్వెందుకుండాలి? అసలు శాంభవిదగ్గరకి నువ్వెందుకు వెళ్లాలి? ... శాంభవికీ నీకూ ఈస్నేహం ఎన్నాళ్లబట్టి"

"ఏమీ? చాలాకాలంబట్టే ఉంది."

"ఎలాకుదిరింది మీ ఇద్దరికీ ఈస్నేహం?"

"ఒకరోజున ఈప్రాంతాలలోనే ఇద్దరం తిరుగుతుంటే దృష్టితిప్పకుండా తనకేసి నేనుచూసేను. దృష్టి తిప్పకుండా నాకేసి తనుచూసింది. తనునవ్వింది. నేను నవ్వేను. ఆ తర్వాత నేనే పలకరించాను."

"సిగ్గులేదా పిల్లకి!"

"మనిద్దరికీ పరిచయం ప్రారంభించడం జ్ఞాపకం ఉందా?"

"ఆమాట జ్ఞాపకంచేసి నన్నిప్పుడు దెప్పిపొడవనక్కరలేదు. నా సంగతివేరు. ...... నీవిషయంలో ఆపిల్లా నేనూ ఒకటేనా?"

"ఒకటేఅని కాదులే."

"ఇలానన్ను అవమానపరచడంన్యాయమేనా?"

"ఇందులో నీకు అవమానం ఏముంది?"

"నన్ను తోసిపెట్టి మిగిలినవాళ్లతో నువ్వు స్నేహంచేస్తుంటే అవమానం నాకుకాక మరెవరికి? వాళ్లు నన్నుచూసి నవ్వరూ? లోకంఅంతా ఏమనుకుంటారు?"

"వాళ్లు ఏమనుకుంటే ఏమిటి రాధా?"

"వారంరోజులక్రిందట శాంభవీ, నువ్వూ కలసి చెఱువుగట్టుమీద పచార్లుచేస్తుంటే చూసేను."

"వచ్చి నువ్వుకూడా మాతో పచార్లు చెయ్యలేకపోయావా?"

" ఆలోచించి అంటున్నమాటలే అవి ?"

" ఈ మాత్రానికే ఆలోచించాలా ?"

" ఆరాత్రంతా నేను నిద్రపోలేదు. "

" ఈమధ్య ప్రతిసాయంత్రమూ చీకటిపడ్డాక శాంభవీ నేనూ అక్కడ కలుసుకుంటూనే ఉన్నాము."

" ప్రతిసాయంత్రమూనా ?"

" అవును. "

" ఎంతచులాగ్గా సమాధానాలు చెప్తున్నావు... నేనంటే నీకంత వేళాకోళంగా ఉందన్నమాట. "

" ఏమీ ?"

" ప్రతిరాత్రీ ఆదుర్మార్గురాలితో కాలం గడుపుతూనూ, ఇప్పుడు నాదగ్గరకూర్చుని ఇంత సావకాశంగా ఎలా మాట్లాడగలుగుతున్నావు ?"

" శాంభవి అంత దుర్మార్గురాలని ఏగు నాకు. "

" శాంభవికాదు. నువ్వే దుర్మార్గుడివి. ... నీతో నేనింక మాట్లాడను, ఎన్నడూ నీతోరాను, ముట్టకో నివ్వను. "

" నన్ను నిజంగా నువ్వుప్రేమిస్తున్నావనే నీఉద్దేశ్యం రాధా ?"

" ఇన్నాళ్లూ ప్రేమించాను. ఈనిముషం ఆప్రేమఅంతా నశించింది. "

" నిజమైనప్రేమకి నశింపుఅంటూ ఎన్నడైనా ఉంటుందా ?"

నువ్వే నశించేటట్టు చేసేవు."

" నేనా ?"

" అవును. "

" శాంభవితో స్నేహం చెయ్యడంకల్లనా?"

" ఈ ప్రశ్నలన్నీ నన్నెందుకు అడగడం ?"

" నీకుతెలియదేమో కాని, శాంభవితో నాకున్న పాటిచనువు మిగిలినవాళ్లల్లో చాలామందితో ఉంది నాకు. "

" నీరహస్యాలన్నీ తెలుసుకుందామన్న కోరిక నాకులేదు. తెలుసుకున్నది చాలును...... ఆ మిగిలిన వాళ్ల పేరేమిటి ?"

" మల్లిక, మందాకిని, ముక్త, మేఘావళి, ... మరికొందరి పేర్లుకూడా నాకు తెలీవు. "

" నిజంగా వీళ్ళందరితోనూ నువ్వు చాలా చనువుగా ఉన్నావంటావా ? నిజంగా నువ్వు శాంభవితో ఈసాయంత్రం అంతా గడిపేవంటావా ? అబద్ధం ఆడకు. వేళాకోళానికి ఈ అబద్ధాలన్నీ ఆడి నన్ను బాధపెట్టకు. "

" నువ్వు నమ్మకపోతే నేనేమిటి చెయ్యడం ?"

" నిన్ను ఎప్పుడునమ్మాలో తెలియదు, ఎప్పుడు నమ్మకూడదో తెలియదు. నువ్వునిజంగా మంచివాడవో తెలియదు, చెడ్డవాడవో తెలియదు. నువ్వు మనఃస్ఫూర్తిగా నన్ను ప్రేమిస్తున్నావో తెలియదు, ప్రేమించడంలేదో తెలియదు. ఏమిటి నాబ్రతుకు ?... దేవుడినైనా తెలుసుకోవచ్చునేమో కాని, నిన్ను తెలుసుకోవడం అసాధ్యం ...... పోనీ, ఒక్కప్రశ్న వేస్తాను. దానికైనా సరియైన జవాబు చెప్పు— వ్వు నిజంగా ప్రేమిస్తున్నావా లేదా?"

" ప్రేమించకేమి?"

"అంతేకాదు. అందరికంటే, అన్నిటికంటే, నీకునేను ముఖ్యమా కాదా?"

" కాదు. "

" ఎంతవెంటనేచెప్పేవు జవాబు!"

" నిజంచెప్పమన్నావు కాదూ?"

" శాంభవి నీకు ఎక్కువముఖ్యం అన్నమాట ?"

" ఎప్పటికీ కాదు. నువ్వే ముఖ్యంకానప్పుడు..."

" మరి ఎవరునీకు ముఖ్యం ?"

" 'ఏమిటి నీకుముఖ్యం?' అని అడుగు. "

" పోనీ, ఏమిటి నీకుముఖ్యం ?"

"నేనేచెప్పలేను రాధా. నాకు ముఖ్యమైనది ఏదైనప్పటికీ, అదిమట్టుకు నాజీవితంలోకి ఇంకారా

లేదు. ఈపల్లెలో నాజీవితంతో నాకు అసంతృప్తి రోజురోజుకీ హెచ్చిపోతోంది. ఒక్కొక్క సమయంలో.........కాని, ఎందు కిలానన్ను మాట్లాడించటం, తర్వాత ఉపన్యాసాలిస్తావని విసుక్కోడం?"

"విసుక్కోవటంలేదు. చెప్పు.........ఏమిటి నీ అసంతృప్తి?"

"అంతా అసంతృప్తే. ఈపల్లెలో చెయ్యదగినపని ఏదీకనబడదు. ఒకవేళ బుద్ధిలేక ఏదైనాకార్యం తలపెట్టే సాధించడానికి తోడ్పడేవాళ్లు ఎవరూ కనబడరు. అందరూ వేళాకోళం చేసేవాళ్లే. ఏవిషయాలలోనూ తెలివితేటలులేవు సరిగదా, ఏ విషయాలతోను అభిలాషలుకూడా లేవు. ముసలివాళ్లు వాళ్ల అనుభవజ్ఞానం వాళ నెరిసినపెండ్రుకలు చూచుకుంటూ వాళ్లలో వాళ్లే ఆనందించుకోవటంతో కాలంగడిపిపోతుంది. పడుచువాళ్లకి పౌర్ణమిరాత్రుళ్లూ పొదరిళ్లూ, లేకపోతే అమావాస్యరాత్రుళ్లూ ఆడపిల్లలూ ఉంటే మరేమీ అక్కరలేదు. ఆడవాళ్లకి పిల్లల్నికనడంతోటే, మొగవాళ్లకి పొలాలుదున్నడంతోటే, మొగపిల్లలకి గొడ్లని మేపడంతోటే, ఆడపిల్లలకి సింగారించుకోడంతోటే జీవితంజరిగిపోతోంది."

"పల్లెంతరూ మరిఏమిటి చెయ్యాలంటావు?"

"ఈ మానవజన్మముయొక్క అర్థంఏమిటి? పుట్టుకఏమి? చావుఏమిటి? ఈసంబంధాలు, ఈచుట్టరికాలు ఈస్నేహాలు — వీటన్నిటియొక్క ఫలితమూ ఏమిటి? ఎందుకు పుట్టేము? ఎందుకు దుఃఖపడతాము?........ ఇటువంటిప్రశ్నలు ఎవరినీ బాధించవు"

"అవి నిన్నుమట్టుకు ఎందుకు బాధించాలి?"

"ఎందుకంటే, నేను అడవిమృగాలతో సమానుడిని కానుకనుక కడుపునింపడం తిడప్పుగా ఖులాసాగా పడుకోలేను కనుక.......నీకు బోధపడకపోవచ్చునూ, రాధా. కాని 'జీవితంయొక్క అర్థంఏమిటి?' అన్న ఆలోచన ప్రతినిమిషం నన్నుబాధిస్తుంది. ఏక్షణం మరచిపోలేను. కాలిపోతున్న శవాన్ని చూస్తున్నప్పుడూ అదే ఆలోచన; గొప్పదుఃఖంలో ఏడుస్తున్నవాళ్లని చూసినా అదే ఆలోచన; అతిసంతోషంగా నవ్వుతున్నవాళ్లని చూసినా అదే ఆలోచన.........ఎందుకిలా నవ్వుతావు?"

"నీ ఉపన్యాసపు ధోరణి చూసి."

"నే నిలా మాట్లాడటం నీకు నచ్చదుకామూ?"

"నచ్చదని కాదు.........ఒక్కొక్కసారి ఆలోచిస్తే, నిన్ను ఏకోణాన్నీ నేను బోధపరచుకోలే నని పిస్తుంది నాకు."

"అది నిజం."

"నువ్వు ఎల్లప్పుడూ ఇలా ఏర్పరించిన పండితుx పెద్దపెద్దవిషయాలు మాట్లాడుతూ ఉన్నా బోధపరచుకోగలను. ఎల్లప్పుడూ నవ్వుతూ హాస్యపుకబుర్లుచెప్తూ పల్లెలోఉన్న ఆడపిల్లలనందరినీ హింసిస్తూ వాళ్లవెంట తిరిగినా బోధపరుచుకోగలను. కాని నీకు అనేకరూపాలు. ఆరూపాలలో అనేకభేదాలు. అందులో ఏరూపం నీస్వచ్ఛమైన రూపం అని నమ్మడం? .........ఈపల్లెలో చెయ్యగలిగిన పనిలేక నీకేమీ తోచడం లేదంటావు. నువ్వు రోజూచేసే అల్లరిచేష్టలు ఇన్నీఅన్నీ కావని నీకుతెలుసును. తెల్లవారినదిమొదలు ఏదోఒకవెంకిపని చేస్తూ ఉంటేకాని నీకుతోచదు. పైగా జీవితంలో సంతృప్తిలేదంటావు. ఎప్పుడువస్తుంది నీ కాసంతృప్తి? వెన్నముద్దలు దొంగిలించినా రాలేదు. పరులభార్యలని దొంగిలించినా రాలేదు."

"పరులభార్యలని దొంగిలించానని ఆడవాళ్ల మాటలు కాని, మొగవాళ్ల కెవరికీ అనుమానాలు లేవు. నేనెంత మంచివాడనో వాళ్లకి తెలుసును."

"నీచమత్కారం ఏమిటంటే, ఆడవాళ్లని ఎంత సులభంగా మోసపుచ్చుతావో మొగవాళ్లనికూడా అంతచులాగ్గానూ బుట్టలో వేసుకుంటావు.'

"నావల్ల మోసపోయిన ఆడవాళ్లెవరో చెప్పు చూద్దాం."

"నేను లేనూ?.........ఈమాటలకేమి కాని, ఎందుకు ఉండీఉండి జీవితంలో నీకు సంతృప్తి లేదం

టూఉంటావు. నిన్ను నమ్మేందుకు లేదు కాని, నమ్మినప్పుడుమట్టుకు చాలాసార్లు అటువంటిసమయాలలో జాలివేస్తుంది. ఎందుకు నీకింత అసంతృప్తి? నిజంగా చెప్పు."

"ఈపల్లెలో ఈ ప్రయోజనంలేని బ్రతుకు నాకు సరిపడదు రాధా."

"ఏమిటి కావాలంటావు?"

"పరిపాలించేందుకు రాజ్యాలు, పన్నేందుకు కుట్రలు, పోట్లాడేందుకు యుద్ధాలు, పోషించేందుకు ప్రజలు వాదించేందుకు పండిత సమూహాలు, స్థాపించేదుకు క్రొత్తవేదాంతపద్ధతులు—ఏమైనాసరే, ఈపశుప్రాయ జీవితం తప్ప."

"మేమందరం పశుప్రాయులం కాదూ?"

"మీరందరూ అని కాదు. మనం అందరం."

"అయితే ఏమిటి చేద్దామని నీ అభిప్రాయం?"

"ఎప్పుడో ఒకనాడు మళ్లీకనబడకుండా మాయమైపోతాను."

"నిజంగా అటువంటిపని ఏదో చేస్తావనే నా అనుమానం.........నేను ఏమాత్రమూ నీకు అక్కరలేదుకాదూ?"

"నువ్వు నావెంటే వస్తావు, రాధా. నాతోనే ఉంటావు.......అన్నట్టు ఈవాళ నన్ను ప్రత్యేకంగా ఎందుకో రమ్మన్నావు కామా? ఎందుకు?"

"అవునుసుమా. నేనుకూడా మరచిపోయాను, చూడు!.........నిన్నరమ్మని చెప్పినప్పుడు కారణం ఏమిటో తెలుసునన్నావు కామా?"

"తెలుసునులే. అయినా నువ్వుచెప్పు."

"నువ్వు ఏమిటనుకుంటున్నావో చెప్పు."

"వినయునికి పెళ్లి విషయమేనా?"

"అంటే?"

"మీ అమ్మ వినయుడికి నిన్నిచ్చి పెళ్లి చేద్దామనుకోడమేనా?"

"నీ కెలా తెలిసింది?"

"నాకు తెలియనిదేముంటుంది?"

"ఎలా తెలిసింది?......... తెలిసినప్పటికీ ఇంత నిర్భయంగానూ, ఇంతనిర్విచారంగానూ ఎలా ఉండగలుగుతున్నావు?"

"భయమూ విచారమూ దేనికి?"

"దేనికా? ఏది ఎలాజరిగినా నీకుచింతలేదు. రెండురోజులబట్టి నేను సరిగ్గా తిండితినడంలేదు; సరిగ్గా నిద్రపోవడం లేదు. మాఅమ్మ ఈవిషయంలో చాలా పంతంపట్టింది, తెలుసునా?.........ఇదంతా ఎలా తెలిసింది? ఎవరుచెప్పేరు నీకు?"

"వినయుడే చెప్పేడు."

"వినయుడే? ఏమనిచెప్పేడు?"

"రెండుమూడు వారాలలో నిన్ను పెళ్లి చేసుకుంటున్నానని."

"నువ్వు ఏమన్నావు?"

"విని నవ్వి ఊరుకున్నాను."

"నవ్వడం దేనికి?"

"పెళ్లికబురువిని ఏడవమంటావా? అందులో, అవబోయే పెళ్లికొడుకుముందర?"

"నీకు ఎప్పుడు వేళాకోళంగా మాట్లాడాలో తెలియదు. .వినయుడు చెప్పినదంతా నిజం. మా అమ్మ నన్ను సకలబాధలూ పెడ్తోంది. నన్నేమిటి చెయ్యమంటావు?"

"నీకు వినయుడిని పెళ్లి చేసుకోవాలని లేదా?"

"ఇంకా అడుగుతున్నావుకాదూ నన్ను?"

"అడగకపోతే నాకెలా తెలుస్తుంది?......నీకతను నచ్చలేదన్నమాట!......వినయుడు భర్తగా దొరికితే చాలునన్నవాళ్లు చాలామందున్నారు ఈపల్లెలో."

"చిత్రం! ఆపిల్లకూడా అమాటే అంది........ అచ్చు అదేమాట."

"ఏపిల్ల?"

"శాంభవి."

"ఎప్పుడు?"

"ఇందాకా నాతో మాట్లాడుతూ."

"అయితే శాంభవిసలహాకూడా తీసుకున్నావన్న మాట?"

"నాకు నీశాంభవినీ, గింభివినీ సలహాలడిగే అలవాటు లేదు."

"కాని శాంభవి చాలా తెలివైనపిల్ల."

"ఆవిషయం నేనూ కనిపెట్టేను."

"ఏమిటి నిశ్చయించుకున్నావు నువ్వు?"

"ఏదో ఒకటిచేస్తాను. యమునలోపడి చస్తాను."

"అంతా బాగానేఉంది కాని ఇంతట్లోనే పెళ్ళి జరిగిపోయినట్టు కాదుకా?......ఇప్పుడు వినయుడికి నిన్ను"

"ఏమి?

"అనేక కారణాలుండొచ్చును."

"వినయుడికి నన్ను పెళ్ళి చేసుకోవాలని లేకపోతే బాగానే ఉండును."

"చేసుకోవాలని లేదనే చెప్పేడునాతో ఈవాళ."

"వినయుడే?"

"వినయుడే......అతనలా అన్నాడని నువ్వు బెంగపెట్టుకున్నట్టు కనిపిస్తుందేమి?"

"నాకెందుకు ఏడ్పని బెంగ? పోనీ, నేను కాకపోతే వినయుడికి ఇన్నాళ్ళకి ఎవరువచ్చారు?"

"శాంభవి అంటే అతనికి చాలా ఇష్టంఅని నా అనుమానం."

"వినయుడు నన్ను పెళ్ళిచేసుకోవాలని ఆదుర్దాపడుతున్నాడుకనుకనే మా అమ్మ వాళ్ళందరినీ పెళ్ళిమాటలకి పిలిపించింది.. ......నాదగ్గర ఈవాళకూడా తనకి నే నంటివచ్చునట్టు ప్రవర్తించలేదే వినయుడు!"

"మొగవాళ్ళు మాయస్వరూపులు .........అది కాక ఈవాళ అతను నిన్ను కలుసుకోడం నన్ను కలుసుకోక ముందు."

"అంటే?"

"నన్ను కలుసుకున్నాక మనిషితత్వం కొంచెం మారింది."

"అంటే?"

"నాతో మాట్లాడేక నిన్ను పెళ్ళి చేసుకోవాలని అంత తహతహలాడటంలేదు మనిషి."

"ఏమి?"

"నీమాట తనతల పెట్టేందుకు వీలులేదని చెప్పేనేను. వెంటనే వెళ్ళి మీ అమ్మతో తనకి నిన్ను పెళ్ళిచేసుకోవాలని లేదని చెప్పమన్నాను."

"నిజంగా?......ఏమన్నాడు?"

"తను శాంభవిని పెళ్ళి చేసుకునేందుకు, పోనీ, నాకేమైనా అభ్యంతరం ఉందా అని అడిగేడు."

"శాంభవి విషయంలో నిన్నెందుకు అడగాలి? నీకున్న హక్కేమిటి?"

"ఏదో మాటవరసకి అడిగేడు. నాకేమీ అభ్యంతరం లేదన్నాను."

"ఆమాత్రానికైనా నేనుసంతోషించాలి...... ఎప్పుడు జరిగింది మీఇద్దరికీ ఈసంభాషణంతా?"

"ఈవాళ ప్రొద్దున్న......అంటే......ఈవాళ... ఇప్పుడే......ఈసాయంత్రం ఆమ్రిచెట్టుక్రింద."

"మళ్ళీవచ్చిందీ ఆపాడుమ్రిచెట్టు?......అయితే శాంభవి ఒప్పుకుంటుందీ?"

"శాంభవి ఒప్పుకునేటట్టు చేసేను, ఒకవారం రోజులు ప్రయత్నించి ప్రయత్నించి......"

"ఏమిటి చేసేవు?"

"మంచిచెడ్డలు బోధపరచాను."

"రెండురోజులబట్టి అనవసరంగా బెంగపెట్టుకున్నానన్నమాట?"

"ఈమాత్రానికే?"

"నీ కలా కనిపిస్తోందిమరి. పోనీ నాతోవచ్చి ముందే చెప్పకూడదూ?"

"ఏమిటని చెప్పడం? అసలు నువ్వు బెంగపెట్టుకున్నావనీ, అది ఈ కారణంకల్లననీ నాకువచ్చి నువ్వు చెప్తే కద!"

"ఆమాత్రం ఊహించుకోలేవు కాబోలు...... అయినా, అంతా అయిపోయిందికదా. ఇప్పుడెందుకు నీలో తప్పులుపట్టడం?"

"నాలో తప్పులుపట్టడమా?......... అందే కాని కృతజ్ఞత ఏమాత్రమూ లేదు."

"కృతజ్ఞత దేనికి?"

"వినయుడు నిన్ను పెళ్లిచేసుకోకుండా నిన్ను రక్షించినందుకు."

"అంతా నాకోసమే చేసినట్టు!"

"లేకపోతే?"

"నీకోసమే చేసుకున్నావు......పోనీ, కృతజ్ఞత చూపిస్తే ఎలాచూపించమంటావో చెప్పు."

"నన్ను ముద్దుపెట్టుకో."

"నాకొద్దు."

"అయితే, పో."

"ఒక్కొక్కటే ఒకటి..."

"ఒక్కొక్కటే ఒకటైతే నాకక్కరలేదు."

"ఏమిగర్వం నీకు! అంతా నీ ఇష్టంవచ్చినట్టే జరగాలి కాబోలు?"

"అవును."

"అన్నివిషయాలలోనూ నీఇష్టంవచ్చినట్టే జరగాలి."

"అవును."

"మిగిలినవాళ్లు ఇష్టపడినా సరే, ఇష్టపడకపోయినా సరే?"

"అవును."

"సరే, నీ ఇష్టం."

---

# నా మహారాష్ట్ర యాత్ర

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

"అయ్యలూ! ఏ ఊరు మీది?" అని మాపురవడుమున్న వృద్ధుడనినాడు. శబ్దము వాని నాభికమలమునుండి త్రెంచుకొని ఈడ్వబడిన ట్లుండెను. వాని శిరమున నలగారు ఎఱ్ఱని పాగా ఆతని శరీరకాంతితో నెకసక్కెములాడుచుండెను. వానికి నెడమవైపున నొక సన్నని మనిషి చతికిలపడియుండెను. ఆమెని వయసు నలుబదేండ్లుండును. కుడివైపున నొక యాడుది కలదు. పాప మామె మొగమున స్ఫోటకపుమచ్చలు దట్టమై యున్నవి. ఆమె యొడిలో తాటిపండువంటి బిడ్డ కలదు. గజాసురుడు ప్రత్యక్షముకాగనే శిశువు బేరుమని యేడువసాగెను. పోరుపెట్టిన నిసుంగును తల్లి మారముగి గొనిపోయినది. అత్తావున నాంధ్రమున ప్రశ్న వినవచ్చినంతన నేనెంతో యానందించితిని. చెన్నపురి యని తెలిపి, వారియుదంత మడిగి తెలిసికొంటిని. వరంగలునుండి వారు యాత్రికులై అచటికి వచ్చిరట. ముసలివాడు వైశ్యకులమందనుడు. తక్కినవారిరువురు దంపతులు-సాలీలట.

ఇంతలో మిరపపండుగాడు పైకి పరుగెత్తుకొని వచ్చి "పితాజీ వస్తున్నారు" అని నోటీసు ఇచ్చినాడు. డైమాక్ రాజు నిమిషములో హాజరై "స్వాములూ! తమహుకుం ఏమో సెలవియ్యండి తీర్థవిధి జరిపెదరా?" అని మమ్ముల నడిగినాడు. "తీర్థవిధి రేపు జరిపెదము. నేడిచట దర్శింపవలయు ముఖ్యస్థానములను చూపుము" అని నే నంటిని. "ఒకప్పుడు బ్రహ్మకపాలమునకు పోతిని. అప్పటినుండి నేను శ్రాద్ధాలు మానివేసినాను. ఇపుడు పిండప్రదానముతో నా కెట్టి ప్రసక్తియు లేదు." అని గజాసురు డన్నాడు. "బ్రహ్మకపాలము వెళ్లిన నేమి? ఇది నూతనక్షేత్రము కాదా? తీర్థవిధిజరిపిన జరుపవచ్చును. నేను జరిపెదను. అయినను, దీనివిషయమై రేపు కదా యోచింతము!" అని మిత్రునితో పలికితిని. "గోదావరిపుట్టినచో టేది? యాత్రికులకును, చరిత్రకారులకును ప్రధానమైన ప్రదేశము లెచటెచట నే వేవి యున్నవి?" అని డైమాను రాజు నడిగితిని. "అదె అచట అగపడుచున్నది బ్రహ్మగిరి. అది మిగుల నెత్తయి నదికదా! దాని నెక్కుట చాలకష్టము. గోదావరి ఆగిరి శిఖరమున పుట్టినది. కొండకుదిగువను కుశావర్తక్షేత్ర మున్నది. యాత్రికు లందే తీర్థవిధులు జరుపుచుందురు. దాని సమీపమందే ఈశ్వరాలయ మున్నది. మావానిని మీకు తోడిత్తును. ఇపుడు కుశావర్తమున స్నానము చేసిరండు" అని తెలిపి అతడు మిరపపండును మా కప్పగించినాడు. "అయ్యలూ! మేంకూడా వచ్చేదా?" అని వరంగలువృద్ధు డడిగినాడు. "రండని" మే మా దివ్యహర్మ్యమునుండి మెల్లగ క్రిందికి దిగితిమి. తాడిపండు ఇంకను పోరుపెట్టుచునేయుండెను. మాకు మిరపపండుగాడే మార్గదర్శకు డైనాడు. అచిరములో మేము కుశావర్తమును చేరుకొంటిమి.

[1] అది యొక చిన్నచెరువు. ఇట్టిచెరువు లెన్నో నేడును నైమిశారణ్యమున గలవు. * తటాకమునకు

---

1 నైమిశారణ్యము నేడు 'నీమ్‌సార్' అను నామాంతరమున బరగుచున్నది. ఇది మిశ్రిక్ హత్యాహరణములకునడుమ గలదు. వీని ప్రత్యేకప్రాముఖ్యమును మఱొకగ్రంథమున వివరింతును. సంయుక్తరాష్ట్రము లందు బాలామూనుండి సీతాపూర్ పోవు రైలుమార్గమున నివి యున్నవి. హత్యాహరణమునకుమాత్రము వేణీగంజ్ స్టేషనునుండి కాల్నడకను పదిమైళ్లు పొలములగుండా పోవలెను. మిశ్రిక్ కడనే దధీచి తన వెన్నెముకను రాక్షసవధనకై దేవతల కిచ్చినాడట. వెన్నెముక నిచ్చుటకు మున్నాతడు భారతభూమిం గల మహాతీర్థములను

నలువలంకలందును చక్కని మెట్లున్నవి. మెట్లకు నెడుమ నెత్తయిన అరుగులు గలవు. వీనిపై నలుతట్టులందు వసారాలున్నవి. యాత్రికు లరుగులపై నిద్రవేయుచుందురు. చెరువునకు పడమరవైపున నొక నుయ్యి కలదు. అందు నీరులేదు. ఇది పూడినదివలె నున్నది. యాత్రికులు పిండములను దీనియందే విడతురు. కుశావర్తమునకు పైభాగమందే ఈశ్వరాలయము మున్నది. ఇందందు చిన్ని చిన్ని గుళ్లున్నవి. బ్రహ్మగిరిపై జనించిన గోదావరి కొండనుండి జాలువారి ఒక్కొకచో కన్నులబడి, వేఱొకచో నదృశ్యయై కుశావర్తహ్రదమున బయలుచుండును. సరస్సులోని సలిల మవ్వలికి స్రవించుటకు దిగువ నొకద్వారము కలదు. తటాకమున నీరు నిలువదుకావున నది కడుంగడు పరిశుభ్రమైయుండును. కుశావర్తమున కవ్వల పండ్లూ, పూవులూ మొదలైన పూజాద్రవ్యములు లభించును. బజా రచటికి కనతిదూరమందే యున్నది.

తీరమున కొంతసేపు నిలిచి సరోవరమును పరికించితిని. నిర్మలహృదయమునుండి యవిరళకవితాధార వెలారి బహుళమానసములను తనుపులీల, చెగ్యాకడుపునుండి గోదావరీధార స్రవించి అనేకకేదారములను తనుపుచుండును. కుశావర్తము వట్టి నీటిగుండమని నే దలపలేను. కుశావర్త మనుడు, మానససరోవర మనుడు, హరిద్వారమున హరికిపౌరాలోని బ్రహ్మకుండ మనుడు, భీమగోడ కడగల తటాక మనుడు, మఱి హిమగిరిపై గల సూర్యకుండ మనుడు, ఖంఖల్ కడనున్న సతీకుండ మనుడు, [3] హత్యాహరణ వైద్యనాథా మహాక్షేత్రము

---

సేవింపదలచినాడట. ఆతడందులకు గడంగినయెడల విశేషకాల మగునని యు, అంతదనుక రాక్షసబాధను సహించుట సాధ్యము కాదనియు నచటి దేవేంద్రాదులు భారతావనియందలి పుణ్యక్షేత్రములను దధీచికై నైమిశారణ్యమందే తోడనే నెలకొలిపిరట. వానియందు తానమాచరించి, అర్థించిన అమరులకు వెన్నెముక నిచ్చుటకై దధీచి ఆత్మార్పణము గావించుకొనెను. నేడును నైమిశారణ్యమున నీక్షేత్రములు కలవు. చిన్నిచిన్ని సరోవరములు కాశీ, గయ, ప్రయాగ, అయోధ్య, మథుర, గోకుల, బృందావనము, ద్వారక మున్నగు పేర్లతో పరగుచున్నవి. కొన్ని గోమతీనదికి సమీపమందే యున్నవి. మఱికొన్ని సుమా రెనుబది మైళ్ల మేరలో నందందు గలవు. సుదర్శనచక్రము ననుసరించిన ఉదంతమునకు సంబంధించిన చక్రతీర్థ మందు గలదు. అదియు నొక కాసారమే! దానిలోతు నెవ్వరును కనుగొన జాలరైరట! అష్టాదశపురాణము లీ పుణ్యభూమి యందే పుట్టినవి. వ్యాసఋషి పరివ్యసీమ కరిగెనను ఉదంత మందు లిఖితమైయున్నది. సూతాదిమహాఋషు లందు నివసించిరి. పాండవులు కొంతకాల మందు వసించిరి. అందు మహోన్నతమైన మారుతివిగ్రహము కలదు. అచటికి కొంతదూరమున గోమతీనదీగర్భమున రుద్రావర్తమున నీశ్వరలింగము కలదు. నీటిపై వేయబడిన బిల్వపత్రములను లోపలి గుండమందలి శివలింగ మాకర్షించుకొనును. బహుకారణములచే నైమిశభూమి కడుంగడు పవిత్రమైనది. ఏడాది కొకమా ఱందు గొప్పమేళా (ఉత్సవము) జరుగును. "చౌరాశీజాత్ర"కై బహుసంఖ్యాకు లచటి కరిగి విస్తీర్ణవనభూమిని చుట్టివత్తురు. అందలి వృక్షములుకూడ (వానియందు శ్రీవిష్ణువు వెలసెనని వారి నమ్మిక) పూజింపబడుచుండును. ఈ యరణ్యమున మసలిన భాగ్యము నాకు చేకూడినది. ఈయాత్రను గుఱించిన విచిత్రోదంతమును చదువరులకు వేఱొకతావున తెలుపుదును.

2. గయలో నిది విష్ణుమందిరమునకును, అక్షయవటమునకును నడుమనున్నది. ఇది టెంకాయలతో నిండియుండును. శాస్త్రదృష్టియందు దీని కెంతో మహత్త్వమున్నది. కాని దీని లోపలిభాగము మిగుల నపరిశుభ్రమైయుండును. శోచనీయముకాదా?

3. ఇది హరిద్వారమునకు దిగువ రెండుమైళ్ళ దూరమందున్నది. దక్షుడిందే యజ్ఞము సలిపెనని పలువురు విశ్వసింతురు.

లందలి సరస్సులనుచూ, మరే తీర్థమనుడు కేవలము జలరాశి యని నే నెన్నడు నమ్మియుండలేదు. నీకై బహుయోజనము లరుగనేల? వ్యక్తికిగాని, వస్తువునకుగాని, భావమునకుగాని స్థలకాలముల దూరము విశేషసామ్యము నొసగును. శతాబ్దములందును, సహస్రాబ్దములందును మసలిమసలి అధునాతనవసుమతికి గురుగంభీరపాఠమును గఱపు సంప్రదాయము, సంజీవిపోలు భావము నాత్మపుష్టి నిడికొనునది కావుననే చిరంజీవియై విజ్ఞానుల జిజ్ఞాసకు నిత్యజీవన మొసగును. ఆత్మ అమరత్వముగలదందుము. ఎన్నెన్నో తీపితలపులు చేరి ఒక్క యమృతమూతియగులీల, నెన్నెన్నియో భావములు కూడి ఆత్మయగును. మనుజులు పుట్టుదురు, గిట్టుదురు. భావమో? ఇది మిత్తిరాంగ! కెందామరలనుండి యుద్వ్యాప్తుగ లేచు భ్రమరగీతికవలె విలయకాల శిఖిశిఖలనుండి మహత్తర భావము వెడలి తరువాతి సృష్టికి కన్నతల్లి యగును. సంప్రదాయ మనినంతన కనుబొమ్మజేయువా రెందఱెందఱో కలరు. చలనరహితమై శిథిలరహితమైన సంప్రదాయముపై గోరినిలుపు టుచితము. మహితభావమాయువుగా నద్భుతదీప్తుల వెదజల్లుచుమ వెలగు సంప్రదాయము, ఎన్నడో పుట్టిన దైనక్షేమి, యుగముల కేలొమ్ముల నందజాలును. తీర్థయాత్రలందలి సంప్రదాయము మహత్తరమైనదని నాదృఢవిశ్వాసము. దీనిని పరికించు విశాలవిజ్ఞానదృష్టియందు బహుశాఖ్యోదయపరంపరలు నిహితమైయున్నవని నాతలంపు. తీర్థయాత్రలందలి ఫలితమునుగుఱించి మహాభారతమందును, తక్కుంగల మహాపురాణములందును విచిత్రవృత్తాంతముల గాంతుము. ఉన్నవాని నున్నట్లు వీనిని జేకొనకున్నను, అంతస్సలిలలీల వీనియందు జాలువారు అద్భుతసత్యమును మద్దుకృష్ణునట్లు నిజాంతరంగముల దైకొను టొప్పు. నెనకటిదని సత్యము ప్రాతగిలునా? సత్యమునకు క్రొత్తప్రాతలున్నవా? దీనిని జగదీశుని జేసి, దీనికి సత్యనారాయణుడను నామాంతర మిడి భారతమహనీయు లెన్నెన్ని యద్భుతములు నెఱపిరి కారు? సత్యగర్భితమైన సంప్రదాయము ఈశ్వరపీఠమందలి యఖండజ్యోతిక యైనది. దీనికి జేజేలుపాడుటకు మాటు ప్రాచీనమైనదని మొంగములు చిట్లించుకొంటిమేని అంధకారమందల్లాడి, గతిరాజ్ఞానకూపమున కూలబడుదుము. వినాశనమునకు నొదలనొగ్గు వస్తువులకు దాపరిల్లు క్రొత్తప్రాతలను అవినశ్వర భావముల శిరములకు గట్టితిమేని ఆత్మనాశనమును "హా! దూ!!" యని పిలచినవార మగుదుము; పుడమి చిఱుతప్రాయమందున్నపుడే కెంపుకాంతులట్లు తూరుపుదెసనుండి తళ్కొత్తిన విజ్ఞానమరీచులు మనకు కొరగాని సరకు లగునా. సనాతన మనినంతన చట్టుమనుట పాడియా? భావభరితసంప్రదాయము విశ్వహృదయమందే పునాదిగలదై, ఉత్తుంగకాలకుధరశిఖరమును చుంబించును. మహత్తరసనాతన భావము దేవదేవుని నాభినుండి మృణాలమై వెడలి ఎట్టి యద్భుతసృష్టిని పుష్పింపజేసినదో యెఱుగమా? వేదవిజ్ఞాన మీసృష్టిసముద్భవదివ్య సౌరభమే కాదా? కాంతికిని సౌరభమునకును ప్రాతక్రొత్త లుండుననువా డవివేకి కాడా? వీనికి ప్రాతక్రొత్తలు లేనిచో వీనిని గనిన భావమున కుండునా? భావోపాసనము, కళోపాసనము, సౌందర్యోపాసనము, ఈశ్వరోపాసనము నొక్కటియే యని కంఠమెత్తి పలికెదను. భావము నారాధించువారే నిత్యసత్యవ్రతులు. 'సత్యం, శివం, సుందరమ్' లను పరమాశయము లవినాభావసంబంధముగలవని రస్కిన్, కీట్సు మున్నగు పాశ్చాత్యరచయితలు తెలుపుటకు బహుయుగములకు మున్నే భారతమనీషులు పలికిరి. ఒక్క జగదీశుని త్రిమూర్తులని పేర్కొందుము. ఒక్క మహత్తర భావమునే 'సత్యం శివం సుందరమ్'లని పేర్కొందుము. భావారాధనమున నాటితేటిన తపసి పదునాలుగు భువనములను పదునాలుగు పూవుచెండులనట్లరచేత దాల్పగలడు. భావపూజకొనగు శక్తి ఎంతయద్భుతమైనది! ఈశక్తి కతననేకదా ప్రాచీనఋషులు సాహితీ బ్రహ్మాండములను సృష్టించిరి! ప్రాచీనవీరులు ఫాలాక్షునిగూడ నోడింపజాలు ప్రజ్ఞనందిరి! ప్రాచీన మహిళలు కొందఱు మగుగమ్మలకు గూడ మేలుబంతులైరి! నేటి విద్యావిధానము బాహ్యపృథ్వికి సంబంధించిన పరిజ్ఞానమునే మన కొసగుచున్నది. భౌతికశాస్త్రమునకే పట్టము గట్టినది! ఋజువున కందని ఆత్మసంచలనము, అంత

రంగికమహత్త్వము, భావదార్ఢ్యము, ఆశయశక్తియున్న సంశములు నవనాగరకులకు హృదయంగమములు కావు. 'Intellectual refuse of the west' రచించు వ్యక్తులకు దేవదేవునివలె భారతవిజ్ఞాన మిచ్చు అమృతకలశము పనికిమాలిన కుండవలె గోచరించును! ఉచితానుచితములను పాటింపక, సద్విమర్శనెఱుగక శిథిలశక్తిగల కొన్ని సంప్రదాయములకు వీరు బలాదూరనిరి. అవిశ్వాసము, అనుచితవ్యంగ్యము వీరి సొమ్ములైనవి. మాంద్యమెంత భయదమైనదో, అవిశ్వాసమును అంత అపాయకరమైనదే! ఇట్టి యవిశ్వాసమును మది జేరనీకుండుటకును, మనసునకు భావశబలత చేకూర్చుటకును, ఆత్మశక్తి యలవఱచుకొనుటకును, కనులువిప్పి ప్రకృతిగ్రంథమును పఠించి, మహత్తర భారతవిజ్ఞానమున మనము మునుగ వేయవలెను. ప్రకృతిగ్రంథమును పఠించియే మన మహాకవులును, షేక్స్పియరాదులును విజ్ఞానఘనులై తమ విభూతిని సను విశ్వమునకును సమర్పించిరి. విద్యార్థిజీవనమున దేశాటన ప్రాముఖ్య మెఱిగియే మన ప్రాచీనులు వన్యస్థగురుకులములందే తమ విశ్వకళాపరిషత్తులను నెలకొల్పిరి! ఆంగ్లకవులు తప్పనిసరిగ కొంతకాల మిటలీరమ్యప్రకృతియందు వసించి నవనవోన్మేషశాలు లగుచుండువారు. మహానదులందును, సరస్సులందును, గిరిశిఖరములందును, వనములందును, ఇతిహాసములోను చరిత్రలోను ప్రాముఖ్యమందిన తావులందును బహుకాలమునుండి వెల్లుబ్బు భావసలిలమును మనసార గ్రోలి ఆనందించుటకై నేనవేకమాఱులు దేశభ్రమణ మొనరించితిని. "భావాంబరవీథి విశ్రుత విహారి"ని కాజాలనేమోయని ఆశపడియే దీర్ఘ యాత్రలు సలిపితిని. కుశావర్తము నాకట్టెదుట భావబంధుర కాసారమై చూపట్టినది. పలుమారు దివిజకల్లోలినియందు గ్రుంకులిడినపుడు నామనసు విహంగపతివలె దివిదెస నెగసిపోయినది. భావఘనియం దీదులాడినపుడు నాయాత్మ జవోపేతముగ కాలపథమునుండి వెనుకకు జని, ప్రాచీనమహత్త్వమున దీర్ఘమాడినది. అత్తటి నేనందిన ఆనందమునకు మేరలేకుండెను. జ్ఞానదర్శనము ("ధ్రుపద") దృష్టాంతీకరించు సలిలమందు గ్రుంకులిడినపుడే కాదు, ప్రకృతిశోభకును, ప్రాచీనదృశ్యములకును (అందును మహత్తరమనుష్యజీవనమునకును మతమునకును సంబంధించినవానికి) కను లప్పగించినపుడును నే నట్టి యానందము నందితిని. నా మానసాంజలిపుటం దానందమున ధారవోసిన తరుణము లెన్నియో చదువరులకు తెలుపుచునే యుందును. ఆత్మకు తనువు అమృతము కావున, క్షణికమైన సుఖమునకు దిగదుడుపని, తొల్లింటి మునులును మునులేకారు-రాజన్యులును వలసినంత ఆనందమునందుటకై వనస్థలియందు, వనరమ్యగేహమున వాసము లేర్పఱచుకొనిరి. కుశావర్తమున స్నానకులమైనంతన, సుధాపూరితకలశము లట్లు తోడి యాత్రికుల హృదయములు పరమానందముతో పొంగిపొరలినవని నే నూహించితిని. వారి యనుభవ మెట్టిదో యెఱుగనుగాని అదృశ్య ఈశ్వరగపదిశబ్దమువలె ననిర్వాచ్య పరితోషభావము నిజాంతరంగమున మసలుచుండును.

అనంతరము మే మూదాపువనున్న దేవమందిరమున కరిగితిమి. మహోన్నతమైనది కాదుగాని ఆలయము ప్రాచీనమైనదికావున సాగరతరంగములట్లు పూత భావములందు ప్లావిత మగుచుండెను. గర్భాలయము లోతుగనున్నది. భూగర్భమునుండి గంగ పొంగి అందలి శివలింగము నభిషేకించునని త్ర్యంబకవాసు లనిరి. అచ్చోటును జేరి ఆచిత్రమును దర్శింప ముక్కువపడితిమి. బ్రాహ్మణులకే అచటి కరుగుట కనుమతి లభించునని గజాసురుని, వరంగలు మిత్రులను పూజారులు లోపల ప్రవేశింపనిచ్చిరికారు. ఈ యాభ్యంతరమునకు మిగుల వగచితిని. 'అస్పృశ్యుల' ప్రవేశమును గుఱించి కొంతకాలమునుండి ఆందోళనము జరుగుచునే యున్నది. 'అస్పృశ్యులకు' గాక తక్కుంగల హిందువుల కుత్తర హిందూస్థానమున నేయాలయమందు నెట్టి నిషేధమును లేదు. రామేశ్వరస్వామిని తాకుటకే యాత్రికునకు (అతడగ్రజాత్యుత్పన్నుడైనను) సాధ్యముకాదు. కాశీ విశ్వేశ్వరునకు స్వయముగ యాత్రికు డభిషేకము చేయవచ్చును. నిషేధపుటుత్తరువు మహారాష్ట్రసీమయందలి ఈ ముఖ్యస్థానమున మిటెంత కఠోరమై గోచరించుటచే మిగుల ఖేదపడి పూజారులతో "ఈశ్వరపూజ నేయు

టకు ప్రతిమానవునకును హక్కు కలదుకదా! నామిత్రులను ప్రతిఘటించుట అన్యాయముకాదా?" అని పలికితిని. "శ్రీ రీశ్వరుని గొలుచుటకు పురోభాగమందలిచావడిలో వలసిన వ్యవస్థ యున్నది." అని వా రనిరి. మిత్రులను వదలి గర్భాలయమున ప్రవేశించుటకు నామనసొప్పకుండెను. అందుండియే మహేశునకు ప్రణమిల్లి నిష్క్రమించు టుచితమేమోయని యూహించితిని. పంచములకు ప్రవేశము లేదని గాంధికి విశ్వేశ్వర సందర్శనము చేయుట కిష్టపడలేదని యెఱుంగుదును. ఒరులను వీడి కైలాసమున జొచ్చుట కాదుగాని 'యన్యులకై నరకమున ప్రవేశింతు'నని వివేకానందస్వామి వచించు టెఱుగుదును. జిజ్ఞాసువునై, విజ్ఞానయాత్రికుడనై, చాలశ్రమకు లోనై నే నచటి కరిగితిని. విహంగమువలె నెగిరివచ్చిన మనకున కచ్చో నాశాభంగము కలుగునని, ఈశ్వరసమక్షమందే అట్టి విషాదపరిస్థితులు తలసూపునని తలపనైతిని. నాకన్నులనుండి నీరు జొటజొట రాలినది. నామనసునకు తగిలిన యాఘాతము నామిత్రులకు దగులలేదు. ఇచ్ఛగించినచో గజాసురుడు తప్పక లోపల ప్రవేశింపజాలెడువాడు. మహేశుడుతక్క త్రియంబకమం దాతనితో నిలిచి పోరజాలు వ్యక్తి మఱెవ్వండును లేడు. "గర్భాలయమున ప్రవేశించి, తనంతదాను గంగాధవాని ఈశ్వరాభిషేకము చేయు చిత్రమేమో చూచిరం"డని గజాసురుడును, తరంగలు నెచ్చెలులును నన్ను బలవంతపెట్టిరి. నామనస్తాపము నీశ్వరునిమ్రోల వ్యక్తీకరించుటకై లోపలిగుడియందు ప్రవేశించితిని. బొమ్మరిల్లువలె నున్న చోటునందు నీర మల్లన నుబుకుచుండెను. మూడు మూలలనుండి సలిలము చిమురుచుండెను. మధ్యప్రదేశమున పల్లెరమట్లున్న తావున గల శివలింగముపై పవిత్రవారి జాలువారుచుండెను. స్థూలకాయుడైన మహారాష్ట్రవిప్రు డొకడు (ఇతడు గర్భాలయమున నెట్లు ప్రవేశించెనో యెఱుగను) మహేశునకు దట్టముగ చందన మలందుచు, నాచేతికి కొంతగంధ మిచ్చినాడు. అందులకు సంతసించి స్వామికి దానిని బూసి, సాగిలపడి "తండ్రీ! ఇట్లొనరించుటకు నీతనయు లందఱికిని అధికారము కలదు. ఈభాగ్య మెల్లరకు చేకూర్చుము. పూజారుల హృదయమందలి మౌఢ్యమును ఛేదింపగలవాడవు నీవుగాని శాసనసభలు కావు" అని యంతరంగమున నని, కొంతసే పందుండి, అనంతర మవ్వలి కరిగితిని. మిరపపండుతో గలిసి అచిరములో మేము బసను చేరుకొంటిమి.

అప్పటికి అపరాహ్ణము రెండు గంటలు కడచెను. అంతదనుక నే నెట్టి యాహారమును దీసికొనలేదు. నాసికలో బస్సుకడ గజాసురుడు టిఫిన్ గైకొనినాడు. ఎట్టి యాత్రాస్థలముల కరిగినను, కొందఱు కొందఱు ఉత్తర హిందూస్థానీయు లుదరములు పూరించియే స్నానమొనరించుట నే నెఱుగుదును. హరిద్వారమున జరిగినగత కుంభమేళ మహోత్సవ సమయమున నాతో నరసింగ్, శివశంకర్, దమ్మోకర్, పగ్గిర్జిలను మార్వాడీ వ్యక్తులుండిరి. నాడు (ఏప్రిల్ ౧౩,౧౯౩౮) అపరాహ్ణమొంటిగంట దాటినమీదటగాని కుంభమేళపుణ్య ముహూర్త మాసన్నముకాదు. స్నానసమయ మదియే! నాతోనున్న మిత్రులు పదిగంటలు కాకమున్నే పొట్టలను చపాటీలతో నింపి, నాముందు "పక్కీరసోయికి" *సంబంధించిన పూరీల దొంతరను పెట్టిరి. అత్తటి వానిని నే నొల్లనందులకు వారు కినిసిరి. "అనవరతము మెక్కుచునే యుందుము నగరములందున్న తటి ఆత్మసంయమము నభ్యసించుటకు చక్కని తరుణములు లభింపవు. ఇంచుక మతావేశ మున్నగాని సంయమ గుణము—సంయమ గుణమే కాదు మఱేసుగుణమైన నలవడదు. ఇట్టిగుణముల నలవఱచుకొనుటకు వలసిన శిక్షణము మానవున కొసగుటకును, పెక్కు ఇక్కట్టులను మొక్కవోని విక్రమమున నడాయించి ఉత్తుంగ శిఖరమున గల

* "పక్కీరసోయి", కచ్చీరసోయి" అను రెండు వంటకములు ఉత్తర హిందుస్థానీయులందు ప్రసిద్ధములు. పులాక్కు, పప్పు అన్నములు "కచ్చీ"కి సంబంధించినవి. పరోటా, పూరి, సాగ్ లు "పక్కీ"కి సంబంధించినవి. వీనిని వైశ్యులు చేసినను బ్రాహ్మణులు తిందురు. బ్రాహ్మణస్త్రీలు "కచ్చీ" పదార్థములనుగూడ భుజింతురు.

భాష్యదాశయమును జేరుట కౌతని కెంతో సామర్థ్యమిచ్చుటకును తీర్థయాత్ర లుద్దేశింపబడినవి. * పండ్రెండేండ్లకువచ్చు పవిత్రమహూర్తము నాశించి, శ్రమించి వచ్చి కడుపుకక్కురితికి దాసులమగుట తగునా?" యని నే నపుడు నామిత్రులను మందలించితిని. వారి హృదయములు మారినవి. మర్నాడు నావలె వారును, వారితో

* యాత్రలందలి మహత్తరోద్దేశమును భారతీయులు గుర్తించినట్లు మరెవ్వరును గుర్తింపలేదు. వ్యక్తిగతజీవనమునకును, సంఘజీవనమునకును తీర్థయాత్రలనులగించి, హిందూమతము భారతీయులకు సర్వతోముఖాభివృద్ధిని చేకూర్చినది. ప్రాచీనభారతయాత్రికులలో నగ్రగణ్యు డాఖండలసూనుడు. కఠోరనియమపాలనార్థ మాతడు జటాధారియై భూప్రదక్షిణ మొనరించినాడు. నరులం దాత డుత్తముడు. సంయమీంద్రులను మించిన మహాసంయమి. బదరికాశ్రమమున నారాయణునితో నుగ్రతప మాచరించిన మునికుంజరుడు. ఆత్మవిజయమందిన విజయుడు. పరమార్థమును చేబట్టిన ధనంజయుడు. దేవదత్తమును పూరించిన మహాత్ముడు. నిర్గుణోపాసకులందు శిరోమణియై జగదీశునకు నెచ్చెలియైన భాగ్యశాలి. విశ్వరూప సందర్శనమందిన అదృష్టవంతుడు. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున భగవద్గీతనందిన పుణ్యమూర్తి. ఈశ్వరునకొక్క యడుగుమాత్రము పక్కనుండి తీర్థసేవవలన, క్రమతపసుకతన ముక్తినంది దివ్యబృందావనమున వంశీధరునితో నాటలాడిన క్రీడి. భారతమును, భగవద్గీతను విమర్శకదృష్టితో పరికించినయెడల మన కీవిషయములు విశదమగును. "విజయవిలాసము"ను తెలిసినంతన పార్థుని ఆధ్యాత్మిక విజయోదంతము కనులబడునని ఆశపడుదుము. పూలరాశిపోలు చామకూర వెంకటకవి కవితయందు నుడితేనియలందు పూతభావధార జాలువారునని యూహింతుము. కాని గ్రంథమున బ్రవేశించినంతన మన కెదురగునది దురంతమైన యాశాభంగము. "గోకర్ణభూప్రాంచద్ధూర్జటిఁ గొల్చి, పశ్చిమసముద్రప్రాంతపుణ్యస్థలుల్ గనుచున్ బోయి ప్రభాసతీర్థమున వేడ్కం గ్రీడించిన క్రీడి" నాతడు స్త్రీలోలునిచేసి వదలినాడు. "భుజమూలరుచుల్ జిలుగుంబయంటలో గనుగుమిటారిజూచు టెకాని" అతనికి మరే దేనిమీద నపేక్ష యొకించుకేనియున్ లేదట! తన మనసులోని పరుకును చామకూరకవి మహాసంయమితలకు గట్టినాడు. అత డర్జునుని గుర్తించిన అదృష్టవంతుడు కాడు.

ప్రబంధకవులును, వారి పద్ధతి నిలుపుటకు పుజేకొనినవారును పచ్చిశృంగారమునకు క్రీతదాసు లైరి. వాల్మీకికాళిదాసులు వెలార్చించిన శృంగారరసమందలి అద్భుతఆధ్యాత్మికభావములను వారు హృదయంగమము నొనరించుకొనిరి కారు. సానుమంతశిఖరముమీది జలధార, ఏకాంతులు మహనీయులకు దృగ్గోచరమగు జలధార వెల్లువయై, పాయపాయలై సుందరమందలి విస్తీర్ణకేదారములను తనుపులీల, ఉపనిషచ్ఛిఖరములపై నుదయించిన భావధార, ఘనతరతాత్త్వికదార్ఢ్యముగల మహనీయులకే మానసగోచరమగు భావధార భారతమహాకావ్యమున జొచ్చి బహుళసంఖ్యాకుల యాత్మల దనుపుచొప్పున, గురుగంభీరతత్త్వశాస్త్రమూఢమున జనించిన భావధార విశాలసాహితీవిశ్వమున స్రవించి పామరహృదయముల దనియించుననని ఈకవులు గుర్తింపరైరి.

కవిత్వమునకును తత్త్వశాస్త్రమునకును, మతమునకును, ఆత్మకును అవినాభావసంబంధ మున్నదనియు, ఆధ్యాత్మికశక్తి నది యాత్మహృది నిముడ్చుకొనినవనియు గుర్తించినవారు మననేలలో నెందఱో లేరు. శ్లేష, ఆశుకవనము, అవధానము కవిత్వమహత్త్వమును ప్రకటించునవనునభిప్రాయము చాలకాలమునుండి ఆంధ్రావనియందు విజృంభించుచున్నది. ఇవి పాండితిని, మేధాశక్తిని మాత్రమే వ్యక్తపఱచునుగాని కవితాశక్తిని, సహజశక్తిని గాదని నొక్కిచెప్పుదును. శ్లేషతో నొక టేమేమో చదివినంతన " ఆహాహా! ఓహోహో!"అని పలువురు తలలూచుట పలుమారు చూచుచుందుము. "Mankind is a flock of Sheep" అనికదా కార్లయిలు తెలిపినాడు. నూటికి తొంబదుగురు మూర్ఖు లనినాడు జాన్ స్టూవర్ట్ మిల్ (Vide J. S. Mill's Utilitarianism)

నున్న ఖోటియాబాయి ఈమె శివశంకరుని మేనత్త) యను పురాతచరిత్రయైన వితంతువును ఉపవాసములు చేసిరి. నేను త్రియంబకమున గూడనున్న మిత్రులు నాపద్ధతి నవలంబింపవలెనని నా యాశయము. కాని, వారు తమచిత్తమువచ్చినట్లొప్పన నాచరించిరి. డైమాక్ రాజుకొంపలో చతికిలపడిపోయిరి. ఇక నెచటికిని రాజాలమనిరి.

దేశభ్రమణమున నెదుటివారిని గుర్తింపక యూడ గొనిపోవరాదు. ప్రకృతియందును, శారీరకస్థితియందును మనకు సరిపడు వ్యక్తులే తోడియాత్రికులైయుండ వలెను. జిజ్ఞాసయందు, విజ్ఞానపిపాసయందు మనకు దీసిపోనివారే అత్తఱి మన నెచ్చెలులై యుండవలెను. కష్టనిష్ఠురముల నోర్చి, మహోత్సాహమున ముందులకు లంఘింపజాలువారే, పరిచర్యచేసి పరిచర్యచేయించు కొనగలవారే ఆయవసరమున సన్నిహితులై యుండ

---

విమర్శకదృష్టి ఎందఱికి గలదు? భావనాశక్తికి బహుయోజనముల దూరమందున్నను, పలువురు పద్యము లల్లుచుందురు. ఇవి "పంచరత్నము"లనియు, "నవరత్నము"లనియు పిలువబడుచుండును. నత్తిగుల్లలను మూటగట్టి, మంచిముత్తెములని చక్కని hand bill ను దానికి కట్టి మొఱకులను మోసగించువారెందఱోకలరు. బిరుదులు, శాల్వలు, కట్నములు, సంచులు వీరి సామ్ములు. నిష్ఫచ్చరమున దిగబడిన వీరికి కొంతయండ యేర్పడుచున్నదని సంతసింతునుగాని, ఆత్మను తనుపుకొండొక మహత్తరభావమును తమ కవితయందు చూప నంతదనుక, సభ్యజగతిచే తన్మయనృత్యము జేయింపజాలు ఒక్క మహాజగంభీరభావమును వీరు వ్యక్తపఱుప నంతవఱకు వీరిని కవులని తలచుట తప్పని ఎలుగెత్తి చెప్పుదును. కవిత్వమొక రాష్ట్రమునకును, ఒక జాతికిని, ఒక సీమకును, ఒక కాలమునకునుమాత్రమే చెందినదని తలపరాదు. అది విశ్వమానవ కల్యాణమునకై తోడ్పడునది. ధరిత్రిని పవిత్రవంతము చేయజాలునది. కావుననే మొన్నటి ౨౫-౭-౩౬ నాడు బ్రిటిష్‌ప్రధాన మంత్రి బాల్డ్విన్ "భౌతికశాస్త్రవేత్తలెందఱో ఉన్నారు. వీరి పరిశోధన లెన్నో రీతుల దుర్వినియోగము గావింపబడు చున్నవి. నేడు పలువురుకవు లక్కఱలైయున్నారు. వీరికతన జగతి బాగుపడును" అని సామ్రాజ్య విద్యామహాసభయందు వాకొనినాడు. ఇట్టి మహత్తరోద్దేశమునకై తోడుపడు కవులాంధ్రమునందెందఱు జనుదురో కదా! ఈ యుత్తమాశయమును చేరవలెనని గవిత్వమును గుఱించి, సాహిత్యమును గుఱించి నేను చెల్లుబడియగుచున్న భావములు తుత్తునియలు కావలెను. ఈ భావములకు పల్వురు విద్యాధికులే దోహదమొసగుట శోచనీయము. ఈ మహనీయులు వివిధ జీవనాంగణములందు మేలుచేతులు కావచ్చును. కాని ఆదర్శసాహిత్యమును గుఱించిన పరిజ్ఞానము వీరిలో బండినున్న యని వీరి గ్రుడ్డి ప్రాగల్భ్యము చెప్పక చెప్పుచున్నది. గురుగుణమునకు సాగిలపడువాడు మహాత్ముడు. ఇతడు క్షుద్రాంశమునకు నంజలిఘటింపడు. ఘటించినచో నీతడు గుణతత్త్వమెఱుగని మూర్ఖుడైనయో, క్షుద్రాంశములనే కాంక్షించు దుర్మతియనియో గ్రహింతుము. విమర్శకుని ఆంతరంగిక గ్రంథమెట్టిదో ఆతని నుడువులే తెలుపును. ప్రతిదానికి తలయూపు విమర్శకుడు గంగిరెద్దునకు జ్యేష్ఠభ్రాత యనిపించుకొనును. సద్విమర్శనము తలసూపినపుడే కుకవులు వెనుకబడి, సుకవులు ముంగలకు వత్తురు. మనమేమో, మన ఘోషయేమో యని కాలము గడపితిమేని మన మెల్లప్పుడును వెనుకనే పడియుందుము. అన్యరాష్ట్రములవారును, అన్యదేశములవారును, అన్యయుగముల వారును మన సాహితిని, మన వ్యక్తిత్వమును మెచ్చవలెనని, సభ్యజగతియందు మన సారస్వతమునకు మహోన్నతస్థానము చేకూరవలెనని దాని నుత్తమాశయములకుసంధించి, మహత్తరకళానూత్నములను నిర్వచించి జిజ్ఞాసువులకు సద్విద్య గఱపవలెను; నిక్కంపు విజ్ఞానయాత్రికులను, సాహిత్యోపాసకులను, కళారాధకులను, నిర్మల చారిత్రులైన ఆనందవ్రతులను పృథ్వీరంగమున నిలుపవలెను.

వలెను. ఈనియమమునకు చెలుపువచ్చెనేని, భ్రమణోద్దేశము భగ్నమైపోవుట తథ్యము. మనసునకు దురంత యాతనము కలుగుట నిక్కము.*

ఇకనచటికిని రాజాలమని చతికిలపడిన మిత్రులను ముందులకుత్రోయుట కిచ్ఛగింపనైతిని. వారికతన నా పూనికను నేబుటుక్కున త్రెంచుకొన బూనుకొనలేదు. ఒంటరినై బ్రహ్మగిరి శిఖరము నెక్క నిశ్చయించి తోడనే యాదిక్కుగ సాగిపోతిని.

తెరువున బలిష్ఠకాయు లిరువురు డోలీని బుజముల నిడికొని నా కెదురైరి. డోలీలోనికి దయచేయుడని వినయపూర్వకముగ నన్నాహ్వానించిరి. అపరాహ్ణము. మూడుగంటలవేళ. కుక్షిలో నేమియును పడవేయక గోదావరీ జన్మస్థానమును వీక్షింపవలెననియు, చీకటిపడకమున్న గిరిశిఖరమునుండి దిగి రావలెననియు నుద్దేశించితిని. డోలీలో చతికిలపడినయెడల శ్రమయుండకనేపోయెడిది. కష్టపడవలసినచోటున, చెమ్మటలోడ్చవలయుసమయమున సుఖమును చేగొనితిమేని, అది తప్పక గోతపుట్టించును. ఎండబడకున్న నీడలోని హాయి నందగలమా? కష్టమున కనుంగుబిడ్డగాని సుఖము సుఖమే కాదు. అనవరతము కిరీటధారియై మాంధాతవలె సుఖమెదురగుచో, తనంతదాను చులకనయగును.

ఇంద్రియములకు నెచ్చెలియగునది సుఖము. ఆత్మకనుంగు చెలిమికత్తె కష్టమందును. ఆత్మదృష్టి అనవర

---

* ప్రతికూలప్రకృతులవారితో పయనముసాగించు దురదృష్టము నాకపుడపుడు లభించినది. లాహోరునుండి, అచటికి ముప్పదిరెండుమైళ్లదూరమందున్న అమృతసరముపోవువేళ, జలియన్వాలాబాగ్న చూడవలసిన దేమి, బంగారుగుడియందలి గొప్పతన మేమియనిన వ్యక్తియును, ఆగ్రాస్టేషన్ప్రక్కనుండి రైలులో పోవుచునే తాజ్మహల్కొన చూచి సంతృప్తిపడిన జిజ్ఞాసువును మున్నూటెండ్లకుమున్న లాహోరుఅమృతసరములకునడుమ షాజహాన్సమ్రాట్టు పెంపొందించిన షాలీమార్మహోద్యానమును (ఆమార్గము నుండిపోవుచునే) చూచెడిదేమి యనిన మహాశయుడును, వారణాసివచ్చి అచటికేడుమైళ్లదూరమందలి సారనాథమును చూచువేళ, అశోకస్తంభమునుగాని, బౌద్ధవిహారములనుగాని, పెద్దమ్యూజియమునుగాని గాంచిన లభించు లబ్బన మేమనిన ఘనుడును, గయనుండి, బుద్ధగయకు పోవు నక్కరయేమనియు, పెషావరునుండి వచ్చుచు మార్గమందలి తక్షశిలను చూడవలసిన 'జరవు' రేమనియు, ప్రాచీననాగరకత దెలిసికొనిన గడుపునిండునా యనియు వచించిన శ్రీశాలియు, హృషీకేశమునకు వచ్చి అచటికి మూడుమైళ్లదూరమందున్న లక్ష్మణఝూలాను జూడబోవు టెందులకనియు, బొంబాయిచనుదెంచి, మలబార్ హిల్ నుజూచు టెందులకనియు, దాని తోటకొండలు మాయూర నున్నవనిన జిజ్ఞాసువును, కాశీవిశ్వేశ్వరునకు సాగిలపడినపుడు పకపకనవ్వి, అదిమూఢాచారమని గేలిచేసిన సహృదయుడును, అయోధ్యవచ్చి పెండ్లాముబిడ్డలకై బెంగటిల్లి రోదన మొనరించి మంచముపట్టి రేయింబవళ్లు పీడించి, తనను వెనక్కు గైకొనిపొమ్మని ప్రాణములుతీసిన ధైర్యశాలియును, తంజావూరునకు కొంతదూరమందున్న మహిళంకోట నుండియరుదెంచి గయలోతారసిల్లి, (ఈతడు తమిళుడు. వీనికి హిందీగాని, బంగాళీగాని, తెలుగుగాని, ఇంగ్లీషుగాని రాదు. అప్పట్లో తమిళమున నాపరిజ్ఞానము శుద్ధపూజ్యము. ఈతనితో నేను వేగిన విధమును పరాత్పరుడెఱుగును) కూడవత్తునని తెలిపి మధుపురవైద్యనాథములకు చనుదెంచి, జనసమూహ మధికమైయున్నదని యడలి, శివరాత్రినాడైన నీశ్వరసందర్శనము నభిలషింపక, అనువుగానిచోటున నన్నమును, సాంబారు, ఇడ్లీ, కూటు, రసములను సంస్కరించుచు వానికై పొగిలి నన్ను బాధపెట్టినవాడును, ఫ్రాంటియరు ఎక్స్‌ప్రెస్‌లో మూడవతరగతిపెట్టెలు లేకున్నను, ఆశ్రేణిటిక్కట్టునే కొందునని పట్టుపట్టిన స్థితిప్రజ్ఞుండును, అక్కఱకుమాలిన వెచ్చముచేయుచు, అక్కఱకై నాపైబడిన మహోదారుడును, టిక్కట్టుకొనుటకుగాని, కూలివానిని పిలచుటకుగాని, చిన్నిమూటను మోయుటకుగాని కొఱగాని మహాశయుడును, అనవరత మెవ్వరితోనైన తప్పక కలహించిన యోధాగ్రేసరుడును, ద్రుతగతి జనవలయు ఱతి గాఢనిద్రయందు నిమగ్నుడైనకలియుగ కుంభకర్ణుడును, ఇంకను రకరకములవారు నాకు దాపురించిరి.

తమ ఉన్నతాశయములపై వ్రాలియుండును. మల్లికల వట్లు వీని నందుకొనుట కిది ఎంతేని తపించును. రవిదెస బనువ్యక్తి వెలుగున ప్రవేశించునట్లే, మహోన్నతోద్దేశము దెస నరుడు ప్రాణి వెలుంగు నందకమానదు. కాంతి నందినంతన నాత్మ యానందపూరిత యగును. తా నాహ్వానించిన కష్టమే తన కానందభిక్ష పెట్టునని అది యెఱుగును. తపములోని మహత్త్వమును, కష్టమందలి పటుత్వమును గుర్తించునది ఆత్మగాని ఇంద్రియములు కావు. ఇవి చెప్పినట్లు నడచుకొను మానవుడు కొంత సుఖమందును. నిజమే! కాని, సుఖించు సమయమున (క్రమగతినుండి తప్పిజారితి నని వీని యాత్మ పొసలును కావున) నీతిని యంతరంగము దురంత యాతనమునకు పాల్పడును. అంతరంగమున నగ్ని రవులుకొనుచుండ నొడలిమీది మంచిగందము నిప్పను, దుఃఖమును కలిగింపదా? చిరాభ్యుదయమును, ఉత్తమోద్దేశసిద్ధిని, ఆత్మానందమును వలచిన వ్యక్తులు అక్కరైన మెట్టులని ఇక్కట్టులను మాచి మురియుదురు. జ్ఞానపిపాసువు, జ్ఞానయాత్రికుడు, చిరపథికుడు ఇట్టి సోపానముల నెడనెడ గాంచుచును. పథికుని అంతరంగికశక్తిని, జ్ఞానపిపాసను, ఇచ్ఛాశక్తిని, నిశ్చయబలమును పరిశీలింప నెంచియే జగదీశుడు వీనికట్టెదుట పెద్దకొండను నిలుపును. జాన్ బనియ నను కంబరి బెడ్‌ఫర్డ్ కారాగారమున పండ్రెండేండ్లుండి ఈ యంశమును దృష్టాంతీకరించుటకే The Pilgrim's Progress అను తన యుద్గ్రంథమును లిఖించెనని నా యుద్దేశము. దుష్కరశిఖరము నడుగుటకు జంకి, అనాయాసముగ నవ్వలితట్టు జేర ప్రక్కతెరువులజనిన అభాగులిరువురు అంధకారమందును, ఆత్మనాశనమందును కూలబడ లేదా? మత్తవేదండమును మార్కొను సింహడింభకమువలె మన వ యాత్రికుడు (క్రిస్టియను) కొండ నెదుర్కొనినాడు. మార్గమధ్యమున నపల్లోనియన్‌తో పోరాడినాడు. పట్టు వదలక గమ్యస్థానము దెస సాగిపోయినాడు. తుదకాతడు సౌందర్యమాధుర్యములకునిధానమైనసురపురమున జొరలేదా? బనియన్ మొన్న మొన్నటివాడు ఈతడు జన్మించుటకు బహు సహస్రాబ్దులకు మున్నే భారతీయులు యాత్రయందలి అంతరంగికార్థమున కవగతులైరి. ఒక్కొక పుణ్యతీర్థము నొక్కొక Pilgrims Progress జేసిరి. భారతసాహితి కేవలము పఠనమునకే గాక నిత్యానుష్ఠానమునకై కూడ ఉద్దేశింపబడినది. భారతసాహితి కేవలము వినోదమునకొఱకే గాక ఆదర్శజీవన విధానమునకై కూడ సృష్టినందినది. భారతసాహితి కాలక్షేపమునకుమాత్రమే కాక మనుష్యహృదయమును ముక్తిమందారము దాపున జేర్చుటకై కూడ తలయెత్తినది. ప్రాచీ సాహిత్యమందలి గంభీరాశయములను, గభీర భావములను గనజాలక "ఇది అసాధ్యములకు, మితిమీరిన విడ్డూరములకు ఆలవాల"మని పాశ్చాత్య నాగరికతా వాతూలమున బడికొట్టుకొనువా రందురు. కనుల కగపడు బ్రదుకే మానవుని సంపూర్ణజీవనమని వీరి తలంపు. ఆర్థిక, రాజకీయ, సాంఘికజీవనమునకు నాయువు వోయునది యాధ్యాత్మిక జీవనము. ఆత్మశక్తి అద్భుతమైననాడే మనసును, ఇంద్రియములును, శరీరస్థ అంగప్రత్యంగములును తమ తమ పనులను కడుంగడు చక్కగ నెరవేర్చును. ఆధ్యాత్మికశక్తి అనూనమైనపుడే ప్రత్యక్షజీవనము – అది వ్యక్తిగతజీవనమైనను, జాతి జీవనమైనను– మహిమోపేతమై నవనవోన్మేషమై తనరును. కావుననే మన కవులీశక్తివృద్ధి నుద్దేశముగా గొని తమ కృతులను రచించిరి; బాహ్యమ్మునే గాక. ఆంతరంగిక జన్యమును కూడ వారు చూపిరి. కురుక్షేత్ర మెచ్చటి యుద్ధము? చారిత్రిక దృష్టితో పరికించిన నది బాహ్యభండనమే! తాత్త్వికదృష్టితో విలోకించిన, నది యాంతరంగికరణమని తెల్లమగును. ఈ యాలమందే. ఈ నిష్కామ కర్మయందే భగవద్గీత సృష్టిగాంచినది. ఈశ్వర కటాక్షమును కవచము గావించుకొని ఘోరారిష్టముల నెదుర్కొను నరుడు విజయుడును, ధనంజయుడు నగును. ధర్మక్షేత్రమున నిలువంబడి విషాదయోగము నభినయింపక, నిజయత్నమను గాండీవమును నిజోద్దేశముదెస నెక్కుపెట్టు వ్యక్తికి కష్టపరంపరలు లొంగి, అతనిచేతికి జయపతాక మిచ్చి, వాని కూడిగము చేయును. తత్త్వశాస్త్రమునకును, మతమున

కును, మనుష్యాత్మకును, ప్రత్యక్షానుష్ఠానమునకును సంబంధించిన భగవద్గీత భారతీయుల ప్రత్యేకదృష్టిని, సారస్వతసృష్టిని వసుమతికి వ్యక్తపఱచినది. ఈశ్వర శక్తి నాత్మజీవనరచనమున విజృంభింప జేయగలవాడే, సృష్టికర్త కాజాలునాతడే గ్రంథకర్తయగుట కర్హుడు. ఏమేమో వాగి పదుగురను పకపకలాడింప గలవాడు గారడివాడగునుగాని సాహిత్యోపాసకుడు కాజాలునా? సాహితియందు దివ్యమరీచుల నీను నాత్మశక్తినే మన ఋషికవులు ప్రతిభ యనిరని నాతలంపు. దీని నలవఱచుకొనుటకే విజ్ఞానయాత్రికుడు తపించును. తపసన జడలు పెంచుకొని, ఎందో ముక్కుమూసికొని చతికిలపడుట కాదు. అది నిరంతరకృషి. గ్రంథపఠనమువలన చేకుఱునది పాండిత్యమే! ప్రకృతిపఠనమువలన, పరిశీలనమువలన, భావనమువలన, ప్రత్యక్షానుభవమువలన, ఆదర్శదృష్టాంతమువలన, సదుపదేశమువలన, ప్రతిభాప్రజ్ఞలవలన, మనన నిదిధ్యాసనముల వలనగాని ఈతపసు పూర్ణము కాదు. యాత్రికతన నిందలి బహుళాంశములు మానవునకు పట్టుబడును. Pilgrim's Progress ఉద్యోగములకొఱకు, సద్యోగములకొఱకు ఉద్దేశింపబడలేదు. అది ప్రతిభాసంపాదనకు, ముక్తిలాభముకొఱకు నుద్దేశింపబడినది. ప్రపంచపథికుల చరిత్రములను విమర్శకదృష్టితో పరికించితిమేని, మన కీయంశము స్పష్టమగును. విజయుడును, ప్రతిభావంతుడును, గమ్యస్థానము జేరిన యాత్రికుడును, ముక్తినందిన తపస్వియును సాహితీవసుంధరయందు వేర్వేఱు వ్యక్తులు కారు. మన కొండలును, మన నదులును, మన వనములును, మన సారస్వతవిశ్వమందలి వివిధఘట్టములని, ఇవి జీవరహితములుకాక పరమాశయములదెస మానవయత్నమును త్రోకొనిపోవు శక్తులని ప్రాచీనకాలమందలి మన సాహిత్యోపాసకులు గుర్తించిరి; తారార్కశీతాంశువులనుగూడ తమసంఘమందు జేర్చుకొని వానితో చుట్టఱికము గలుపుకొనిరి; ప్రకృతి నాశ్రయించి అంతరాశ్రమములను నెలకొల్పిరి. షేక్స్పియర్ మహాకవి

"...Tongues in trees, books in the running brooks,

Sermons in stones and good in everything"

విలోకించినాడు. కాని ఆతడు పాశ్చాత్యుడగుడు అనవరతము తనదృష్టి నాధ్యాత్మికోద్దేశమునకు లగింపలేదు. కాళిదాసో? భారతీయుడుకావున నీతడు శృంగారములని తోచు తన రచనలందు బహుళాధ్యాత్మికభావములను నింపినాడు. వ్యాసవాల్మీకుల రచనలవలె నీతని గ్రంథములు ప్రకృతియందును, యాత్రాస్థలములందును జన్మింపలేదా? వీనిని చదువు విజ్ఞాని అంతరంగికముగ వింధ్య భూధరములందును, హిమగిరులందును,నదులందును, కనులపండు వొనరించు కేదారములందును విహరింపడా? యాత్రికుడుచేయు కర్మము కూడ నిదియేకదా!

కళోపాసకుడనై, జ్ఞానపిపాసువునై నేను యాత్ర సలిపితినిగాని, నీట మునిగినంతన, కొండ లెక్కినంతన స్వర్గము నరచేత బట్టగలనని యాశించికాదు. తెరువున నిక్కట్టులు లేకున్న నాయాత్రకు అందమే యుండెడిది కాదని యెఱుగుదును. డోలీ యాత్రోద్దేశమునకు చెఱుపు దెచ్చునని యెఱుగుదును. డోలీకాదుకదా, ఈశ్వరవిమానమైనను, విహంగపక్షియైనను కొండదిగువను నాకు ప్రత్యక్షమై తిన్నగ నుద్దేశసిద్ధికడ నన్ను జేర్తునంచు తెలిపినను, వానిని దూరముగ తొలగించుట నాకర్తవ్యమని యెంచి, అట్లొనరించియుందును

ద్విగుణీకృతోత్సాహముతో ముందంజవేసితిని. డోలీవాండ్రు నన్ను వదలలేదు "మీదారినిమీరుపొండు; నేను నడచియే కొండతుద చేరెద"నని వారి నుద్దేశించి పల్కితిని. "అయ్యా! బ్రహ్మగిరి నెక్కుట చాలకష్టము. కొంతదూరము పోయినపిదప సంగతి మీకే బాగుగ బోధపడును. అందుచే మేమును కూడవత్తుము. తరువాత మీరు డోలీ యెక్కితీరుదురు. ఈయుత్సాహ మెంతోసే పుండదు. మీరు పట్నవాసములం దుండువారు. ఇట్టి కొండల నెక్కుట కెంతో అభ్యాస ముండవలె"నని వారనిరి. వారి నుడువులు నామనసునకు చుఱుకుగ తట్టినవి. "కొండకొనచేరుట అసాధ్యమైనచో, కొండ దిగువనుండియే మరలివత్తును. కాని డోలీయెక్కి యాత్ర

సాగింతునని నమ్మకుడు. మీరు ప్రబోధించితిరని నా మనసున కిష్టములేని పని నెట్లుచేతును?" అని నేనంటిని. మఱికొంతసేపు నాతో నడచి, యేమేమో యనుకొని వారు మరలిపోయిరి. ఒంటరినై నడువదొడగితిని.

బ్రహ్మగిరికి నలుదిక్కులందును చక్కని వన మున్నది. చల్లనై, చక్కనైన ఆతావుగుండా పోవుతఱి నా హృదయ మింతింతనరాని యానందము నందినది. నగరవీథులందు నడచుతఱి నలుగురతో నాడుచుపాడుచు నడచుట పాడి. చెట్లయందో? నిర్జనప్రదేశమందో? శాంతియుత, సౌందర్యసందీప్తస్థానములందో? కిక్కురు మను తెరువరి అందు ప్రవేశించుట కర్హుడు కాడు. నడి రేయిని నిద్రామగ్నమైయున్న కమలకాసారమున రాయిరువ్వ బెట్టి దుర్ణయమో, పువ్వురొమ్మున వాడి గోళ్లు చొప్పించు బెట్టి దౌష్ట్యమో, లలితభావముపై కఠినశబ్దమును దొరలించు బెట్టి చెట్టయో, మణికాంతులీను మంచుముంపునపై నడుగువేయు బెట్టిపాపమో, లేతమోమున చఱపువేయు బెట్టి క్రౌర్యమో, తియ్యని 'కుహూకుహూలు'పై పెడబొబ్బను వీడు బెట్టి దౌర్జన్యమో, క్రొన్ననలపై ముండ్లురాల్చు బెట్టి దౌరాత్మ్యమో, కసుగాయమీదికి కాల్చిచ్చును పురికొలుపు బెట్టి యత్యాచారమో, హేమలతపై శాతాసిని విసరు బెట్టి కలుషమో, నగుమోముచిన్నారిని వెక్కిరించు బెట్టి యన్యాయమో, నిండుజవ్వనిసుందరియుపై శిలీముఖమును వేయు బెట్టి యఘమో, శాంతిమయప్రదేశమున నుడుపునీకుటయు నట్టి కాఠిన్యమే! చేతనున్న మరచెంబుతక్క నితరవ్వరును అపుడు నాకూడ లేకుండుట మేలే యనుకొంటిని. చెంబును చప్పుడుకానట్లు పట్టుకొని నడచుచుంటిని. ఆకుగములనుండి వెడలిన పక్షికూజితములు వనరమ కావించు గుసగుసలట్లు వినిపించినవి.

నిస్తబ్ధతయందేకదా ఆత్మ నిద్దురనుండి మేల్కాంచును! పురిపిల్లతో నందేకదా సచ్చిదానందము నను క్రోలును! అందేకదా మానసదిగ్వలయము ప్రణయినిహృదయమట్లు విప్పారును! ప్రొద్దుగ్రుంకినంతన గూండ్లజేరు పిట్టమూకలవలె నెందో యడగియున్న భావపరంపర లపుడేకదా రివ్వు రివ్వున చిత్తమున వ్రాలును! విశ్వేశ్వరాలయమందలి శివరాత్రినాటి గంభీర ఘంటారవము పోలుపున నా సమయమందే కదా అంతరంగమున దివ్యవాణి ప్రతిధ్వనించును! ఆహా! శాంతికిని, సౌందర్యమునకును, ఆనందమునకును నెట్టి యవినాభావ సంబంధమున్నదో! దీని నెఱిగియే కాబోలు ప్రాచీన జిజ్ఞాసువులు మానులై శాంతిధామములందు కుటీరము లేర్పఱచుకొనిరి! అనంతవారాశియం దిచ్చవచ్చిన తెఱగున మున్కవేయు మీనములట్లు మునిమానసము లనంత శాంతియందు గ్రుంకులిడి ఎంతెంతహాయినో, ఎంతెంత భావవిభూతిని అందినవో! నామనస్తఱి భావబంధుర ప్రాచీనకాలముడస నల్లన నెగసినది.

ఇంతలో మైదానము కడచినది. కొంతమీది కమితోత్సాహముతో కదలిపోతిని. ఉల్లమునకు చల్లందనమిచ్చిన ప్రశాంతవాతావరణమునుండి కదలిపోయి, బండరాళ్లపై బడితిని. దిగువభాగమున మాత్రము కొన్ని మెట్లున్నవి. వానిని దాటినంతన నడుగు చులకనగ పడలేదు. అరుగులుపోలు రాళ్లు త్రోవలో తోచినవి. మోకాలిపై చేయిమోపిగాని యెక్కుట సాధ్యము కాలేదు. నా సత్తువకు ఘోరమైన పరీక్ష యెదురైనది ఘనభావములకు ఘనతరపరీక్ష ప్రత్యక్షమైనది!!

కడచిన దినము సాయంకాలము బొంబాయిలో వెల్కమ్‌హోటలులో తొందరతొందరగా భోజనము చేసితిని. అదైనను ఆంధ్రభోజనము కాదు. రసరహితమైన పద్యమును బోలు అరవకూటు కట్టెదుట నిలిచి, దెబ్బతో నన్ను "హతోస్మి"ని చేసి వదలినది! రాత్రి నిద్రలేకుండుట, దురంతానుభవములకు గుఱియగుట, ఇంతదనుక పయనమొనరించి ఎంతో బడలికనందుట నాసత్తువకు గట్టిదెబ్బ తగులుటయకదా!

తఱచుగ నన్ను పీడించు తలనొప్పి నన్ను మాఱ్కొనినది. ఈబాధ బాల్యమునుండి నన్నాశ్రయించియున్నది. గునపములు, గొడ్డళ్లు, ఈటెలు, బల్లెములు ఒకేమాఱుగా నెత్తిపై పడినట్లుండును. రాత్రులందు చాలసేపు మేల్కొనుటయు, మితిమీఱిన పనిని మెదడున కప్ప

గించుటయు నీదుర్దాంతయాతనమునకు కారణములాయె
నని వైద్యు లనిరి. వారు తెలుపకుండగనే ఆహేతు
వుల నెఱుఁగుదును. కాని విశ్రాంతికి నేను నోచుకొన
లేదు. నామనసు నన్ను విశ్రాంతిదీసికొననీయదు. అది
నిరంకుశత్వమును చలాయించు Task Master.
యోచింపవలసినదానిని యోచింపనినాడు, చదువవలసిన
దానిని చదువనినాడు, వ్రాయవలసినదానిని వ్రాయని
నాడు నాహృదయము దేమో సంక్షోభ ముదయిం
చును. కలవానియింట జొరబడిన దొంగవలె హక్కు
లేని నిద్దురందు చిత్తము ప్రవేశించెనని, వాడు నన్ను పీడ
కలలు పిడించుట తథ్యము. చితియందు నాళికేరము చిట
చిటలాడు పవిత్రసమయమందైన నామనస్సు విశ్రాంతి
నెఱుగదేమో! నేను చదివిన చదువులు నేన్వ్రాయు
వ్రాతలు నాసుఖమును గుండజేసివదలినవి! శారదనుచేపట్టి
తిననికాబోలు లక్ష్మి నాయెడల ప్రసన్న కాలేదు. కావు
ననేకాబోలు, నే నింకను రొంపిలో దిగబడలేదు.
ఇదియే నాభాగ్యముకాబోలు! భావికాల మెట్లుం
డునో యెఱుగను. దూరమున నిలిచిన లచ్చిని చేరబిలు
చుటకు నామన సొప్పకుండుగాక! నాశారదయే నా
యంత్యముహూర్తమున నాచెంగట నిలిచి, నాయాత్మ
కానందము గలిగించునుగాక! శైశవమునుండి నేను వల
చుచువచ్చిన సారస్వతమునకును, ప్రజలకును ఇంచు
కంతైన సేవచేయగలిగితి నను భావమును, ఎట్టిప్రలోభ
మునకును లొంగక దృష్టిమందే ఉత్తమాశయములను
చెదరనీక, ఐహికమైన ఈమజిలీని గడపగలిగితినను
భావమును ఆఖరుదినిముసమున నాయంతరంగమున పొడ
చూపెనేని ధన్యుడ నగుదును.

కొంతతలనొప్పి నాటిసూర్యోదయమే తలచూపినది.
కొండయెక్కుతిటి అది తీవ్రతరమైనది. చేత నొక
యాతకోలయైనను లేదు. అంతకు కొన్నినాళ్లకు
ముందు పంజాబులో పర్యటనముసలిపినపుడు, అమృత
సరమున నాపురచిహ్నముగా గొనిన చక్కని చేగఱ్ఱను
కాంటాక్రజ్‌లో (ఇది బొంబాయికి సమీపమం
దున్నది) నెవ్వరో అపహరించిరి. మోకాలి నూతజేసి
కొని ఎత్తయిన కొండరాళ్ల నెక్కుచు నెంతదూరము
పోదును? శిరమెత్తి చూచితినిగదా ఆకసమును చుంబిం
చుచు, పర్వతము ఘోరరాక్షసివలె కానుపించినది!
నాయెడల నీలలో అక్కసుపూని పర్వతరాజు దివిదెస
పెరుగుచున్నట్లు పొడగట్టెను! శిరోవేదనము దుస్సహ
మైనది. ఒడలున ముచ్చెమటలు 'పోసినవి!' "అమ్మా!"
అనీ, "అమ్మగర్యా!" అనీ (క్రమముమాత్రము
క్కక) మఱికొంత యెత్తున కెక్కితిని. తలరాలి
నేలబడు ననుకొంటిని. Aspirin tablets ఏమైన లభిం
చునేమో యని జేబులో చేయిబెట్టి చూచితిని. అవి
లభించలేదు. "అమృతాంజనమూ", "యోగభస్మమూ"
(తలనొప్పి నించుక తగ్గించుటకై Menthol, Camp-
hor లను కలిపి నేదయారొనరించి వాడుచుండు
ఔషధవిశేషము) జేబునుండి అంతకుమున్నే జారి
పోయినవి. ఉస్సురుస్సు రనుకొనక తప్పినదికాదు.
అపరిమితమైన దాహము వేసినది! చేతిలో మరచెం
బున్నదేమి? నీరేదీ? పోవుచున్నది గోదావరితల్లి పుట్టిన
చోటికి. ఆపత్కాలమున నాయమ్మ కొంతస్తన్య
మిచ్చునని ఆశపడితిని. కాని నాకది లభించలేదు.
గొంతుక యెండిపోయినది! కడుపు కాలుచున్నది!
నాలుక ఆరిపోయినది! శరీరమంతట దురంతమైన
నొప్పులు బయల్దేరినవి! అయిదుప్రాణములలో మూ
డెగసిపోయినవి! మిగిలిన రెండసువులు ఇకనచిరములో
గోదావరీజన్మస్థానమునకు గాకమానె, గోభూమిదెస
నెగసిపోవునని గ్రహించితిని. కదలించుట కెంతయత్నిం
చినను కాళ్లేతులు కదలలేదు! "హా! శ్రీహరీ!" అని
పర్వతసానువుపై ఒలికిల బడిపోతిని!

మార్గదర్శకుడు (Guide) లేనందున త్రోవదప్పి
తినని, తప్పితినికావుననే ఈ ఘోరసంకటమున బడిపోతి
నని గ్రహించితిని. నావలెనే మఱొక యభాగుడు
తెరువుదప్పినగాని నా కచ్చోటున మనుష్యదర్శనము
లభింపదని యెంచితిని. తప్పుతెరువున సగముదూరము
కడచినవెనుక నా కిక నెవ్వ రగపడెదరు? Bunyan's
Pilgrim's Progress మానసయవనికపై సినిమావలె
తళుక్కుత్తినది! గంగానదిని చేరుటకై దక్షిణసీమనుండి
నడచినడచి, తీరమునుచేరుటకుమున్నే చచ్చి స్వర్గమును



శివభక్తమాహాత్మ్యము కిరాతాఖ్యానమున నొకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్ర సంగ్రహమునుండి)

చేరుకొనిన బ్రాహ్మణుని గాథ (ఇది కాశీపురాణములో నున్నది) నామనసున పట్టినది అంతదనుక నేను కడపిన జీవనము, వివిధరాష్ట్రములందు నేను సలిపిన పయనము లందలి సంఘటనములు చరచర చిత్తవీథియందు పర్విడినవి! ఈ పర్యాయముమాత్రమే కూడగొనిరానందున చెన్నపురియందే యున్న శారద మూల్గుచు మానసనేత్రమున కెదుట దోచినది.

నిముసము కన్నులు మూసితిని. 'నిద్దురపట్టునేమో' అని యనుకొంటిని. పట్టలేదు. ఇంతలో నీశ్వరకటాక్షముకతనకాబోలు, నాహృదయమున నూతనోత్సాహ ముదయించెను. అట్లు పడియుంట, మనమున దౌర్బల్యమునకు చోటిచ్చుట సిగ్గుచేటని గ్రహించితిని. అట్టి యిక్కట్టును నెట్టివేయుటందే గట్టిప్రాణిక సార్థకత గాంచునని గుర్తించితిని. నాటి ఘోరవిపత్తుతో పోరినపుడే ద్విగుణీకృతమైన ఆత్మశక్తి నందగలనని ఆశపడితిని. నాటికి మూడునాళ్లకుమున్ను బొంబాయి విశ్వవిద్యాలయ పుస్తకభాండాగారమున చదివిన పంక్తులు భాసమాన మయూఖములనూడ్కి మానసదిగ్వలయమున తళుక్కుత్తి నాకు మఱింత ఆంతరంగికసార్ధ్యమును గలిగించినవి. అపాయము వాటిల్లుతఱి, నంతరంగమున నూతనశక్తి యుద్భవించుట విడ్డూరము కాదని యవి విశదమొనరించినవి. రానున్న సంఘటనము నూహించియే కాబోలు జగదీశుడు బొంబాయిలో నాపంక్తులను నాకను లెదుట విరబోసినాడు. *

"ధిక్!" అనుకొని లేచి నిలిచితిని. చర చర కొంతసే పెక్కితిని. తన్నట్లు మూర్కొనుమున్నందులకు కినిసికాబోలు పర్వతరాజు మఱింత భయంకరమైన రూపుదాల్చెను. అరుగులువోలు రాళ్లు కడచినవి. తరువాతి శిలలు మత్తమాతంగములట్లు తోచినవి! జంకక ఒక్కొకపుడు నడచియు, వేఱొకప్పుడు ప్రాకియు ఇంకొకపుడు దేకియు, మఱొకపుడు వంగి వంగియొక్కొ యంగుళంగుళమును పరిశీలించుచు కొంతదూర మరిగితిని. ఈ వింత గమనికలో చేతినుండి మరచెంబు చివాలున రాలిపడినది! బలిచక్రవర్తిబట్టతలపైబడి నిముషములో దానిని తునక తునకలుచేయునని యడలితిని. దొరలి దొరలి చెంబు సుమారు నూరుగజముల లోతునందున్న లోయలో పడినది. దానిని వదలిపోయిన, ముందుముందు తీవ్రతరమైన దాహముతో పొగులవలసి వచ్చునని తలపోసితిని. అల్లన లోయలోనికి దిగజారితిని. తల్లిమాటవలె అదూరమున జలధార జాలువారునట్లు వినవచ్చినది. చోటును పరికించుచు నిందందు నడయాడితిని. కొన్ని గజములదూరములో పర్వతపార్శ్వమునుండి సన్నని సలిలధార స్రవించుచు నా కనులబడెను. నాసంతసమునకు మేర లేదు. ఆ స్వచ్ఛధార దాపున జేర్చుటకొఱకే ఈశ్వరుడు నాచేత గల చెంబును జారజేసెనని గ్రహించి కన్నులనుండి జలబిందువులు జలజల రాల నాతని నుద్దేశించి అర్చి సాగిలపడితిని. ఘోరవిపత్తు లందుగాని ఈశ్వరప్రేమ ప్రత్యక్షముకాదని గ్రహించితిని. జలధారక్రింద తలయొగ్గితిని. అది ఈశ్వరాశీస్సు కదా! శిరోవేదనము కొంత తగ్గినది. కడుపునిండ నీరు త్రాగితిని. ఉదరగోళము కొంత చల్లబడినది. మనసు కుదుటబడినది. ఇంచుక సేపందు నిలిచి చుట్టుగల గురుగం

* "Still we went on leaning our weight against them, and as we went a kind of exaltation seized me, as it does always in moments of great danger, so that my heart grew bold and feared no more. I would match myself against these elemental strengths as I had matched myself against those of hostile people, and conquer them. Or may be it was the breath from the divine fire burning below that already had entered into me I cannot say but this I remember, that before I had reached the point of that fearful rock I was filled with a wild joy and could laugh at Philo crawling after me with hesitating steps and breathing prayers now to Isis and now to the Grecian gods that he had worshipped as a child."

(Vide: "Wisdom's Daughter" by H. Rider Haggard, Page 220)

భీకరగహనసీమను పరికించితిని. తన నిస్తబ్ధపర్వత సామ్రాజ్యమును అల్లనల్లన దివియందు చలించు పిట్టగుంపును వీక్షించుచున్నది. ఆహా! పక్షి జీవన మెంతమహత్తరమైనది! శరీరంతము పోజాలని తావేది? అది కనజాలని గమ్యదృశ్యము లేవి? విశ్వమందలి వింతలు చూడవలెననిన, అనంతశాంతియం దీదులాడవలెననిన, కడలేని భావములను మనసున ప్రోగొనరించుకొనవలెననిన, ఆనందమును తనివార గ్రోలవలెననిన, పచ్చందనమును, చక్కందనమును, చల్లందనమును ముల్లోకములు చేసికొని ప్రకృతి గూడి వానియందు మురియవలెననిన, మాధుర్యము నవిరళముగ నానందప్రవాహము వీనుదోసిళ్లందు బోయవలెననిన, ఏదేని యొకభవమున నిక్కంపుగవియై వసుంధరపై భావధారల గురిపింపవలెననిన మానవుడు విహంగమమై జన్మింపవలెను. అచ్చెరుపాటున నాయద్భుతదృశ్యమును చూచుచుండ నొకదిక్కున గుహయొకటి నాకగపడినది. అందుండి మర్కట మొకటి నాపైపునకు పరుగెత్తుకొని వచ్చినది. కోతికి జడియనేల? గుహయందేదో చప్పుడు వినబడినది! అందేదేని వన్యమృగ మున్నదేమో యని తొలుత భీతు జెందితిని. హిమగిరి గుహలందు అందందు యోగులను చూచియుంటిని. శీతనగమున పయన మొనరించినపుడు వారిని గలిసికొని, వారితో కొన్ని దినములు గడపి, వారి యాశీస్సులనందు భాగ్యము నాకదివరలో చేకూరినది. వన్యపశువుకాక మహాత్ముం డెవండైన నెదుట గోచరించు గుహలో వసించుచుండెనేమో యనియు, అతని గలిసికొనిన నపూర్వాంశముల నెన్నో నిరయెఱుగవచ్చుననియు, నాటికంటే విడిసి మర్నాడు కొండకొనజేరుటకై పయనము కావచ్చుననియు తలపోసితిని. ఒకరుప్పవెన్క నిలిచి ఆచప్పు డేమైయుండునో యని కనిపెట్టసాగితిని. డొంకప్రక్క నొక జాబు పడియుండెను. ఆ నిర్జనప్రదేశమున కాజా బెట్లు వచ్చెనో యెఱుగను. ఒరుల జాబు చూచు టనుచితమే! ఆకమ్మకం దొక హక్కుదారుడు లేనందున దానిని తీయుట తప్పుకాదని యోచించి చేబూనితిని. అందున్నవి హిందీయక్షరములు. వానిని చదివినపుడు నా మనసున కంతేని పరితాపము కలిగెను. అది వాయ్

వాసస్థుడగు ఒక మహారాష్ట్ర వ్యక్తికి వ్రాయబడెను. వ్రాసినవాడు బృందావనవాసి. పత్రమును మెల్లగ జేబునం దుంచితిని. కారణము లేకపోలేదు. ఇంతలో గుహలో మరల శబ్దమయ్యెను. వెనుకటికంటె నిప్పుడది తీవ్రముగా నుండెను. మున్యాశ్రమమున నట్టి భయావహ ధ్వని యేల యుదయించు ననుకొంటిని. గుహనుండి బారెడు పా మొకటి అపుడు చరచర ఈవలికి ప్రాకి వచ్చినది! మరల నదే ధ్వని! అందున్న నిక ముప్పు వాటిల్లునని గ్రహించి యెట్లో చెంబున నీరు నింపుకొని చరచర అందుండి కదలితిని. జోడును డైమానురాజింట వదలివచ్చుటచే కంగారున సత్తెత్ నడువవలసివచ్చుటచే రెండు అరికాళ్లయందు ముండ్లు, పల్లేరుకాయలు నిండుగ గ్రుచ్చుకొన్నవి. వానరము నాకూడ రాదొడగినది. జేబున సెనగలు లేకపోయెను. అయినను నది యాత్రికుల నాశ్రయించు కోతి కాదని గ్రహించితిని. అదిపండు కోతి కాదు. భయము గొలుపు కొండముచ్చు. దాని వాలకము చూడగా నది మీదపడి పీకివేయునేమో యనునట్లగపడినది. చేత గఱ్ఱలేదు. ఒకవైపున దుష్టప్లవంగము, ఇంకొకతట్టున క్రూరవ్యాళము! అవి రెండు నొక్కమాఱు మార్కొనిన, రెండుచేతులు మొగిచి మృత్యుకాంతనోట నురుకవలసినదే! నిముసమైన తడయక ఒక తెన్నును గానక కొండపై కెగబ్రాకసాగితిని. వెన్కనుండి కాలసర్పము తఱుముకొనివచ్చుచున్నదేమో అని యడలితిని. పాప మాపా మెందో యదృశ్యమైనది! ఎగిరెగిరి కొంత దూరము వెంటబడిన కోతి ఒకచెట్టుకొమ్మపై దుమికి నన్ను నా త్రోవను పోనిచ్చినది. దానికిని, పామునకును, గుహయందు ధ్వనిజేసిన అదృశ్యమృగమునకును ధన్యవాదము లొసగితిని. ఉపద్రవమునుండి బయటబడితిని. మరల భూధరము నతిక్రమించుటకై గట్టియత్నము చేయవలెను. అప్పటికి రమారమి యైదుగంటల వేళ యైనది. అత్తటి మరల మొండిసాహసమునకు కడంగుట అవివేకమేమో యనుకొంటిని. కాని అపుడు చేయునదేమి? క్రిందికి దిగి మర్నాడు కొండకు తిరిగిరావలెనని యోచించినను, ఇంతదనుక పడిన పాట్లు వ్యర్థమగునేమో యనియు, మర్నాడు నాపూనికకు నెవ్వరేని

యవాంతరము గలిగింపవచ్చుననియు పరక్షణమందే తలపోసితిని. క్రింది కరిగినను, మరల త్రోవతప్పననుటకు నేరంటే లేదనియు, గోదావరీ జన్మస్థానము కాదుకదా అంధకారమున నే భయంకర వన్యమృగమైనను ప్రత్యక్షమై నిముషములో నన్ను కుక్షిని జేర్చుకొనవచ్చుననియు నూహించితిని. అట్టి మీదికరిగినను ముప్పురావచ్చును. యత్నము విరమించి, మనసున విషాదమును నింపుకొని దిగి ముప్పుదెచ్చుకొనుటకంటె యత్నము సాగించి, మనసున ధృతిసాహసములను నింపుకొని పైకెక్కి ఆపదను కవుంగిలించుకొనుట ఘనతరవిషయమని యూహించి, మఱిక్రిందికి చూడక వాలింపక పర్వతమును నెదుర్కొంటిని. కొండపై నెన్నని ప్రాణు లున్నవి. ఈశ్వరుడు మఱొక్క ప్రాణికి నాటి యామిని నందుచోటీయడు యని యూహించుకొంటిని. అంగవస్త్రమును నడుమునకు గట్టుకొని, తొంటితీఱున వంగుచు, డేకుచు, నెగబ్రాకుచు, నెట్లో ముందులకు శరీరమును నెట్టించుచు నే ముహూర్తమున కెట్లు సాధ్యమో అట్లు చలించుచు నెట్టకేలకు కొండకొన జేరుకొంటిని. "అమ్మయ్యా!" అనుకొంటిని. నదీమతల్లి పుట్టిన చెందని నలుతట్టుల జూచితిని. నా కది కానుపింపలేదు సరిగదా, భీషణాకారము దాల్చి మఱొకకొండ కొంతిదూరమున గానుపించినది. దానినికూడ నెక్కనగాని నాగమ్యస్థానమును చేరజాలనని గ్రహించితిని. ఆకొండ ఇంచుమించుగ గోడవలె నున్నది. దానిమీద కెగబ్రాకుటకూడ అసాధ్యమని అడలితిని. చొరవచేసినను, కర్మముచాలక కాలుజారిన యెడల, తునకతునకలై పాతాళమున రాలుదునని యెఱుగుదును. ఇకేమిచేతును? హా! దైవమా! ఇదేటి దారుణపరీక్ష? అందుండి యెటుచనినను ముప్పే! అందు నిలిచి నను ముప్పే.

చదువరులారా! నాయీ బ్రదుకున నెన్నడికడ గండ్లకు గుఱియైతిని. ప్రతియొక్కట్టు ప్రాణముదీయ నడలించినను, దానియందేదేని జ్ఞానప్రదమ మందునేమో యని ఆశపడితిని. బ్రహ్మగిరియారోహణమున రాబందులట్లు నాపై నెన్నోపాట్లు వ్రాలినవి. కొంతనే పవి నన్ను బాధించినను, తలచి తెచ్చుకొనినవి కావున నవి నాయాయువును దీయక పరమహూర్తమున నాహృదయమునకు నూతనసంజీవి నొసగినవి. నాజీవనమున నాకు విశేషవిజ్ఞానభిక్షబెట్టిన యనుభవములలో నాటి యనుభవ మొక్కటంచని వినీతభావమున విన్నవించుచున్నాను.

అత్తటి ఉస్సురుస్సురనిన, నిట్టూర్పులు వీచిన నవి యగ్నికీలలై నన్ను మాడ్చివేయునని యెఱుగుదును. కన్నులందు నీటిని జేరనిచ్చితినిగాను. అంతదనుక నన్ను గాచిన సర్వేశ్వరుడు నన్ను జోడుకొండలనడుమ నలిపివేయడని ఆశపడితిని. గుండెను గట్టిగ బట్టియుంచితిని.

ఆహా! మనుష్యహృదయముయొక్క సృష్టి యెట్టిదో! అది కుసుమసదృశమనియు, వజ్రాదపి కఠోరమైనదనియు గదా మహాకవి భవభూతి పలికినాడు! దడదడలాడి మానవుని నేలద్రోయునదియు, ఇంచుకైన జలింపక మహాపదలందు మనుష్యుని కాపాడి, దివ్యసింహాసనమున నాతని నాసీనుజేయునదియు నదియే! అంతరంగస్థభావమును బట్టియే హృదయమిట్టి గుణము నందునేమో! లోపల నొండొక యద్భుతశక్తి కలదని విశ్వసించి, దానిపై నేకాగ్రదృష్టిని నిలిపినపు డది యెదుటి యడ్డంకులను గుండగావించి, ఎదుర్కొనిన యరిష్టములను చెండాడి, మనుజుని చేతికి జయపతాకము నందించును. ఆశక్తిని గుర్తింపక, అంతరంగమున నవిశ్వాసమునకు చోటిచ్చి, భయసంశయములను దానికి తోడిచ్చి, అంధుడై, అంధకారమందల్లాడు నాతని కది యేడుగడకాజాలదు. కావున వాని మనుగడ మరుభూమికి ప్రతిరూపమై యుండును. నాడు కొండకంటె నాగుండెను మొండిజేసిన దివ్యశక్తికి జోహారంటిని

ఇక గంటలో తప్పక ప్రొద్దుగ్రుంకును. నాడు మార్గశిరబహుళ చతుర్దశి. మర్నాడే నాకన్నతల్లి తద్దినపు రోజు. సూర్యాస్తమయము కాకమున్నే కొండకొన జేరకున్న భయదమైన ఆ తెరువున భీషణాంధకారమున నాకు ఘోర దుర్మరణము తప్పదని యెఱుగుదును. నాడు సూర్యభగవానుడు వేయికన్నులతో నన్ను పరికించుచున్నట్లు గుర్తింపగలిగితిని. కారుచీకట్లు నాపై

దాడి విశాలకుండుటకై దిగ్వలయమునుండి తానుకదలక తన ఘోటకము లేడింటి నాతను పగ్గములతో పట్టి యుండనోపు! గుక్కెడునీరు త్రాగి, క్రొత్తసత్తువ దెచ్చుకొని, నడుమున కంగవస్త్రము బిగించికట్టి చెంబును జారనీక కడువడిగ పైకెగ బ్రాకసాగితిని. తోడనే సత్తువ సన్నగిలినను, గోజుచున్నను, భుసబుసగుల్లను పొగవలె శ్వాస విడలుచున్నను, పేగులు తెగుచున్నను, గుండెలు దడదడలాడుచున్నను, ఒడలం తయు వణకుచున్నను, గోదానదీధారలవలె శరీరము నుండి చెమటలు కారుచున్నను, మరల శిరోవేదనము ప్రారబ్ధ కర్మమువలె సమ్మెటపోటులు వేయుచున్నను, ఒకమారు కనులుమూసి, వేరొకమారు తెఱచి నన్ను నే నెఱుగక, కాళ్ళేతులు కదలుచున్నవో లేదో యని యైన గుర్తింపక, గిరికాయము నంటియుండి గోదావరీ జనయిత్రి జన్మస్థానమును స్మరించుచుంటిని. ఇక నపుడేమి జరిగినదో నేను తెలుపజాలను. పాఠకులే యూహించు కొందురుగాక! మఱికొంతసేపు కడచిపోయినది. కడు కష్టమున కనురెప్పలెత్తి పశ్చిమదిశ జూచితిని. బంగారు చిరునగవులు నగుచు, దినేశుడు కనులపండు వొనరించి నాడు! తన వేయిచేతులతో నాశిరమును స్పృశించి, బహుళాశీస్సుల నాపై తగ్గొల్కొల్పి దాపుననుండి (అది పశ్చిమపునర మేకదా!) అల్లనల్లన జని, సప్త కొంతుల నివాళులతో నదృశ్యుడై నాడు. నేజేరిన తావునుండి దశదిశలను పరికించితిని. బ్రహ్మగిరిశిఖరమున నాసీనుడనై యుంట గుర్తించితిని. పరమహంసవలె నాయాత్మ హృదయబృందావనమున నృత్యమొనరించి నది. అపూరమున మధురమంజుల నిస్వనము వినవచ్చి నది. అది జలధారయాలాపించు అనంతదివ్యగీతిక యని యెఱిగితిని. నాకు మిగులగూర్చు నదీమతల్లి అందే జనించినదని గ్రహించితిని. ఎన్నటికో తల్లిని గనిన బాలకునివలె, పరమపరితోషమున నాడిక్కొనకు పర్విడి పోతిని.

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలము నాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములవైఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు విశదముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల. రు. ౧-౮-౦.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు.

# నూతన భారత రాజ్యాంగ ప్రణాళిక

## రాజకీయార్థిక ఫలితములు

గో. వెం. కృష్ణారావు

నూతన భారత రాజ్యాంగ ప్రణాళిక వచ్చే యేప్రిలు మాసమునుండి అమలులో పెట్టబడును. అచ్చటచ్చట కొన్నిలోపములున్నను యీ క్రొత్త ప్రణాళికవలన భారతదేశమునకు చాలలాభము కల్గునని యు, రాష్ట్రీయ స్వాతంత్ర్యము ప్రసాదింపబడెనని యు, సమాహార ప్రతిష్ఠాపనవలన భారతీయులలో జాతీయతాభావము ఇంకెక్కుడగ పెంపొందుటకు అవకాశము కల్గునని యు ప్రణాళిక నంగీకరించువారు ప్రచారము చేయుచున్నారు.

క్రొత్త ఆక్టుప్రకారము మనకు సంతుష్టికల్గించు సంస్కరణములు లభింపకపోయినను, నూతన రాజ్యాంగ విధానము నంగీకరించి సాధ్యమైనంతవరకు దాని మూలమున లాభములు పొందుట భావ్యమనియు, దానివలన కీడు కల్గకుండజేయుటకు ఎన్నికలలో పాల్గొని శాసనసభలలో అధికసంఖ్యాకబలము సంపాదించుట అవసరమనియు మితవాద నాయకులు వాపోవుచున్నారు. క్రొత్తరాజ్యాంగముచే మన దాసీనశృంఖలములు మరింత దృఢపడుననియు, కుడిచేతితో నొసంగిన అధికారమును యెడమచేతితో అపహరించిరనియు, స్వయంనిర్ణయ సూత్రాధికారము మన కొసంగబడలేదనియు కాంగ్రెసువాదులును, తదితర రాజకీయ ప్రముఖులును స్పష్టీకరించిరి.

క్రొత్తఆక్టును రాజ్యాంగతంత్ర (Constitution) మని ఆంగ్లప్రభుత్వమువారు నిర్వచించిరి. రాజ్యాంగ తంత్రమనిన ఒకసంఘముయొక్క గాని, ఒకజాతియొక్క గాని జాతీయతను వ్యక్తపరచునట్టి విధానమని అరిస్టాటిల్ తెల్పినాడు. క్రొత్తఆక్టుచే ప్రసాదింపబడిన రాజకీయసంస్కరణములు మనజాత్యభివృద్ధికి తోడ్పడునా? క్రొత్తఆక్టు మనజాతీయతను వ్యక్తపరచుచున్నదా?

నూతన రాజ్యాంగపు మూలసూత్రముల క్రోడీకరించుచు నేదైన ఉపోద్ఘాతమొకటి క్రొత్తఆక్టులో లేకపోవుట మొదటిలోపమని చెప్పవలయును. ౧౯౧౯ వ సం॥ ఆక్టులోగల ఉపోద్ఘాతమందు "బాధ్యతగల స్వపరిపాలనమును కాలక్రమేణ భారతీయులు పొందుటయే" ఆంగ్లదేశపు ముఖ్యోద్దేశమని స్పష్టపరచిరి. కాని క్రొత్త ఆక్టులో యెట్టియుపోద్ఘాతము లేకపోవుటచే ఇంగ్లండు అభిప్రాయము వ్యక్తమగుటలేదు. అదిగాక ౧౯౧౯ వ సం॥ ఆక్టులోనుదాహరించిన ఆదర్శసంపాదనకు నూతనఆక్టు తోడ్పడునా, లేదా యని ప్రశ్నింపవలసివచ్చుచున్నది.

ఏదేశములోనైన ఆర్థికాభివృద్ధిపైననే రాజకీయాభివృద్ధి ఆధారపడియున్నది నవీనయుగమందన్ని దేశములలో రానురాను ప్రభుత్వ మొక ఆర్థికసంస్థగ మారుచున్నది. కాన క్రొత్తఆక్టులో ప్రసాదించిన రాజకీయసంస్కరణలు మన ఆర్థికాభివృద్ధి కెంతవరకు తోడ్పడునో విచారింతము.

క్రొత్తఆక్టులో ౨ వ సెక్షనునందు ఆంగ్లపార్లమెంటువారే భారతదేశమందు సంపూర్ణాధికారము కల్గియున్నటుల ప్రకటింపబడెను. ఆంగ్లప్రజల ప్రతినిధులుగల ఆంగ్లపార్లమెంటువారు ఆంగ్లేయుల ఆర్థికశ్రేయస్సు కొరకు కృషిసల్పెదరనియు, అందుకై భారతప్రభుత్వము నొక పనిముట్టుగ నుపయోగించెదరనియు వ్యక్తపడుచున్నది.

౭ వ సెక్షనుప్రకారము కార్యనిర్వాహకాధికారమంతయు గవర్నరుజనరలు కివ్వబడెను. ఈ అధి

కారమునంతను గవర్నరుజనరలు తన "అభిమతము (discretion) ప్రకారము చలాయించును. ఆక్టులో "అభిమతము" "స్వాభిప్రాయము" (individual judgement) అను పదములు అనేకమారులు వాడబడెను. గవర్నరుకాని, గవర్నరుజనరలుకాని చలాయించు అధికారమంతయు వారి అభిమతమునో, లేక వారి స్వాభిప్రాయమునో యనుసరించియుండును. అదేకాకుండా యేదైనఅధికారమును ఏయధికారియైన చలాయించుట సవ్యమా, అపసవ్యమా అను ప్రశ్న నిర్ధారణచేయుట కూడా గవర్నరు, గవర్నరుజనరలుల అభిమతముపైననే ఆధారపడియున్నది. ఈ సందర్భములో కావించిన కట్టుదిట్టములకు మనము సర్ సామ్యూల్ హోరు గారి నభినందింపవలసినదే!

భారతజాతీయతకు ఊపిరిసలపకుండ పకడ్బందుగా అన్నివైపులను బానిసశృంఖలముల బాగుగబిగించినారు. రాజే సర్వాధికారను భావము ౧౭-వ శతాబ్దమందు ప్రచారములో నుండెడిది. నవనాగరికతయు, ప్రజాస్వామ్యమును వెల్లివిరియుచున్న ౨౦వ శతాబ్దములో యీభావము అంతమొందెనని సంతుష్టిపడు వారికి సర్ సామ్యూల్ హోరుగారు దీని కొక నూతన ఆకారము చేకూర్చి ప్రదర్శించినారు. గవర్నరు జనరలుకు క్రొత్తఆక్టులో యిచ్చిన శాసనబద్ధమగు అధికారములు అతనినొక నిరంకుశాధికారిగ నొనర్చుచున్నవి. గవర్నరు జనరలు కిచ్చిన అధికారములను ౧౭వ శతాబ్దమందు పాశ్చాత్యరాజుల కిచ్చియున్నయెడల వారు చాల అదృష్టవంతుల మని యుప్పొంగియుండెడివారు. పూర్వము రష్యాలో జార్ చక్రవర్తి యెట్టి నిరంకుశాధికారియో, నేడు గవర్నరుజనరలు అటువంటి వాడని చెప్పుటలో యేమాత్రము అతిశయోక్తియు లేదు.

౯ వ సెక్షనుప్రకారము సమాహార వ్యవహారములన్నియు మంత్రులసభవారి సలహాననుసరించి గవర్నరు జనరలు పరిపాలించుననియు, ఆయనఅభిమతమునకువిడిచిపెట్టిన విషయములలో మంత్రులు జోక్యము చేసికొనకూడదనియు తెల్పబడెను. మంత్రులసభ కార్యనిర్వాహక సంఘమువంటిది గాదు. గవర్నరుజనరలుకు సలహాల నిచ్చుటయే దాని విధ్యుక్త ధర్మము.

౧౧వ సెక్షను ననుసరించి దేశసంరక్షణ, మత సంబంధమగు విషయములు, విదేశవ్యవహారములను గవర్నరుజనరలు తన అభిమతము ననుసరించి పాలించునేగాని మంత్రులసభసలహాలను పాటింపడు. ౧౨వ సెక్షనులో గవర్నరుజనరలు ప్రత్యేకబాధ్యతలు వివరింపబడెను. ప్రత్యేకబాధ్యతలను పేరుతో సర్వవిషయములను చేర్చి, వానిని గవర్నరుజనరలు తనఅభిమతము ప్రకారము పాలించునని స్పష్టపరచిరి. వానిపరిపాలనలో మంత్రులసభ జోక్యముచేసికొనకూడదు.

శాంతి సంరక్షణము, న్యాయపరిపాలనము, ప్రభుత్వపు ఆర్థిక సంపత్తి వృద్ధిచేయుటకు పన్నులు విధించుట, ఏదైన సందర్భములో తీర్పుచేయుట, కావలసినచో ప్రభుత్వమువారు ఎచ్చటనైన ఎప్పుడైన అప్పుతీయుట, అల్పసంఖ్యాకుల హక్కుల సంరక్షించుట, ఆంగ్ల దేశపు, బర్మాదేశపు వస్తువులపై యెట్టి సుంకముల విధింపకుండుట, యేభారత సంస్థానాధీశుని హక్కులనుగాని సంరక్షించుట యివన్నియు గవర్నరు జనరలు ప్రత్యేక బాధ్యతలట! ఈవ్యవహారములన్నిటిని సక్రమముగ నిర్వహించుటకు గవర్నరు జనరలు ముగ్గురు సలహాదారులను నియమించును. వారి జీతములు, నౌకరీనియమములను ఆంగ్లప్రభుత్వము వారు నిర్ణయించెదరు (౧౧వ సెక్షను). ఆర్థికవిషయములలో సలహానొసగుటకు గవర్నరు జనరలు నియమించు సలహాదారుడు సమాహార శాసనసభల అదుపు ఆజ్ఞలలో ఉండడు (౧౫వ సెక్షను).

కావున గవర్నరు జనరలు నియమించు మంత్రుల సభవారు పరిపాలనావిషయములలో ఎట్టి బాధ్యతను వహింపరని స్పష్టపడుచున్నది. వారు గవర్నరు జనరలు యొక్కయు, ఆయన సలహాదారుల యొక్కయు, ఇష్టానిష్టతలననుసరించి ప్రవర్తింపవలసినదే! ఇక గవర్నరుజనరలు, ఆయనసలహాదారులును సెక్రటరీ ఆఫ్ స్టేటు అధికారముక్రింద నుండెదరు (సెక్షను ౧౪).

మంత్రుల నియామకములో గవర్నరు జనరలుకు అధికారముండుటచే దేశమందు వివిధపక్షముల మధ్య వైషమ్యములు పెంచుటకు అవకాశము కల్పింపబడెను. ౧౦వ సెక్షను ౫వ సబుసెక్షను ప్రకారము—

"మంత్రుల నియమించుటగాని, వారిని తీసి వేయుటగాని, వారిజీతముల నిర్ణయించుటగాని గవర్నరుజనరలు అధికారమునకు విడిచిపెట్టబడెననియు, ఆ అధికారమును ఆయన తన అభిమతము ననుసరించి చలాయించు"

నని స్పష్టపరచిరి. ఇక ఈమంత్రులసభ ఉండి దేమిప్రయోజనము? దేశదారిద్ర్యము నిర్మూలించుటకు వీరి కధికారము లేదు. ప్రస్తుతపరిస్థితుల నవలోకించిన గవర్నరుజనరలుకిచ్చిన అధికారమును ఆంగ్లధనాఢ్యుల యొక్కయు, ఆంగ్లవర్తకులయొక్కయు, ఆంగ్లాధికారులయొక్కయు స్వార్థాభివృద్ధికై యుపయోగింపబడునని తేటతెల్లమగును. ఈ సూక్ష్మము ౧౮ వ సెక్షనులో వ్యక్తపరచిరి. అందులో "స్వాభిప్రాయముననుసరించి ప్రవర్తించు విషయమందు గవర్నరుజనరలు సెక్రటరీ ఆఫ్‌స్టేటు అధికారమునకు లోబడియుండు ననియు, సెక్రటరీ యిచ్చుఉత్తరువులను అమలులో పెట్టుననియు" దెల్పబడెను.

కాన స్వల్పవిషయములందుకూడ సెక్రటరీ ఆఫ్‌స్టేటే అధికారము చలాయించును. గవర్నరుజనరలకును ఒకవ్యక్తిద్వారా ఆంగ్లప్రభుత్వమే భారతదేశపరిపాలన కొనసాగించును. గవర్నరుజనరలుకిచ్చు విధులపత్రము (Instrument of Instructions) సెక్రటరీ ఆఫ్‌స్టేటు అధికారమును చాలవరకు తగ్గించునని క్రొత్తఆక్టు ఆమోదించువారు చెప్పవచ్చునుగాని మనకున్న పూర్వానుభవమువలన ఆవాదము అర్థరహితమైనదని చెప్పవలయును. ద్వంద్వప్రభుత్వముక్రింద మంత్రులస్థితియెట్లుండెనో అంతకన్న అధ్వాన్నముగ సమాహారరాజ్యాంగమందు గవర్నరుజనరలుక్రింద మంత్రులస్థితి యుండునని నిస్సందేహముగ చెప్పవలెను.

ఇకసమాహారశాసనసభలో యెట్టిఅధికారములేని నీవరహితముగు సంస్థలుగ తయారగును. ౩౭ వ సెక్షను ప్రకారము సమాహారశాసనసభలు ఆమోదించు ఏబిల్లునుగాని త్రోసివేయుటకు గవర్నరు జనరలు కధికారమివ్వబడెను భారతదేశార్థికస్థితి చక్కపరచుటకు సమాహారశాసనసభలేమైన నిర్ణయములగావించినచో వానిని గవర్నరుజనరలు త్రోసిరాజనుటకు అధికారమున్నది.

ఈశాసనసభలకు ఆర్థికముగ నామకః స్వల్పాధికారము గలదు. ౩౩వ సెక్షను ప్రకారము సాంవత్సరిక ఆదాయవ్యయ పట్టికను రెండు భాగములుగ విభజించిరి. గవర్నరు జనరలు, ఆయన సలహాదారుల, మంత్రులయొక్క జీతములు; అడ్వకేటు జనరలు జీతము; ఫెడరల్ కమీషనర్ల జీతములు; ఆర్థికసలహాదారుని, ఆయనకార్యాలయ నౌకర్ల జీతములు; సమాహార రాజ్యాంగ న్యాయమూర్తులజీతములు; అప్పులపై వడ్డీలు; సంరక్షణపై, మతసంబంధమగు విషయములపై, రాజకీయశాఖపై, ప్రత్యేకింపబడిన ప్రదేశములపై చేయుఖర్చులు—ఇన్నిటిపైనను శాసనసభల అనుమతి లేకున్నను గవర్నరు జనరలు ధనము వెచ్చింపవచ్చును. ప్రస్తుతమున్న కేంద్రప్రభుత్వపు ఖర్చులో నూటికి ౭౫ భాగములు పైన నుదాహరించినవానిపై ఖర్చులే యగును. ౩౮వ సెక్షను ప్రకారము కేంద్రశాసనసభలలో పైపేర్కొనిన విషయములగురించి చేయుఖర్చును వోటుకు పెట్ట నక్కరలేదు.

ఆంగ్లేయులు మనకు ప్రసాదించు కేంద్రప్రభుత్వ బాధ్యత యిట్టిది. గవర్నరు జనరలుయొక్క, ఎట్టిబాధ్యత లేని ఆయనసలహాదారుల యొక్క జీతములను శాసన సభలవోటుకు పెట్టకపోవచ్చు. కాని శాసన సభలలో అధికసంఖ్యాకబలము అండగా నుంచుకొనవలె నను మంత్రులజీతములను కూడ వోటుకు పెట్టకపోవుట విచిత్రము. గవర్నరుజనరలు యిష్టాయిష్టతలపై అధికారము చలాయించు మంత్రుల జీతములను వోటుకు పెట్టుట భావ్యముకాదని సర్ సామ్యూల్ హోరు గారు తలచియుండవచ్చు. అయితే మంత్రులకు శాసన

సభలలో అధికసంఖ్యాకబల మెందులకు? ఏబాధ్యత లేని మంత్రులు భారతదేశార్థికాభివృద్ధికి యెట్లు తోడ్పడెదరు? గవర్నరు జనరలును సంతోషపెట్టుటయే వారిపరమావధి. ఆంగ్లదేశ ధనాఢ్యుల స్వార్థాభివృద్ధికి కృషిసల్పుట గవర్నరు జనరలువిధి. గవర్నరు జనరలుపై ఆధారపడియుండు మంత్రులు దేశానర్థకమగు పనులు చేయుటకు సహకారులగుదురేగాని దేశాభివృద్ధి కెంతమాత్రమును తోడ్పడరు.

ఏదైనవ్యవహారమందు చేయవలసిన ఖర్చును శాసనసభల వోటుకు పెట్టవలయునా, లేదా యనునిర్ణయము గావించుటకు గవర్నరుజనరలు కధికార మివ్వబడెను (౩౩ వ సెక్షను ౨ వ సబుసెక్షను). ఈ అధికారమును గవర్నరుజనరలు దుర్వినియోగము చేయునను భీతి యుండనక్కరలేదు. ఏలనన వోటుకుపెట్టు ఖర్చులపట్టీ నిర్ణయించు అధికారముకూడ ఆయన కివ్వబడెను. అదేకాక శాసనసభలు త్రోసివేసినఖర్చును పునరుద్ధరణ గావించుటకును, తన ప్రత్యేకబాధ్యతల నిర్వహించుట కగుఖర్చులను శాసనసభ లొప్పుకొనకపోయినను ఖర్చుపెట్టుటకు గవర్నరుజనరలు కధికారముగలదు. ఇక గవర్నరుజనరలు ప్రత్యేకబాధ్యతలను ఇండియారబ్బరువలె సాగదీయవచ్చు.

౩౭ వ సెక్షనుప్రకారము గవర్నరుజనరలు అనుమతి ముందుగా పొందనిది సమాహారశాసనసభలు తమ కివ్వబడిన స్వల్పమగు ఆర్థికాధికారముకూడ చలాయించుటకు వీలులేదు. పన్నులువిధించుట, పరిపాలనకు ఖర్చులు ఆమోదించుట, అప్పుచేయుట, ముందుగాచేసిన ఖర్చులను పరిశీలించి మంజూరుచేయుట—వీనన్నిటిలో శాసనసభలు గవర్నరుజనరలు అనుమతి ముందుగా పొందవలెనని నిర్ణయింపబడెను. ఆర్థికముగ చలాయించు అధికారముపైననే సమాహారప్రభుత్వబాధ్యత ఆధారపడియున్నది. అట్టి బాధ్యతి నొసంగనపుడు స్వపరిపాలన మెట్లు చేకూరును?

క్రొత్తయాక్టులో నాల్గవఅధ్యాయమునందు గవర్నరుజనరలుకున్న శాసనాధికారముల పేర్కొనిరి. ౭౨వ సెక్షనననుసరించి గవర్నరుజనరలు ఆర్డినెన్సులు సృష్టింపవచ్చును; ౭౩వ సెక్షనుప్రకారము వానిని పొడిగింపవచ్చును; ౭౪వ సెక్షను సహాయముతో యాక్టులను ప్రయోగింపవచ్చును; [illegible] వ సెక్షనుమూలమున నూతనముగ నెలకొల్పబడిన రాజ్యాంగమునంతను నొకమూలకుత్రోసి, సమస్తాధికారములను తానే స్వీకరించి, నిరంకుశాధికారిగా ప్రవర్తింపవచ్చును.

నూతనరాజ్యాంగముయొక్క రాజకీయఫలితముల నేనిచ్చట చర్చించుటలేదు. కాని ౧౯౧౯ వ సం॥ గవర్నమెంటు ఆఫ్ యిండియా యాక్టులోకూడ నుదాహరింపబడని యిట్టినిరంకుశాధికారమును పరిశీలించునపుడు నూతన రాజ్యాంగమువలన లాభముకల్గునని వాదించువారికి మతిభ్రమణ కల్గినదా యను సందియము కల్గుచున్నది. రాజకీయరంగములో ఆర్డినెన్సులవలన కల్గుఫలితముల మన మిదివరకే చవిచూచియున్నాము. ఆర్డినెన్సులనింక ఆర్థిక విషయములలో కూడ ప్రయోగించిన దేశమునకెట్టినష్టము కల్గునో చెప్పనక్కరలేదు. ౧౯౩౧ వ సం॥ మందు గవర్నరుజనరలు తనకున్న ఆర్డినెన్సుఅధికారమును పురస్కరించుకొని ౧౯౨౭వ సం॥ పు కరెన్సీ యాక్టును సవరణగావించెను. నిరంకుశముగచేసిన సవరణమూలమున భారతదేశమునుండి అనేకకోట్లరూప్యములవిలువగల బంగారముఎగుమతి అగుటకు అవకాశమేర్పడెను. మన రూపాయినాణెమును ఆంగ్లదేశపుపౌండునాణెముకుముడిపెట్టి ఆంగ్లవర్తకునికి భారతదేశప్రభుత్వమువారు గొప్ప మహోపకారముచేసిరి. ఇట్టిఅనర్థములే నూతనరాజ్యాంగముక్రింద ఇంకను ఎక్కుడుగ సంప్రాప్తించును.

కేంద్రప్రభుత్వమందిట్లు నిరంకుశవిధానము శాసనబద్ధము గావింపబడెను. సర్ సామ్యూల్ హోరుగారు దూరదృష్టితో ఆంగ్లసామ్రాజ్య తత్వమును సమాహారప్రభుత్వమందు చక్కగా ప్రదర్శించిరి. భారతదేశమందు ఆంగ్లేయులపాలన యెల్లకాలము నిరాటంకముగా జరుగుటకు నూతనరాజ్యాంగములో కట్టుదిట్టములజేసిరి. ఆర్థికముగ ఆంగ్లేయులు భారతదేశమును కొల్లగొట్టుటకు తగినఅవకాశములు కల్పింపబడెను. రాజకీయాధికారమును భారతీయులుపయోగించి ఆంగ్లదేశార్థికాభివృద్ధికి ఆటంకము కల్పింపకుండుటకు ౧౯౧౯ వ సం॥ యాక్టులో

నుదాహరింపని అధికారములనుకూడ క్రొత్తఆక్టుక్రింద గవర్నరుజనరలు కివ్వబడెను. ఇట్టికేంద్రప్రభుత్వవిధానము చూచియేనా మనసంస్కరణాభిలాషులు మురియుచున్నారు?

క్రొత్త రాజ్యాంగము క్రింద రాష్ట్రీయస్వాతంత్ర్య మివ్వబడెనని జస్టిసు పక్షీయులు, సంస్కరణాభిలాషులు కొందరు వాదించుచున్నారు. ఇదెంతనిజమో విచారింతము.

కడచిన ౧౫ సంవత్సరములనుండి రాష్ట్రీయస్వాతంత్ర్య మను పదము అనేక రూపాంతరముల పొందుచున్నది. ఎవరెన్ని నిర్వచనములు చేసినను తుదకు సర్ సామ్యూయల్ హోరుగారి నిర్ణయమే తుదినిర్ణయము. హోరుగారి దృష్టిలో రాష్ట్రీయ స్వాతంత్ర్య మన్న గవర్నరుయొక్క స్వాతంత్ర్యమన్నమాట.

౪౯ వ సెక్షను ప్రకారము రాష్ట్రములలో గవర్నరే కార్యనిర్వాహకాధికారి. ౫౦ వ సెక్షను ననుసరించి గవర్నరుకు సలహాల నొసంగుటకు మంత్రుల సభయొకటి యుండును. గవర్నరు అభిమతముపై నిర్ణయింపబడు విషయములలో మంత్రులసభ జోక్యము కల్గజేసికొనుటకు హక్కులేదు. ౫౧ వ సెక్షనులో గవర్నరు మంత్రులను నియమించుటకు, తొలగించుటకు అధికారమివ్వబడెను. ౫౨ వ సెక్షనులో న్యాయపరిపాలనము, శాంతి సంరక్షణము, అల్పసంఖ్యాకుల హక్కుల సంరక్షించుట, అధికారులయొక్క, సంస్థానాధీశ్వరులయొక్క హక్కులను సంరక్షించుట, ప్రత్యేకింపబడిన ప్రదేశముల పాలన; రాష్ట్రములకు సంస్థానములకు సమాహారమునకు ఎట్టి సంఘర్షణము రాకుండ చేయుచు గవర్నరు జనరలు ఇచ్చు ఉత్తరువులను అమలులో పెట్టుట మున్నగు విషయములు గవర్నరు ప్రత్యేకబాధ్యతలని చేర్కొనబడెను.

౫౩ వ సెక్షను ప్రకారము విధుల పత్రమును (Instrument of Instructions) గవర్నరుకు కూడ యిచ్చెదరనియు, కాని విధులపత్రము ననుసరించి గవర్నరు నడచుకొనుటలేదను నేరరోపణ న్యాయస్థానములలో చేయుటకు వీలులేదని స్పష్టపరచిరి. ఇక యీ విధులపత్ర మెందుకో?

౫౪ వ సెక్షనుక్రింద గవర్నరు జనరలు అభిమతము ననుసరించి పరిపాలింపబడు విషయములలో ఆతనఅధికారమునకు గవర్నరు లోబడియుండును. దీనివలన సర్ ఫ్రెడరిక్ వైటుగారు సూచించిన స్వల్ప ఆర్థికస్వాతంత్ర్యము కూడ మృగ్యమగుచున్నది.

౬౦ వ సెక్షనుప్రకారము చెన్నరాజధాని, బొంబాయి, వంగదేశము, సంయుక్త రాష్ట్రములు, బీహారు, అస్సాము రాష్ట్రములకు రెండుశాసనసభలుండును. ఇదివరకే అమలునందున్న రాజ్యాంగముకలన అనవసరపుఖర్చు హెచ్చయి, ఆర్థికముగ భారతదేశము క్షీణించుచున్నది. ఇంక రెండవ శాసనసభను రాష్ట్రములలో నిర్మించి అందుమూలమున దుబారాఖర్చు హెచ్చుచేయుటయేగాని వేరులాభము కల్గదు. రాజకీయముగ రెండుశాసనసభలున్న పరిపాలనా సౌష్ఠవమునకు తోడ్పడునని రాజకీయ నిపుణులు చెప్పరు. కాని క్రొత్తఆక్టులో నిరంకుశాధికారము వలుగడల బందోబస్తు గావించినపుడు పరిపాలనాసౌష్ఠవమని, స్వపరిపాలనమని రాజకీయప్రముఖులు వాపోవుట అవ్యక్తము.

౭౫ వ సెక్షనులో శాసనసభలు గావించు నిర్ణయములను త్రోసివేయుటకు గవర్నరుకు అధికారమిచ్చిరి. ఇదే రాష్ట్రీయస్వాతంత్ర్యమా?

౭౯ వ సెక్షనులో కొన్ని విషయములలో ఖర్చును శాసనసభలు వోటు చేయనక్కరలేదని నిర్ణయించిరి. గవర్నరుజీతము; మంత్రులజీతము; అడ్వకేటు జనరలుజీతము; న్యాయమూర్తుల జీతములు; అప్పులపై వడ్డీలు; ప్రత్యేకింపబడిన ప్రదేశముల పాలన ఖర్చులు మున్నగు విషయములలో శాసనసభల అనుమతి లేకుండనే ధనము వెచ్చింపబడును. "రాష్ట్రములు స్వతంత్రములై యుండును" గాని మంత్రులజీతములు శాసనసభలు నిర్ణయింపనక్కరలేదు. ౮౦ వ సెక్షను ప్రకారము శాసనసభలు త్రోసివేసినఖర్చులను గవర్నరు తన ప్రత్యేకబాధ్యతల సక్రమముగ నిర్వహించుటకు పునరుద్ధరణ చేయవచ్చును. ౮౨ వ సెక్షనులో గవర్నరు అనుమతి ముందుగా పొందనిది యే ఆర్థికవిషయమందు గాని శాసనసభలు ఎట్టినిర్ణయముచేయుట కధికారము లేదని తెల్పబడెను.

౮౮ వ సెక్షను ననుసరించి గవర్నరు ఆర్డినెన్సుల ప్రకటింపవచ్చు. ౮౯ వ సెక్షను ప్రకారము వానిని పొడిగింపవచ్చు. ౯౦ వ సెక్షను సహాయముతో గవర్నరు ఆక్టులను చేయవచ్చు; ౯౨ వ సెక్షనులో యే సమాఖ్య రాజ్యాంగముయొక్కగాని, రాష్ట్రీరాజ్యాంగము యొక్కగాని శాసనమునకు లోనుగాకుండ ప్రత్యేకింపబడిన ప్రదేశములను గవర్నరు పాలింపవచ్చునని యేర్పాటుచేసిరి.

౯౩ వ సెక్షను ప్రకారము రాష్ట్రీయరాజ్యాంగమును త్రోసిరాజని అన్ని అధికారములను గవర్నరే చలాయింపవచ్చును. ఇట్టి సంపూర్ణాధికారము ౧౯౧౯ వ ఆక్టులో గవర్నరు కిచ్చియుండలేదు. ఇట్టి నూతన రాజ్యాంగముక్రింద రాష్ట్రములలో మంత్రిపదవుల నధిష్ఠించెద మను ఠీ వాదము ఎంత నిస్సారమైనదో సుస్పష్టమగుచున్నది.



యం. యస్. శాస్త్రి

రాజకుటుంబము



# తబిసిపస్త్రాదు

జి. జాషువ

అవి మహాయోగి వేమన కవివరుండు- జీవయాత్రను వెళ్లబుచ్చిన దినాలు
అవి యతని గోరువెచ్చని యమృతవాణి- తెనుఁగుపొలమున స్వారిచేసిన ఘడియలు.

పెడకంటి రెడ్లపెంపుడు- కొడుక్కై నివసించు నొక్క గోరా జావుం
బడతుకల వలపులయునం- గుడునయి, రేనాట నొక్క కుగ్రామమునన్.

పిడికెడు కొమ్ముతో, నడుగు వేసినఁ గుల్కెడు కండపుష్టితోఁ,
బుడమిని జీబువారు జిగిముద్దులకుచ్చుల గంగడోలుతో
నెడమబుజాన నించుక శయించిన పట్టెడుచెండుతోఁ గడుం
గడుబెడ గైన్నదె, శివుని నందినిఁ గొండలపాలుచేసెడిన్.

దానివెడదవెన్నుపై నాల్గుతూములు- ముత్తియముల నారబోయువచ్చు
దాని కాటుకకనుదమ్ముల నిడువాలు- చూపు, గరువమునకుఁ గాఁపురంబు.

దానిఅంకెవిన్న ధేనుసంఘంబులు- మేఁతమాని బెదరి మిన్నుసూచు
జీవితేశ్వరుండు శిలమ్ములనుసంశ- యించుననుచు సంశయించుకరణి.

చూడియాలు దాని సుందరాకృతిఁజూచి- దినదినంబు మురిసికొనుటకతన,
ఆదనుదప్పకుండ నుదయించు నా యెద్దు- నీడలయిన కోడెదూడగములు.

కను లఱమోడ్చి, వీథిశృంగాటకమున- నెమరువేయుచు నానంది నిలిచియుండ,
దాని మోహనమూర్తి నద్దమునఁబోలి- చెక్కుచుందురు ఱాలపై శిల్పివరులు.

పసిపిల్లవలెఁ బుఱంబున- మసలుచుఁ బసిపిల్ల లడ్డుమసలినఁగొమ్ముల్
విసరక, బుసకొట్టక, యఁ- బ్బసవన సాధించెఁ బ్రజల వాత్సల్యంబున్.

కాలునేలరాచి గదిమి ఱంకెలువెట్టి- మోరయెత్తి వాలము న్నిగిడ్చి,
దానిమీఁద వైరమూని కొండొకనంది- యుఱుక్కు మిగిలి తాకె నొక్కనాఁడు.

త్రాగినవాని కన్నులవిధంబున నేత్రము లెఱ్ఱవాఱ, భూ
భాగము దద్దరిల్ల వృషభంబు గణిల్లున ఱంకెవెట్టి, తూ
నీగవిధానఁ బోయిపడియెం బ్రతివీరునిమీఁద నంతలో
మూగిరి పౌరు లాసమరముం గను వేడుక జిఱ్ఱకొట్టుచున్.

పృచ్చెల్లపై నిసుమంతలు- పెచ్చులెగయ గుండియలు గుభిల్లురుమనఁగా
యెచ్చిది లొచ్చిది యని వా-క్రుచ్చ నలవిగాక కుమ్ముకొనుచుఁ బెనంగెన్.

తలలు పగిలి రక్తధారలు మృత్యువు- చాఱలగుచుఁ బుడమి జాలువాఱ,
ఆలపోతుజంట యంతకంతకు రోష- మతిశయింపఁబోరె నలవులేక.
ఆదలించికొట్టి యింతయు- బెదరక, పిఱుతివక బెనగు వృషభవులకు త
ప్పదు మరణమనుచు నాసలు- వదలిరి పురజనులు దిగులుపడి కనుగొనుచున్.

వంగపండువంటి పచ్చని మైచాయ- యుంగరాలుదిరిగియున్నకురులు,
బూదిపూఁతలేని పుట్టగోచులలేత- యోగియొకఁడు వేగ నుఱికివచ్చి.

ఉఱుమురిమినట్లు ధేయని- యఱచి, సమీపించి, చఱచె నఱచేతులతోఁ
జిర్ప్రక్క లదర నెద్దులు- బఱచెం బెన్నురుగు నోటఁ బడ దిక్కులకున్.

అతఁడు వేమన, భువనమాయాతమస్సు- జించిచెందిన బలశాలి సిద్ధమూర్తి,
సకలసామ్రాజ్యభోగ పిశాచములను- గోచిపాతకు బలియిచ్చికొన్న ఘనుఁడు.

# "ఆరోగ్య శాస్త్రము"

[ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే గ్రంథరచన పోటీలో 750 రూప్యములు బహుమతి గాంచిన గ్రంథము]

సృష్టిప్రారంభములో భగవంతుడు మొదటిరోజున భూమిని, రెండవ, మూడవ, నాల్గవ, అయిదవదినాలలో నీటిని, ఆకాశాన్ని, చెట్లను, చేమలను, పశుపక్ష్యాదులను సృజించి ఆరవనాడు మగమనిషిరూపాన్ని తయారుచేసి అందులోనుంచి తిరిగి స్త్రీరూపాన్ని ప్రవేశపెట్టి "ఇది గో మానవులారా, యీసృష్టిఅంతా మీ క్షేమం, మీఆనందం కోసమే! చక్కగ తృప్తికరంగా అనుభవించండి. ఆదుంపలు, ఆచెట్లకాయలు తినండి. ఆఆకులు కట్టి మీమానాన్ని కాపాడుకోండి. మీకు అమర్చబడ్డఅవయవాల యొక్కవిశేషం యెట్టిదో, వాటిఉపయోగముయేమిటో నేను చెప్పేనియమాలను అతిక్రమిస్తే మీలో నెట్టి మార్పులు, ఎట్టిబాధలు బయలునడలతాయో జాగ్రత్తగ విని అట్లా చరించండి" అని ఒకమహోపన్యాసాన్నిచ్చి మనదేహంలో యేర్పరుపబడ్డ ప్రత్యంగముయొక్క ఉపయోగాన్ని, వాడుకక్రమాన్ని విశమర్చి చెప్పి ఆనాటి నుంచి యీనాటివరకు నరునికంటబడకుండ అంతర్ధానమైనాడు. ఆనాటి ఆమహోపన్యాసమే ఆరోగ్యశాస్త్ర సారము.

సృష్టియందు ధూళరేణుమాత్రాంశముగ పరిగణింపబడదగిన మానవుడు ఆరోగ్యశాస్త్రాన్నిగూర్చి గ్రంథం వ్రాయతలపడితే సృష్టికర్తయొక్క మహోజ్జ్వలమైన లీలలను యితరమానవకోటికి కరతలామలక మొనర్చి నిర్వచన మొనర్చడమన్నమాట. నవనాగరకత బలిసి, నెత్తిమీద వెంట్రుకల ప్రయోజనమేమి, ముక్కు నడుమ వెంట్రుకలతో కేమిపని, పాదమునకు చివర చీల్చబడినట్లు అయిదువ్రేళ్లెందుకు, చీమదూరితే తీసికొనటానికి వీలులేనిపద్ధతిని చెవికి సారంగమేమిటి, నోటిలో దంతాలెందుకు అనివితర్కించి సృష్టినియమాల కెదురుతిరిగే యీనాటి మానవజాతికి భగవానునియొక్క అనిర్వచనీయమైన అనంతవైచిత్ర్యమును ఒకచిన్నగ్రంథంలో నిర్వచనంచేయటం సాధ్యపడుతుందా! అట్టినిర్వచనం సమగ్రమైతే సాహసమే అనాలి; అట్టినిర్వచనకర్తను మహోద్దండుడనే ప్రశంసించాలి.

ప్రపంచ మీనాడు బహుతెలివిమీరివుంది. అన్నిజాతులలో, అన్నిమతములలో స్వాతంత్ర్యతృష్ణ ప్రబలినవెనుక ఒకటిచెపితే ప్రాణాలు తెగే పదిప్రశ్నలు వేస్తారు. ప్రాచీనమైనవిషయాలయందే దేవులాడుచు వాటిని అధునికపద్ధతుల ననుసరించి ఆకర్షణీయముగ నిర్వచించి ప్రబోధ మొనర్చలేనిమతిగురువులకు, శాస్త్రకారులకు ఈనాటిప్రపంచమున నిలుచుటకు తావులేదు. సనాతనాధునాతనతీరుల నవగాహనమొనర్చుకొనగలిగినచో ఎట్టికఠినశాస్త్రమునైన చాకచక్యముగ ప్రపంచమునకు నిరూపించి దానియందు ఆసక్తి పెంచవచ్చును. మనసనాతనుల కదిచేతకాకనే కాబోలు అట్టి శాస్త్రములను వారు మనకు బోధింపలేకున్నారు. ఈ సనాతనాధునాతన సంఘర్షణలో వారు వాటిని ఆచరించుటకుకూడ సాధ్యపడక యిప్పుడిప్పుడు వదలివేయుచున్నారు. అసాధ్యమగుఅట్టిశాస్త్రానేకములలో ఆరోగ్యశాస్త్రమొకటి. శ్రీయుత గుళ్ళపల్లి నారాయణమూర్తి ఎల్. ఎం. ఎస్. గారు "ఆరోగ్యశాస్త్రము" అను ఈ గ్రంథమును తెలుగున ౪౦౦ పేజీలలో ప్రచు

వెల ప్రతి ౧-కి రు. ౨—౦—౦; గ్రంథకర్త: కు అనకాపల్లికి వ్రాసిన బడయగలరు.

రించి మనకెంతవర కుపయోగకారిగ నొనర్చిరో పరిశీలింతము.

ఈ "ఆరోగ్యశాస్త్రము" ఆహారము, జంత్వాహారములు, పానీయములు, గాలి, నీరు, వ్యర్థపదార్థముల తొలగించుట, మురికినీటి నేమిచేయవలెను, శవసంస్కారము, నేల, శీతోష్ణస్థితులు, గృహములు, ఇతరనిర్మాణములు, శరీరారోగ్యము, మాతృత్వము, శిశురక్షణము, అంటువ్యాధులు, వివిధజ్వరములు, రక్తగ్రహణి, క్షయ, గ్రామపారిశుద్ధ్యము, తీర్థములు, పుష్కరములు, ఆరోగ్యసంబంధములగు రాజ్యాంగశాసనములు మొదలగు వివిధాంశములతో ౩౯ ప్రకరణములు కలిగియున్నది. ఈ గ్రంథమునకు శ్రీయుత తాడేపల్లి శంకరశాస్త్రి గారు (లెఫ్టినెంటు కల్నలు ఐ. ఎం. ఎస్.) తొలిపలుకు పలుకుచు "ఈ గ్రంథము మనదేశమందు జాడ్యరోధ-ఆరోగ్యవర్ధక ప్రచారములకు ప్రామాణిక గ్రంథమని నాయభిప్రాయము. పాఠశాలలలోను, గ్రంథాలయములలోను, గ్రామములలో పురాణ శ్రవణములకున్ను ఉపయోగింపదగినది" అని ఉదాహరించినారు.

గ్రంథకర్తయగు నారాయణమూర్తిగారు గాని, తొలిపలుకువ్రాసిన శంకరశాస్త్రిగారు గాని ఈ గ్రంథమెవ్వరికి ప్రయోజనకారి యగునట్లు రచింపబడెనో స్పష్టముగ నుదాహరింపరైరి. ప్రతిప్రముఖప్రకరణాంతిమునను స్వల్పముగను, హెచ్చుగ ౩౯-వ ప్రకరణమునందును గ్రంథకర్తగారీ క్రిందివిధముగ వ్రాసి ప్రభుత్వమువారికి హెచ్చరిక నిచ్చిరి. "స్వయంకృతాపరాధములవలననేమి, పరకృతాపరాధములవలననేమి ప్రజల అనారోగ్యకరములగు పనుల నొనరింపకుండ చేయుటకు రాజ్యాంగశాసనము లావశ్యకము. స్వేచ్ఛాప్రియులకు శాసనములు రుచింపవు. అజ్ఞానులకు శాసనములకు లోబడియుండుట కష్టముగ నుండును. అయినను వ్యక్తిపరముగ నొక్కొక్కడును ప్రయత్నించి ఆరోగ్యరక్షణసాధనముల నాచరణలో పెట్టుట యసాధ్యము. కావున గ్రామముమొత్తమున నారోగ్యరక్షణ సఫలమగుటకు శాసనము సహాయపడును. శాసనములసహాయము లేనిచో మాభావాభిప్రాయములు వేర్లుదన్నిన మనదేశమునందు నూతన పరిశోధనల నమలులో పెట్టుట కష్టము" దీనినిబట్టి యీ గ్రంథము ప్రభుత్వమును హెచ్చరించు నుద్దేశ్యమున రచింపబడినట్లూహింపవలసియున్నది.

గ్రంథవిషయమునకు దిగకముందు ప్రాపంచిక స్వాస్థ్యవృత్తమునుగూర్చి యించుక చెప్పవలసియున్నది. భారతస్వాస్థ్యవృత్తము సామాజిక (Social Hygiene) సంబంధమైనది. ఇతర పాశ్చాత్య స్వాస్థ్యవృత్తము వైద్య(Medical Hygiene) సంబంధమైనది. మనస్వాస్థ్యవృత్తము మనకేర్పడిన సభ్యత ననుసరించి, సామాజికధర్మము, నీతి ననుసరించి యేర్పడినది. పాశ్చాత్య స్వాస్థ్యవృత్తమో అట్లుగాక ప్రతివిషయమును వారి వైద్యశాస్త్ర ప్రమాణము ననుసరించి, వారిసభ్యత ననుకూలించి యేర్పడినది. నారాయణమూర్తిగారి "ఆరోగ్య శాస్త్రము" పాశ్చాత్యస్వాస్థ్య వృత్తము నాధారముగ గొని రచింపబడినట్లు స్ఫురించుచున్నది. భారతజీవికి కావలసినది సామాజిక స్వాస్థ్య వృత్తము (Social Hygiene).

భారతీయున కుపకరించు సామాజిక స్వాస్థ్య వృత్తమునందు పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రతిజీవి యొక్క మనోవాక్కాయము లను త్రికరణములు, భూతభవిష్య ద్వర్తమానములను కాలత్రయమును, బాల్య యౌవన కౌమారవార్ధక్యదశ లను వయోవస్థలు, బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములు, భోజన, ఉదకపాన, నిద్రా, మైథున చతుర్విధేచ్ఛలు, పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతములు, త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణేంద్రియములు, వాక్పాణిపాదపాయూపస్థలు, ఉదకక్షీర దధిఘృత మధుపంచామృతములు, ఉప్పు, పులుసు, కారము, తీపి, చేదు, వగరు లనబడుషడ్రసములు మున్నగు సమస్త ప్రాపంచిక విషయము లిమిడియున్ననే గాని సమగ్రవృత్తము కాజాలదు. నారాయణమూర్తిగారు వారి "ఆరోగ్య శాస్త్రము"నందు పైవిషయముల నన్నిటినిగూర్చి చర్చించిరిగాని అవెల్ల సామాన్యమానవున కగ్రాహ్యముగ నొనర్చిరి.

యంత్రమునకు బొగ్గు ఎట్లవసరమో మానవదేహమునకాహారమంత అవసరమని యెంచి ఆహారము, జంత్వాహారములు, పానీయములు మున్నగు వాటి గ్రంథాదిని ప్రముఖస్థాన మొసంగి విపులముగ చర్చించిరి. మానవున కుచితమగు నాహారమేదియో, అనుచితమగు నాహారమేదియో, యేపదార్థమునం దెన్ని విటమినులు గలవో, టీ, కాఫీ, నీరు మున్నగుపానీయముల మంచిచెడుగులు విస్తరింపబడినవి. ఆహారవిషయైక ప్రకరణములం దొకచో "మననిత్యజీవనమం దీరీతిని లెక్కవేసి భుజించుట జరుగలేదు. కాని జైళ్లు మొదలగు సంస్థలందాహారపరిమితిని నిర్ణయించుటకీలెక్క లవసరము" అని ఉదాహరించిరి. గ్రంథస్థవిషయములు మనకసాధ్యములని వారే తెలివిచ్చుచున్నారు. జైళ్లు మొదలగు సంస్థలెంతవరకు పాటించుచున్నవో సత్యాగ్రహోద్యమమున శ్రీకృష్ణజన్మస్థాన మలంకరించినవారి కనుభవైకవేద్యము.

వంటవలన పదార్థములు రుచ్యముగను, దర్శనీయముగను నుండునని వ్రాసిరి. వంకాయ, పొట్లకాయ, బెండకాయ మొదలైనవి వండబడిన పిమ్మట పూర్వరీతిని దర్శనీయములుగ నుండునా?

చింతపండు, మిరెపకాయలు సుగంధద్రవ్యములుగ నుదాహరించిరి. ఇవి అహంకారమును పెంచును. ఘనీభవించిన వీర్యమును ద్రవీభూతమొనర్చును. చింతపండుకంటె నిమ్మపండురసము, మిరెపకాయలకు బదులు మిరియములు వయ్యిరెట్లు శ్రేష్ఠమైనవి.

పాలనుగూర్చి వ్రాయుచు ఆవుపాలనుగూర్చి మాత్రమే చర్చించిరి. మేకపాలయందు ఆవుపాలు బంగారమను గాంధిగారి మాటలయందలి సత్యమును విశదపరచి యుండవలసినది.

గాలి, నీరు, వ్యర్థపదార్థములు తొలగించుట, మురికినీటి నేమిచేయవలెను అను ప్రకరణములలోని విషయములు సామాన్యమానవునకు ప్రయోజనపడక పురపాలకసంఘములకు, పబ్లికువర్క్సు డిపార్టుమెంటు, వాణిజ్యసంస్థలకు తగినంతసామగ్రిగను, హితబోధగరపువవిగను నున్నవి.

గృహములు, ఇతరనిర్మాణములు, శరీరారోగ్యము, మాతృత్వము, శిశురక్షణము, అంటువ్యాధులు, జ్వరాదులు, విషూచి, మహామారి, క్షయ, మశూచికము, సుఖవ్యాధులు, కోరింతదగ్గు, కుష్ఠము మున్నగు ప్రకరణములందు సామాన్యమానవుడు గ్రహించి, శ్రద్ధతో ఆచరింపదగినవిషయము లెన్నైని గలవు.

"శరీరారోగ్యము" అను ప్రకరణమునందు "యింటినేలను గోమయముతో నలికినగాని శుద్ధిలభించకున్నది" అని ఆక్షేపించుచు వ్రాసిరి. గోమయము, గోమూత్రము భారతీయులకు ప్రకృతిసిద్ధమైన (Disinfectants) క్రిమిసంహారకములు. ఇంటియందు తెల్లగపడుచుండిన గోవుపంచితమును చిలుకుదురు. కొన్ని జాడ్యములందు దానిని లోనికిగూడ సేవింపజేతురు. పాచిపనికి, యిండ్లలుకుటకు గోమయమును మనవారు విరివిగ వాడెదరు. గోమయపునీటిని చిలుకుట, మండిగములకు పసుపు కుంకుమపెట్టుట క్రిమిసంహారక వస్తువులనియే మనవారు చేయుదురు.

భోజనవిషయమున కొందరు రోజుకు రెండుసార్లు మంచిదనియు, మరికొందరు మూడుసార్లు ఆవశ్యకమనియు వివిధాభిప్రాయములు ప్రజలలో ప్రబలియున్నట్లు వ్రాసిరి. ఇందేది ఉచితమో గ్రంథకర్త నిర్ణయించక వదలుటుచితము కాదు.

పొగాకు అభ్యాసమునుగూర్చి విపులీకరించిరి. తాంబూలచర్వణము మనలో చాలమంది కలవాటుకదా! దీనినిగూర్చిన ప్రశంస లేకుండుట విచారకరము.

నిద్ర-ఇత్యాది మానవునకు బహుఅవసరము. పడకయెట్లుండవలె, ఎన్నిగంటలు సహజముగ ప్రతిమానవుడు వినియోగించవలె మున్నగువిషయము లింకను విపులముగ నుండుటావశ్యకము.

శరీరశుభ్రత - దీనినిగూర్చి వ్రాయుచు సబ్బుపరిశ్రమనుగూడ తెలుపరచిరి. నేటికాలపు విద్యార్థులు, నాగరికశిఖామణుల మనుకొనువారు స్పాంజినో, గుర్రమునతో మెదు ఇనుపసాధనమువలె నుండెడు రబ్బరు సాధనమునో ఉపయోగించుచున్నారు. ఇట్టి సాధ

నముల మంచిచెడుగులను చర్చించి యుండవలసినది. సమస్తసాధనములకంటె హస్తమును మించినసాధనము మరొక్కటి లేదు. ఇతరసాధనము లెవ్వియు ప్రవేశింపజాలని ప్రదేశములకు సహితము హస్తము, హస్తాంగుళులు పోయి పరిశుభ్రపరచును.

స్నాన విధానము - చన్నీరు, వేడినీరునుగూర్చి మాత్రమే వ్రాసిరి. సూర్యోదయాత్పూర్వ, సూర్యోదయానంతర స్నానములలో నేదిమంచిదో ఉదాహరించియుండవలసినది. ప్రవహించుచున్న నీటియందు సూర్యోదయాత్పూర్వము స్నానమాచరించుట శ్రేష్ఠమని సమస్తదేశముల శాస్త్రములు అంగీకరించుచుండ ఈ గ్రంథము ఆవిషయమునే తరచలేదు.

నోరు, దంతములు, నఖములగూర్చి చర్చించబడినది. కాని వెంట్రుకలు, వాని ప్రయోజనమును గూర్చి యెందును ఉదాహరింపబడలేదు. మీసములు తొలగించుట యిప్పుడు ఆచారముగను, నాగరకముగను పరిణమించినది. తలకట్లుపోయి కత్తిరింపులు మెండైనవి. వాటియొక్క ఉచితానుచితములను స్పష్టీకరించవలసినది. నఖములచివరచేరే మాలిన్యము ఏవిధముగ మరణమునకు సహితము త్రోవకల్పించునో, దంతవ్యాధులిటీవల నేకారణమున బలముచెందినవో Persoual Hygine నుగురించి వ్రాయునప్పుడు వ్రాయుటెంతైన ఆవశ్యకము. భగవంతునిసృష్టిలో అప్రయోజనమైన దేదియులేదు.

అట్టిప్రయోజనమును మన మెరుగకుండవలెనంటుట మనది పొరబాటు. మూతిదగ్గర మీసము, కనుబొమల మీది వెంట్రుకలు, కనురెప్పవెంట్రుకలు, చంకలందలి వెంట్రుకలు,మర్మస్థానములందుగల వెంట్రుకలు మొదలగునన్నిటికి తగినంతప్రయోజన మేర్పడియే సృజింపబడినవి.

జోళ్లు - భారతవర్షమువంటి ఉష్ణప్రదేశమునకు పాంకోళ్లు అను ఆకుచెప్పులు మాత్రమే తగినవి. బూట్సు పనికిరావు. ప్రకృత్యారాధకులు బూట్సులు తొడగరు. బూట్సు ధరించుటచేత వ్రేళ్లు ఒత్తుకుని ఉడుకెత్తి వ్రేళ్లసందున పాచిపట్టి పుండ్లుపడవచ్చును. పాదముల వ్రేళ్లలో బొటనవ్రేలియందు కొన్ని ప్రధాననరములు గలవు. ఆనరములకు మెదడుకు సంబంధమున్నది. బూట్సుయొక్క చివర సన్నముగనుండి వ్రేళ్లన్నియు ఒత్తుకొనుటవల్ల త్వరలో మెదడుక్షీణించి జ్ఞాపకశక్తి అంతరించును. మనలో ప్రబలిన జోళ్లుతొడిగెడు నాగరకాచారమును ఖండించి యుండవలసినది.

ఉష్ణీషము—మెదడునకు అత్యుష్ణ అతిశీతలము చేరకుండ వెంట్రుక లడ్డమర్పబడినవి. వాటిని టోపీవగైరాలచే మూయుట వెంట్రుకలకును, మెదడునకును హాని. ప్రత్యేకమైన కారణముచే ధరింపవలసివచ్చినను మరుక్షణమే దానిని పరిహరించు టుచితమని సలహానిచ్చియుండవలసినది.

పరిశ్రమ—మనుష్యునకు వ్యాయామము అత్యవసరమనుచు గుర్రపుస్వారి, పడవనడుపుట, ఈతకొట్టుట మంచివిధానములని వ్రాసిరి. ఇవి పాశ్చాత్యుల వ్యాయామములు. మనభారతీయునకు నడకవంటి ఉత్తమవ్యాయామసాధనము మరొక్కటి లేదు దండెములు, పరుగు, పొలముపని, త్రవ్వుట మొదలగునవికూడ ఉచితములే.

శిశువులకు కృత్రిమక్షీరములు— డబ్బాపాలు, గ్లాక్సోమున్నగునవి యుదాహరింపబడినవి. ఈ గ్లాక్సో వగైరా ఆహారములు మనదేశమునకు దిగుమతి కాజొచ్చినప్పటినుండియే శిశువులలో ప్లీహసంబంధ జాడ్యములు హెచ్చి మరణసంఖ్య పెరిగినది. గ్రంథకర్త వీనియొక్క ఉచితానుచితముల చర్చించియుండవలసినది.

బిడ్డలకు పాలిచ్చుట— బిడ్డలకు పాలిచ్చుటకు తల్లులు ఏపద్ధతి (Posture) నవలంబించు టుచితము?

ఆరోగ్యవారములు— "పురపాలక సంఘములును, ప్రభుత్వమును ధనసహాయమిచ్చి ఆరోగ్యవారములను శ్రద్ధతో సాగించుచున్నారని ఒకచోటను, సంవత్సరమున కొకసారి ప్రభుత్వమును సమాధానపరచుటకు ఇప్పుడనేకస్థలములలో జరుగు నారోగ్యవారములకంటె ప్రతిపట్టణమందును ఆరోగ్యసంఘము లేర్పడి తరుచుగ నారోగ్యప్రచారము చేయుట మంచిది అని మరొకచోటను వ్రాసిరి. ఇట్లుదాహరించుటచేత ప్రభు

త్వబాధ్యత యెంతవరకో, ప్రజలబాధ్యత యెంత వరకో స్పష్టపడకున్నది. గవర్నమెంటువారు ఇప్పుడు భారతదేశ ఆరోగ్యమునకు వెచ్చించుచున్న మొత్తము సరియైన ప్రచారమునకు సరిపడునా? ఇంతవరకు వెచ్చింపబడుచున్న మొత్తము గూడ పట్నవాసులకే ఉపయోగపడుచున్నది గాని భారతదేశమునకు వెన్నెముకయైన గ్రామమునకు, అందు నివసించుచున్న కర్షకునకు ఏమాత్రము ఉపయోగపడకున్నది భారత ప్రభుత్వమువారు మదరాసురాష్ట్రమునందలి గ్రామోజ్జీవనముకొరకు పదునాలుగు లక్షల రూప్యముల నొసగినట్లు తెలియుచున్నది. ఈ మొత్తమునందు పెద్దయుద్యోగుల జీతములక్రింద పోవున దెంత, ఇతరనిర్మాణములకు ఇంగ్లండు వగైరాదేశములందలి కంట్రాక్టుదారులకు పోవున దెంత, యిట్టి వన్నియు పోగా గ్రామజనోద్ధరణమునకు యథార్థముగ మిగులున దెంతయుండునో వెనుకటి లెక్కల పరిశీలించిన యథార్థము బోధపడగలదు. గ్రంథకర్త శెలవిచ్చిన విధానముకంటె పేరునకే ప్రబోధము సల్పుట ఉచితము కాదా!

అంటువ్యాధులు, పరిపుష్టములు, కీటకములు, యీగలకు సంబంధించి నాలుగుప్రకరణములు వ్రాసి అంటువ్యాధులకు క్రిములే కారణమని స్థిరపరచిరి. ఆరోగ్యశాస్త్రము రచించుపట్ల సామాన్యమానవునకు కావలసినది అంటువ్యాధులు చేరకుండ జూచుకొను నుపాయము. దానిని వివరించు టుచితమనునేకాని క్రిములయొక్క పొడవు, లావు, ఎత్తు, వాటికాళ్లు, ముక్కు మున్నగువిషయ విస్తీర్ణముయొక్క అవశ్యకత యేమో తెలియకున్నది.

బోదకాలు (Elephantiasis)-దీనికి కారణము సూక్ష్మజీవి గాదని ౨౮౮ పేజీలోను, బోదకాలు పురుగు వల్ల బోదకాలు, బోదచేతులు, బోదబీజములు, బోద పాలిండ్లు కలుగునని ౨౫౮-వ పేజీలోను, క్యూలెక్స్ జాతిదోమలవలన వ్యాపించుబోదకాలు జ్వరమువచ్చునని ౩౧౦ పేజీలోను వ్రాసిరి. అమాయికప్రజ దేనినినమ్మవలెను?

సుఖవ్యాధులు:—వ్యభిచారమును అంతరింపజేయుట కష్టసాధ్యమనియు, దీని నెంతనిరోధింపజూచిన ప్రజలలో నిది యంత ప్రబలతర మగుచున్నదనియు గ్రంథకర్తగారు సూచించి పేరునకు కొన్ని నివారణోపాయముల నిచ్చిరి. వ్యభిచారము అంతరింపకుండ చిరస్థాయిగనుండవలెననియే గ్రంథకర్తగారి అభిప్రాయము కాబోలు! అటులైన వారుచెప్పిన నివారణోపాయములకు తోడు నేడు ప్రబలముగ ప్రచారమునందున్న రబ్బరు గొట్టములగూర్చి యించుక వ్రాసి ఉచితానుచితముల చర్చించియుండవలసినది.

వివిధజ్వరాదులు, మహామారి, కలరా, పిచ్చి, కుక్కకాటు, కుష్టము, సుఖవ్యాధులు, కీళ్లజ్వరము మొదలగు విషయములగూర్చి ప్రత్యేకప్రత్యేక ప్రకరణములుగ వ్రాసిరి. ఈ జాడ్యములు ప్రబలుటకు కీటకములే కారణమనిరి. సరే కుట్టినవి. సామాన్యముగ కందుబాటులోనుండు కొన్ని చిన్నచిన్న చిటకాచికిత్సలగూడ నిచ్చియుండిన నెంతో ప్రయోజనకారిగ నుండెడిది. ప్రతి ప్రకరణమునందును కీటకముల సంహారమునకు మాత్రమే సలహానిచ్చిరి. ఈసంహార కార్యమునకు ఏవేవోయంత్రములను సూచించిరి. వారి సలహాలు సులభముగ చేయతగినవికావు. సూచనలు సులభమైనవిగను, ఆచరణయోగ్యములుగను నుండవలెనుగాని కష్టసాధ్యములైనవెట్లు?

ఆరోగ్యసంబంధములగు రాజ్యాంగ శాసనములు—ఈ ప్రకరణముతో గ్రంథమునకు సంపూర్తి చెప్పిరి. ప్రభుత్వము Sanitary Law ను పెంచి మనుజులను శాసించుటచే మానవుని ఆరోగ్యభాగ్యము హెచ్చునని గ్రంథకర్తగారి యభిప్రాయముగ స్పష్టపడుచున్నది. దీనికి మన మంగీకరించినను గవర్నమెంటువారు ఏశాసనముచేత ప్రకృతిని, అందలి క్రిమికీటకాదులను శాసించగలరో తెలియకున్నది.

తరువాత—టోక్సు, భాస్వరము, విటమినులు, ద్రవమాపకము మొదలగుపదములకు నిర్వచన మవసరము.

జ్వరమును కొలిచేగొట్టము "థర్మామీటరు" ద్రవమాపకమనుసాధనముయొక్క చిత్రములు ఇయ్యబడలేదు. సామాన్యజీవికి నిత్యోపయోగకరములైనవాటిని విడచి పాకీడబ్బాలు, పాకీబండ్లు, మురికిజలదారులు, చెత్తను తగులబెట్టుయేర్పాటు మొదలగువాటికి ప్రాధాన్యమిచ్చి పారిశుద్ధ్యసంఘమువారి, చిత్రములతో చూపుట యీ గ్రంథముయొక్క ప్రయోజన మెవ్వరికో సంశయాస్పదముగనున్నది.

ఈగ్రంథమునందలి శైలి సులభముగనున్నది. విషయమమాత్రము అమాయకులైన మానవునకుకంటె విద్యాధికులకును, పారిశుద్ధ్య సంఘమువారికిని ఉపయోగపడునట్లు రచింపబడినదని ఊహింపవలసియున్నది.

ఈగ్రంథరచనకు ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు రు. ౭౫౦ లు బహుమతి నొసగిరి. ఆరోగ్యశాస్త్రమునకు సంబంధించి పోటీచేయుచువచ్చిన అనేక వ్రాతప్రతులలో నారాయణమూర్తిగారి రచననే విశ్వకళా పరిషత్తువారు ఉత్తమమైనదిగ నెంచి బహూకరించిరి. ఇతర రచన లింతకంటె రసాభాసుగ నుండియుండవలెనని స్పష్టపడుచున్నది. ఏదిఏటులున్నను ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు శాస్త్రగ్రంథములు తెలుగున రచింపించి బహూకరించి ప్రోత్సహించుచుండుట ప్రశంసింపదగినది. అయితే అట్టిగ్రంథములు ఆంధ్రుల కుపయోగపడునట్లుండవలెనని మాత్రము పరిషత్తువారు జ్ఞప్తియం దుంచుకొనవలెను. ప్రజ్ఞకై పెనగులాడి అప్రతిష్ఠ పాలగుటకంటె ఆంధ్రప్రతిభ సర్వతోముఖముగ ప్రసరించుటకు పరిషత్తువారు హెచ్చుగ ప్ర నగుపర చెదరని విశ్వాసము.

ఒక్కమాట — మానవునకు ఆయురారోగ్యములకు మించినసంపద లేదు. ధనధాన్యసంపత్తి, పాడిపంట రెండవపక్షము. బ్యాంకులో డబ్బు మూల్గుచుండును. అన్నము తింటే అరగక పేలపిండి తినును. అనుభవించ లేనిరోగికి డబ్బు కూడబెట్టవలెనను వాంఛ యేల? ఆరోగ్యము గవర్నమెంటువారు సంపాదించిపెట్టినదికాదు. మానవుడు ఆరోగ్యసంపద నైతికజీవనము, ధర్మనిరతి, విశ్వప్రేమవలన సాధించవలసినది. ఆరోగ్యవిషయమున ఎవ్వరికివారే శ్రద్ధమాపుకొనవలెను. ప్రభుత్వమువారిని శాసనములొనర్చి దండించుమని సలహా యిచ్చుటకంటె మానవున కుద్బోధనసల్పు టుచితము. అట్టి యుద్బోధన శక్తి యీగ్రంథమున కుండవలసినంత యుండకపోయినది. దీనికి కారణము గ్రంథకర్తకు భారతీయస్వాస్థ్యవృత్తసంప్రదాయము తెలియమియే యనవలెను. ఇట్టి గ్రంథములు వ్రాయువారు ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయములను రెంటిని పరిశీలించి నేటి మనవారికి వలసినతీరున వానియందలి విషయములను కూర్చవలెను. అంతియేకాని కేవలము పాశ్చాత్యసంప్రదాయము ననుసరించి రచియించిన యెడల చాలదు. దాని తాలూకు కొంచెము ఉపయోగముకూడ అసాధ్యమయిపోవును.

వడ్లమన్నాటి కుటుంబరావు.

# మెండలీయము – రక్తస్పర్శ

మెండెలు సూత్రములను రూఢిపఱచుటకు సాధన కారులగు 'గీనీల' (గుణవాహకులు) ను గూర్చి కొంత తెలిసికొందము. చిన్నచిన్న యిటుకలు చేర్చి పెద్దమేడకట్టినట్లు, సన్నని నూలుపోగులతో వస్త్రము నేసినట్లు సమస్త జంతువులును, వృక్షములును, సజీవ మగు ప్రతిదియు అణుకోశము (Cells) లనబడు సూక్ష్మమైన జీవపదార్థముతో నిర్మింపబడినవి. ఈ అణుకోశములయందే సమస్తప్రాణుల మూలపదార్థము (Protoplasm) నిండియుండును. ప్రతిప్రాణియు తల్లిదండ్రులిరువురిచేత నేర్పడిన స్థూలసూక్ష్మ బీజాశయ మానవుని



సూక్ష్మబీజము.
౧/౫౦౦ అం. పొడవు.

చిత్రము ౧౫
స్థూలబీజాశయము ౧/౧౨౫ అం. అడ్డకొలత.
♂ పురుష చిహ్నము.
♀ స్త్రీ చిహ్నము.

ముల (చూడుము ౧౫ చిత్రము) సమ్మేళన ఫలితముగ నేర్పడు ఏకజీవకణ కోశమునుండి ఏర్పడినవారగుదురు. నానాట ఇది ద్విగుణీకరింపబడి తలిదండ్రులను బోలిన యాకృతిని దాల్చును. ఈ అణుకోశములలో ననేకరకము లున్నవి. అవి చేయవలసిన పని ననుసరించి వాని రూపము మారియుండును. చర్మములోని యణుకోశములు దేహాంతర్భాగములను గాపాడుటకు తగి యుండును; అస్థులలోనివి గట్టిదనముగలిగి ప్రాణికి నాకారము చేకూర్చును; నరములలోనివి నూలుపోగులవలె నుండి 'టెలిగ్రాఫ్ తీగలవలె' వార్తావాహకములుగా నుండును; కండరములలోనివి ప్రాణికి చలనశక్తిని చేకూర్చును. ఇట్లే కండ్లు, నాలుక, ముక్కు మొదలైన అవయవములలోగల జీవాణుకోశములు ఆయా అవయవములు చేయవలసిన పనుల ననుసరించి మార్పుచెందియుండును. సూక్ష్మదర్శనీయంత్ర సహాయమున నీజీవాణుకోశమును పరీక్షించినచో దాని నిర్మాణము తెలిసికొనగలము. చక్కని పరిపాలనకు ప్రతిగృహమున కొక ప్రధానోపాధ్యాయు డుండునట్లు, ప్రతిగ్రామమున కొక మునసబుండునట్లు, ప్రతి దేశమున కొక ప్రభుత్వ ముండునట్లు ప్రతిజీవాణుకోశమున కొక జీవస్థాన (లేక బీజము-(Nucleus) ముండును. జీవాణుకోశముయొక్క చలనము, పెరగడము, ద్విగుణీకృతముకావడము, ఇవన్నియు నాజీవస్థానముమీద నాధారపడియుండును. కోడిగ్రుడ్డులో తెల్లజనమధ్యనుండు చందమామవలె, జీవాణుకోశమును నిండియుండు మూలపదార్థములమధ్య ఈజీవస్థానము, లేక బీజ మున్నది. (చూడుము చిత్రము. ౧౬) జీవాణు




చిత్రము ౧౬
జీవాణుకోశము

మూ. మూలపదార్థము.
జీ. జీవస్థానము.

కోశము ద్విగుణీకృతమగునప్పుడు సూక్ష్మదర్శనీయంత్ర సహాయమున బరిశీలించినచో అసామాన్యమైన కొన్ని సంగతులు దానియందు జరుగుచుండుటను మనము కనుగొనవచ్చును. బాగుగా కనబడుచుండిన జీవస్థాన

మాయణుకోశమునందు మటుమాయమైపోయి చిన్న చిన్న కడ్డీలవంటి ఒకవిధమైన పదార్థ మాస్థానము నాక్రమించును. ఇవి అతిసులభముగా రంగును దీసికొనుటచేత వీనిని 'క్రోమోసోమ్సు' (Chromosomes), లేక 'వర్ణగ్రాహకములు, అందురు. ఈవర్ణగ్రాహకములు అణుకోశముమధ్య వరుసగా బారుదీరి నిలిచి ప్రతిది నిడివికి రెండుగా చీలుటకు ప్రారంభించును. ఈవిధముగా అవి చీలినతర్వాత అవి వేరుచేయబడి ఒకసగ మొక ప్రక్కకు, మఱియొకసగ మింకొక ప్రక్కకు లాగివేయబడి అవన్నియు ఆయాస్థలములలో ఏకమై మునుపటి జీవస్థానరూపము దాల్చును.

మం దొక్కటిగా నుండిన జీవస్థాన మిప్పుడు రెండైన దన్నమాట. అటుతర్వాత అణుకోశము మధ్యకకు కేర్పడి నానాట సన్నగిలి రెండుగా వేరుచేయబడును (చూడుము చిత్రము ౧౮). ఈవిధముగా ఒక్కజీ




ఉ

చిత్రము ౧౮ (చూ పు. ౪౦౨)

వాణుకోశము రెండగును. ఈరెండు పైవిధముగానే నాలుగై, నాలుగు ఎనిమిదై, ఎనిమిది పదహారై అంతములేక పెరుగుచునే యుండును. ఈ అణుకోశము లెంతభాగింపబడినను వర్ణగ్రాహకముల సంఖ్య మారనే మారదు. ఇట్టి అణుకోశవిభాగము (cell division) కంటికి కనబడని చిన్న జంతువులయందును, పర్వతాకారముగల ఏనుగునందును, పనికిరాని గడ్డియందును, మహాసముద్రములమధ్య పెరుగుచుండు పాచియందును జరుగుచునేయుండును. మన ఆధ్యాత్మికులు "భగవంతుని సృష్టియందు సమస్తప్రాణులు సమానములే" యన్నప్పుడు అం దెంత సత్యమున్నదో! అన్నిప్రాణులయందలి జీవాణుకోశములలోనుండు వర్ణగ్రాహకముల సంఖ్య ఒకటేవిధముగ నుండదు. ప్రతిజీవియొక్క ఆకారస్వభావముల ననుసరించి, దానిలోని వర్ణగ్రాహకముల సంఖ్య మారుచుండును. ఒకపురుగునందు రెండుండవచ్చును. సీమపందికొక్కులు, ఉల్లిపాయలు వీనిలో ముప్పదిరెం డుండును. చుంచులు, సీమవంకాయలు వీనియందు నలువదియెనిమిదియు, కొన్నివానరములయం దేబదినాలుగును, మఱికొన్ని వృక్షజాతులలో రెండువందలుగూడ నుండును. మనుష్యులయం దివి నలువదియెనిమిదిమాత్రమే యున్నవి. ఈవర్ణగ్రాహకముల సంఖ్య లన్నియు పరిసంఖ్యలుగా నుండుట గమనింపదగిన యంశము. ఇందులకు గల కారణము- ప్రతిసజీవమగు పదార్థమునకు ఆదిమవస్తువును, స్థూలసూక్ష్మ బీజాశయముల ఐక్యఫలితమును అగు ఏకజీవాణుకోశమునందు తల్లిదండ్రుల జీవోత్పాదక బీజకణములు రెండింటిలో నుండిన వర్ణగ్రాహకములు కలిసి యున్నవి గనుక, కుడిచేత నైదు చింతపిక్కలను, ఎడమ చేత నైదు పిక్కలను దీసికొని రెండింటిని గలిపినచో గలుగు పది పరిసంఖ్యగానే యుండును. ఇదేవిధముగ కోతిలోనుండు ఏబదినాలుగు వర్ణగ్రాహకములు, దాని తల్లినుండి ఇరువదియేడును, తండ్రినుండి యిరువదియేడును దీసికొన్న దానివలన నేర్పడినవే యగును. తక్కినవానిలోని వర్ణగ్రాహకములు సహితము తల్లినుండి సగము, తండ్రినుండి సగము గ్రహించినవే. ఈజీవాణుకోశముల విచిత్ర ప్రవర్తన యిట్లే జరుగుచుబోయినచో కొంతకాలమునకు సరికి ప్రపంచములోని జంతుజాలముల యణుకోశములోని వర్ణగ్రాహకముల సంఖ్య మితిమీరి పోవును. ఆకాశమునందలి నక్షత్రములకంటె నివి ఎక్కుడు అసంఖ్యాకములై సంతతినుండి సంతతికి పుట్టు పిల్లలకు ఏట్టిసంబంధమును లేక (వర్ణగ్రాహక

ముల సంఖ్య తల్లిపిల్లలపోలికకు కారణభూతముగావున) ఎట్టి దురంతములు సంఘటిల్లునో యూహింప నశక్యము. కాని సృష్టియం దీదురంతము నివారించుటకు గోసాయిచిటిక యొకటి యున్నది. పిండోత్పత్తికి మూలకారణమగు జీవోత్పాదక బీజకణకోశములోని వర్ణగ్రాహకముల సంఖ్య, తక్కిన శరీరావయవ జీవకణకోశములలోని వానిలో చెఱిసగముమాత్రమే యుండును (చూడుము చిత్రము ౧౫). జీవోత్పాదక బీజకణ నిర్మాణమునకు పూర్వము అణు కోశములలో




చిత్రము ౧౫. (చూ. పు. ౪౦౨)

క్షీణవిభాగము (Reduction division) జరుగుటను ౧౫వ చిత్రము సూచించును. స్థూలసూక్ష్మ బీజాశయములలో జరుగు ఈక్షీణవిభాగము, జీవజంతువులలోని వర్ణగ్రాహకముల సంఖ్య నెక్కుడుగానీక, తక్కువగానీక యాపుచు, తలిదండ్రులకు బిడ్డలకు పోలికను గూర్చుచు, ప్రకృతియందు విపరీతములు చొరనీయకగాపాడుచున్నది. ఏమి యీసృష్టి వైచిత్ర్యము! సూక్ష్మాతిసూక్ష్మమగు దేహాంతర్భాగమున నెక్కడో జరుగుచుండు ఈక్షీణ విభాగనియమము బాహ్య ప్రపంచమున నిత్యము ప్రయోగింపబడుచుండుట మనము చూచుచునేయున్నాము. లోకమున పాపము పెరిగినది; భూభారము హెచ్చినది. విపరీతములు గలిగి యుపద్రవములు రాకమునుపే క్షీణవిభాగతుల్యముగ సంభవించు యుద్ధములు, ప్రళయములు, భూకంపములు, క్షామములు మొదలగు అనర్థములు ప్రపంచమున కలిగి జనబాహుళ్యమును గొంతవఱకు తుడిచి వేయుచుండును.

క్షీణవిభాగానంతరము జరుగు స్థూలసూక్ష్మ బీజముల సమ్మేళన ఫలితముగ పిండోత్పత్తి గలుగునని మనము తెలిసికొంటిమి. జీవోత్పాదక బీజకణములు, తత్కణములలోని వర్ణగ్రాహకములు, ఎట్లు మిళితమై, తలిదండ్రుల చాలుననుసరించు పిల్లల నెట్లు సమకూర్చునో అదియు [illegible]ంగితిమి. ఇక 'గీనీలకు' (గుణవాహకములు) స్థలమేది? గీనీలు లేకపోయినచో మెండెలు సూత్రము లనువర్తించు విధాయక మెక్కడ? మానవుని బిడ్డకుగాని, కాకి పిల్లకుగాని, యుండు స్వభావముల నిచ్చు 'గీనీలు' తప్పక యీవర్ణగ్రాహకములతో నుండి తీరవలయును. ఇరువదియవ శతాబ్దములో శాస్త్రలోకమున గనిపెట్టబడిన సమస్తవిషయములలోనెల్ల ఈ 'గీనీల' విషయము చాల ముఖ్యమైనది. పలువిధములగు పశువృక్షజాతుల బీజకణ కోశములలో వర్ణగ్రాహకములు పరిశోధింపబడి 'గీనీల' యునికి కనిపెట్టబడినది. ఇవి కడ్డీలవంటి వర్ణగ్రాహకములయందు నిడివికి గుళికసీపూసలవలె వరుసగా నిమిడియున్నవి. విస్తారముగ పోగుచేయబడిన యిసుక సముద్రతీరమున కెట్లు కారణభూతమో, అసంఖ్యాకములగు నీటిబిందు సముదాయము మహాసముద్రముల కెట్లు మూలాధారమో, అట్లే గీనీల యునికియే వర్ణగ్రాహకముల కాధారమని చెప్పవచ్చును. గీనీలు లేకున్నచో వర్ణగ్రాహకములు లేవన్నమాట. అనగా నీరెంటికిని ఒకదాని కొకదానికంత సన్నిహిత సంబంధ మున్నదని గ్రహింపవలెను. ఈ



చిత్రము ౧౬. (చూ. పు. ౪౦౨)

గీనీలు జీవాణుకోశమున నేస్థానము నాక్రమించునో (౧౬) వ చిత్రము తెలుపును. ఈక్రింది వృక్షమును అదే విషయమును విశదపఱచును.

మూలపదార్థమునిండిన
జీవాణుకోశము

జీవస్థానము

వర్ణగ్రాహకములు

గుణవాహకలు
(గీనీలు)

ఒక్కొక్క వర్ణగ్రాహకములోను లెక్కలేని గీనీ లుండవచ్చును. వీని సంఖ్యయు వర్ణగ్రాహకముల సంఖ్యవలె జంతుజంతువునకు భేదించును. గీనీలు సూక్ష్మతమములైనవి కాని పరమాణువుల (Atoms) కంటె పెద్దవి. వందలకొలది పరమాణువులు చేరి ఒక గీనీ కావచ్చును. జె. బి. యస్. హాల్డేన్‌గారి యూహప్రకారము ఒక కోడిగ్రుడ్డును మన భూగోళమంతదిగా జేయుటకు ఎన్నిరెట్లు పెద్దదిజేయవలయునో అన్నియేసార్లు ఒకగీనీని పెంచినచో అప్పటికిని దాని నొక గదిలోనుండు చిన్నబల్లపై నుంచదగినంతమాత్రమే యగునట! (చూడుము చిత్రము ౨౦)ఇంత చిన్నగీనీలు, మన జీవితసారము నిముడ్చుకొని యున్నవి. మనశక్తిసామర్థ్యముల కాధారములైనవి తాతసొమ్మంతయు బొంతలో గూర్చియున్నట్లు మన సర్వస్వమును యీగుణవాహకములు దేనితో నిర్మింపబడ్డవి? వానికి వ్యక్తియనునది లేదా? అవియు సజీవములేనా? ఇవన్నియు ఉన్నవనుకొన్నను ప్రాణికోటిలోని గుణవిశేషములగు నీలికండ్లు, చుట్టవెండ్రుకలు, మూర్ఖపము, శతాయువు మొదలైనవిగా నీగీనీలెట్లు వృద్ధినందును.? ఈప్రశ్నల కన్నిటికి సమాధానము చెప్పుటకు సమయ మింకను రాలేదు. జీవరసాయనశాస్త్రము (Bio-chemistry) ఇంకను అంత దూరము సాగిపోలేదు ఈ శాస్త్రము నిన్న లేక మొన్న అంకురించినది. ఇంకను సరిగా మప్పదియేండ్లుగూడ నిండ లేదు. జీవాణుకోశములును, జీవస్థానమును, వర్ణగ్రాహకములును సజీవములని రూఢి పరచబడినది. తమంతటతాము ఏలాంటి రసాయనాదిభేదముల నందకయే ఊరకున్నంత మాత్రమున తాడికల్లునకు మత్తు కలుగజేయు గుణము నిచ్చు "ఈస్టు" వలె, మనలో జీర్ణశక్తిని చేకూర్చు జాఠరరసములోని కొన్ని "ఎన్జైమ్స్"వలె ప్రాణులకు కొన్ని స్వభావముల నిచ్చుటకు ఈవర్ణగ్రాహకములలోని యునికిమాత్రము చాలునేమో! ఏలనందురా, అవి పెరుగుటలేదు; తరుగుటలేదు. అవి లేకున్న మాత్రమున ప్రాణియందు




చిత్రము ౨౦. (మా. పు. ౮౦౨)

వానికి చెందిన కొన్ని గుణములు గన్పడనే గన్పడవు. కావున నొకానొక తల్లిదండ్రులలోని కొన్ని దుర్గుణములను వారి పిల్లలకు చెందనీక చేయవలయునన్నచో తద్గుణకారకములగు గీనీలనుమాత్రము జీవోత్పాదకబీజకోశముల వర్ణగ్రాహకములనుండి తీసివేసినచో, ఆగుణములు తప్పక పిల్లలయందు కన్పడక పోవును. ఇది దుస్సాధ్యమైన పనియని తలచకుడు. వర్ణగ్రాహకములను పూర్తిగ జీవోత్పాదకబీజకణములనుండి తీసివేసి పిల్లలను పుట్టించుటకు ప్రయత్నములు జరిగినవి. కాని తృప్తికరమగు ఫలితము కలుగలేదు. అట్లుచేసినచో పిండోత్పత్తికి ఆధారభూతమైనదియు, ప్రాణి పెరుగుటకు ముఖ్యసాధనమైనదియు, దాని జీవమునకు కారణమైనదియు నగు వందలకొలది గీనీలను మనము తీసివేసినవార మగుదుము. తత్ఫలితముగ పిల్లల యుత్పత్తి యాగిపోవచ్చును. ఒకవేళ కలిగినను వికారస్వరూపము గలిగియుండవచ్చును. అట్లుండినను చాలకాలము జీవించియుండక నశించిపోవచ్చును. గోరుమట్టు లేచినదని వ్రేలిని, జలుబుచేసినదని ముక్కును తీసివేయుటకుమారు తద్రోగకారణమును తొలగింపజేయుట యుత్తమము. కావున తండ్రిలోని కోపస్వభావమును, తల్లిలోని గయ్యాళితనమును వారి పిల్లలకు లేకుండ చేయవలయునన్నచో తద్గుణవాహకములగు గీనీలను మాత్రము వారి సూక్ష్మస్థూల బీజాణుకోశముల వర్ణగ్రాహకములనుండి సాధ్యమున్న బొత్తుగా తీసివేయుటయో, లేక వాని నందుంచియే యేయౌషధ ప్రయోగమువలననో, X Ray సహాయముననో, 'అల్ట్రా వైలెట్' కిరణప్రసారములవలననో వాని శక్తిని లాగివేయుట మంచిది. కొంతకాలముక్రితము అమెరికాదేశమున ముల్లర్‌గారు (Muller) ఈవిధానము ననుసరించి X Ray ప్రయోగమున కొన్ని క్రొత్తయీగలను సృష్టించెను. ఎప్పుడో ఒకప్పుడు ఇదేవిధమగు ప్రయోగములు మనుష్యులయందును చేయబడి, వలసినచో కాళిదాసువంటి మహాకవులను, లక్ష్మీబాయియంతటి ధీమంతురాండ్రను, బుద్ధునివంటి పరమయోగులను మనము బడయగలము. ఔషధాది బాహ్య ప్రేరణావశ్యకత లేకయే కొన్ని నియమములను పాటించుచు చేయు మిథునముల సంతానమునందిట్టి మార్పులను తప్పక చేయవచ్చును. ఇట్టి వింతలు మెండెలు బఠాణిచెట్లలో చేసెను. కేంబ్రిడ్జిలోని బిఫ్ఫెన్ (Beffen), రషియాలోని వావిలోవ్ (Vavilov) ఇట్టి ప్రయోగఫలితముగ క్రొత్త గోధుమలు సృష్టించిరి. అమెరికాదేశమున మార్గన్‌గారు (Morgan) "డ్రోసిఫైలా" ఈగలలో నొక నూతనజాతిని పుట్టించిరి. మనుష్యులయందును ఇట్టి ప్రయోగములు గావింపగల దినములు తప్పక రానున్నవి. అప్పటి ప్రభుత్వము ఏతీరున నుండునో తలంచుకొన్నంతమాత్రమున ఒడలు పొంగిపోవును. ఇప్పటి పరిపాలనయందుండు వ్యవసాయశాఖ, ప్రజారోగ్యశాఖ, స్థానికస్వపరిపాలనశాఖ, విద్యాశాఖవలె 'వివాహశాఖ' యొకటి ఏర్పడవలయును. దేశములోని జనాభాలెక్కలను దీసి, ఆడువారి సంఖ్య ఎక్కువగా నుండుచో మగవారిసంఖ్యను వృద్ధిచేయుట, మగవారెక్కువగ నుండుచో నాడువారిని వృద్ధిచేయుట, వంశపరంపరగా వ్యాధిగ్రస్తులుగా నుండు కుటుంబములలో వివాహసంబంధములనునిషేధించుచు శాసించుట, జాతివర్ణభేదములను, దేశాంతర విభాగములను నశింపజేసి దేశక్షేమమునకు అంతర్వర్ణ, అంతర్జాతీయ, అంతర్దేశీయ వివాహములను ప్రోత్సహించుచు చట్టములు కల్పించుట, ఇత్యాదికృత్యములు వివాహశాఖ నిర్వర్తించవలసియుండును. ఇటీవల మనము వినిన మనదేశపు భావికాలపు ప్రభుత్వ విధానమునుగూర్చి విచారణ సలిపిన "జాయింటు సెలెక్టుకమిటీ" వలె, అప్పుడు దేశమునం దుండవలసిన స్త్రీపురుషసంఖ్యలను గూర్చి విచారించుటకు 'సెలెక్టుకమిటి' లు నిర్మింపబడవలయును. వర్తమానకాలమున స్వీడన్ దేశమున వంశీయజీవ శాస్త్ర పరిశోధనాలయము (Institute cf Race Biology) ఒకటియున్నది. అట్టి ఆలయము లికముందు ప్రతిదేశములోను వర్ధిల్లవలయును. అట్టి సుదినములు త్వరలో సంప్రాప్తించునుగాక! ఆధునిక శాస్త్ర విషయములాంధ్రలోకమున ప్రబలునుగాక!! ప్రకృతి శాస్త్రమునకు జయమగుగాక!!!

౧౬, ౧౭, ౧౮, ౨౦ చిత్రముల వివరణము

చిత్రము. ౧౬

జీవాణుకోశము—ద్విగుణీకృతము

అ: జీవాణు కోశము.

ఆ: మూల పదార్థమునందు వర్ణగ్రాహకము లేర్పడుట.

ఇ: వర్ణగ్రాహకులు—శిరస్థాన మదృశ్యమైనది.

ఈ: వర్ణగ్రాహకులు—బాగు దీరినది.

ఉ: వర్ణగ్రాహకులు—నిడివికి రెండుగా చీలినవి.

ఊ: విభజింపబడిన వర్ణగ్రాహకులు ఉత్తర, దక్షిణ ధ్రువములకు లాగివేయబడినవి-అణుకోశముమధ్య కతు కేర్పడినది.

ఋ: అణుకోశము—రెండైనది. వర్ణగ్రాహకులు కేంద్రము నాక్రమించినవి.

ౠ: వర్ణగ్రాహకులు శిరస్థానమైనది.

చిత్రము. ౧౭

౧. శరీరాణుకోశము—వర్ణగ్రాహకుల సంఖ్య-౪

౨. బీజకకోశ నిర్మాణమునకు పూర్వము జరుగు క్షీణ విభాగము.

3. క్షీణవిభాగానంతరము ఏర్పడిన రెండు బీజాణుకోశములు.

చిత్రము. ౧౮

ఒక జీవాణుకోశము

మూ: మూలపదార్థము.

శి: శిరస్థానము.

వ: వర్ణగ్రాహకములు.

గు: గుణవాహకములు.

చిత్రము. ౨౦

గ్రు: క్రోత్రిగ్రస్డు—భూగోళమంత పెద్దదిగా చేయబడినది.

గి: అన్నియేరెట్లు పెద్దది జేయబడిన 'గిని' లేక గుణవాహకము.





౮. కల్యాణమహల్' గోపురముమీదనుండి కనుపడు దృశ్యము. చెంజిదుర్గమున రాజగిరికి తూర్పునగల ప్రాంతము.
దుర్గమునందలి ప్రాకారములు, ద్వారములు, మార్గములు మొదలయినవి యిందు కానవగును.
ఎడమవైపున 'కల్యాణమహల్' గోపురముఛాయ కనుపడుచున్నది.



౭ చాంద్రాయనదుర్గము: రాజగిరి దుర్గముమీది ఫిరంగిమంటపమునుండి కనుపడు దృశ్యము. ముందు 'శెట్టికొళము.' దానికి ఎడమవైపున, మెట్లయొక్క ఈవలిచివర దేశింగురాణి సహగమనముచేసిన స్థలమున దిన్నె.

చెన్నరాజధానియందు 1934-వ సంవత్సరము అక్టోబర్ ప్రారంభము మొదలు
డిసెంబర్ తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

### కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

పంచకావ్యకథానిధి—సి. సుబ్రహ్మణ్యశాస్త్రి
పంద్రెండురాజుల కథలు—యస్. రామానుజరావు
భీముడు—యం. సీతారామరావు
మాంధాతృచరిత్రము—సి. వెంకటాచార్యులు
రాయబారము, భా ౨—డి. వెంకటకృష్ణరావు

### కల్పము

ప్రాజాకల్పము—యం. నరసింహ యతీంద్రులు

### కావ్యములు

ఆంధ్రకాదంబరి, భా. ౨—(ప్ర) వి. ప్రాజ్ఞప్రజ్ఞాచార్యులు
ఆంధ్ర హంససందేశము—వేదాంత దీక్షితర్
ఉత్తరహరివంశము (వచనము)—సి. నారాయణశాస్త్రి
చిత్రభారతము—సి. ధర్మన్న
శ్రీ కోదండ రామాయణము—బి. రామయ్య.
శ్రీ సీతాకల్యాణము—జి. అచ్యుతసూర్యనారాయణ శర్మ.

### గణితశాస్త్రము

ఆంధ్రగణితశాస్త్రము, భా. ౧—వై. యల్. నారాయణశాస్త్రి.
ఆంధ్రరేఖా గణితము—డి. యగ్గన్న.
లఘుగణితము బుక్ 3—యస్. బాలకృష్ణఅయ్యర్.
లెఖల ప్రశ్నోత్తరములు—యస్. వి. రామావధానులు.

### గేయములు

కనకదుర్గాంబ చరిత్రము—సి. నారాయణదాస్.
కనకవల్లిపాట—(ప్ర) గృహసరస్వతి బుక్ డిపో, కడప
కిన్నెరసాని పాటలు, కోకిలమ్మపెళ్లి—వి. సత్యనారాయణ.
కీరపాండురంగాంజనేయ భజనకీర్తనలు—బి. వీరాస్వామిదాస్.
కృష్ణలీల నాటకమునందలి కీర్తనలు—పి. లక్ష్మీకాంత కవి.
కౌసల్యా పరిణయము—రాఘవకవి.
మంగళ హారతులు—(ప్ర) కె. వెంకటరమణ శర్మ, రాజమహేంద్రవరము.
మహిళా మనోహరము—కె. సీతారామయ్య.
మానసపూజ—(ప్ర) వెంకటరమణ శర్మ.
రామకీర్తనలు—కె. సత్యనారాయణదాస్
విషలీల నాటకమునందలి కీర్తనలు—పి. లక్ష్మీకాంత కవి.
శ్రీకుసుమహారమురళి (భా. ౧, ౨)—యస్. సింగరసూరి.
శ్రీకృష్ణలీలా శృంగారపద జావళీనిధి—ఇ. సూర్యం.
శ్రీపాండురంగ బృందావన సంకీర్తనలు—పి. నారాయణదాస్
(శ్రీ) పాండురంగ హరినామసంకీర్తనలు—(ప్ర) పి. అప్పలస్వామి. బెజవాడ
శ్రీసద్గురు విలాసము—టి. నారాయణస్వామి
శ్రీసీతారామసేవ—పి. సుబ్బారావ్.

### చరిత్ర

ఆంగ్ల దేశ చరిత్ర, భా. ౨—సి. నరసింహరావ్.
ఆంగ్ల హిందూదేశముల చరిత్రము—యం. పేరిదీక్షితులు. టి. సూర్యప్రకాశరావ్.

---

* ఈపట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు, పద్యము. ప—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం. సంపాదకులు, సటీ.—సటీకము.

ఇంగ్లాండు, బ్రిటిషు ఇండియాచరిత్రము—కె. సీతారామశాస్త్రి.

నవీనహిందూదేశచరిత్రము—డి. అప్పారావ్.

## చట్టము

గ్రామోద్యోగముల నిబంధనలు—(ప్ర) శ్రీ కాంతం, గుంటూరు.

## ఛందశ్శాస్త్రము

అప్పకవీయము—కె. అప్పకవి.

## జీవితములు

వీరమాతలు—కె. లక్ష్మమ్మ.

శ్రీకృష్ణుడు—జే. వెంకటజగన్నాథరావు.

శ్రీనృసింహభారతీస్వాములవారి దివ్యచరిత్రము—(ప్ర) యస్. శ్రీకంఠశాస్త్రి, శృంగేరి.

## జ్యోతిషశాస్త్రము

ముహూర్తనారసింహము—కె. నరసింహశర్మ.

సిద్ధాంతగణకానందబోధిని—(ప్ర) సి. నరసింహశాస్త్రి, మచిలీపట్టణము.

సిద్ధాంతినరకంఠీరవము—సి. వెంకటనారాయణసిద్ధాంతి.

## దండకము

ఆంజనేయదండకము—(ప్ర) గృహసరస్వతీబుక్‌డిపో, కడప.

## నవలలు

తాజ్‌మహల్—యస్. వెంకటసుబ్బరావు.

తూలిక—యం. విశ్వనాథం.

దాసీకన్య—రమేశచంద్రదత్

పడకపాము, భా. ౧, ౨ బి. కోటీశ్వరరావు

మంద్రగబ్బ, భా. ౧, ౨— యస్. రామానుజరావు

మాలతి—యస్. వెంకటసుబ్బరావు

యమమాత—యస్. రామానుజరావు

రాధాదేవి—పి. రామకృష్ణచౌదరి

సంధ్య—యం. విశ్వనాథం

## నాటకములు

అనార్కలీ—యస్. ముద్దుకృష్ణ

కాలకేతనము—యస్. రామానుజరావు

కాపురుష గర్వభంగము—జి. జాన్.

గండికోట పతనము—కే. జయరామరావు.

తెనాలి రామకృష్ణచరిత్రము—సి. సోమసుందరజోస్యులు.

భక్తవిజయము—జి. జోసఫ్.

శ్రీ రుక్మిణీకల్యాణము—డి. రామమూర్తిశాస్త్రి.

## నిఘంటువులు

ఆంధ్రవాచస్పత్యము, భా. ౨—కె. శ్యామలకామశాస్త్రి.

శబ్దరత్నాపణము—ఏ. వ్యాసశాస్త్రి.

## నీతి

నీతికథలు—డి. యన్. శర్మ.

నీతిపద్యరత్నావళి—యం. వెంకటనరసింహరావు.

## పరిశిష్టము

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సాంఘికవాదుల సంఘము—(ప్ర) జి. రంగనాయకులు, నిడుబ్రోలు.

ఆంధ్రోపాధ్యాయ గ్రంథమాల చతుర్థ పుష్పము—(ప్ర) సెక్రెటరి, ఉపాధ్యాయ సంఘము, ఒంగోలు.

ఆధునిక మానసిక చికిత్స—సి. సేతుమాధవరావు.

ఆదర్శము—పి. కృష్ణమూర్తి నాయుడు.

ఆర్యవాచకము, తరగతులు ౩,౪—సి. భీమశంకరం, యం. వేంకటరత్నం.

ఆహారశాస్త్రము, భా. ౧—టి. రాజగోపాలరావు.

కవిరాయలు—కె. వీరభద్రయ్య చౌదరి.

జమఖర్చులలెక్క జాబితా—ఏ. నారాయణదాసు.

జమీందారీ గ్రామకరణముల పరీక్షాదర్శిని—బి. ల నరసింహం.

నిరంజనాంజనము—కె. సంగమేశ్వర కవి.

వాల్గవవాచక పుస్తకము—కె. వీరేశలింగం.

పట్టుశాలి జాతీయసంఘ నిబంధనలు—(ప్ర) సెక్రెటరి, బొంతలకోడూరు.

పద్యములు—నరసింహదాసు.

పక్షిరాజునకు బాదరక్షా ప్రయోగము—డి. రాధా కృష్ణమూర్తి.

బహిరంగశ్రీముఖపత్రిక—కల్యాణానందస్వామి.

బొమ్మలకథావాచకము, బుక్ ౧—కె. సుబ్బరావ్.

మణిమంజరి, భా ౧—(ప్ర) కె. వి.నరసింహాచార్యులు, కొల్లూరు.

మహర్నవమిపద్యములు—(ప్ర) యస్. సుబ్బరావు, పాలకోలు.

మాతృస్మృతి—కె. సీతాపతిరావు.

మేంగొలుపులు—(ప్ర) కె. వెంకటరమణశర్మ.

రత్నమాల—బి. హనుమంతరావు, డి. సూర్యనారాయణరావు.

రామమోహనుడు—సతీశచంద్ర చక్రవర్తి.

లక్ష్మీవియోగము—జే. సీతారామస్వామి.

లోకజ్ఞానబోధిని—కె. వెంకటరావ్, యం. సీతాపతిరావ్.

విజ్ఞానలహరి—యస్. గోపాలం.

విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము—(ప్ర) వి. నిరంజన శాస్త్రి, దుగ్గిరాల.

శంభుతో నొకనాటి సహవాసము—కె.యస్. వెంకటరమణి.

శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రవిషయ ప్రదర్శిని అను తాంబూలదుర్వాద ఖండనము— యస్. సుదర్శనాచార్యులు.

శ్రీ మహానందీక్షేత్రము, వన్యమృగరక్షణ—జి. హరిసర్వోత్తమరావు.

శ్రీ రామజయంతి మహోత్సవాహ్వానపత్రిక — ఎ. నారాయణదాస్.

శ్రీ రామవిజయము—కె. సుబ్బయ్యశాస్త్రి.

శ్రీ హరనాథస్మృతి, భా. ౧—(ప్ర) కుసుమహరనాథతత్వ ప్రచారిణిసభ, రాజమహేంద్రవరము.

సాక్షి—పి. లక్ష్మీనరసింహరావు.

స్వరశాస్త్రము—యస్. కృష్ణారెడ్డి.

## పారిశ్రామికము

నేతపరిశ్రమ.—పి. వెంకట్రామయ్య.

## ప్రకృతిశాస్త్రము

ప్రకృతిశాస్త్ర పాఠములు, భా. ౨—జి. వెంకటరామయ్య.

ప్రకృతిశాస్త్రపాఠములు, భా. ౫— వెంకట్రామయ్య.

మాగుతిశాస్త్రవాచకము, ఫారం ౨, ౩ సుబ్రహ్మణ్యం, పి. శ్రీరాములు.

విజ్ఞానశాస్త్రము, ఫారం ౩, ౪—కె. వీరభద్రయ్య.

సాధారణముగా నేర్చుకొనవలసిన ప్రకృతిశాస్త్రవిషయములు—జి. వెంకటరామయ్య.

సామాన్యశాస్త్రవిషయములు, ౨ డి. సూర్యనారాయణశర్మ.

## భూగోళశాస్త్రము

కర్నూలుతాలూకా భూగోళము — వి. వెంకటాద్రిరావు.

నంద్యాలతాలూకా భూగోళము—టి. నరసింగరావ్.

నిజాంరాజ్యభూగోళము—మఖ్దుం మహీయుద్దీన్.

బళ్లారిజిల్లా భూగోళము—(ప్ర) సి. శ్రీనివాసరావ్, ఆదోని.

భూగోళశాస్త్రము, ఫారం ౪—అర్. శేషగిరిరావు.

మానవభూగోళశాస్త్రము—యం. సీతారామరావు.

సత్తెనపల్లితాలూకా భూగోళము—బి. సత్యనారాయణ.

## మాహాత్మ్యములు

పాండురంగ మాహాత్మ్యము—ఎ. సూర్యనారాయణ.

మల్లేశ్వర మహాత్మ్యము—జె. రామశాస్త్రి.

శ్రీశైలమహిమము—రామకృష్ణ సీతారామ సోదర కవులు.

హోళీపండుగ మహాత్మ్యము—ష్యాబ్ రామకృష్ణ ప్రసాద్.

## మతము - హిందు

భక్తినామ మహిమ—యం. వెంకట లక్ష్మీనరసింహారావు.

భక్తియోగము—వివేకానందస్వామి.

భక్తియోగోపన్యాసములు—వివేకానందస్వామి.

సప్రశ్నాప్రశ్న వివేకము—క. వెంకటకృష్ణశర్మ పాకయాజి.

### —ఇతరములు

అర్చ్యశిష్ట చిన్న తేరేసమ్మగారి చరిత్రము—యం. రెవ్. ఇగ్నాటిస్.

అర్చ్యశిష్ట అతానసియస్ గొంజాగ అనువారి చరిత్రము—యం. రెవ్. ఇగ్నాటిస్.

అర్చ్యశిష్టనిస్ లాస్ కోష్టక అనువారి చరిత్రము—యం. రెవ్. ఇగ్నాటిస్.

కుటుంబములయందు జేసునాధస్వామి పరిశుద్ధ హృదయ స్థాపనమును గురించిన ఆరు సంభాషణములు—(ఫా) మాతో.

పాపములన్నిటిలో గొప్పదేది—చ. ఇ. ఆషం.

బంగారు విగ్రహము—చ. ఇ. ఆషం.

మతోద్ధారణ క్రుస్తు చరిత్రము—(ప్ర). యూ. యల్. సి. యం. చర్చి. కౌన్సిల్, తెనాలి.

మోక్షసోపానములు—బి. మాథ్యూస్.

రక్షణగానము—బి. మాథ్యూస్.

రక్షణమార్గగీతి—బి. మాథ్యూస్.

రక్షణసువార్త—చ. ఇ. ఆషం.

రాజస్థాపనము—యం. రెవ్. ఇగ్నాటిస్.

సింహముబోనులోవేయబడిన ప్రధానమంత్రి—చ. ఇ. ఆషం

### యక్షగానము

శ్రీ అనసూయనాటకము, యక్షగానము—యం. కృష్ణకవి.

### వేదాంతము

ఆంధ్రశతశ్లోకి—(అను) పి. నారాయణశాస్త్రి.

త్రిమతవేదాంత కౌస్తుభము—క. వెంకటరత్నశాస్త్రి.

నిర్వచనశివసుజ్ఞానదీపము అను గురుగీతలు—క. గోపాల కృష్ణమూర్తి.

భగవద్గీత—నారాయణానందసరస్వతీస్వామి.

భగవద్గీతామృతసారము—యం. తిమ్మయ్యసెట్టి.

మహాసీతము—ఎ. సీతారామశాస్త్రి.

వాసుదేవమననము—వాసుదేవయతీంద్రులు.

శ్రీభగవద్గీతాహృదయము—డి. వెంకటరామరెడ్డి.

### వైద్యశాస్త్రము

అనుపానమంజరి—(ప్ర) సి. లక్ష్మణస్వామి, కోరింగ.

ఆయుర్వేదౌషధరత్నాకరము — యస్. కృష్ణమూర్తి శాస్త్రి.

ప్రకృతిఆరోగ్యము—వి. దొండాసాహెబ్.

### శతకములు

ఆంజనేయశతకము—పి. నరసింహాచార్యులు.

ఆదినారాయణశతకము—ఎ. శేషాచలామాత్యమణి.

భద్రాద్రిరామశతకము—యస్. సుబ్బారావ్.

శ్రీ కీరపంపెరినాధశతకము—టి. వేంకట అప్పలదాస్.

శ్రీ హరిశతకము—క. హనుమత్కవి.

### శిల్పశాస్త్రము

శిల్పశాస్త్రము—(ప్ర)సి. త్యాగరాయసెట్టి, మదరాస్.

### సారస్వతము

కావ్యప్రకాశ వివరణము, భా. ౧— నరసింహాచార్యులు.

గ్రామ్య భాషాప్రయోగ నిబంధనము — వి. వెంకటరాయశాస్త్రి.

### స్తోత్రము

విశ్వేశ్వర సంప్రార్థనము—జె. వెంకటేశ్వరులు.

### హరికథలు

కంసవధ—యం. మహానందిరెడ్డి.

దయాకర విజయము—బి. బాలాజీదాస్.

శశికలా సుదర్శనీయము—క. గోపాల కృష్ణమూర్తి.

శ్రీ సులోచనచరిత్ర హరికథ—టి. వెంకట అప్పలదాసు.

సూరదాసు చరిత్రము—బి. బాలాజీదాస్.

# నక్షత్రమండలము

(ధాతృ సంవత్సర అధికభాద్రపద, నిజభాద్రపదమాసము)

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

ఉత్తరము

దక్షిణము

ఖగోళవేధచేయువారు ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సప్పనట్లు పట్టుకొని చూడవలెను. ఇందు స్నట్లు గ్రహనక్షత్రాదులు (శుక్రుడుమాత్రము. సూర్యాస్తమయమైనపిమ్మట అక్టోబరు మాసారంభమున కనబడునట్లు పటములో చూపబడినది)

సెప్టెంబరు 8 తేదీని రాత్రి గం. 8-52

సెప్టెంబరు 15 తేదీని రాత్రి గం. 8-25

,, 22 ,, ,, ,, 7-57

,, 30 ,, ,, ,, 7-26

అక్టోబరు 7 ,, ,, ,, 6-58 కనబడును.

"My eye was fixed upon the glowing sky"
(Wordsworth.)

"It is sweet to see the evening star appear
'Tis sweet to hear
At midnight on the blue and moonlit deep
The song of"... (Byron)

"Divine melodious Truth,
Philosophic numbers smooth,
Tales and golden histories
Of Heavens and its mysteries." (Keats)

"నక్షత్రకోటులతో అద్భుతముగా మెఱయు చున్న ఆకాశరంగమును తనివితీరక తదేకదృష్టితో పరికించిచూచుచుంటిని. పడమట చుక్క (శుక్రుడు) మంచికాంతి కలిగి ప్రకాశించుట చూచజూచ మనస్సున కాహ్లాదము కలుగుచున్నది. వినీలమైన, చంద్రజ్యోత్స్నా ధవళమై, బహు మనోజ్ఞమైన నభోరంగమునుండి, నడిరేయి వినవచ్చు మధురగీతములు సుశ్రావ్యములును, సుస్నిగ్ధములును, పరతత్త్వప్రబోధశీలకములును నై దేవతాచరిత్రాత్మకములైన స్వార్గిక మర్మముల సత్యమును సువ్యక్తముకావించు స్వర్ణకథాజాలప్రదర్శకములై యొప్పుచున్నవి."

ఈ సంవత్సర అధిక భాద్రపద బహుళ అష్టమి. (౮-౯-౩౬) మొదలు నిజభాద్రపద బహుళ అష్టమి. (౮-౧౦-౩౬) వఱకును నగు మాసములో తొలిజామున రాత్రి కాననగు ఖగోళ విశేషములను పరిశీలింతము.

## పాలవెల్లి (The Milky way)

ఈ మాసములో పాలవెల్లి ఈశాన్యమున భృగుపరశు మండలమునుండి, నైరృతిదిశను మూలదిగువవఱకును ఆకాశమునకడ్డుగా కట్టిన ధట్టీవలె వ్యాపించి నభోరంగమును ఇంచుమించుగా సమములై తోచు రెండు ఖండములుగావిభజించుచున్నది. అందలి శ్యామసీమలుపటములో శ్యా ౧, శ్యా ౨ గా చూపబడినవి. అవి ఇంచుమించుగా యామ్యోత్తరరేఖపై నున్నవి. అటనుండి ఛాయాపథము నైరృతిదిక్కునకు వ్యాపించియున్నది. ఈశాన్యమునుండి నైరృతికి వరుసగా గిభృగుపరశు (Perseus), అప్సరస (Cassiopea) రాజహంస (Cygnus), గరుడ (Aquila), ధనువు (Sagittarius) అను నామములు గల చుక్కలగుంపు లందులో కనబడుచున్నవి.

## First Magnitude Stars

మిక్కిలి తేజోవంతములయిన నక్షత్రములు ఇరువదింటిలో ఈమాసమున మనకు ఐదుమాత్రమే కనబడు చున్నవి. అవేవియనగా:—

౧. భూతేశమండలములో స్వాతి (Arcturus in Bootes)

౨. వృశ్చికరాశిలో జ్యేష్ఠ (Antares in Scorpio)

౩. వీణామండలములో బ్రహ్మ (Vega in Lyra.)

౪. గరుడమండలములో శ్రవణము (Altair in Aquila)

౫. ఇంద్రద్యుమ్నుడు Fomalhaut in Pisces Austrialis.)

ఇట్టిచుక్కలింతతక్కువగా నున్నందుకు నభోరమశోభ తక్కువగా నుండవలసినది కాని గ్రహములయొక్క తేజస్సువలన నీలోపము తీరుచున్నది.

పడమట సూర్యాస్తమానము కాగానే శుక్రుడు మంచితేజస్సుతో ప్రకాశించుచు, ఈమాసములో కన్యాతులారాసులలో సంచారము చేయుచున్నాడు. అక్టోబరు మాసారంభమునుండి స్వాతిలో నుండుటను పటములో చూపినాడను. గురుడు జ్యేష్ఠలో ఋజుగతిని సంచరించుచున్నాడు. శని పూర్వాభాద్రలో వక్రగతుడై యున్నాడు. కాబట్టి ఈమాసములో సూర్యాస్తమానమైనప్పటినుండి పడమటినుండి తూర్పునకు వరుసగా (౧) శుక్రుడు, (౨) జ్యేష్ఠ, (౩) గురుడు, (౪) శని ఈగ్రహనక్షత్రములు క్రాంతివృత్తముపై జ్వాలాతోరణమువలె ప్రకాశించుచుండ, ఉత్తరాకాశమున స్వాతి, బ్రహ్మ, శ్రవణ నక్షత్రములును, దక్షిణమున ఇంద్రద్యుమ్నుడును ఆశోభను వృద్ధిచేయుచున్నారు.

## బుధుడు (Planet Mercury.)

ఈ గ్రహము ఒక సెకెనుకాలములో సుమారు ౨౯ మైళ్లు పోవుచుండును. బుధుడు దేవతల వార్తాహరుడని, వేగపురెక్కలుగలవాడని, (Swift winged messenger of the Gcds) అని పాశ్చాత్యగాథలు. తక్కిన గ్రహములవలె ఇతడు స్థైర్యముతో కనబడడు కనుక కొందరీ గ్రహము కొరవిదయ్యమువంటి (Willow-the-wisp of a planet) దనిరి. ఇతడు సూర్యోదయమునకు ముందు రెండుగంటలలో ఉదయించినపుడును, సూర్యాస్తమయమైన రెండుగంటలలో ఉదయించినపుడుతప్ప మరెప్పుడును కనబడడు. ఒకప్పుడు అగ్రగణ్యమైన నక్షత్రమంతకంటె ఎక్కువతేజముతో వెలుగుచు కనబడును (Sometimes he appears brighter than a star of the first magnitude) అప్పుడు ఆగ్రహముయొక్క దృశ్యము మిక్కిలి మనోజ్ఞముగానుండును. (He is a noble object to the naked eye.) సంధ్యాకాలములందే కనబడువాడైనను అరుణకాంతితో, నక్షత్రములవలె మిణుకుమిణుకున మెఱయుచుండును. సాయంకాలమున సూర్యాస్తమానమైనపిమ్మట పడమట చంద్రవంకయు (crescent moon) శుక్రగ్రహము (Venus) ను కలప్పుడు బుధుని ల ల మత్యంతమనోజ్ఞము. అది యీమాసమున లభింపగలదు కావునను అది యీపటమున చూపవలనుకాదు కావునను, ఈమాసములో పడమట బుధుడస్తమించువేళకును, సూర్యాస్తమానముకాగానే పశ్చిమాకాశము గమనింప చదువరులను ప్రార్థించుచున్నాను. (The most delightful picture Mercury makes is, when he sparkles in the evening glow, with a crescent Moon for neighbour and Venus in attendance) ఇట్లు ఆసెప్టెంబరు ౨౮ వఱకు చూడవచ్చును.

## ఉత్తరాకాశమున

ధ్రువక్షితిలో చిన్నఎలుగు (Ursa Minor) తోకచివర ధ్రువుడు మెఱయుచున్నాడు. తోకలో సప్తప్రజాపతియు, మహేంద్రుడును, లోకమూలను అగ్నియు కానవచ్చుచున్నారు. అగ్నికెగువ మిత్రనక్షత్రమును, ఈ రెండింటికిని ఎదురుగా పడమటకు ధాత, విధాత చుక్కలును చూడనగును. వాయవ్యమున, బృహదృక్షములో పులహ, పులస్త్యఋషులు అస్తమించినారు. ఆచతురస్రములో క్రతువు, అత్రి మాత్రము వాయవ్యక్షితిజసమీపమున నగపడుచున్నారు. ధ్రువక్షితిలో ధాత విధాత చుక్కలకెదురుగా, వాయవ్యమున అంగీరస, వసిష్ఠఋషులు కనబడుచున్నారు. వసిష్ఠుని ప్రక్క అతని ధర్మపత్ని అరుంధతీదేవి మిణుకుమనుచున్నది. ఆ దిసువను మరీచిఋషి కలడు. ధ్రువక్షితికిని, సప్తర్షులకును మధ్య నరకుడు ఘోరసర్పాకారముతో మెలికలుతిరుగుచు కానవచ్చుచున్నాడు. ధ్రువునిచుట్టి, కొంతవఱకు ధ్రువక్షితిలోను, కొంత ఆ యెగువను, ఊరువున వసించునదియగు ఊర్వశి, తన ప్రియుడగు పురూరవసుతో పాలవెల్లిలోనికి, సరిగా ఎగువకు వ్యాపించియున్నది. పురూరవసునకు ఎగువ, పాలవెల్లిలో అప్సరసలును, అవల ఈశాన్యక్షితిజమున భృగుపరశుమండలములోని కొన్నిచుక్కలును కనపడుచున్నవి.

## పడమట

చిత్ర అస్తమించినది. తోరణస్తంభములవంటి జతయని శ్రీనాగునిచే వర్ణింపబడిన ఈచుక్కలజతలో చిత్ర కనబడకపోవుటచేత పశ్చిమాకాశము చిన్నవోయియుండవలసినదే. కాని శుక్రుడాలోపము తీర్చుచున్నాడు. లోటు తీర్చుటేకాదు, పడమటి కెక్కువ శోభ కూర్చుచున్నాడని చెప్పవచ్చును. స్వాతికిని పాలవెల్లికిని మధ్య, శేషపాన్పుపై పవ్వళించిన శ్రీమహావిష్ణువు పడమటకు చాలవ్రాలి పరివర్తన మహోత్సవమునకు సంసిద్ధుడగుచున్నాడు. సెప్టెంబరు ౨౮-వ తేదీని పరివర్తనమహోత్సవము. అనగా విష్ణుమూర్తి పడమట అస్తమించి, బోధనైకాదశి (కార్తికశుద్ధ ఏకాదశి)కి తూర్పున నుదయించి నిద్రలేచుటకు ముందు ఒత్తిగిలుచున్నాడు. ఈ ఒత్తిగిలుటయే భాద్రపదశుద్ధ ఏకాదశినాటి పరివర్తనోత్సవమునకు కారణము.

## దక్షిణమున

పశ్చిమసమీప నైరృతిదిశను శుక్రుడు గొప్పతేజముతో కొంతవడి మెఱసి అస్తమించినాడు. ఆపశ్చిమక్షితిజమునకును పాలవెల్లికిని మధ్య, ఇంద్రాగ్నిదైవత్యమై, కులాలచక్రమువంటి ఆకారముగల విశాఖచుక్కలున్నవి. విశాఖకు తూర్పుగా పాలవెల్లిలోనికి వ్యాపించి వృశ్చికరాశి రమ్యముగా కనబడుచున్నది. అనూరాధచుక్కలు డెక్కలుగాను, జ్యేష్ఠచుక్కలు శరీరమధ్యభాగముగాను, మూలచుక్కలు తేలుతోక, కొండెలుగాను స్పష్టముగా నగపడుచున్నవి. ఈ తేలురూపము దక్షిణాకాశమున విశేషభాగమిపు డావరించి చక్కగా కనబడుచున్నది. ఈపాలవెల్లి కావల దక్షిణమున మయూరచిహ్నముపై బాణాసురు డున్నాడు. ఈ చుక్కలకావల, ఆగ్నేయమున, ఇంద్రద్యుమ్న మహారాజు 'విష్ణురూపుడగుచు' దివ్యతేజముతో మెఱయుచున్నాడు. అతని పేరు భూమిమీద స్థిరముగా నుండునట్లు దేవతలకు ఋజువిచ్చిన యుగంధరకమఠమును, ఆకమఠము జాడ తెలిపిన ప్రావారకర్ణఘూకము (Phaenix) ను, ఈఘూకము నెరింగించిన నాళీకజంఘ మను బకమును బాగుగా ఉదయించినవి.

## మధ్యను

గురుడు జ్యేష్ఠచుక్కలకెదురుగా పాలవెల్లిలో ఛాయాపథసమీపమున మెఱయుచున్నాడు. ఉత్తరాషాఢా, పూర్వాషాఢానక్షత్రములు రెండు రెండువంకరమంచపుకోళ్లవలె మెఱయుచున్నవి. ధన్వి మన్మథుడేనని మన మీవఱకు తెలిసికొంటిమి. అతడే కృష్ణావతారమున ప్రద్యుమ్నుడయ్యెను. ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు బాణాసురునిపుత్రికయగు ఉషాకన్యకు ప్రియుడయ్యెను. ఉషాపరిణయకథ ఈచుక్కలను చూచినపుడు జ్ఞప్తికి రాగలదు. ఉషాకన్యతండ్రియగు బాణాసురు డాదిగువనే కలడు. జ్యేష్ఠనక్షత్రమున కధిదేవత ఇంద్రుడు. ఇంద్రుడును, విష్ణువును సోదరులగుటయును, విష్ణువునకు నాభికమలసంజాతుడు బ్రహ్మయొకడును, పుష్పబాణుడు ధన్వియొకడును పుత్రులగుట కూడ చక్కగా స్ఫురించుచున్నది.

మన్మథుడు మకరధ్వజుడు కదా? ఉత్తరాషాఢకెగువ మకరమీయంశమును స్థిరపఱుచుచున్నది. శ్రవణము గరుడుడై విష్ణువునకు వాహనము, ధ్వజమునై యొప్పుచున్నది. వీణాపాణియైన సరస్వతిని ముఖమందు ధరించిన బ్రహ్మకు వాహనమైన రాజహంస పాలసంద్రములోనే ఉన్నది. మకరమున కెగువ కుంభమున్నది. కుంభము జలస్థానము. దాని కధిపతి వరుణుడు. వరుణునకు వాహనము మకరము.

## తూర్పున

అశ్వినిచుక్కలు ఇప్పుడే ఉదయించినవి. అశ్వినులు రథమెక్కినపుడు వారిరథమున కొకప్రక్క వాహనముగా పూన్చబడినట్లు ఋగ్వేదములో వర్ణింపబడిన శింశుమారము కొంత ఉదయించినది. ఈశాన్యమున గ్రుస్తమిం(?)కరించుకొనుచు పులోమకక్కసుడు ఇప్పుడే ఉదయించినాడు. పులోమ బాధితయైన గర్భవతి భృగుపత్నికి గర్భచ్యుతిచే కలిగిన చ్యవనుడు సుకన్యాఖ్యానము జ్ఞప్తికి తెచ్చుచు అశ్వినులప్రక్క నున్నాడు. చ్యవనుడు ఇంద్రమదహర్త. అతని మాతకు ప్రస్వనామము ఇంద్రమద. వీరికెగువ, పేద్వఘూర్ణ్యములో (పెగసస్ చతురస్రమదే) పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రము లున్నవి. పేద్వఘూర్ణ్యమున కెగువను, అశ్వినికిదిగువను మీనరాశి కలదు మీనరాశిలో రెండుచేపలున్నవి. "మత్స్యద్వయం చేతి" మీనరాశి పరిసరమున గల గుంపులను, మీనరాశిలోగల చుక్కలను వివరముగా చూపు నక్షత్రపట మొకటి ఈ ప్రక్కను వ్రాయబడినది (చూ. చిత్రము ౨) ఈచిత్రములో మధ్యనున్నది మీనరాశి. ఇందు కుడిదిట్టు (౧) చేపయును, ఎడమదిట్టుమీదుగా చేప (౨) యును కలవు. ౧వ చేపలో Pisces అనురాశిలోడి, ౧౯ లాంబ్డా, కప్పా, గామా, బి, తీటా మొదలగు గుర్తులుగల చుక్కలు చేరియున్నవి. పటములో ఇది పేద్వఘూర్ణ్యముక్రింద నున్నది. ౨వ చేపలో ఆరాశిలోని

పై ౧-౨-౩, సిగ్మా, తీటా, ఎప్సిలాన్, ఈటా, నర్తులుగలచుక్క లున్నవి. ఈ రెండుచేపలను కలుపు ధారము (Ribbon) రేకసూత్రము అనునట్లు కొన్ని చుక్కలు చక్కగా కనబడుచున్నవి. మీదిచేప (౨)లో ఈటానర్తుగల చుక్క దిగువనుండి ఈ సూత్రముపై- ౭, ఆల్ఫా, క్సై, న్యూ, మ్యూ, తీటా, ఎప్సిలాన్ చుక్కలమీదుగా మొదటిచేపను పైపైం ౨౨ అనునర్తు గలచోట తగులుచున్నది. ఈ సూత్రములో ఎడమచేతి ప్రక్క దిగువమూలనున్న ఆల్ఫాచుక్క ముఖ్యముగా గమనింపవలయును. ఈ రెండుచేపల సూత్రములను ఈమూలచుక్కకడ ముడివేసినట్లు తోచగలదు. కావున ఈ చుక్కను అరబ్బులు అల్ రిశ్చా ముడి (Al Rischa-Knot) అని చెప్పెదరు. ఈయంశమునే అరబ్బులకు పూర్వము బహుకాలముక్రిందట, ఇప్పటికి సుమారు రెండువేల సంవత్సరములక్రిందట నుండిన ఆరేటస్ (Aratus) అను గ్రీకు సిద్ధాంతికవి ఈ క్రింది పంక్తులలో చక్కగా వర్ణించియున్నాడు.

"West ward and South ward in the South Winds' path the fishes float; one ever uppermost.

First hears the boisterous coming of the North;

Both are tide by a band;

Round their tails which point to an angle.

Flled by a single goodly star.

Called the conjoiner of the fishes tails."

దక్షిణదిశనుండి వీచు గాలియొక్క మార్గమునకు పడమటను, దక్షిణమునను మీనరాశిలోని చేపలు రెండును తేలియాడుచుండును. అందొకటి మీదికి (అనగా ఉత్తరమునకు) తేలియుండి, ఉత్తరదిశనుండి వచ్చు వాయుధ్వనులను ముందు వినగలదు. రెండుచేపలకు సంపర్కము కలుపు దారపుపట్టె ఒకటి ఉన్నది. ఒకొక్క చేపయొక్కతోక 'చివరను కట్టబడిన' యీ దారపుపట్టె, మూలనున్న ఒకమంచిచుక్కకడ, ముడిపడినట్లు తోచుటచేత ఈమూలచుక్క అనుముడికలన ఆచేపలతోకలకు కట్టబడిన దారపుపట్టెలకు సంబంధము కలుగుచున్నది. దీనినే ముడిచుక్క అందురు.

## ఈ చేపలనుగూర్చిన గ్రీకు గాథ

టైఫన్ (Typhon) అనునొక క్రూరరాక్షసు డుండెను. ఆరాక్షసునికి జడిచి వీనస్ (Venus) అను సౌందర్య దేవతయు, ఆమెకుమారుడు (Cupid) క్యూపిడ్- అను ప్రేమకారకుడైనదేవతయును చేపలై యుండిరి. అందుచేతనే ఈ చుక్కలకు వీనస్-క్యూపిడ్ చుక్కలని పేరుండెను.

## ఇట్టిదే భాగవతములో కథ

ఈశ్వరుని కంటి మంటలలోపడి దగ్ధుడైన మన్మథుడు దేహలబ్ధికొఱకు పరమేశ్వరుని వరము పొంది, రుక్మిణికి కుమారుడై జన్మించెను. ఆశిశువు సూతికాగృహమున నుండగా శంబరుడనురక్కసుడు తనకు వానివలన చావు రానున్నదని తెలిసికొని ఆ శిశువును ఎత్తుకొని పోయి సముద్రములో పడవైచెను. ఒకచేప ఆశిశువును మ్రింగెను. జాలరు లాచేపను పట్టి శంబరునికి కానుక ఇచ్చిరి. ఆచేపను కోసి చూడగా కడుపులో నీఅర్భకుడుండెను. ఆసంగతి తెలిసి మన్మథునిభార్య రతీదేవి మాయావతియను పేరుతో శంబరునికడ కరిగి, ఆశిశువును పెంచెద నిమ్మని వేడెను. శంబరు డామె కోరినట్లు చేసెను. బాలకుడు పెరిగి పెద్దవాడయ్యెను. మన్మథుని అవతార మగుటచే ఆబాలుడు "చక్కని వారల చక్కదనము మిట్టిదని ఉపమింప తగిన" సౌందర్య రూపముతో పెరుగుచుండెను. మాయావతి అతనివలన మిథున గర్భము నభిలషించెను. కుమారుడు కోపించి (భాగ-దశ-ఉత్తర ౧౨)

"నాతనూభవు డితడంచును నానయించుక లేక యోమాత నీ విదియేమి నేడిటు మాతృభావము మానిసంప్రీతి కామినిభంగి చేసెదు పెక్కు విభ్రమములన్...... ...ధర్మముకాదు...మోహము సేయఁతగ"మని గర్జించెను. అపు డామె పూర్వజన్మమున మన్మథుడైన అతనికి తాను

భార్యవని తెలిపి శంబరుని దౌర్జన్య మెరిగించి వానిం జంపుమనెను. అత డారాత్ముని సంహరించి రతీసహితుడై ద్వారక కరిగి రుక్మిణీకృష్ణుల ముద్దుకుమారుడై యుండెను.

పాశ్చాత్యుల Cupid దేవతకును, మన మన్మథునికిని వ్యాపార మొక్కటే- మగలను మగువలను మరులుకొల్పుటే! నిజమునకో, లోకనటనకో, కొంత కాలము వార లుభయులును తల్లికొడుకుల ట్లుండుటయు రెండు కథలకును సామాన్యముగా నగపడుచున్నది. ఈ సామాన్యవిషయము లాశ్చర్యకరముగా నున్నవి.

## విశేష విషయములు

పెగసస్ చతురస్రములో నాలుగుచుక్కలున్నవి. అందు ఆల్ఫాపెగసస్-బీటాపెగసస్ అను గుర్తులుగల రెండు చుక్కలును పూర్వాభాద్ర నక్షత్రములు. ఇవి రెండును మనపటములో మన కుడికిట్టున ఉన్నవి. గామా పెగసస్ ఆల్ఫా (Andromeda) ఇంద్రమదచుక్కలు రెండును చేరి మన ఉత్తరాభాద్రనక్షత్రము. ఉత్తరాభాద్రనక్షత్రములను కలిపి దిగువకు గీసిన సరళరేఖ సరిగా క్రాంతిరేఖయు, విషువద్రేఖయు కలియు చోటనే వాటిని కలిసి దిగువకుపోవును. ఈమూడురేఖలు కలియుచోటనే విషువద్బిందువున్నది. సూర్యు డీబిందువు కడ నున్నట్లు కనబడిన రోజుననే వసంతఋతువున విషువత్పుణ్యకాలము (Spring Equinox) అగును. దీని పిమ్మట అర్ధసంవత్సరమునకు Autumnal Equinox అందురు. మనదేశకాలమానముబట్టి దానిని వర్షములేక శరత్కాలపు విషువత్పుణ్యకాలము అనవచ్చును. అదియు సెప్టెంబరు నెల ౨౨ తేదీని సంభవించును.

## శతభిష నక్షత్రము

కుంభరాశిలో (Aquarius) లాంబ్డా గుర్తుగల చుక్క మన శతభిషమను నక్షత్రము.

## జీటాపిస్కం

క్రాంతివృత్తముపైనిమీనరాశిలో 'జీటాపిస్కం' అనుచిన్న చుక్క ఒకటి చూడనగును. ఇది రెండుచేపల మధ్యసూత్రమును క్రాంతివృత్తమును కలియు చోటనే ఉన్నది. ఇది చూచుటకు చాలచిన్నచుక్క అయినను కొంతకాలముక్రిందట విషువద్బిందువు ఇక్కడనే ఉండెడిది. కాలక్రమమున నీబిందువు వెనుకకు జరిగి ఇపుడుత్తరాభాద్రలోనికి వచ్చినది. విషువద్బిందు విట్లు చలించి వెనుకకు పోవుటకు ఇంగ్లీషులో Precession of Equinox అందురు.

సెప్టెంబరు ౨౨- * గుర్తుగలచోటనుండి ఈనెల ౨౨ తేదీని ఉల్కాపాతము కనబడును.

అక్టోబరు ౧౧ తేదీని * ఈ గుర్తుగల చోటనుండి ఉల్కాపాత మగపడును.

రెండవ పటములో * గుర్తుగల చుక్కలన్నియు కాంతిసంపద మారుచుండు స్వభావము కలిగియుండును. అనగా ఎల్లప్పుడును ఒక్కమోస్తరు తేజస్సుతో కానరాక కాంతియందు వృద్ధిక్షయములతో కానవచ్చును. ఇట్టి చుక్కలకు (Variable Stars) కాంతి మారుచుండు చుక్కలని పేరు కలదు. ఇట్లు మారుచుండు కాంతిగలచుక్క లన్నిటిలో నగ్రగణ్యమైనది (Mira Ceti) మైరాసెటి అందురు. ఓమిక్రన్ గుర్తుతో ఈచుక్క శింశుమారము (Cetus) రాశిలో చూడవచ్చును.

# చెంజిదుర్గము



[దుర్గముయొక్క ప్రథమ ప్రాకారమునందలి ప్రధానద్వారప్రాంతము: ఎడమవైపున ప్రాకారముయొక్క గోడ: కుడివైపున రాతిగోడ కావలకందకమున్నది. ఎదుటిఎత్తుగోడలకు వెనుక మందుగుండు సామానులకొట్టు.]

చెంజిదుర్గము అతి పురాతనమయిన పర్వతదుర్గము. దీని పుట్టుకపూర్వోత్తరములు సరిగా తెలియరావు. ఇది త్రిభుజాకారమున నున్నది. ఇందు మూడుమూలలను మూడు కొండ లున్నవి. తూర్పున కృష్ణగిరి, దక్షిణమున చాంద్రాయన దుర్గము, పడమర రాజగిరి. అన్నింటను రాజగిరి మిక్కిలి ఎత్తయినది; సులువుగా ఎక్కుటకు వీలుకానిది. ఈకొండల యుపరిప్రదేశమునకోటలు కట్టబడినవి. ఈదుర్గము వెలుపలనుండు దృఢమయిన రాతిగోడ ౬౦ అడుగుల మందముగలది. ఆగోడ నానుకొని దానిచుట్టును ౮౦ అడుగుల వెడల్పుగల కందకమున్నది. ఇట్టిదుర్గము మూడుమైళ్ళమేర వ్యాపించియున్నది. మూడుకొండలచుట్టును మీది కెగబ్రాకు బలమైన రాతిగోడ లున్నవి. వానియందు దృఢమైన బురుజులు, వానిలో శత్రువులమీద ప్రేల్చుటకయి ఫిరంగులను, తుపాకులను ఉంచుట కనువయిన కన్నములు నున్నవి. ఈగోడల పొడవు మించుమించు ౧౨ వేల గజములుండునని యంచనా వేయబడెను. ఈదుర్గమున కోటకిని నిలిచియున్న పెద్దపెద్ద ధాన్యపుకొట్టులు, నూనె, నేయి మొదలగువానిని నిలువచేయుటకు కుండులు, ఎన్నడును నీరు వట్టిపోవని జలాశయములు, ఎడతెగక యూటల నెగజిమ్ము నీటిబుగ్గలు మొదలయిన నిర్మాణసౌకర్యములు నీదుర్గము వెనుకటికాలమున సకలసంపత్సమృద్ధముగను, స్వయంపరిపూర్ణముగను, శత్రుజనదుర్భేద్యముగను ఉండెననుటను ప్రకటించు

చున్నవి. ప్రాచీనుల దుర్గనిర్మాణకౌశలమున కిది సాటి లేని నిదర్శనము.

ఈ దుర్గముయొక్క నిర్మాణమును గూర్చినగాథ యొకటి పురాణములం దిట్లు కలదు: శూరశర్మ యను కాశీరాజొకడు సంతానములేమిని రాజ్యమును పరిత్యజించి చెంజికి వచ్చి యచట తపముచేయుగా నతనికి సంతతి కలిగెనట. అంత నాతడు చెంజియందు రాజధానిని నెలకొలిపి దేవాలయమును, కోటను కట్టించినాడట. పదునెనిమిదవశతాబ్ది ప్రారంభమున చెంజిని పాలించి స్వాతంత్ర్యముకొరకు పోరాడి ప్రాణములను విడిచిన వీరశిఖామణి దేశింగురాజు ఈ శూరశర్మవంశమున నిరువది మూడవతరము వాడట.

౧౭౬౮-వ సంవత్సరమున రచింపబడిన చరిత్ర ఈ దుర్గమువిషయము నిట్లు పేర్కొనుచున్నది. శివాజీ పూర్వులగు మహారాష్ట్రరాజుల కిది రాజధానిగా నుండెను. వీరిరాజ్యము చెంజినుండి తంజావూరువరకు వ్యాపించియుండినది. కాని దుర్గనిర్మాణకాలముమాత్రము తెలియరాదు. ఈ దుర్గమును విజయనగరరాజులు పదునాల్గవ శతాబ్దిచివర స్వాధీనముచేసికొనిరని యేర్పడుటవలన దీనినిర్మాణ మంతకుపూర్వమే జరిగియుండవలెనని స్పష్టమగుచున్నది. అంతేకాదు; దుర్గమునందలి ప్రధానములయిన కట్టడములన్నియు విజయనగరరాజుల చేతనే కట్టబడినవి. హంపియందలి నిర్మాణముల నవి సరిగా పోలియుండుటయేకాక అట్టి గొప్పనిర్మాణములను నెలయించుటకు తగినంతదీర్ఘకాలము అది వారి చేతిక్రిందనే యుండినది. వారి తరువాత మహారాష్ట్రులు, ముసల్మానులు, ఫరాసులు క్రమముగా నీదుర్గమును పాలించిరి. వారును దుర్గమునోడలు మొదలగు వానిని కొన్నింటిని కట్టించి కోటలను బలపరిచిరి. ఈ చెంజికోట శిథిలావశేషములను వర్ణించుటకు పూర్వము దీని కింత ప్రసిద్ధిని సమకూర్చిన చారిత్రకవిశేషముల నిట సంగ్రహముగ పేర్కొను టప్రస్తుతము కాదు.

విజయనగరరాజుల కాలమున మధుర, తంజావూరు రాష్ట్రములవలె చెంజియు వారి యధీనమున నుండెను. వారి ప్రతినిధియొక్కడు దుర్గమునందుండి రాష్ట్రపాలనకార్యములను నిర్వహించుచుండెను. తలికోట యుద్ధముతో విజయనగరరాజ్య మంతరింపగా అప్రతినిధి స్వాతంత్ర్యమును ప్రకటించెను. తరువాత నొక శతాబ్దికాలము అతని సంతతివారే దీనిని పాలించిరి. అవల ౧౬౪౮-వ సంవత్సరమున గోలకొండనవాబు దీనిని స్వాధీనపరుచుకొనెను. ౧౬౭౭-వ సంవత్సరమున నాతని యధీనమునుండి దీనిని శివాజి వశపరుచుకొనెను. అతడు తన యధీనమున నిదియున్నకాలమున చెంజి చుట్టును ప్రాకారములను, కందకములను, బురుజులను విశేషముగ పెంచి దుర్గమును దృఢతరము చేసెను. శివాజి మరణించిన తరువాత అతని కుమారుడు రాజారాము, ఔరంగజేబు వెంటాడి తరుముకొనిరాగా చెంజికోటలో తలదాచుకొనెను. అది మొదలు విరిగిన మహారాష్ట్ర సేనలన్నియు నిందే తలదాచుకొనుచుండెడివి. ఏవిధమునననైన ఔరంగజేబు చెంజిని లోబరుచుకొనవలెనని పట్టుపట్టెను. దీనితో మహారాష్ట్రుల యుద్యమ మడుగంటిపోవుటయేకాక, తన సామ్రాజ్యము దక్షిణప్రాంతముల, తనయేలుబడి దృఢముగ నెలకొని ప్రశాంతముగ నెలయగలదని యతడు తలచెను. ఈ తలంపుతో ముట్టడి ప్రారంభమయినది. కాని మొగలు సేనాపతి జుల్ఫికర్ ఖాను దక్షిణప్రాంతమున తా నొక స్వతంత్రరాజ్యమును నెలకొలుప నెంచి లోలోపల కుతంత్రములను పన్నుచు ముట్టడిని ఏడేండ్లు- ౧౬౯౧ మొదలు ౧౬౯౮ వరకు-కాలము జరిపెను. చివరకు రాజారాము సకుటుంబముగ చెంజినివదలి అప్పటికి తన స్వాధీనమున నుండిన వెల్లూరికి పారిపోయెను. అంతట చెంజి మొగలులచేజిక్కిపోయినది. ఆప్రదేశము రోగభూయిష్ఠమగుటచే రాజధాని కది తగదని తెలిసికొని మొగలులు ఆర్కాడును రాజధానిని చేసికొని సరూపసింగు అను రాజపుత్రరాజకుమారుని చెంజి కధిపతిగ నియమించిరి. అతని యనంతరము "దేశింగు" అని ఖ్యాతిగనిన అతనికుమారుడు తేజసింగు ఆధిపత్యము వహించెను. కాని ఆర్కాడు నవాబునకు లొంగియుండుట కిష్టపడక అతడు తిరుగబడెను. అప్పటినవాబు సాదతుల్లాఖాను కుపితుడై

దేశింగుమీది కత్తిదచ్చెను. చెంజికి కొలదిమైళ్ల దూరమున దేశింగునకును ఆతనికిని యుద్ధము జరిగినది. ఆ యుద్ధమున దేశింగు హతుడయ్యెను. మరల చెంజి ముసల్మానుల వశమయినది. ఈ యుద్ధము వృత్తాంతము తెలుగునను, తమిళమునను వీరకరుణరసములు నిండారిన గేయకావ్యముగా రచియింపబడి నేటికిని గ్రామములయందు, నగరములందు జంగములు మొదలగువారిచే పాడబడుచున్నది. ఉత్తరాంధ్రమున గేయరూపమున వెలసిన బొబ్బిలివీరుల యుద్ధగాథవలె నిది దక్షిణాంధ్రమున ప్రసిద్ధిగనినది. ఇందు దేశింగు క్రొత్తపెండ్లికూతురగు తనభార్యయొద్ద యుద్ధమున కనుమతిని పొందు పట్టు కరుణరసమును జాలువారజేయుచుండును. "దేశింగు"కు పెండ్లి అయినది. కాని కులగురువు భార్యమొగమును అదిమొదలుకొని మూడునెలలవరకు జూడవలదని అతనిని నిషేధించెను. ఇంతలో యుద్ధము సంప్రాప్తమయినది. యుద్ధమునకు బోవుటకయి భార్యఅనుమతిని గొనుటకు దేశింగు అంతఃపురమునకు పోయెను. భార్యకును దనకును నడుమ తెర నుంచుకొని యామెఅనుమతిని కోరెను. ఆమెయొద్దనుండి అనుజ్ఞాతాంబూలమును గ్రహించుటకు తనచేతిని దేశింగు తెరలోనికి పోనిచ్చెను. అతిసుందరముగనున్న తన మగనిచేతిని గని "చేయియింత సుందరముగనున్నది. మొగము ఇంక నెంత సుందరముగ నుండునోకదా! చూచిఅయిన ఆనందింప నోచుకొననయితినే" అని ఆమె కడుంగడు దుఃఖించెను. ఆదుఃఖాశ్రువు లొకటిరెండు ఆతని చేతిపయి బడెను. తాంబూలమును గ్రహించి దేశింగు చేతినీవలకు దీసికొని దుఃఖాశ్రువులచే తడిసిన దానినిగాంచెను. అంత ఆతనికిని మనసుకరగి పట్టరానిదుఃఖము వచ్చెను. ఎట్లయినను చివరకు ఆమె రాజపుత్రరమణి కావున రాజపుత్రవీరుల కుచితమగు విధమున ప్రవర్తింపవలెనని మగనిని వీడ్కొల్పినది. ఆమె రణనిహతుడయిన మగనిశవమును చెంజికి దెప్పించి దానితో తాను సహగమనము చేసినది. నబాబు సాదతుల్లాఖాను ఆమె ధైర్యస్థైర్యములకు మిక్కిలి అచ్చెరువుపడి, ఆమెపేరు శాశ్వతముగ నుంచగోరి పతివ్రతచిహ్నముగ నాపేరుత నొక నగరమును నిర్మించెను. ఆనగరమే 'రాణిపేట' అనుపేరున నేటికిని పిలువబడుచుండునది.

అనంతరము ౧౭౫౦-వ సంవత్సరమున డూప్లెక్సు ఫ్రెంచిగవర్నరు-ఫ్రెంచిసేనలతో ధైర్యశాలియగు బుసీని చెంజిదుర్గమును ముట్టడింప బంపెను. ఫ్రెంచిసేనలు ఏకాయెకిని ఒక్కరాత్రి తెల్లవారులోపల దుర్గమును స్వాధీనపరచుకొనగలిగిరి. ఆయా ద్వారములయొద్దనున్న రక్షకసేనలను సద్దుచప్పుడులేకుండ కత్తివాత బెట్టుచు ఏకకాలముననే మూడుకొండలను ఎగబ్రాకి కోటలను పట్టుకొనిరి. ఇట్లు ఫ్రెంచిసేనలుచూపిన ధైర్యసాహసములు, తంత్రము అత్యద్భుతములని చరిత్ర ఘోషించుచున్నది. "పగటివేళయయినచో దుర్గమునందలి సేనలు ఫ్రెంచిముట్టడిని తుదముట్టించియుండెడివి. రాత్రివేళయగుటచే భయభ్రాంతులచేత నేమియుదోచనివారయి లోనిసైనికులు ఫ్రెంచివారి యాక్రమణమును నివారింప జాలకపోయిరి." అని యాచరిత్రయే చెప్పుచున్నది. దక్షిణదేశమున చెంజి అసాధ్యమయిన దుర్గముగ పేరుగన్నది. కావున దీని నాక్రమించుటవలన ఫ్రెంచివారి శౌర్యపరాక్రమములు మరింత ప్రసిద్ధినిగనినవి.

౧౭౫౨వ సంవత్సరమున ఇంగ్లీషువారు చెంజిని ఆక్రమించుకొనప్రయత్నించిరి. కాని వారిప్రయత్నము విఫలమయినది. మరల కొన్నేండ్లకుతరువాత ప్రయత్నముచేసిరి. అది ఐయర్‌కూటు పుదుచేరి ముట్టడించియున్న సమయము. చెంజినుండి ఆహారపదార్థములు పుదుచ్చేరికి రాకుండనుండుటకయి స్మిత్తుదొర చెంజిని ముట్టడించియుండెను. పుదుచ్చేరి ఇంగ్లీషువారికి చిక్కిపోయినది. వెంటనే స్మిత్తు తనకు లొంగిపోవలసినదని చెంజిరక్షకులకు వార్త పంపెను. ఫ్రెంచిసేనాని అందు కంగీకరింపక 'లక్షసైన్యమున్నను మీకు ఈ దుర్గమునాక్రమించుటకు మూడేండ్లకాలముపట్టును' అని జబాబుపంపెను. ఇక స్మిత్తు కోటనాక్రమించుకొనుటకు అనేకవిధములయిన యుపాయములను పన్నెను. అతని యుపాయములన్నియు విఫలములయిపోయెను. ఎటు చూచినను దుర్గములోనికి ప్రవేశమయినను దొరకకుట

సాధ్యముకాకుండెను. చివరకు సగమురాత్రివేళ ఎట్లో తోలిద్వారములోనికి ప్రవేశించి తెల్లవారువరకు వేచి యుండెను. ఆనాడంతయు కొండమీదినుండి ఫిరంగులుకురియు నగ్నివర్షమునకు ఇంగ్లీషుసేనలు గురియాయి యుండిరి. ప్రొద్దుగూకి చీకటిపడినతర్వాత జమేదారొకడు చంద్రాయనదుర్గముమీదికోటకు రహస్య ద్వారమున ఇంగ్లీషుసేనలను కొనిపోయెను. అక్కడనున్న ఫ్రెంచిసేనలను తరిమినైచి ఇంగ్లీషువారు దాని నాక్రమించుకొనిరి. కాని తక్కిన రెండుకొండలకోటలనులోబరచుకొను నుపాయము కానక వానిని ముట్టడించి యుండిరి. ఈముట్టడి రెండునెలలు సాగినతర్వాత ఫ్రెంచిసేనాని తనకును, తన సేనలకును ఎట్టి అపాయమును గలిగింపక విడిచిపుచ్చునెడల వానిని స్వాధీనపరచెదననెను. అట్లే ౧౭౬౧-వ సం॥ము ఏప్రిల్ నెల ౫-వ తేదిసాయంకాలమున ఫ్రెంచిసేనలు కోటలను వదలిపెట్టిపోయినవి.

తరువాత హైదరు, దక్షిణ దండయాత్రలలో, ఇంగ్లీషువారిని వెడలగొట్టి, తానాదుర్గము నాక్రమించుకొనెను. అప్పు డక్కడనుండిన ఇంగ్లీషుసేనాని బందీచేయబడి శ్రీరంగపట్టణమునకు పంపబడెనట. చివరకు అతడు కట్టుబట్టలైన లేకుండ అక్కడనుండి తరిమివేయబడెనట. టిప్పు పరాజయము తర్వాత నది మరల ఇంగ్లీషువారి యధీనమయి అదిమొదలుకొని వారిక్రిందనే యున్నది. అంతదిట్టమయినదుర్గము ఫ్రెంచివారిదగు పుదుచ్చేరి సమీపమున నుండుట అపాయకరమని తలచి దానిని పూర్తిగా ధ్వంసముచేసివేయవలసినదని జిల్లా కలెక్టరు ౧౦౮౩-వ సంవత్సరమున సలహాయిచ్చెను. కాని అది కార్యరూపమును పొందినదికాదు.

చెంజిదుర్గము తిండివనము (S. I. R.) రైలు స్టేషనుకు ౧౫ మైళ్ళ దూరమున దక్షిణార్కాడుజిల్లాలో నున్నది. అక్కడకు తిండివనమునుండి తిరువణ్ణామలకు పోవురోడ్డున మోటారుబస్సులో పోవలెను. ఈరోడ్డు దుర్గమువెలుపలిప్రాకారములనుభేదించుకొనిరాజగిరికృష్ణగిరులనడుమను పోవుచున్నది. దీనిని చూడబోవువారు సామాన్యముగ దక్షిణద్వారమున వెలుపలి ప్రాకారములోనికి ప్రవేశించి రాజగిరికి పోవు రెండవద్వారము నెదుటికిపోయిచేరుదురు దుర్గముయొక్క అతిమాత్రప్రమాణమును, శత్రువులు దానిని ముట్టడించునపు డెదుర్కొనవలసిన యపాయములను చక్కగా తెలిసికొనవలెననిన దుర్గమునకు దక్షిణమున నొకమైలుదూరమున నున్న చెంజిగ్రామమునొద్ద నుండి నడిచిపోవుట మంచిది. చెంజినుండి కాలిత్రోవ దుర్గముయొక్క వెలుపలి ప్రాకారము ప్రక్కనున్న మందుగుండుసామానుల కొట్టు (Royal Battery) దగ్గరకు పోవును. దానికి పడుమట కొన్నిగజములదూరమున నవీననిర్మాణము (ఫ్రెంచివారిదికావచ్చును) లనదగిన రెండుద్వారములగుండ పోగా పహారాజవాను లుండుటకు ఇటుకతో కట్టినగుడిసెయొకటి కనుపించును. అక్కడనుండి ఒకవైపున కోటగోడ, ఇంకొకవైపున లోతయిన కందకము గలరోడ్డునూరు గజములదూరము పడుమటికిసాగి దక్షిణమునకు తిరుగును. అక్కడ కరఘర్లాంగుదూరముననే మొదటిద్వారములోనికి ప్రవేశము. దీనిని పుదుచ్చేరిద్వార మందురు. దార్ఢ్యమును, నిర్మాణవిధానమును బట్టి ఇది ప్రాచీనమని తోచును.

ద్వారముకడ ప్రాకారమునంటి కమానువంపు గోడకలదు. ఆగోడ ఉత్తరపుదిక్కున ప్రాకారముతో కలియుచోట ఒకఇరుకయినత్రోవ కలదు. అది తిన్నగా లోపల అర్ధవర్తులాకారముననున్న ఆవరణలోనికి పోవును. దానిలోనుండి మొదటిదానికి సమకోణప్రదేశమున నింకొకత్రోవ ప్రహరిగోడగుండా కోటలోనికి పోవును. ఈత్రోవ ముప్పదిఅడుగులపొడవుగలది. అనగా కోటలోనికి మొదటిద్వారమున ప్రవేశించి, ఆవరణలోనికిపోయి అక్కడనుండి రెండవద్వారముగుండ కోటలోనికి ప్రవేశించవలయుననుట. ఈ రెండుమార్గములును చాలయిరుకుగా నుండును. దానివెడలుపు ౫ అడుగులు. ఎత్తు ౭ అడుగులు. అందుచేకకాలమున నొకరిద్దరు మాత్రము కాలినడకను పోవచ్చును. మొదటిత్రోవలో, నేలమట్టమున కొంత మీదుగ నాలుగు మూలలు తీర్చినద్వారములు రెండు రెండువైపుల ప్రక్కకొక్కటివంతున నున్నవి. గోడలకావలి (లోపల) వైపునుండియు వీనిలోనికి మార్గముకలదు. వీనియం దొక



చెంజిదుర్గము :
పుదుచ్చేరి ద్వార
ము లోవైపు రెండు
వైపుల రహస్య
ద్వారము లున్నవి.



రాజగిరి దుర్గ
మీద కట్టువం



రాజగిరి దుర్గము
మీద పెద్ద ఫిరంగి.



రాజగిరి దుర్గము
ధాన్యపుకొట్టు



రాజగిరి దుర్గము
రంగనాథాలయము



రాజగిరి దుర్గము
మీద ఖజానా
కొట్టు

మరిప్రాంచియుండిశత్రువులులోనికి ప్రవేశించునపుడు వారిని కత్తితో నరికి చంపివేయుటకని యీ ద్వారము లుంచబడియుండును. ఈ ద్వారమున ముందున్నవాడు పడిపోయినయెడల వెనుకనుండి యింకొకడు ముందుకు వచ్చి శత్రుసంహారము చేయవచ్చును. ౨౦ అడుగుల పొడవుగల రెండవమార్గమునను అట్టివే చిన్నవి ౧౫ అ. వెడల్పు ౨౫ అ. పొడవుగల ద్వారములున్నవి. ప్రహరి గోడలోనున్న గదులలోనుండి వీనిలోనికి రావలెను. ఈ గదులలోనికి కోటలోపలనుండి ప్రవేశించవలెను. ఈ చిన్నద్వారములు నేలమట్టమునకు ౫ అడుగులఎత్తున నున్నవి. గదులలోపల వీనియొద్ద నిలుచుండి కత్తి విసరి లోనికి పోవు శత్రువులను నరికివేయవచ్చును. అర్ధవర్తులాకారమున నున్న గోడలో రహస్యమార్గమొకటి గోడ పొడుగునను గలదు. అందు చిన్న చిన్న రంధ్రములున్నవి. వానిలో తుపాకులనుంచి మొదటిమార్గమును గడచి ఆవరణలోనికి వచ్చిన శత్రువులను రెండవమార్గము ప్రవేశింపకపూర్వమే కాల్చి చంపివేయవచ్చును. ఇట్లుండుటవలన శత్రువు మొదటిమార్గమున నడుముక్రిందిభాగమున దగులు కత్తివేటులను తరువాతిదగు, ఆవరణలో మీదినుండి వచ్చి నెత్తిపయినిపడు తుపాకిగుండ్లను, రెండవద్వారమున కుస్తుక నుత్తరించు కత్తిదెబ్బలను తప్పించుకొననగాని కోటలోనికి ప్రవేశించుటకు వీలులేదు.

మొదటిద్వారమును దాటి తిన్నగా పడమటికి పోయిన రెండవద్వారము వచ్చును. దానిని దాటిన నిక కోటలోపల ప్రవేశించినట్లే. ఈద్వారమునకు 'శైలు'అని పేరు గలదు. అదియొక పెద్ద దీర్ఘచతురస్రము ఆకారమునసున్నది; దానిలో ననేకద్వారములున్నవి. అవి యొకటికొకటి తిన్నగా ఎదుటనుండవు. త్రోవ మెలికలు దిరిగియుండును. సులువుగా ఫిరంగులతో బ్రద్దలు చేయరాకుండుటకయి యీద్వారమిట్లు నిర్మింపబడియుండవచ్చును. దీనిని దాటిన తర్వాత త్రోవ అవల నున్న యింకొకసామాన్యద్వారముకడకు పోవును. ఆత్రోవ చివరకు 'రాజగిరి' కొండక్రిందికి చేరును.

దుర్గమమగు ఈదుర్గమున 'రాజగిరి' అత్యంతము దుర్గమమయినభాగము. దీనియెత్తు రమారమి ౮౦౦ అడుగులు. ఇది ఉత్తరమున తిన్నగా నిట్టనిలువున నుండును. దక్షిణమున కొండకొమ్మొకటి ముందునకు మింపుగ వచ్చియుండును. దీనిఉపరితలమున కోట కట్టబడియున్నది. ఈ 'రాజగిరి' నెక్కుటకు నిట్రమయిన, ఇరుకయిన త్రోవయొకటి పెనుబండలమీద మెట్లతో నేర్పరుపబడియున్నది. ఈత్రోవ దక్షిణమునకు మించియున్న కొండకొమ్మ క్రిందిచదునుప్రదేశమునకు చేరును. ఇచట దృశ్యము రమణీయముగ నుండును. ఆప్రదేశము పడుమటిఅంచున కొంచెము నిట్రముగా మీది కొకచరియయున్నది. దాని నెగబ్రాకిపోవుటతికష్టము. తక్కినవైపులనుండి పైకిపోవుటకు వీలుగాదు. ఈవైపునయిన లగ్గలుపట్టించినను కూడ ఎక్కుటకుసాధ్యముకాదు! ఈచరియకడ్డుగ మూడుచోట్లమూడు గోడలు ఒకటితరువాతనొకటిగా పెద్దబండలతో కట్టబడియున్నవి. ఒక్కొకదానియందును ఒక్కొకచిన్నద్వారము కలదు. ఆద్వారములగుండ చరియనంటిచాయగానున్న త్రోవను మీదికి బోవలెను. ఈ గోడలలోను రంధ్రములున్నవి. వానిగుండ తుపాకులను, ఫిరంగులను పేల్చి శత్రువుల యాక్రమణము నెదుర్కొనవచ్చును. చరియపయి నీతీరున గోడలను కట్టిన శిల్పిసామర్థ్యము మెచ్చుకొనదగినది. ఈ గోడలను దాటి చివరకు మీద నున్న కోట కుత్తరమునగల యొక నల్లరాతికొమ్మకడకీత్రోవ పోవును. ఆ కొమ్మునకును కోటకును నడుమ అగాధముగు నిడుపాటిగోయి గలదు. దాని వెడలుపు ౨౪ అడుగులు. కొమ్మపయిని కోటయుండు ప్రదేశమునకు సమానముగా రాళ్లతో దిమ్మ ఏర్పరుపబడిదానిమీదినుండిగోయి కడ్డముగ కఱ్ఱవంతెన కట్టబడియున్నది. కోటను ప్రవేశించుట కిది యొకటియే మార్గము. కోటవైపున ఈ వంతెన కెదుట రాతితో నొకద్వారము నిర్మింపబడినది, దాని కిరువైపుల లోవంపుగల రాతిగోడలు కొంత మేర కున్నవి. వానియందున్న రంధ్రములగుండా శత్రువుల మీదికి ఫిరంగులను, తుపాకులను పేల్చవచ్చును. ఈ చోటనుండి పదిమంది పదివేలమందిని నిరపాయముగ నెదుర్కొనవచ్చును. ఆద్వారమును దాటగనే కోటయున్న సమప్రదేశము. అక్కడికి చేరినతర్వాత ఇక మనసుకు

ఎక్కడలేని విశ్రాంతి కలిగినట్లు తోచును. మోకాళ్లు విరుగున ట్లంత మేర యెక్కినబాధ పూర్తిగా అంతరించిపోవును.

'రాజగిరి' మీదికోటలో ఖజానాకొట్టు, ధాన్యపుకొట్టు, పానయోగ్య జలాశయములు, దేవాలయము, కొలువుకూటము, ఒక మంటపము, దానిలో నొకగొప్ప ఫిరంగి, మందుకొట్టు మొదలయినవి-కోటను చిరకాలము శత్రువుల దాడినుండి కాపాడుకొనుటకు కావలసిన సౌకర్యములన్నియు-అందు కలవు. అందుచేత దుర్గము అడుగు భాగమంతయు శత్రువులచే నాక్రమింపబడినను చిరకాలము మీదిభాగమును సంరక్షించుకొన వచ్చును.

ఖజానాకొట్టు దీర్ఘ చతురస్రాకారముకలది. లోపల నేలమాళిగ యున్నది. కాని యిపు డది పాడుపడి చెత్తచెదారముతో నిండిపోయినది. దీనికి తూర్పుగా ధాన్యపుకొట్టున్నది. ఈ రెండిటికి నుత్తరమున మీది భాగమున పెద్దజలాశయ మున్నది. అక్కడ కొంప యునికి వింతగా నుండును. పెనుబండల సందున రెండడుగులమాత్రము అవకాశముగల ద్వారమునగుండా ఒదిగి యిరుకుగను, చీకటిగను ఉన్న గొందిలో దిగిపోయినయెడల నొకగుహ కానవచ్చును. మీదనుండు పెనుబండలసందుల నెక్కడనుండియో యొకింత వెలుగు ఆగుహలోనికి ప్రవేశించును. నడుమ ఎత్తుగా నుండు ప్రదేశమును, ఉత్తరమున అగాధమయిన నిర్మల జలాశయమును గలవు. మండువేసవిని సయితమందలినీరు వట్టిపోకుండును.

ఈజలాశయమున్నగుహను వెలువడి కొంతదూరము తూర్పునకు సాగిపోయినయెడల కొలువుకూటము కానవచ్చును. అక్కడికట్టడములలో నిది మిక్కిలి పెద్దది. ఇదియు దీర్ఘచతురస్రాకారమున నుండును. దీనికప్పునకు మొనదేలిన కమాను లున్నవి. ఇందు మిక్కుటముగా ప్రతిధ్వని పుట్టును. దీనికితూర్పున సమతలము యొక్క అంచునరాతితో కట్టబడినధ్వజస్తంభముకలదు. దీనినాచుట్టుపట్టులవారు ఘంటాస్తంభమందురు. ఈశాన్యభాగమున రంగనాథస్వామిఆలయ మున్నది. ఇది చిన్నదయినను సుందరముగ నున్నది. రంగనాథస్వామి దేశింగురాజులదైవము. దేశింగు ఈరంగనాథస్వామిని పూజించి యుద్ధమునకు వెడలెనట. తూర్పువైపున కొంచెము క్రిందుగ ఒకచిన్నమంటప మున్నది. అందు ౧౧ అడుగులపొడవు, మొదట ౬ అడుగుల చుట్టుకొలత గల పెద్దఫిరంగి యున్నది. దానిమీద గ్రంథాక్షరములతోను, ఇంగ్లీషునను ఏమియో చెక్కబడియున్నది. ఆకాలమున నింత బరువుగల ఈ ఫిరంగి ఇట్టి దుర్గమమార్గమున నింత యెత్తున కేతీరున కొనిరాబడినదో ఊహించుటకయిన నలవికాకున్నది. ఈ ఫిరంగి కొంచెక్రిందనుండి వచ్చుమార్గమునగల ద్వారములకన్నింటిని అభిముఖమయియున్నది.

'రాజగిరి' నానుకొని తూర్పున శిథిలావస్థనున్న వేణుగోపాలస్వామి దేవాలయము కలదు. అందు కొన్ని సుందరశిల్పములతో నొప్పుపట్టు లున్నవి. ఇంక కొంత తూర్పున 'కల్యాణమహలు' కలదు. దుర్గమునందలి నిర్మాణములన్నిటిలో నది కొన్నివిధముల నతి విచిత్రముగ నిర్మింపబడిన దనవలెను. అందునడుమ పెద్దకూటము, చుట్టును గదులు నున్నవి. ఆ గదులు రాణివాసమునకు నివాసములుగ నుండినవట. ఆ కల్యాణమహలు మీద ఉత్తరపువైపు నట్టనడుమ చతురస్రముగ నున్న గోపురమున్నది. దానియెత్తు రమారమి ౮౦ అడుగు లుండును. అది రాతితో కట్టబడి మీద గచ్చు చేయబడియున్నది. దానికి ౮ అంతస్తులు కలవు. చివర కది సూదిగా మొనదేలియున్నది. ఒక్కొక్క అంతస్తునను ౮ అడుగుల చదరమున నొక్కగదియు, దానిచుట్టు కమానులమీద కట్టిన సన్నని వసారాయును కలదు. క్రిందిఅంతస్తుకంటె మీదిది చిన్నదిగానుండును. వీని వసారాలగుండ క్రిందికి మీదికి ఇరుకయిన మెట్లవరుసలు రెండున్నవి. అత్యంతము శిథిలప్రాయముగనుండిన ఈ మహలును ప్రభుత్వమువారు చక్కగా మరమ్మతుచేయించినారు. ఇపుడు ఆరవ అంతస్తువరకు ఎక్కవచ్చును. ఆరవఅంతస్తునుండి చూచినయెడల దూరమున 'కృష్ణగిరి' దుర్గములోనికి పెక్కుద్వారములగుండ వచ్చుమార్గము, తూర్పునగల దుర్గశిథిలములు చక్కగా కానుపించును.

ఈమహాలుదగ్గర సైనికులుండు నింద్లవరుసలవి కొన్నోలు శిథిలములున్నవి.

త్రోవ కావలిపైపున పెద్దధాన్యపు కొట్టున్నది. దాని ప్రక్కనే నూనె- నేతికుండు లున్నవి. ఇవి యిటుక లతో కట్టబడి గచ్చు చేయబడినవి. మీద చిన్నద్వార మున్నది. పూర్వము వీనియందు నూనె,నేయి నిలువచేసి యుంచుకొనెడువారట. రాజగిరి ప్రాంతమున, ఇంకను దక్షిణమునకుపోగా నొకపెద్దచెరువు కనుపించును. దీనికి 'చక్రకుళము'అని పేరు. దుర్గములోపల నున్న పొల మున క్రిందలి నీరు పాఱును దీనికి తూర్పున, కొంచెము క్రిందుగ నింకొక చెరు వున్నది. దీనికి 'శెట్టికుళము' అని పేరు. దీని ఈశాన్యభాగమున రాతితోకట్టిన దిన్నె యున్నది. దేశింగునిరాణి సహగమనముచేసినది యీ దిన్నె యుండు చోటనే యనిప్రసిద్ధి.

రాజగిరి దక్షిణపుటంచున నొక బ్రహ్మాండమయిన కొండ కొమ్మొకటి ముందుకు వచ్చియున్నది. దీనిలో నొక లోతయినగోయి యున్నది. దానిచుట్టు ఇటుక గోడకలదు. ఈగోయికి 'కైదీలగోయి' అని పేరు. మరణదండ దండితులు నిచ్చెనద్వారా గోడమీది కెక్కింపబడి ఈ గోతిలో త్రోయబడెడువారట. ఇక వా రందుమ్రగ్గి మరణించవలసినదే.

చాంద్రాయన దుర్గము నానుకొని వెలుపలిప్రాకా రమున పొలములనడుమ వెంకటరమణస్వామి దేవా లయ మున్నది. అది చాల శిథిలము. దాని గోపుర ద్వారము చుట్టను మనోహరశిల్పముతో నలరారు శిలా ఫలకములు అమర్పబడియున్నవి. సుందర శిల్పసమంచిత శిలా స్తంభములిందలివి కొన్ని పుదుచ్చేరిలోనున్న డూప్లే శిలావిగ్రహముచుట్టు పాతిపెట్టబడియున్నవి. ఈ చాం ద్రాయన దుర్గమున నొక మంటపము మాత్ర మున్నది. ఏవో దుర్గరక్షణకని నిర్మింపబడినవి తప్ప అంతగాచెప్ప దగిన నిర్మాణము లేవియు నీ దుర్గమున లేవు.

కృష్ణగిరిదుర్గమున కెక్కుమార్గము ఈ వెలుపలి ప్రాకారమునుండియే. తిన్నగా నొక మెట్లవరుస మీదికి పోవును. ఇక్కడ ఇంచుమించుగా రాజగిరియం దున్నట్టులేకట్టడములన్నియు-రంగనాథాలయము, కొలు వుకూటము, ధాన్యపుకొట్టు మొదలయినవి కలవు. ఆకాల మున రాజులు ఒకదుర్గమున కృష్ణపక్షదినములలో, ఇంకొకదుర్గమున శుక్లపక్షదినములలో నివసించు చుండెడివారట. అందువలన వారికి రెండుదుర్గముల లోను ఇట్లు సమానసౌకర్యము లావశ్యకము లయినవి.

ప్రాచీనకాలమున నిట్టిదుర్గములయిన దుర్గము లెన్నియో భారతదేశమున వెలసినవి. వానిలో ననేక ములు నామావశేషములు. కొన్నిమాత్రము శిథిలప్రాయ ములుగ నున్నవి. ఆశిథిలావశేషములే ప్రాచీనభార తీయులదుర్గనిర్మాణకౌశలమును, శౌర్యపరాక్రమములను, ధైర్యసాహసములను మిన్నన కన్నులుచాచి యుద్ఘో షించుచున్నవో యనునటులు చూపరకు తోచును.

# కయ్యా - కాలువ

'కరుణకుమార'

(తరువాయి)

౫

కుప్ప లింకా ఇప్పుడప్పుడే నూర్చరు. ఉగాదికిగాని కళ్లాలు చేయడానికి కయ్యలారవు. అందువల్ల కుప్పలన్నీ పొలాల్లోనే ఉన్నవి.

లక్ష్మమ్మ రాత్రిపూటకుప్పలవద్ద మనుష్యుల్ని కాపలాపెట్టుతూనే వుంది. రోజూ రేపటివేళనో, మాపటివేళనో ఏదో ఒక పొద్దుల్లో ఆమె ఒకసారి కుప్పలచాయ బోయి తనసొమ్ము భద్రంగా ఉన్నదో లేదో అని చూచుకొంటూనే వుంది. తగని అనుమానం మనిషి! ఎవరినీ నమ్మదు. తనమనస్సే తను నమ్మలేదు. పొలంలోసొమ్ము ఇంట్లోకి వచ్చేవరకూ ఆమెకు ఒకటే ఆలాపనగా వుంది.

ఇట్లా వుండగా ఒకరోజు ఉదయాన్నే ఆమె పొలంచాయ బోయి, కొండడికయ్యకు సమీపంలోవున్న తనకుప్పలను తణిఖీచూచుకొంటూ వుండగా, అందులో ఒక కుప్పకు నెత్తిన నడిభాగంలో ఒకమోపు పన పెరికి బయటికి తీసినట్లుగా ఆమెకళ్లకు కనిపించింది. మరి, ఎవరైనా కావాలని రాత్రిపూట చోరీగా వచ్చి ఆకుప్పలో ఒక మోపెడుపన తీసి ఎత్తుకొనిపొయ్యారో, లేక అంతకు ముందటిరోజు సాయంత్రాన్ని కొట్టిన సుడిగాలికి, కుప్ప కప్పడంలో పనిలేక, పైభాగంలో ఒక సందెడుగడ్డి గాలికి ఎగిరిపోయిందో, లేక ఆమెఅనుమానపుకళ్లకే ఆవిధంగా కనుపించిందో మనం చెప్పలేం కాని మొత్తానికి ఎవరో తనను అన్యాయంచెయ్యాలని, రాత్రిపూట చోరీగా తనకుప్పలో పన పెరుక్కొని పోయారని లక్ష్మమ్మకు ఘట్టినమ్మకం పట్టింది. ఇక బ్రహ్మరుద్రాదులు దిగివచ్చినా ఆమె నమ్మకాన్ని తిప్పలేరు.

ఇక నెందుకు, తన రెండులక్షల రూపాయల సంసారమూ నట్టేట కలిసిపోయినట్లు రెండుచేతులతోనూ గుండెలు గుద్దుకొంటూ ఆమె నోటికివచ్చినతిట్లు తిట్టుకొంటూ, వీధిన బడి గొల్లున గోలపెడుతూ పరుగుపరుగున ఇంటికివచ్చీరావడంతోనే తొందరగా రమ్మని రామిరెడ్డికి కబురుచేసింది. ఏదోకొంపమునిగిందనుకొంటూ రామిరెడ్డీ, రామిరెడ్డితల్లీ, రామిరెడ్డిచెల్లెలూ ఇంటిల్లిపాదీ పరుగెత్తుకొనివచ్చేవరకు, లక్ష్మమ్మ తల విరబోసుకొని, దక్షిణపుతట్టువసారాలో వట్టినేలను, ఈమూల నుండి ఆమూలకు దొర్లుతూ, రోజుతూ, రొప్పుతూ “అయ్యో నాకొడుకా! అయ్యో రామిరెడ్డీ! కొంప గుండం వేసుకొని పోయిందిరా, నాయనా! నాసంసారానికి నేటి



కంటికీ నేలకీ ఏకధారగా,
పెద్ద పెట్టున ఏడిచింది.

కిన్ని కడగండ్లు వచ్చాయిరా తండ్రీ! అయ్యయ్యో! మేరుపర్వతంలాంటి కుప్ప, అస్థులూ, చర్మమూ, మాంసమూ అరిగిపొయ్యేటట్లు కష్టంచేసి పండించుకొన్న కుప్ప, నా తండ్రీ! నారాయన్నా! నా పెంగోలుకుల కుప్ప, బంగారంలాంటికుప్ప - నట్టేట కలిసిపోయిందిరా బాబూ! నేను గొంతుక్కురిపోసుకొని చావవలసినరోజు వచ్చిందిరా కొడకా" అని చూడవచ్చినవాళ్లకు తుదా మొదలూ ఏమీ అర్థంగాకుండా ఒక్క ఉగుక్క పెట్టుతూ, కంటికీ నేలకీ ఏకధారగా, పెద్దపెట్టున ఏడిచింది. రామిరెడ్డి అప్పుడే గ్రహించుకొ

న్నాడు. 'ఇదంతా ఆఘాయిత్యంతప్ప మరొక్కటి కాదని రామిరెడ్డికి తెలుసును. అయితే మట్టుకు ఆమె నోదార్చకుండా ఊరుకొంటే తాను ఆశపెట్టుకొన్న రెండుముక్కలు రూపాయల ఆస్తీ తన కామె సెటిల్‌మెంటు వ్రాసి ఇవ్వదేమో నని లోపల భయం అతనికి. అందువల్ల ఆమెదంతా నటన అని తెలిసినప్పటికీ అదంతా నిజమేనని తానుగూడా విశ్వసిస్తున్నట్టు నటించకపోతే చిక్కువచ్చి పడుతు, దనుకొన్నాడు:

"ఏందమ్మా? అసలుసంగతేమిటో చెప్పవమ్మా! ఏంజరిగిం దేమిటి? నిన్న పగటివేళ పొలంచాయపోయి చూచివచ్చాను. మన కుప్పలన్నీ భద్రంగానే ఉన్నవే! ఇప్పు డేం వచ్చిందీ?" అని రామిరెడ్డి అడిగేవరకు,

"దానికి కాలం వచ్చేటప్పటికి ఎంతలో పోవాలెరా నాయనా! నిన్నరాత్రి తెల్లవార్లూ ఎంతమందిజనం మోసినారోగాని సగం కుప్ప ఎగిరిపోయిందిరా బాబూ! వీళ్లు నాశనంగానూ; వీళ్లకడుపులు మండిపోనూ; వీళ్ల వంశం నిర్వంశంగానూ! నా యెంగిలికూటి కాశపడ్డారురా కొడకా!" అని లక్ష్మమ్మ మళ్లా అందుకొంది.

"అయితే ఎవరెత్తుకొనిపోయినా రంటావు?" అన్నాడు రామిరెడ్డి.

"ఎవరని నన్నడుగుతా వెందుకయ్యా? బాబూ! కలకింద కొరివిలా నాకయ్యాకింద వాడు ఊరికేనే చేరినా డనుకొన్నావా! వాడితో నాకు బతికేపొత్తు లేదురా బాబూ! మొన్న నేను వాడికి కాలు విప్పలేదని వాడు నన్నప్పుడే బెదిరించి నామీద శాఖ్ద్రీలుతీసి వెళ్లాడురాబాబూ! నాకొంప గుంపంవేసింది. ఆమాలమాదిగవెధవ కొండడుతప్ప మరొకరి పని గాదురా ఇది" అని లక్ష్మమ్మమరీ ఏడిచింది.

"అట్లాగయితే నేను విచారిస్తా గాని, ను ప్వూరికే రచ్చచేయబోకు! మాలవాడెక్కడకు పోతాడు? నిముషాలమీద నీ సొత్తంతా నీయింట్లో చేరుతుంది, ఏడవబోకులే. లేచి పళ్లుతోముకొని, ఇన్ని చద్దినీళ్లు తాగు. అయ్యయ్యో! అరచి అరచి గొంతుకు రాచుకుపోయె; ఆయాసమూ, శోపాకూడా వచ్చిందిగదమ్మా తల్లీ! లే! ఎండ పడింది. లే!" అని రామిరెడ్డి ధైర్యంచెప్పాడు.

లక్ష్మమ్మకు విడిపోయిన జుట్టు రామిరెడ్డి తల్లి ముడివేసింది. సంకటపట్టి లక్ష్మమ్మను రామిరెడ్డి పైకి లేవదీసి చీడీమీద కూర్చోపెట్టాడు. లక్ష్మమ్మ చెదిరిపోయినపైట సర్దుకొని, జీరునచీది ఎడంచేత్తో విసరి నేలనేసి కొట్టింది. వొంటి నంటుకొన్న దుమ్మూ, ధూళీ రామిరెడ్డి తుడిచాడు. రామిరెడ్డి చెల్లెలు పళ్లుతోముకో నీళ్లు పిన్నమ్మపక్కన

*అయ్యయ్యో! ఈమాలమాదిగ కొడుకు నా పెట్టింది. కళ్లు తుడుచుకొని లక్ష్మమ్మ మొగం*

ఇంటికి శనిగ్రహం పట్టినట్లు పట్టినాడురా కదుకొంది.

౬

రామిరెడ్డి దూరాలోచనగల మనిషి; కానైతే జబ్బురకంమనిషి కాదు. పినతల్లి చేసినచేష్టలన్నీ ఆమూలాగ్రంగా తనలో తాను విమర్శించుకొన్నాడు. అతని కసలు పినతల్లితత్వం మొదటినుంచీ తెలవనే తెలుసు. ఆమెఆఘాయిత్యంలోని అర్థం ఇతరులెవ్వరూ అతనికి చెప్పనవసరమే లేదు. ఈ యెత్తంతా కొండణ్ని తనకయ్యాలదగ్గరనుండి లేవగొట్టి వాడికయ్యా తాను తీసుకోవడానికై వేసిన యెత్తని రామిరెడ్డి బాగా మనస్సుకు తెచ్చుకొన్నాడు. అసలు కుప్పలో చోరీపోయిన సంగతే అబద్ధమని అతనికి నమ్మకం. అందులో కొండడు అట్లాంటి నీచపుపనికి పోడని కూడా అతనికి బాగా తెలుసు. అయితే మట్టుకు ఏం చేయగలడు? లక్ష్మమ్మకు తాను ఇన్నియేళ్లుగా చేస్తూవున్న సేవంతా ఒక యెత్తూ, ఇప్పుడీకయ్యాతకరారులో చేయవలసిన సేవంతా ఇంకో యెత్తూను. అబద్ధమో, సుబద్ధమో ఏదైనప్పటికీ ఇందులో మాత్రం తాను నడుంకట్టి తగినంతపని చెయ్యకపోతే, ఇక లక్ష్మమ్మ జన్మజన్మాలకూ తన్ను గుమ్మం తొక్కనీయదు సరికదా, ఆఖరుకు తనముఖం కూడా చూడదు. ఇక రెండులక్షల రూపాయల ఆస్తికీ తాను నీళ్లు వదులుకోవలసిందే !

ఇంటికి పోయి పైన గుడ్డ వేసుకొని, చెప్పులు తొడుగుకొని, కర్ర చేతపుచ్చుకొని రామిరెడ్డి తిన్నగా కరణం రామగుండం బసవయ్యగారి యింటికి వెళ్లాడు.

బసవయ్యగారు నిఖారుపైన నియోగి బిడ్డ. తండ్రిపేరూ తాతపేరూ మాత్రమే కాకుండా, అసలు ఆర్వేలవా రందరి పేరు ప్రతిష్ఠలూకూడా ఏకటాకీని నిలబెట్టుతున్నాడాయన. అనాదిగా వారిది పెద్దకరణాల కుటుంబం అని పేరుపడింది. దానికితోడు ఆయన స్వతహాగా తెలివితేటలుగల ఘటం. అందువల్ల గ్రామంలో బసవయ్యగారి బావుటా బాగా ఎగురుతోంది. ఆ వూరుమునసబు కమ్మ నాయుడు. సంతకంమాత్రం ఎట్లాగో నేర్చుకొన్నాడు. బసవయ్యగారు నుంచోమంటే నుంచోవాలె, కూర్చోమంటే కూర్చోవాలె అతను. అందువల్ల ఆ గ్రామపుసివిల్, క్రిమినల్, రెవిన్యూవగైరా యావత్తు అధికారాలూ బసవయ్యగారే చలాయిస్తూ రెండుచేతులా గ్రామంలో నొల్లుకొని తింటున్నాడు. కాని ఎంత సంపాదించినా-ఆయనకుటుంబం పెద్దది. అందువల్ల కూతుళ్ల పెళ్లిళ్లకీ, కార్యాలకూ, కొడుకుల పెళ్లిళ్లకూ, వాటికీ వీటికీ చాలక, కొంత వరకు లోకులకు బుణపడ్డాడు. అచ్చం రామిరెడ్డికే ఆయన ఆరువేలు అచ్చవలసుంది. ఆమొగమాటంకొద్దీ తనకు గ్రామంలో ఎంత పలుకుబడి ఉన్నా, అప్పుడప్పుడు బసవయ్యగారు రామిరెడ్డికిమాత్రం రవంత పక్కాలు వంచుతూవుండవలసివచ్చింది.

రామిరెడ్డి రావడంతోనే బసవయ్యగారు అతణ్ణి ఆహ్వానించి చావడిలో ఉత్తరపు తట్టు అరుగుమీద చిరిచాపవేసి "ఏం ఇట్లా వచ్చావు, కథ" అని ప్రశ్నించాడు. "మీ

తోనే పని ఉండి వచ్చా: నిన్నరాత్రి మా పిన్నమ్మ దక్షిణపునట్టులోని కుప్పలో ఎవరో దొంగతనంగా పదిమోపులు పన కట్టుకొని పోయారట. దానికోసరం ఆమె గోలపెడు తోం" దన్నాడు రామిరెడ్డి.

"పదిమోపులే ?"

"ఆఁ! పదంటే పది కా దనుకో. అంతకు తక్కువే కావచ్చు. ఎంతయినప్పటికీ మొత్తానికి దొంగతనం దొంగతనమే."

"అయ్యో! కామమరి. పాపం ఆమె సొమ్ముకు కక్కుర్తిపడ్డ గాడిదకొడు కెవ డయ్యా ?"

"నీతో నిజం చెప్పొద్దూ: ఎత్తుకొని పోతూవుండగా ఎవరూ కళ్లారా చూడ లేదు. మాపిన్నమ్మకేమో మాలకొండడి మీాద అనుమానం."

"అబ్బే! వా డట్లాంటిపనికి పోయే వాడు కాదయ్యా పాపం. ఎందుకు మనం మాత్రం ఒకరిమీాద పాపంమాటలు అను కోవాలె ?"

"అవునుమరి. వాడిసంగతి నాకూ తెలుసు. అయితే ఆమెమాత్రం వాడే చేశాడు ఈపని అని ఘంటాపథంగా చెప్తా తోంది. ఆమెమతం మార్చడానికి బ్రహ్మ దేవుడి తరంగాదు."

"అయితే ఇప్పు డేంచేద్దామని నీఆలో చన ?"

"చేయడాని కేముంది? కొండణ్ణి పిలిపించి ఆమె కుప్పలోపోయిన కట్టలు ఆమె కిప్పించివెయ్యి."

"అంతటితో ఆమె తృప్తిపడుతుందా?"

"అదీ సందేహమేలే. తీరా పదికట్టలు వాడిచేత ఇప్పించినా, చోరీచేసినందుకు వాడికి జుల్మానా విధించి అదికూడా తనకే ఇప్పించవలసిందని ప్రాణాలు తీస్తుంది. ఆమెతో నక్కచావు వచ్చిపడిం దయ్యా నాకు. ప్రాణాలు కొరికేస్తుంది పాడుముండ."

"ఎట్లాగా నీరొట్టెవిరిగి నేతిలో పడిందిలే. అన లామెసంసారాని కెక్కుపెట్టి వున్నావు. మొత్తానికి నీది ధనజాతకమే."

"ఏమో; ఆముండ అంతరించే దెప్పటికో, మనపాచిక పారే దెప్పటికో. మరి ముందు దీనివిషయం పరిష్కారంచేయాలె. ఈపని నీచేతిలో వుంది."

"మరీ ఇంత అన్యాయంలోకి దిగుతు న్నావేమిటయ్యా, రామిరెడ్డి! పోనీ, ఎత్తుకొనిపోతూవుండగా ప్రత్యక్షంగా చూచినట్టు సాక్ష్యమేనా వుంటే ఏదోవిధంగా యేడ వచ్చు. ఎవడో వీధిన పొయ్యేవాణ్ణి పిలిచి, నువ్వు లక్ష్మమ్మకుప్పలో చోరీచేశావని ఎట్లాగ నిరూపించడం? నువ్వే చెప్పు."

"సరేలే! ఈధర్మపన్నా లన్నీ వకరకు పెట్టడాని కిప్పు డేమీా సందులేదు. నాకు తెలుసు. అసలు చోరీ జరిగిందో లేదోకూడా

నాకూ అసనమ్మకమే. ఇంటికి వచ్చి మా పిన్నమ్మని చూడకపోతిని. పొద్దుటినుంచీ ఆమె చేసేషు ఆఘాయిత్యం చూస్తే నువ్వేమను కొందువో! ఈ విషయంలో మట్టుకు నువ్వు పూర్తిగా నామాట దక్కించాలె. నీకు తప్ప దనుకో. నామెడకు గండగత్తెర చుట్టు కొంటే, నీకు చుట్టుకొన్నట్టు కాదూ, బసవయ్యగారూ ?"

"అయితే భోజనంచేసుకొని మధ్యాహ్నం వాణ్ని పిలిపించి విచారించి ఏదో రకంగా తీర్మానం చేద్దాంలే. పెద్దమనిషివి, నువ్వే స్వయంగా ఇంత నొక్కి చెప్పతుంటే ఇక తప్పతుందా ? "

"సరే" అంటూ రామిరెడ్డి లేచి ఇంటికి వెళ్లాడు. పదకొండుగంట లయ్యేసరికి బసవయ్యపంతులు గూడా స్నానం చేసి, ఆహ్నికం పూర్తిచేసుకొని భోజనంచేసి, మధ్యాహ్నం మూడుగంటలకు కొండడి కోసం ఇంటికి కబురుచేశాడు. బర్రెగొడ్లకటి మేతానీళ్లూ మేయక, పొద్దుగూకులూ అరుస్తూ పసువులమీదకి ఎగబడుతూ వుంటే, దున్న పోతును దాటించడానికి దాన్ని కొండడు పక్కవూరికి తోలుకుపోయాడని ఇంటికాడ చెప్పేసరకు పోయినమనిషి తిరిగి వచ్చి ఆసంగతులే పంతులుతో చెప్పాడు. తాను చెప్పినపని ఏమి చేశాడో కనుక్కురమ్మని రామిరెడ్డి అప్పుడే కబురుచేశాడు. ఇక ఆలస్యం చేయడానికి వీలుండేటట్టు లేదని రామిరెడ్డిని పిలిపించుకొని, అతన్నీ, ఇద్దరు వెట్టి వాళ్లనూ కూడా తీసుకొని బసవయ్యపంతులు ఎకాయెకీని మాలవాడలో కొండడి ఇంటికి పోయినాడు. విచారిస్తే కొండడు లేడని తెలిసింది.

కొండడిది ఒక దూలం చప్పరం. మామూలు చుట్టుగుడిసెకంటె రవంత పెద్దది. లోపల కొండడి తల్లితప్ప ఇతరు లెవ్వరూ లేరు. కొండడిభార్య కూలికిపోయి ఇంటికి రాలేదింకా. దానిచంటిబిడ్డ-పదినెల్లకూన-గుడిసెలో కింద గోతంపట్టామీద పండుకొని దొర్లుతూవుంది. ఈ పదిరోజులుగా తిరిగితిరిగి ఏరుకొనితెచ్చుకొన్న పరిగలన్నీ కలిసి ఒకటి రెండు చిన్నకట్ట లయ్యేవరకు, కొండడితల్లి ఆరెంటినీ గుడిసెలో ఒకతట్టుగా వేసి, ఆరాత్రి కూటికి గింజలు లేనందున, సందేడుకర్రలు ఆకట్టల్లోవి తీసి గుడిసెవాకిట ఎండబెట్టి, ఎండినకర్రలు కొద్దికొద్దిగా తీసి కింద ఈతాకుచాపమీద వరివెన్నులు కుడికాలికిందవేసుకొని నలుపుతోంది. గింజలన్నీ రాలినతర్వాత గడ్డిని మాత్రం ఒకపక్కగా పెట్టుతోంది.

బసవయ్యపంతులూ, రామిరెడ్డి, సిబ్బంది వచ్చేవరకు వెంకికి గాభర పుట్టింది. "ఇదేం దబ్బా! ఎన్నడూరాని అయ్యావారు కూడా మాలవాండ్ల గుడిసెకాడికి ఎండలో పడి వచ్చాడే" అని దానికి ఏమీ అర్థం కాకుండా వుంది.

"వెంకీ! ఆఖరుకు రానురాను నీకొడుక్కి ఇట్లాంటి దొంగబుద్ధులుకూడా పట్టు పడ్డాయిటే?" అన్నాడు బసవయ్య.

"ఏంది మారాజా! ఏంచేశా డయ్యా నాకొడుకు?"

"ఏంచేశాడా? నిన్నరాత్రి లక్ష్మమ్మ కయ్యకుప్పలో పనపెరికి దోరీగా తెచ్చి ఇంట్లో వేసుకొన్నాడటగా? ఇదిగో! రామి రెడ్డికూడా వచ్చాడు."

"ఏలక్ష్మమ్మ సామీ!—రామరామ! మే మట్లాంటి పాపాలకు పొయ్యేవాండ్లము కాదుసామీ! నాకొడుకు ధర్మరాజు సామీ."

"ఛీ! నోరుముయ్యి, మాలముండా! ఊళ్లోవాళ్లసొమ్ము దోపిడీచేసి ఇంట్లో వేసుకొని కమ్మంగా తిందా మనుకొన్నావా? నీ సంగతి నే నెరగనూ? అసలు నువ్వే చెప్పి పంపించివుంటావు కొండణ్ణి దోపిడీచేయ మని. జైలుకు పంపిస్తా చూడు."

"ఏందయ్యా సామీ' ఈగొడవ ఈ రోజు? నాకొడుకు నిన్న పగటేళనంగా బర్రెను తోలుకొనిపోయాడు నాయనా! రాత్రి వా డింటికిరాలేదు. ఆపాపం మాకు తెలియదు సామీ! ఉంటే తింటాం, లేకుంటే పస్తుపండుకొంటాంకాని, దొంగకూళ్లు మాకు పనిలే దయ్యా! నీకు దణ్ణాపెట్టి చెప్పతా సామీ!" అని వెంకి అనేవరకు వెట్టివాళ్ల నిద్దరినీ పిలిచి వాళ్లతో "ఒరే లోపలికి పోయి సోదావేసి చూడండిరా; ఇంట్లో పన కట్ట లుంటే బయటవేయండి" అని బస వయ్య చెప్పాడు వెట్టివా ళ్లిద్దరూ మాల వాళ్లే. బసవయ్య ఈ మాట అనే వరకు, ఇద్దరిలో ఒకడు కాలుముడుచుకొను పోయినట్టుగా పోయి మొఖం తప్పించాడు. రెండోవాడు సందేహిస్తూ సందేహిస్తూ, ముఖం కిందకి వంచుకొని, చేతిలోకర్ర కింద టక్కుటక్కున కొట్టుతూ, అడుగులో అడుగు వేసుకొంటూ తలబరుక్కొంటూ ముందరికి పోతున్నాడు. అది చూచి బసవయ్యపంతులు:

"ఏందిరా, నీ కేమైనా సొయ్యమా ఏందిరా? గుడిసెలో సోదా వేయమంటే పెళ్లినడకలు నడుస్తా వేందిరా? మెడలు విరగదన్నుతా, గాడిదకొడకా! పో! తొందరగా వెళ్లు" అని వెట్టివాణ్ణి అదిలించాడు.

వెట్టివాడు గుడిసెలో దూరాడు.

"ఇదేంది పంతులూ! ఈఅన్యాయం? పిల్లోడూ, పిల్లాకూడా ఇంటికాడ లేకుండా చూచి నాగుడిసెకు నిప్పు పెట్టుతుండా వేమయ్యా" అని వెంకి గొల్లుమన్నది.

మాలవాడలోని మాలలందరూ కూలి పనులకు పోయినందున, ఎవరో అక్కడక్కడ ముసలీ ముతకా పిల్లా, జెల్లా తప్ప ఇతరు లెవ్వరూ పెద్దతలకాయలు కనుపడడం లేదు. వెంకిగుడిసెకాడ జరిగేగలభాకు అ వున్నవాళ్లే పిల్లా, పీచూ—పదిమందీ పోగయారు. వెట్టివాడితోకూడా వెంకి గుడిసె లోకి దూరింది; వాడి కాళ్లావేళ్లా చుట్టుకొంది. అయిదునిముషాలవరకు లోపలికిపోయిన వెట్టివాడు బయటికి రాలేదు. వెంకి గోల పెట్టుతోంది. దానిఅవస్థ చూచేవరకు వాడికి

కళ్లవెంబడి నీళ్లు గిర్రున తిరిగినవి. సోదా వేయడానికి కళ్లచూపు ఆనలేదు వాడికి: "మమ్మల్నిట్లా ఎందుకు పుట్టించావయ్యా భగవంతుడా" అని వెట్టివాడు తనలో అనుకొని నిట్టూర్పు విడిచాడు.

"ఏమిరా! లోపల దూరి ఎంతసేపటికీ బయటికిరా వెందువల్లరా? ఈరోజు నీకేమైనా ముసించిందా ఏమిటి? లేక ఈ దొంగసొత్తులో నీకేమైనా భాగం ఉందా? బయటికి రావేమి?" అని బసవయ్యపంతులు బయటనుండి అరుస్తున్నాడు. కాని వెట్టివాడు బయటికి రాలేదు. బసవయ్యకు ఒళ్లు భగ్గుమనింది. వెట్టివాడు సమయానికి మొగమాటంవల్లనో, కులాభిమానంవల్లనో జంకుతున్నాడని, తానిక చెయ్యిచేసుకొంటేనే గాని వీల్లేదనుకొని, బసవయ్య దుడుంగున పడసెలోకి దూరాడు. వెంకి పరిగపరి తెచ్చి పోగుపెట్టిన రెండుకట్టలూ చూశాడు.

"ఈకట్ట లెక్కడివే వెంకీ?" అని అడిగాడు బసవయ్య.

"వరికొయ్యకాల్లో పరిగపరి తెచ్చుకొన్నవి, సామీ! ముసిలిముండని. నడుము పడిపొయ్యేటట్టు ఒక్కొక్కకర్రే యేరి తెచ్చుకొన్నా: ఇది దొంగసొత్తు కాదు మారాజా! నీకు దణ్ణంపెట్టుతా" అన్నది.

"ఛీ! నోరుముయ్యి, పళ్లురాలగొట్టుతా లంజా! తప్పుడుమాటలు కూస్తావు" అంటూ ఆయనే రెండుకట్టల్నీ బరబర బయటికి లాక్కొనివచ్చాడు. వెంకి నోరూ, నెత్తీ లబలబ కొట్టుకొంటూ బసవయ్యకు అడ్డు తగిలేవరకు, మాలముండ తనను తాకుతుందేమో, ప్రాయశ్చిత్తం చేసుకోవాలెనని భయంతో, బసవయ్య తనచేతికర్ర రెండు చేతులతోనూ ఆచివరా, ఈచివరా పట్టుకొని వెంకిమెడమీద బెట్టి ఒక్కనెట్టు నెట్టాడు. "చచ్చాను దేవుడా" అంటూ వెంకి నాలుగు గజాలదూరంలో పడిపోయింది. ఈయుద్ధరంగంలో రామిరెడ్డి ఏమీ జోక్యం కలుగజేసుకోకుండా, చూస్తూ కొయ్యబొమ్మలాగ నిలబడివుండడమే ఆశ్చర్యకరమైన విషయం! ఆశ్చర్యంమాత్రం ఏముంటుందీ? బసవయ్య పాపాలకల్లా భైరవుడు. రామిరెడ్డి అప్పుపెట్టి ఆయన్ని కొన్నాడు. ఇప్పుడు ఆయనచేత తన యావత్తు పనులూ, కూలివాడి చేత చేయించుకొన్నట్టు చేయించుకొంటున్నాడు. తనకృతజ్ఞత చూపి ఋణదాతను మెప్పించాలన్న కోరిక తప్ప, బసవయ్యపంతులుకు మరో తలంపు లేదిప్పుడు. అందువల్ల ఆఆవేశంలో ఆయన తనస్వంతపనుల్లోకంటె ఎక్కువ సాహసమూ, ఎక్కువ పట్టుదలా, ఉత్సాహమూ చూపుతున్నాడు.

బయటికి లాక్కొనివచ్చిన రెండుకట్టలూ బసవయ్యచేతనే తన ఇంటికి మోయించేవాడు రామిరెడ్డి. కాని ఎందుకు బ్రాహ్మణ్ణి కష్టపెట్టగూడదనుకొని, తన జీతగాళ్లలో ఒకణ్ణి పిలిపించి రెండుకట్టలూ లక్ష్మమ్మయింటికి చేర్పించాడు.

కిందపడిన వెంకి కిందనే పొర్లుతూ వుండగా, తలపెట్టినకార్యం జయప్రదంగా కొనసాగినందుకు తనలో తనే సంతోషపడుతూ, బసవయ్యా జారిపోయినజుట్టు తిరిగి ముడివేసుకొని,కర్రచేతబుచ్చుకొని, జయభేరీమోగిస్తూ, చేతులు ఊగీసలాడించుకొంటూ, రామిరెడ్డితో గూడా ఇంటికి పోయినాడు.వెళ్లి బావిదగ్గర ముఖాన్న ఉంచిన గంధంపట్టెలూ, అక్షతల బొట్లూ వగైరాలన్నీ పొయ్యేటట్లు పదబిందెలు నెత్తికి తోడిపోసుకొని స్నానం చేసి, చేతికర్రకూడా కడిగేసి, ఇంట్లోకి పోయి పట్టుగుడ్డ కట్టుకొని, విభూతి ధరించి మైలబడ్డ జందెం తీసివేసి, కొత్తజందెం వేసుకొని నూటఎనిమిదిసార్లు గాయత్రి జపించాడు; తరువాత లేచి, చలవమడతలు కట్టుకొని, మంచి తీర్థం తీసుకొని వీథిలోకి పోయాడు. ఇంతలోనే లక్ష్మమ్మ పిలిపించేవరకు ఆమెయింటికి పోయి వీథి అరుగుమీద కూర్చొని రామిరెడ్డి, అతనూ, లక్ష్మమ్మా ఈముచ్చటే ఏమిటో మాట్లాడుకొంటున్నారు. రెండు వరికట్టలూ ఇంటికి చేరినప్పటికీ, పోయినసొత్తు పూర్తిగా రాలేదని లక్ష్మమ్మ సణుగుతూనే వుంది, చెవులో పోటులాగ. "బయటకు పోయిన మొగాడు, కొండడు ఇంటికి వచ్చినతర్వాత కొరవగూడా ఏదోవిధంగా భర్తీపెట్టుతాం లేవమ్మా. నీసొత్తు గడ్డిపరకంతకూడా ఎక్కడికీ పోదు" అని బసవయ్యా ధైర్యంచెప్పి లక్ష్మమ్మను ఓదారుస్తూన్నాడు. "ఏమో నాయనా! నాప్రాణం పాలీ ఆనేవరకూ ఏకడగండ్లూ లేకుండా నాతను విట్లా తెల్లవారిపోతే, నా కంతేచాలు. లోకులసొమ్ము నాకు ఆవగింజంతకూడా అక్కరలేదు. ధర్మాత్ముకాలు లక్ష్మమ్మ అని లోకం అంతా మోగిపోతున్న రోజుల్లో, ఈనాటి కీమాలముండా కొడుకు నన్ను బయటికి నలుగురిలోకీ ఈడ్చాడు, వీణ్ని పోలేరమ్మ బుగ్గిచేసుకుపోనూ" అంటూ సింహద్వారానికి పొదుగింట ఆనుకొని నిలబడి కంట తడిపెట్టుకొని పైటకొంగుతో తుడుచుకొంది లక్ష్మమ్మ.

౭

కొండడు పడమట బారెడుపొద్దుండగా, అసుకుసురై బరెను తోలుకొంటూ, పొద్దుటినుండీ కూడులేక ఇంటి కొచ్చేవరకు, ఇల్లంతా బీభత్సంగా వుంది. వెంకి ఇంటిముంగిట దుమ్ములో పొర్లాడుతూ వుంది. కొండడిభార్య ఇంకా ఇంటికి రాలేదు. జరిగిన విషయం అంతా కొండడు తెలుసుకొన్నాడు. వాడిమనస్సు చీకాకయింది. కథ పెరుగుతున్నందుకు వగచాడు: అధైర్యపడ్డాడుకాని యింతలో సంబాళించుకొని వెధవపరిగకర్రలు నాలుగూ తీసుకొనిపోతేపోయారు. ఇంతమాత్రానికే చెడేదిలేదులే అని వాటివిషయమై దిగులుపడలేదుకాని, తాను దొంగతనం చేసినట్టు నలుగురిలోనూ అపకీర్తిపాలుకావలసివచ్చిందే అనిమాత్రం దుఃఖించాడు. ధైర్యం తెచ్చుకొన్నాడుమళ్లా; తల్లికి ధైర్యం చెప్పి, లేవదీసి ఓదార్చాడు. మరికొంత సేపటికి భార్య వచ్చింది: ముగ్గురూ కాస్సేపు

కళ్లనీళ్లుపెట్టుకొన్నారు. "ఇక ఊరుకోండి. ఇంతటితో మనం అదృష్టవంతులమే" అని కొండడు వాళ్లను ఊరడించి, లేచి నీళ్లు పోసుకొందామని, కడవదగ్గరికి పొయ్యేవరకు —కరణమూ, రామిరెడ్డి పిలుచుకొని రమ్మన్నారని కొండడితావుకు ఒకమనిషి వచ్చి పిలిచాడు. నీళ్లుపోసుకొని కొండడు లక్ష్మమ్మ ఇంటికి పోయాడు, మళ్లా ఏం తెచ్చిపెట్ట బోతున్నారో అని భయపడుతూ. బసవయ్యా, రామిరెడ్డి, లక్ష్మమ్మా ముగ్గురూ కలిసి కొండణ్ణి పదిబూతులు తిట్టి, పోలీసుకు రిపోర్టుచేస్తామని బెదిరించి, కొరతపడ్డ వరి కట్టల ఖరీదుకిందా, దొంగతనం చేసినందుకు అపరాధంకిందా వాడికి పదిహేను రూపాయలు జుల్మానా విధించి, ఆ పైకం అప్పుడే రొఖ్ఖరూపంగా కట్టినాసరే, లేకుంటే లక్ష్మమ్మపేర రూపాయికి నెలకు అణావడ్డి వంతున అప్పుపత్రం వ్రాసియిచ్చినాసరే, ఏదోఒకవిధంగా తీర్మానంచేయాలని కస్తీ చేశారు. వారు చేసినపంచాయితీకి కొండడికి కడుపు దహించుకొనిపోతోంది.

"నన్ను అడ్డంగా పండబెట్టి ముక్కలు ముక్కలుగా నరికినాసరే నేను మాత్రం ఒక్కదమ్మిడీగూడా అచ్చుకోలేను" అని వాడు అనేవరకు

"నీమదం అణుస్తా నుండరా, పొగరు బోతుగాడిదకొడకా! ఊళ్లోవాళ్లసొత్తు దొంగతనంచేసి, తేరగా ఇంట్లోవేసుకొని తినడమనుకొన్నావా" అని బసవయ్య గ్రుడ్లు వురిమి, లక్ష్మమ్మసేద్యగాళ్లలో ఒకగవండ్లవాణ్ణీ, ఒకగొల్లవాణ్ణీ పిలిచి "ఒరే, మీరు పోయి కొండడి ఇంటికాడ బర్రెగొడ్డును కొట్టకొనిరాండి. వీడేమో ఒళ్లు తెలియకుండా మాట్లాడుతున్నాడు" అని ఉత్తర్వు చేసేవరకు, ఇద్దరు సేద్యగాళ్లూ ఆక్షణంలోనే పోయి బర్రెను, కొండడు లక్ష్మమ్మఇంటికాడ వుండంగనే తోలుకొనివచ్చి, లక్ష్మమ్మ పశువులదొడ్లో కట్టినేశారు.

"ఏంచేసినా చెల్లుబడి అవుతుందిగదా అని మీరందరూ కలిసి చేస్తున్నారు ఈపనులన్నీ. ఇంతకంటె మీరు నన్ను చెడగొట్టే దేముంది? అన్ని పాపుణ్యాలూ ఆభగవంతుడే కనిపెడ్తాడు లెండి" అని లోపల కుతకుతలాడే హృదయాన్ని తననిస్సహాయస్థితివల్ల జనించిన వేదాంతంతో తృప్తిపెట్టుకొంటూకొండడు ఇంటికి పోయాడు.ఇంటిదగ్గర తల్లీ,భార్యా గోలుగోలు మని ఏడుస్తున్నారు. పొద్దుగుంకి ఇంటికిచేరిన మాల అమ్మలక్కలు కూడా పోగయి దవడలు నొక్కుకొంటూ నిలబడ్డారు. కొండడు తల్లినీ, భార్యనూ కూక లేసి ఏడుపుమానిపించి ఆరాత్రి గంజితాగి పండుకొన్నాడు.

తెల్లవారింది. కొండడు రెండుకట్టల వరి కర్రలూ పోయినందుకు దుఃఖపడలేదు గాని, ఎట్లాలేదన్నా కనీసం ముప్ఫయిరూపాయలు కిమ్మతుచేసే నిక్షేపంవంటి బర్రె పోయినందుకుమాత్రం కొంత విలపించాడు. తెల్లవారి లేచి చూచేవరకు వాకిట బర్రెలేక ఇల్లంతా

బారుమన్నది. ఎట్లాగైనా కొంత ప్రయత్నం చేసి పై వారికి తెలుపుకొని, పోయిన బర్రెను మాత్రం తిరిగి తెచ్చుకొందామని మహాదోగ్లాడినాడు. కాని భత్యఖర్చుకైనా చేతిలో దమ్మిడీ లేకపోయె! ఇక వ్యవహారం ఎట్లా జరపగలడు! అదిగాక బసవయ్య రాక్షస ముండాకొడుకు: రామిరెడ్డి, లక్ష్మమ్మా బలవంతులు. తానుపోయి బర్రెను తీసుకుపోయారని ఏపోలీసువారితోనైనా చెప్పుకొంటే, బసవయ్యా, రామిరెడ్డి కలిసి, అసలు తన మీదక తెచ్చిపెట్టిన దొంగతనం నేరాన్ని ఏతప్పుసాక్ష్యమో సృష్టించి, పెంచి పెద్దది చేసి తుదకు తన్ను ఏజైలులోనైనా నెట్టిస్తారేమోనని భయపడ్డాడు కొండడు, ఎప్పుడూ ఇట్లాంటి ఇట్టాలుపడ్డవాడు కాదు కాబట్టి. వాడికి ముందువ్యవహారం జరపడానికి ధైర్యం చాలలేదు. తాను దొంగతనం చేసినట్టు వచ్చిన అపనిందకే సగం చచ్చి తిరుగుతున్నాడు. "దానితాడు తెగిరి, పోతేపోయింది బర్రె: నే నీతంటాలు పడలే" నని నిశ్చయించుకొని ఊరుకొన్నాడు కొండడు.

ఇంతలోనే తనగ్రామజమాబందీ, తాలూకాకచ్చేరికాడ డిప్టీకలెక్టరుగారు - ఇక నాలుగురోజుల్లో - జరుపుతారని తెలిసింది. రైతులు తమతమ కష్టసుఖాలన్నీ డిప్టీకలెక్టరు దొరతో చెప్పుకోవడానికై తలాఒక అర్జీ వ్రాసుకొని జమాబందిరోజున దొర దగ్గరకు పోతున్నారు. కొండడు తనకయ్యకి కాలవకోసరం పెట్టుకొన్న అర్జీలమీద ఇంకా ఉత్తరవు లేమీన్నీ రాలేదు. పోనీ జమాబందీలో దొరగారితో కాలవసంగతి మొరపెట్టుకొని చెప్పుకొందామని, కొండడుకూడా ఒకఅర్జీ వ్రాయించుకొని జమాబందీనాడు తాలూకాకచ్చేరికి పోయినాడు. అర్జీదార్లను పిలిచినవెంటనే తనఅర్జీకూడా ఇచ్చాడు. దొరగారికి దణ్ణంపెట్టి తనకు కాలవ యిప్పించవలసిందని కోరగా, డిప్టీకలెక్టరు పక్కకూర్చున్న తహాశీల్దారువైపు చూశాడు. "గ్రామాల్లో పార్టీలు పెంచుకొని, తగవులాడుకొని, ప్రతీవాళ్లూ కాలవలు కావాలని కోరుతున్నారు సార్! ఈ అర్జీదారుకు అరెకరాభూమికంటె జాస్తి లేదు. వీడిమట్టుకు వీడికికూడా ఒకకాలవ కావలెనంటే ఎట్లా వస్తుంది? ఒకరికిగనుక ఇచ్చినామంటే, ఇక ప్రతీరైతూ తనప్రతికయ్యకూ ఒకకాలవ యిప్పించమంటాడు. ఇది సాధ్యం అయ్యే పనిగాదు సార్!" అని తహాశీలుదారు జవాబుచెప్పాడు.

"అవునవును మీరు చెప్పింది నిజమే" నంటూ డిప్టీకలెక్టరు కొండడివైపు తిరిగి "నీకు ప్రత్యేకంగా కాలవ యివ్వడానికి వీల్లేదు. నీ అర్జీ తోసివేశాం" అని ఉత్తరువు చేశాడు.

"అయ్యా! నేను బీదవాణ్నండి, నా కయ్యకు నీళ్లుపారించుకొనే ఆధారంలేదండి" అన్నాడు కొండడు.

"గ్రామంలో వెయ్యా, రెండువేల ఎకరాలకు నీళ్లుపారుదల అవుతూ వుంటే నీ అరెకరాకయ్యకూ నీళ్లు రావడంలేదంటే ఎవరైనా నమ్ముతారా—?" అన్నాడు డిప్టీ కలెక్టరు.

"లేదు సామీ! లక్ష్మమ్మగారూ, కరణం బసవయ్యగారూ కలిసి నన్ను అన్యాయం చేస్తున్నారు సామీ! నామీద చోరీనేరం పెట్టి నాబర్రెగొడ్డును తోలుకొనిపోయారు సామీ! తమరు కటాక్షించకుంటే నాకయ్యను బీడెట్టుకుని పోవలసిందే సామీ!" అని కొండడు గోలచేశాడు.

"ఒరే, ఇది కచ్చేరీగాని, మీమాలవాడ కాదు, తెలుసునా? నీనడవడిక మంచిదయితే గ్రామంలో ఆసాములు నీరురానియ్యకుండా ఎందుకు చేస్తారు? అరెకరాకయ్య గలవాడివి. నువ్వు లక్షాధికార్లతో తగవు పెట్టుకోవచ్చురా?" అన్నాడు డిప్టీకలెక్టరు.

"వీడు గజదొంగ సార్! వీడ్ని కె. డి. రిజిష్టరులో చేర్చడానికి పోలీసు సబిన్స్పెక్టరు గారు రాసుకొనిపోయారు సార్!" అని అక్కడనే నిలబడివున్న కరణం బసవయ్యగారు ఆ కొరవ పూరించాడు.

"గొప్పవాళ్లతో ఎన్నడూ తగవు పెట్టుకోకూడదురా: పో! పో! ఆలక్ష్మమ్మ కాళ్లూ, కడుపూపట్టుకొని నలుగురితోపాటు నువ్వుకూడా నీళ్లుపారించుకో. పో, ఆమెతో తగవులు పెట్టుకోకు" అన్నాడు డిప్టీకలెక్టరు దొర.

"అయ్యా! నామీద అబద్ధపుకేసు పెట్టి ఈకరణం బసవయ్యగారు అన్యాయంచేస్తున్నారండి" అన్నాడు కొండడు.

"పోరా! జమాబందీలో అవన్నీ విచారించడానికి మాకు వీల్లేదు. నీ కేదైనా అన్యాయం జరిగితే సాక్ష్యం తెచ్చుకొని మేజస్ట్రీటులోనో, సివిల్లోనో దావాపెట్టుకో. మే మేమీ చెయ్యడానికి వీల్లే"దని దొర ఇంకో అర్జీదారును పిలిచాడు. నెత్తిన గుడ్డవేసుకొని దిగులుతో కొండడు ఇంటికి పోయాడు.

జమాబందీ అయినమర్నాడే తాలూకాలో జరిగినసంగతంతా లక్ష్మమ్మకు తెలిసింది. మాలవాడికి బాగాజరిగిందని చంకలు తట్టుకొంది. వ్యవహారం తమకు అనుకూలమై కొండడికి కాలవ ఇవ్వడానికి వీల్లేదని దొర తీర్మానంచేశాడుకాబట్టి, అనుకొన్న ప్రకారం ఫయిసలుచేయించవలసిందని రెవిన్యూ ఇన్స్పెక్టరు లక్ష్మమ్మకాడికి కబురు చేశాడు. ఇప్పుడు చేతిలో దమ్మిడీఅంటే దమ్మిడీ లేదని జవాబు చెప్పుతూ, కొండడికి పట్టా కిచ్చినకయ్య పట్టామార్పించి తన పేర పట్టాను తెప్పించినట్టయితే దానికీ, దీనికీ కూడా కలిపి అనుకొన్నది ఇస్తానుగాని ఇప్పుడేమీ ఇవ్వడానికి వీలులేదని జవానుతో చెప్పి పంపింది లక్ష్మమ్మ. ఇన్స్పెక్టరు నిట్టూర్పుపుచ్చి తలవంచుకొని ఊరుకొన్నా

డు. ఇంతలోనే కొండడు వచ్చి ఇన్‌స్పెక్ట రుకు దణ్ణంపెట్టి—

"సామీ! నాకు కాలువ తెప్పిస్తా నంటిరి. ఆఖరుకు డిష్ట్రిక లెక్టరుదొర ఒప్పు కోకపోయె: నాఅయిదురూపాయలూ నాకు పారెయ్యండి" అని అడిగాడు.

"ఇదేమీ వంకాయలబేరం కాదు: కొరవ అయిదురూపాయలూ నీవు అప్పుడే ఇచ్చిఉంటే, నీ కీపాటికి కాలవ వచ్చేఉండు ను. స్వల్పంలో అజ్ఞాయించినందుకు వ్యవ హారం ఇట్లా అయింది. చేతికివచ్చిన పైకాన్ని వాపసుయిచ్చే ఆచారం మనదగ్గరలేదు. పో" అన్నాడు ఇన్‌స్పెక్టరుపంతులు. ఉసూరు మంటూ కొండడు వెళ్లిపోయాడు.

కొండడికి చెడ్డరోజులు వచ్చినవి. బం గారు పట్టితే మట్టయిపోతోంది. లక్ష్మమ్మకు తనమీద ఇంతపగ ఎందుకో వాడికి అర్థం కాలేదు. ఆమెసొతు తనేమీ ఆశించలేదు. ఆమెకుతోడు ఇప్పుడు బసవయ్యగారుకూడా వాడికి పగవాడయినాడు. కాలంకర్మంకూడా ఒనగూడిన ట్లయింది వాడికి: ఎవరితోపోయి చెప్పుకోవడానికీ వాడికి దిక్కు తోచలేదు. కయ్యకోసం తెచ్చిన అప్పు పెరిగిపోతోంది. లక్ష్మమ్మతో వ్యవహారం ముదిరిపోయింది. బసవయ్యపగ తాచుపగే; ఎప్పు డేంజేస్తాడో అని దిగులు. వెనుకటి గుండెనిబ్బరం చెడింది. ధైర్యం పలచబడుతోంది కొండడికి.

ఇంట్లో కూటికి గింజలులేక, ఆ మరు నాడు చీకటితోనే తనకుప్ప తొక్కించాలని ఆరోజు తనూ తనభార్యా ఇద్దరూ పొలం పోయి కళ్లం బాగుచేసివచ్చారు. మాలవాడ లోనే పదిపశువుల్ని వాళ్లనీ వీళ్లనీ అడిగి సంపాదించుకొన్నాడు. తెల్లవారుజామున పోయి కుప్ప పడగొట్టా లనుకొని, సర్వమూ సిద్ధంచేసుకొన్నాడు. ఇంకా ఇద్దరు కూలి వాళ్లనుమాట్లాడుకొన్నాడు. రాత్రి భోజనం చేసుకొని నెలపొడవంగనే లేచిపోదా మను కొని పెందలకడనే నడుంవాల్చాడు కొండడు

జమాబందీలో కొండడు డిష్ట్రిక లెక్టరు దొరతో చెప్పిన నేరాలకు బసవయ్య ఉగ్రుడై కొండణ్ణి నమిలి మింగివేయాలని ఉన్నాడు. లక్ష్మమ్మ కోపమూ, బసవయ్య కోపమూ అంతా ఇప్పుడు బసవయ్యలోనే మూర్తీభ వించిపోయింది. "మాలవెధవ, దమ్మిడీకి కొరగానివెధవ, పబ్లీకులోకి వచ్చి, బ్రాహ్మణ్ణి నామీద దొరదగ్గిర తంటాలు చెప్తాడా? హుం! నేను నియోగిబిడ్డను. వీడికి నామజా ఇంకా తెలియదు కాబోలు: అయిందేదో అవనే అయింది. ఇంతవరకూ వచ్చింతర్వాత వెనక్కు తిరిగితే, పంతులు ఆఖరికి మాలాడి చేతిలో చిక్కుకొన్నా డంటారు నలుగు రూను. కాబట్టి ఇక గ్రామంలో వాడైనా కాపురం ఉండాలె! నేనైనా కాపురం ఉం డాలె! అంతేగాని వాడూ నేనూ ఈగడ్డ మీద కాపురం చేస్తామంటే వట్టికల్ల! తన అంతరమేమి! నాఅంతరమేమి? చెప్పాలుమోసే

వెధవ! నాతోసమానంగా దొరదగ్గర నిలబడి మాట్లాడడమేకాకుండా, పైగా నామీద నేరాలు చెప్పి, తాచుపాముతో చెలగాటా లాడు తాడా? వీడిఅంతు పట్టిచూస్తా" అని బసవయ్యాపంతులు పరవళ్లు తొక్కుతున్నాడు. కొండణ్ణి పిలిపించి సమక్షంలోవాణ్ణి నాలుగు బూతులూ తిట్టి పంపడం అంటే ఆయనకు తృప్తికాలేదు. శాశ్వతంగా నిలిచేటట్టు వాడికి తగినశిక్ష చేయా లనుకొని తీర్మానం చేసుకొన్నా డాయన. తాను వేసుకొన్న ప్లానుకు ఇక కొండడితో మాట్లాడకపోవడమే మంచి దనుకొన్నాడు. తనహృదయ గోళంలో ప్రజ్వలించే క్రోధాగ్ని ప్రత్యక్షంగా బయటపడి శత్రునాశనం చేయవలసిందేగాని అంతవరకూ దాన్ని బయటపెట్ట కూడ దనుకొన్నాడు. తనలోపల తాను కుమిలి కుతకుత ఉడికిపోతున్నాడు బసవయ్యాపంతులు.

ఆరోజు సాయంత్రమయింది. బీదలను హింసించే దుర్మార్గుల చర్యలను చూడలేకేమో సహస్రకరుడు ప్రాపంచికదృశ్యధాన్నుండి చాటుకు పోయాడు. ఆ అసురసంజ వేళ బసవయ్యా రామిరెడ్డిని పిలుచుకొని లక్ష్మమ్మఇంటికి పోయాడు. బసవయ్యాకూ, లోకానికీ కూడా అంధకారం అలుముకొంది.

"పంతులూ! ఆకయ్య మనకు దఖలు పడేటట్టు చేస్తూ. నీధర్మాన్న కాలవ పోనే పోయిందే! మాలవాణ్ణి మటుమాయంచేసి, కయ్యలోకయ్యా కలుపుకొనేదాకా నాకు నిద్రపట్టదు, పంతులూ! - ఇదిగో! ఈపని కూడా నీచేతిలోనే ఉంది" అని లక్ష్మమ్మ అనే వ ర కు — "తొందరపడకు. వాడికి అంత్యకాలం సమీపించిందిలే; ఇప్పుడు నేను వచ్చింది అసలు ఆపనికొరకే" అంటూ పంతులూ, రామిరెడ్డి, లక్ష్మమ్మా మిద్దె మీదికి పోయి, ఒకఅరగంటసేపు ఏమేమిటో గుసగుసలాడుకొన్నారు. స రే న ం టే స రే ననుకొని అందరూ మిద్దెదిగి కిందికి వచ్చారు. ఎవరిదారిన వారు వెళ్లారు. బసవయ్యా ఇంటికి పోయి, ఉడుకునీళ్లు పోసుకుని సాయంసంధ్య వార్చుకొని భోజనం చేసి పండుకొన్నాడు.

కొండడి యింట్లో కొండడు నిద్రపోతున్నాడు. బసవయ్యా యింట్లో బసవయ్యా నిద్రపోతున్నాడు. జగత్తంతా నిద్రపోతున్నది ఒక్కలక్ష్మమ్మతప్ప. ల క్ష్మ మ్మ కాదినం ఏకాదశీపర్వం. నిద్రపోలేదు. జాగారం చేస్తోంది. తనతోపాటు రామిరెడ్డినికూడా మేలుకో బెట్టి అతనివల్ల భాగవతం చదివించి విం టోంది. రామిరెడ్డికీ ఆత్రంగానే వుంది — పడుకొంటేబాగుండుననేమో.

నెలపొడిచి కొండణ్ణీ, వాడిభార్యనూ నిద్రలేపింది. కూలివాళ్లను కేకవేసి చద్దన్నం మూటకట్టుకొని, పశువులను తోలుకొని కొండడూ, వాడిభార్యా ఇద్దరూ వెంటనే కుప్పకాడికి బయలుదేరారు. ఒక పావుగంటసేపటికి వాళ్లు కుప్పకి కనుచూపుమేర దూరంలోకి వచ్చారు. చూస్తాడుకదా తేరిపార కొండడు, పొగా మంటా కనపడింది

వాడికి తన కుప్ప వున్న స్థలంలో. ఇదేమా అని వాడికి గుండె బేజారయింది. నవనాళ్లూ కుంగిపోయాయి. వొళ్లు తెలియలే దక. గుండెలు కవుక్కొంటూ వొక్కటేపేరెం తీశాడు కొండడు కుప్పకాడికి.

వచ్చాడు, కొండడు మండుతూన్న కుప్పకెదురుగ్గా నిలబడ్డాడు. అప్పటికే కుప్ప నలువైపులా అగ్నిహోత్రుడిసందెట్లో చిక్కుకుంది. చిటపటమంటూ మంట బ్రహ్మాండంగా మండిపోతోంది. తూర్పుగాలి అందుకొని అగ్నిహోత్రుడికి తోడయింది. ఎవరితరం ఆర్పడ మిక? ఆకాశానికంటా యెగసిపోయే ఆమంటలకు వాడి వొళ్లుకూడా మంటలెక్కిపోతూంది. మొగాన నెత్తురుచుక్కలేదు. చూశాడు చూశాడు కుప్పకేసి; నివ్వెరపోయి వెర్రిచూపులు చూశాడు. చైతన్యం స్తంభించిపోయింది. మండుతున్న కుప్పకేసి కొయ్యబరిపోయి చూస్తూ కుప్పగూలి పోయాడు కొండడు.



# నూతన రాజ్యాంగము - చెన్నరాష్ట్రము

మోచెర్ల కృష్ణమూర్తి

నూతన భారత రాజ్యాంగచట్టమునందు నిర్వచింపబడిన రాష్ట్రీయస్వపరిపాలనావిధాన మితర రాష్ట్రములతోపాటు చెన్నరాష్ట్రమునందు గూడ రాబోవు ఏప్రిలుమాసారంభము నుండియు ఆచరణలోనికి రానున్నది. స్వపరిపాలనారంభముతో ప్రజల దుస్థితిని తొలగించి సంపదలతో తులతూగచేయగలమని ఆశించువారీ రాజ్యాంగమువలన తమయాశయము లెంతవరకు సిద్ధిపొందగలవో పరిశీలింపగడంగు టవసరము. ప్రజల స్థితి నభివృద్ధిపరుపవలెనని ఏమంత్రివర్గమునకుగాని రెండువిధములగు సౌకర్యము లుండవలెను. అందు మొదటిది నిజమగు రాజకీయాధికారము; రెండవది ధనసమృద్ధి. రాష్ట్రములందు పరిపాలనాధికారమునంతను, ప్రజలకు బాధ్యతవహించు మంత్రుల కప్పగింపబడినటుల నూతనరాజ్యాంగశాసనమున గన్పరుపబడినను, ప్రత్యేకాధికారములు, బాధ్యతలు అనుపేర్లతో నాయధికారమునంతను తిరిగితీసుకొని, గవర్నరులచేతులలో నుంచిరని ఎల్లరు నంగీకరించుచున్న విషయమే. గవర్నరాయధికారములనుపయోగించినయెడల రాష్ట్రీయస్వపరిపాలనము నేతిబీరకాయవంటిదే యగును. కాని ఆ తదాయధికారముల నుపయోగింపనియెడల దేశీయాభివృద్ధికి రాష్ట్రీయప్రభుత్వములందు రాజకీయములగు ప్రతిబంధకములుండవని అంగీకరింపక తప్పదు. అట్టిచో నిక గావలసినది ధనము. ఎవరు మంత్రిపదవులకు వచ్చినను ఆదాయములేనిది ఏమియు సాధింపజాలరు. కావున నూతన రాజ్యాంగమునందు జాతీయాభివృద్ధికరములగు పనులను నిర్వహించుటకు, చెన్నరాష్ట్రీయార్థికపరిస్థితు లెంతవరకనుకూలముగనున్నవి, వీనికి కావలసినధనమును సంపాదించుట కొసగబడిన అధికారము లెంతవరకు కార్యసాధకములు గాగలవు అనువిషయములు విచారణీయములు.

ప్రభుత్వములకును వ్యక్తులకును అర్థశాస్త్రములందు ముఖ్యముగ నొక్క భేదము గలదు. వ్యక్తులకు ధనోపార్జననుబట్టి ఖర్చు. ప్రభుత్వములకు ఖర్చునుబట్టి ధనోపార్జన. వ్యక్తులు ముందుగా తమ రాబడిని చూచుకొని ఖర్చును దానిలో సర్దుబాటు చేసుకొనవలెను. ప్రభుత్వములు ప్రజాక్షేమమునకుగాను అవసరమగు ఖర్చులను ముందు నిర్ణయించుకొని, తరువాత అందు కవసరమగుపన్నులను విధింపవలెను. ఈసూత్రము ననుసరించి నూతనరాజ్యాంగమున రాష్ట్రీయప్రభుత్వములు నిర్వహింపవలసిన కార్యభారమును ముందుగా దెలిసికొని ప్రభుత్వమువారి కొసగబడిన పన్నులఅధికారములను తరువాత పరిశీలింపవలసియున్నది.

## రాష్ట్రీయప్రభుత్వబాధ్యతలు

రాష్ట్రీయ ప్రభుత్వము నిర్వహింపవలసియున్న కార్యములు రాజ్యాంగశాసనమునందు సె ౨౪౬ (౨)లో సూచింపబడెను. చట్టనిర్మాణ మొనర్చుటకు రాష్ట్రీయ శాసనసభల కేయేవిషయములం దెంతెంతవరకు అధికారముగలదో ఆయావిషయములం దంతంతవరకు పరిపాలనా కార్య నిర్వహణాధికారము రాష్ట్రీయప్రభుత్వములకు గలదని ఆసెక్షనునందు గలదు. రాష్ట్రీయ శాసనసభలు చట్టనిర్మాణ మొనర్పగల విషయములు రాజ్యాంగశాసనమున కనుబంధముగ చేర్చబడిన ౭వ పట్టికయందు గన్పించును. అందు ౬౬ అంశములు గలవు. అందులో ౩౯ వరకును రాష్ట్రీయ ప్రభుత్వములు నిర్వహింపవలసిన కార్యములకు సంబంధించినవి. మిగిలినవి రాష్ట్రీయాదాయ మార్గములకు సంబంధించినవి. అందు మొదటి ౩౭లో ఎక్కువ వ్యయముతో గూడిన కొన్ని యంశము లీక్రింద గానవగును — ౧. ప్రజాశాంతి రక్షణము, న్యాయపరిపాలన. ౨. పోలీసుశాఖ. ౩. కారాగారములు. ౪. ప్రజారోగ్యము, పారిశుద్ధ్యము,

వైద్యశాలలు. ౫. విద్యావ్యాప్తి. ౬. రోడ్లు, మైనరురైల్వేలు వగైరా రహదారులు. ౭. ఇరిగేషను. ౮. వ్యవసాయము, పశువైద్య సౌకర్యములు. ౯. అడవులు. ౧౦. ప్రభుత్వఋణములు. ౧౧. పరిశ్రమలు. ౧౨. పేదలకు సహాయము, నిరుద్యోగ నివారణము. ౧౩. రాష్ట్రీయోద్యోగశాఖలు మొదలైనవి.

## నిరుద్యోగ నివారణము

పైన పేర్కొనబడినవానిలో పేదలకు సహాయము, నిరుద్యోగనివారణము దప్ప మిగిలిన వన్నియును ఇదివరకుగూడ రాష్ట్రీయప్రభుత్వములచే నిర్వహింపబడుచున్న కార్యములేగాని క్రొత్తవిగావు. క్రొత్తవగు నీకార్యమున కెంతధనము గావలసియుండునో మొదట పరిశీలింతము. భారతదేశమున, అందు ముఖ్యముగ చెన్నరాష్ట్రమున ప్రజలలో పేదరికమును, పనిలేనిస్థితియు విపరీతము. జీవనోపాధులులేక, తిన తిండిలేక విసిగి ఆత్మహత్యల గావించుకొనుచున్న వార్తలు పత్రికలయందు సర్వసాధారణ మగుచున్నవి. ప్రజలలో నిరుద్యోగులుగనున్న వారి సంఖ్యల దెలిసికొనుట కింతవర కీరాష్ట్రమున నెట్టి యేర్పాటులును గావింపవు. కనుక సరియైన సంఖ్యల దెలిసికొనుట అసాధ్యమగు కార్యము. ఇట్టి స్థితిలో ఉన్న యాధారములనుబట్టి వీరి సంఖ్యను నిర్ణయించుకొనవలసియున్నది. కడచిన జనాభాలెక్కలలో చెన్నరాష్ట్రమును గురించి తెలుపబడిన ఈ క్రింది సంఖ్యలు మన పనికి కొంతవరకు తోడ్పడవచ్చును:-

| | |
|---|---|
| ౧. ధనార్జనగలవారు | ౧౭, ౯౦౨, ౮౦౬ |
| ౨. ఆర్జన స్వల్పమగుటచే ఇతరులపై కొంతవర కాధారపడెడివారు | ౮,౦౦౧, ౬౮౪ |
| ౩. సార్జనలేక ఇతరులపై నాధారపడియున్నవారు. | ౨౦, ౮౩౫, ౬౧౭ |

పైనుదాహరింపబడిన మూడుతరగతులలో రెండవదగు, తగినంతపనిలేక ఇతరులపై నాధారపడియున్న వారిని మొదట దీసుకొనుడు. వీరిపుడుచేయుపని వారిలో సగముమందికి సరిపోవునని యెంచినను, సుమారు ౪౦ లక్షలమంది పనిలేనివారు తేలెదరు. మూడవతరగతిలో చిరుతవయస్సువారును, కడువృద్ధులను, పనిచేయజాలని స్త్రీలను మినహాయించుటకు గాను ౧౮౦ లక్షలను తగ్గించినను, పనిచేయగలిగి పనిలేక జీవనాధారములు లేనివారు ౨౮ లక్షలమందిగాయైన నుందురు. పట్టణములందును పల్లెలందునుగూడ పనిలేకతిరుగుచుండు మధ్యతరగతి కుటుంబములలోని వారిని స్వయముగ జూచుచుండువారికీ సంఖ్యయందతిశయోక్తిదోషముండునని భావింపజాలరు. ఈసందర్భమున, ఆర్జనపరులలో చేర్పబడిన వ్యవసాయపరిశ్రమోపజీవనులలోనున్న నిరుద్యోగసమస్యనుగూడ గమనింపవలసియున్నది. ౧౯౩౧ జనాభాలెక్కలలో వీరినిగురించి ఈ క్రింది వివరములు గాన్పించును :

### వ్యవసాయవృత్తిలోనివారు

| | | | |
|---|---|---|---|
| ౧. | వ్యవసాయముచేయని భూస్వాములు | | ౪౧౨,౭౮౯ |
| ౨. | ,, | చేయు | ౪,౭౬౭,౫౧౬ |
| ౩. | ,, | ,, కవులుదార్లు | ౧,౫౧౮,౯౯౧ |
| ౪. | ,, | చేయని | ౨౦౪,౮౩౩ |
| ౫. | | చేయు పాటకపుజనము | ౫,౩౧౩,౩౧౧ |

వీరిలో ౧,౪ తరగతులప్రజలు పనిలేనివారి క్రిందనే లెక్కింపబడవలసియున్నను, పేదవారినిగ పరిగణింప వీలులేదు. మిగిలిన మూడు తరగతులలో ౧౧, ౫౯౯,౦౧౮ మంది గలరు. మనదేశమున వ్యవసాయపరిశ్రమయందున్నవారికి సంవత్సరమునందారుమాసములు పనిలేక వ్యర్థముగ గడుపవలసివచ్చుచున్న విషయము సుప్రసిద్ధము. వీరి పనిలేనిస్థితిని జనులసంఖ్యలోనికి మార్చినయెడల వీరిలో ౫౮ ల. మందికి పనిలేదని చెప్పవలసియుండును.

సుమారు ౧౨ లక్షలమందికి పనికల్పించిననే గాని చెన్నరాష్ట్రమున ప్రజలలో నిరుద్యోగస్థితి నివారణగాజాలదని పైలెక్కలవలన దెలియవచ్చును. అంచనాలలోపముక్రింద ౨౮ లక్షలు మినహాయించినను అధమమొక కోటిమందికైనను ప్రభుత్వమువారు పనికల్పింపవలసియుందురు. లేనిచో ఇతరనాగరకదేశములందలి ప్రభుత్వములవలె పనిలేనివారికి దినభత్యములనైన చెల్లింపవలసియుందురు. రెంటిలో నేదియు చేయనిచో

ప్రజలయెడల తమకర్తవ్యమును విడనాడినవా రయ్యెదరు. తల ౧కి నెలకు రు. ౫౦ చొ॥న దినభత్యముల చెల్లించినను, ఈయొక్క కార్యమునకే సాలీనా రు. ౬౦ కోట్ల ధనమును సిద్ధపరచుకొనవలసియుండును. ఈ పద్ధతి కంటె ప్రజలకు లాభకరములగు పరిశ్రమల నెలకొల్పి ప్రోత్సహించుచు, విదేశీయపోటీకి నిలుచునట్లు సహాయమొనర్చుట తక్కువ వ్యయకరముగు పద్ధతి. కాని ఇందుకైనను సాలీనా నాలుగైదుకోట్ల రూప్యములను వెచ్చించుచుండవలసియుండును.

## విద్యావ్యాప్తి

నిరుద్యోగనివారణతప్ప మిగిలిన కార్యములలో ముఖ్యమైన వన్నియును ప్రస్తుతము రాష్ట్రీయప్రభుత్వములచే నిర్వహింపబడుచున్నవియేయని గుర్తించియుంటిమి. అందుచే నీశాఖలలో ఇదివరకుకంటె ఎక్కువ వెచ్చింపవలసిన యవసరముండదని భావించుట సహజము. కాని అది పొరబాటు. దేశీయాభివృద్ధికరములని చెప్పబడు శాఖలన్నిటియందునుగూడ ప్రస్తుతము వెచ్చింపబడుచున్న మొత్త మత్యల్పము. ఈ కార్యములు సంతృప్తికరముగ నిర్వహింపబడవలెననినయెడల ఇప్పటికంటె అనేకరెట్లధికముగ వెచ్చింపవలసి యుండును. ఉదాహరణకు విద్యాశాఖను దీసుకొనుడు. చెన్నరాష్ట్రమునగల జనసంఖ్యలో ఇపుడు నూటికి ౯౨ నిరక్షరాస్యులుగ నున్నారు. తమప్రజల కందరకు ఉచితముగ ప్రారంభవిద్యనొసగుట ప్రభుత్వముయొక్క ప్రధాన బాధ్యతయని నాగరిక ప్రభుత్వములన్నియు నంగీకరించుచున్నవి. కడచిన జనాభా లెక్కలప్రకార మీరాష్ట్రమున ౫-౧౫ సం॥ల మధ్యవయస్కులు ౧౨౦ లక్షలమంది గలరు. ౬-౧౨ సం॥ల లోనివారే ప్రారంభవిద్యార్థిదశయందుందు రనుకొని భావించినను, సుమారు ౯౦ లక్షలమంది యుందురు. ౧౯౩౩ ౩౪ సం॥న వీరిలో ౨,౪౧౭,౪౧౦ మంది ప్రారంభపాఠశాలలలో విద్య నభ్యసించుచున్నారు. అనగా విద్యా సౌకర్యములేని యుక్తవయస్కులింకను ౭౦ లక్షలకు తక్కువగాకుండ నుండిరని భావింపవచ్చును. ప్రారంభ విద్యాతరగతులలో బాలురకు

రు. ౧౦-౪-౦ చొ. నను, బాలికలకు రు. ౨౩ చొ. నను ఖర్చగుచున్నటుల లెక్కలవలన దెలియుచున్నది. సగటున ౧౬ చొప్పున చూచినను రు. ౧౧ కోట్లు గావలసియుండును. ఇప్పటికంటె నింకను అభివృద్ధినిగోరు సెకండరీ, ఉన్నత వృత్తివిద్యాసౌకర్యముల ఆవశ్యకతలు ఇంకను ఈ మొత్తమునందు చేరలేదు.

## వైద్యసౌకర్యములు

ప్రజల కిపుడుగల వైద్యసౌకర్యములస్థితి నించుక చూతము. ప్రస్తుత మీరాష్ట్రమున గ్రామసీమలలో ౧౧౦౭ వైద్యశాలలును, పట్టణప్రాంతములలో ౨౪౯ వైద్యశాలలును గలవు. సుమారు ౧౪౨౨౬౦ చ. మై. విస్తీర్ణమును, ౪౭౦ లక్షల జనాభాయును, ౫౨౩౪ గ్రామములును గల చెన్నరాష్ట్రమున కీ వైద్యశాలల సంఖ్య అత్యల్పము. సగటున ౩౫ వేలమంది ప్రజలకును, నూరు చ. మై విస్తీర్ణమునకును, ౫౦ గ్రామములకును ఒక్కొక్క వైద్యశాల, వైద్యసౌకర్యముల నొసగవలసియున్నది. ఇది యెంతదుస్సాధ్యమగు కార్యమో వేరుగ చెప్పనక్కరలేదు. అనగా. ౧౦ వేలమంది జనాభాకును, ౧౦ గ్రామములకును, ౨౮ చ. మై. విస్తీర్ణమునకును ఒక్కొక్క వైద్యశాల నేర్పరచినను, ఇపుడు వెచ్చించుచున్నదానికంటె రు. ౩ కోట్లయినను క్రొత్తగా వెచ్చింపవలసియుండును.

## పశువైద్య సౌకర్యములు

వ్యవసాయకమగు మనరాష్ట్రమునకు, అందును ముఖ్యముగ రైతుపశుసంతతియొక్క క్షేమ మెంతముఖ్యమైనదో వేరుగ చెప్పనక్కరలేదు. అట్టిపశుచికిత్స కిపుడీ రాష్ట్రమునకంతకును సుమారు ౧౨౦కంటె పశువైద్యశాల లెక్కువలేవు. అనగా, సగటున ౧౦౦౦ చ. మై. ప్రాంతమునకు, ౪౨౦ గ్రామములకు ఒక్కొక్కవైద్యశాల పనిచేయుచున్నది. ప్రతివత్సరమును జాడ్యములచే లక్షలకొలది పశువులను గోల్పోవుచు, కోట్లకొలది రూప్యముల నష్టమునకు గురియగుచున్న రైతులకు నిజముగ పశువైద్య సౌకర్యముల నందుబాటులోనికి దేవలెనినయెడల ౪౦ గ్రామముల కొక్కొక్క పశువైద్యశాల నేర్పరచినను

ఎక్కువగాదు. అట్లగుచో, ప్రభుత్వమువారిపుడీ శాఖపై వెచ్చించుచున్న రు. ౧౦ లక్షలకు పదిరెట్లు, అనగా ఒకకోటిరూపాయలైన నీశాఖయందు వెచ్చింపవలసియుండును.

## ఇతర శాఖలు

ప్రజారోగ్యము, పారిశుధ్యము, పరిశ్రమలు, వ్యవసాయము మొదలగు ప్రజాక్షేమకరములగు కార్యములకొరకిపుడు వెచ్చించుచున్న మొత్తములుగూడ అత్యల్పము. మంచినీటి సౌకర్యములులేని వేలకొలది గ్రామములలో బావులు, లక్షలకొలది ప్రజలను ప్రతివత్సరమును పొట్టను బెట్టుకొనుచున్న మలేరియా మొదలగు వ్యాధుల నివారణకు ఏర్పాటులు, రోడ్ల సౌకర్యములులేని వేలకొలది గ్రామములకు రోడ్లు అత్యవసరమగు పనులు. వీనిలో నొక్కొక్కదానికే కోట్లకొలది వెచ్చింపవలసియుండును. వీనికొరకిపుడు వెచ్చించుచున్న మొత్తములుగాక సాలీనా మరి రెండు కోట్లయినను గావలసియున్నది.

## ఆదాయ మార్గములు

చెన్నరాష్ట్రీయ ప్రభుత్వము ఇప్పటికంటె ఎక్కువగను, క్రొత్తగను పూనుకొనవలసియున్న కార్యములను గురించిమాత్రమే ఇంతవరకాలోచించితిమి. ప్రస్తుతము రాష్ట్రీయపరిపాలనకుగాను ౧౭ కోట్లు వెచ్చించబడుచున్నవి. దానిని తగ్గించుట సులభసాధ్యము గాదు. ౪౨ కోట్లకు తక్కువగాని పరిపాలనాకార్యభారమును నిర్వహించుటకు రాష్ట్రీయప్రభుత్వముల కొసగబడిన పన్నుల అధికారముల నిక పరీక్షింతము. రాష్ట్రీయాంశములు నిర్వచింపబడిన ౨-వ పట్టికయందు ౩౯ నుండి ౫౪ వరకునుగల పద్దులయందీ క్రిందిపన్నులు పేర్కొనబడెను. ౧. భూమిశిస్తు, ౨. అబ్కారీఫీజులు, ౩. వ్యవసాయాదాయములపన్ను, ౪. ఇండ్లు, భూములు వగైరా ఆస్తులపై పన్ను, ౫. వ్యవసాయపుభూములకు వారసత్వపుపన్ను, ౬. గనులువగైరాలలో స్వామ్యతలఫీజు, ౭. తలపన్ను, ౮. వృత్తిపన్ను, ౯. జంతువులపైపన్ను ౧౦. వస్తువిక్రయములు, అడ్వర్టయిజ్‌మెంట్లపై పన్ను, ౧౧. ప్రాంత్యాదిగుమతులపైపన్ను, ౧౨. వినోదములపై పన్ను, ౧౩. స్టాంపుఫీజులు, ౧౪. ప్రయాణికులపన్ను, ౧౫. టోలుగేట్లపన్ను, ౧౬. రాష్ట్రీయశాఖలలో వసూలుచేయదగు ఇతరఫీజులు.

వీనిలో వ్యవసాయపు ఆదాయపుపన్ను, తలపన్ను, వ్యవసాయపు వారసత్వపుపన్నులు మాత్రము క్రొత్తవి. మిగిలినవన్నియును ఇదివరకే రాష్ట్రీయప్రభుత్వమువారిచే కొన్నియు, స్థానికసంస్థలచే మరికొన్నియు వసూలుచేయబడుచున్నవి. క్రొత్తపన్నుల విషయమాలోచించుటకు పూర్వము ఇపుడున్న పన్నులనుగురించి కొంత ప్రస్తావింపవలసియున్నది. ఈపన్నులవలన వచ్చుచున్న ౧౭ కోట్ల ఆదాయములో ౭ కోట్లు భూమిశిస్తువలనను, ౪ కోట్లు అబ్కారీఫీజులవలనను వచ్చుచున్నది. ప్రజలకు బాధ్యులగు మంత్రులు పరిపాలనాధికారమును వహించుచో నీరెండు పన్నులునుగూడ పూర్తిగ మార్పుచెందవలసియుండును. భూమిపన్ను పేదరైతులకు చాలదుర్భరముగనున్నదనియు ప్రజలేగాక చాలమంది అధికారులుగూడ అంగీకరించుచున్నారు. అన్నిరాజకీయ పక్షములును భూమిశిస్తుపద్ధతిని సంస్కరించుటను తమకార్యవిధానమునందు ప్రధానాంశముగ నిడుకొనియున్నవి. కనుక నీభూమిపన్ను ఇకమీద వ్యవసాయపు ఆదాయపు పన్నుగ మార్పబడునని యూహింపవచ్చును. అటులగానిచో భూమిశిస్తురేటుల తగ్గించుటవలన గలుగు లోటును భర్తీచేయుటకు వ్యవసాయాదాయపు పన్ను ఉపయోగించును. అంతియుగాని అదనపు ఆదాయమున కుపకరింపజాలదు. ఇక అబ్కారీఫీజుల విషయము. నేటి ప్రజాభిప్రాయమును పరికించినచో స్వపరిపాలిత భారతదేశమునందు మద్యపానము సంపూర్ణముగ నిషేధింపబడునని భావింపవలసియున్నది. సంపూర్ణనిషేధము నవలంబించుచో రు. ౪ కోట్ల అబ్కారీ ఆదాయమును అంతరించును. అపుడీ లోటును భర్తీచేసుకొనుట కితరమార్గముల నన్వేషింపవలసియుండును.

## క్రొత్త పన్నులు

ఇక, రాష్ట్రీయప్రభుత్వముల కొసగబడిన క్రొత్త పన్నుల యధికారము లెంతవరకు ఆదాయసాధకములు

గాగలవో చూతము. వీనిలో వ్యవసాయాదాయపు పన్ను క్రొత్తఆదాయమున కుపకరింపజాలదని పైన గుర్తించియుంటిమి. ఇక వ్యవసాయపువారసత్వములపన్ను విషయ మాలోచింతము. ఈపన్నుయొక్క భారము ఇప్పటికే పన్నులభారమును సహింపలేక శిథిలమగుచున్న వ్యవసాయపరిశ్రమపై పడుననువిషయమును మరువవీలులేదు. అంతియగాక ఇతరవిధములగు ఆస్తులపై గూడ వారసత్వపుపన్ను విధించుటకు రాష్ట్రీయప్రభుత్వముల కధికారమున్నట్టుల గన్పింపదు. ఇతరఆస్తులకు ఇట్టిపన్ను లేనపుడు ఒక్క వ్యవసాయకులకు మాత్రము విధించుటవలన ప్రజాబాధమును బడయజాలదు. దేశమునకు ప్రాణాధారమైనట్టి వ్యవసాయపరిశ్రమను శిథిలపరచు నీ పన్నును విధించుట లాభకరమును గాదు.

ఇక వీనిలో మిగిలినది "తలపన్ను" ఇంగ్లాండు క్రిందిదేశములయందు విప్లవముల యనంతరమీపన్ను తొలగింపబడినది. కేవల మనాగరకమగు నీపన్ను నాగరికజాతులయందెచ్చటను గన్పింపదు. సామ్రాజ్యవాదులగు పాశ్చాత్యజాతులవారు తమ పరిపాలనయందు అనాగరికజాతులవారిపైన మాత్రమే దీనిని విధించుచున్నారు. అర్థనీతివిరుద్ధమును, అనాగరకము నగు నీపన్నువలన ఆదాయము కొంచెము క్రొత్తగారాకపోగా ప్రజలలో అశాంతి యధికమగునని చెప్పవచ్చును. నూతన రాజ్యాంగమునందు చెన్నరాష్ట్రప్రభుత్వమువారు నీవిధముగ జాతీయాభివృద్ధి కరములగు కార్యములను దలపెట్టవలెననినచో, క్రొత్త ఖర్చులకుగాను రు. ౨౧ కోట్లును, అబ్కారీ ఆదాయము ను తొలగించుటచే గలుగు లోటును భర్తీచేయుటకు ౪ కోట్లును, వెరశి కనీసము రు. ౨౫కోట్లు, వెంటనే గాకపోయినను క్రమముగా కొలదివత్సరములలోనైనను, క్రొత్త ఆదాయమును సాధింపవలసి యున్నది. రాష్ట్రీయప్రభుత్వములకు క్రొత్తగా నొసగబడిన పన్నుల అధికారము లీకార్యమున కెంత నిష్ప్రయోజనమైనవో చూచియుంటిమి. ఇపుడున్న ౧౭ కోట్లఆదాయము సాధారణపు ఖర్చులకే సరిపోవుచున్నదిగాని, జాతీయాభివృద్ధి కరములగు పనుల కేమాత్రమును మిగులుటలేదు. కేంద్ర ప్రభుత్వమువారు రాల్చిపెట్టుచున్న ఆదాయపు పన్నునందు కొంతభాగము ముజరావచ్చినను, అది ౩౦, లేక ౪౦లక్షలకంటె నెక్కువగాదు. ఇదియైనను ౫ సం వత్సరముల తరువాత గాని ఇప్పుడుగాదు. హెచ్చు వేతనముల నందుచున్న ప్రభుత్వోద్యోగుల వేతనములను తగ్గించినను, మరితక్కువ వేతనము లొసగబడువారి వేతనములు హెచ్చింపవలసియుండుటచే నది ఈకార్యముల కుపకరింపదు. కనుక, నీరాష్ట్రీయ స్వపరిపాలనా రాజ్యాంగము ప్రజల కెక్కువ ఉపకారముల నొనర్పదలచు మంత్రివర్గములకు బ్రహ్మాండమగు నార్థిక సమస్యల నెదుర్కొనవలసియున్నది. శాసనసభ్యుల సంఖ్యయు, ఉద్యోగుల సంఖ్యయు అధికమగుటచే వారి వేతనాదికముల భారము వహించుట తప్ప, సాధారణ పరిస్థితులలో నూతనరాజ్యాంగమువలన ప్రజల కెక్కువ ప్రయోజనము గల్గునని భావించుట కవకాశము గన్పింపదు.



# భారతీ మహిళా మండలి



శ్రీమతి సుందరమ్మాళ్, యం. ఏ.,
లండను విశ్వవిద్యాలయమున యం. ఏ. పట్టమును పొందిన యువతి. జంత్ర (వీణ) గాత్ర సంగీతమున మిక్కుల ప్రావీణ్యముగల యువతి. బ్రిటిషు బ్రాడ్ కాస్టింగున వీణ వాయించిన ప్రథమ భారతీయ యువతి




మిస్ షికీను షుజిత్ ఆలీ, యం. ఇ. ఎస్.
మదరాసు విద్యాశాఖ సర్వీసులో ఉద్యోగమును బడసిన ప్రథమ మహమ్మదీయ స్త్రీ. గా॥ నర్మెంటు హాస్పిటల్ ట్రెయినింగు హైస్కూలు సూపరింటెండెంటుగా నియమింప బడినది.



శ్రీమతి న్నాప్రగడ చెన్నగంటమ్మ. యం. ఏ.,
రాసు విశ్వవిద్యాలయమున నీయేడు ఈమె యం. ఏ. పరీక్షలో ప్రథమ స్థానము నలంకరించినది. బి. ఏ. లో అట్లె ప్రథమ స్థానము నలంకరించినది. ఇంటర్మీడియేటులో మొదటి తరగతిలో కృతార్థురాలయినది. ఈమె వయస్సు ౨౨ ఏండ్లు. ఈమె రా. స కల్లి చిట్టి అబ్బాయినాయడిగారి కూతురు అన్నాప్రగడ కృష్ణారావు (B. S. C. Hons) గారి ? ర్య

# లోకాస్సమస్తా స్సుఖినోభవంతు

కపిల కాశీపతి

ఇరవైరెండు సంవత్సరాల క్రితం మానవులంతా పశుప్రాయులై, మారణయంత్రాలతో ఒకర్ని ఒకరు నాశనం చేసుకున్నారు. ఆ మహాసంగ్రామంలో కేవలం సైనికులేకాక శాంతంగా జీవితంగడిపే నాగరికులు, గ్రామీణులుకూడా మరణించినారు. మరణించిన సైనికులసంఖ్య ౧౩,౦౫౫,౦౦౦; యుద్ధంలో పని చెయ్యకపోయినా యుద్ధంవల్ల నశించినవారి సంఖ్య ౨౮,౩౭౯,౦౦౦; ప్రాణాలుపోకపోయినా యావజ్జీవం బాధపడేటట్టు గాయపడినవారు, గ్రుడ్డి, నష్టినారైన ప్రజ ౨౩,౦౦౦,౦౦౦. ఒక్క బ్రిటిషు సామ్రాజ్యంలోనే ౧,౦౯౦,౦౦౦ మంది మరణించినారు; ౨,౨౦౦,౦౦౦ గాయపడినారు.

గుండె చెరువైపోతుంది ఆనాటి దురంతాలు తలుచుకుంటే. శక్తిచచ్చి, ఇక యుద్ధం చెయ్యలేక శాంతి అనే మారుపేరుతో ఒకర్నొకరు భక్షించడానికి వెర్సెయిల్సులో యూరపుదేశాల ప్రతినిధులుకూడిన సమావేశంలో, అమెరికా సంయుక్తరాష్ట్రాల అధ్యక్షుడు వుడ్రోవిల్సను అంతర్జాతీయసమితి నిర్మించాలని బోధించినాడు. కారణాంతరాలవల్ల విల్సనుదేశమే సమితిలో చేరలేదు. రష్యాకూడా సమితిలో చేరలేదు. అన్యాయం జరిగిన జర్మనీకూడా అప్పుడు చేరలేదు. తరువాత చేరి సభ్యత్వం చాలించుకున్నది. జపానుకూడా జర్మనీవలెనే సమితిలోంచి వెళ్లిపోయింది. సమితి యూరపుదేశంలో కొన్ని దేశాల సమితి అయిపోయింది. ఆకారణంచేతనే విల్సను మహాశయుడి ఆశయం భగ్నమైంది. తత్పూర్వమే పరమపదించినాడు మహానుభావుడు, అదృష్టవంతుడు!

ఇరవైరెండు సంవత్సరాల తరువాత, ఈనాడు, యుద్ధం చెయ్యడానికి భయపడుతూ, ఎవటివారి బలం చూసి భయపడి తమ బలం ఎక్కువచేస్తూ, ఈ విపరీతన్యాయంవల్ల దేశంలో ప్రజల సౌకర్యాలు అరికట్టుతూ, చీకటికూపంలో రాజకీయవేత్తలంతా వెల్తురుకోసం దేవులాడే సమయంలో, ఇంకో అమెరికాఅధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డిలానో రూజువెల్టు ప్రపంచశాంతిసమావేశం ఒకటి ఆహ్వానిస్తానని ప్రకటించినాడు. ఉద్దేశ్యం ఉత్తమమైనది. ఉపాయం కొనసాగుతుందా అని మాత్రం సందేహం.

ఈ సమావేశానికి ఆహ్వానించబడే కొందరు ప్రతినిధులు బ్రిటిషు సామ్రాజ్యపు చక్రవర్తి ఎనిమిదవ ఎడ్వర్డు, రష్యా, జర్మనీ, ఇటలీ నియంతలు, ఫ్రెంచి నిరంకుశ ప్రభుత్వపు అధ్యక్షుడు ఇత్యాదులు. ఈ అభ్యర్థులలోనే కొందరు ప్రస్తుతం అశాంతికి కారణం అవుతున్నారన్న సంగతి రూజువెల్టుకి తెలియకపోలేదు. దొంగకే తాళపు చేతులు ఇస్తే మంచిదనే ఉద్దేశ్యం కావచ్చును. కాని, ఈ సమావేశం ఒకవేళ జరిగితే ప్రపంచశాంతిసంస్థాపన చెయ్యకలుగుతుందా అని ప్రశ్న. చెయ్యలేదని నిర్భయంగా చెప్పవచ్చును. దీనికి ఆధారం ప్రపంచచరిత్ర, మానవస్వభావం.

రూజువెల్టుకి పూర్వం, విల్సనుకిపూర్వం అమెరికాసంయుక్తరాష్ట్రాలకు మన్రో అనే అధ్యక్షుడుండేవాడు. అతనికాలంలో ఇంకా యూరపు అమెరికా ఖండాల సంబంధబాంధవ్యాలు స్థిరపడలేదు. తల్లిదేశాలనే పేరుతో అమెరికా వలసరాజ్యాల వ్యవహారాలలో యూరపురాజకీయవేత్తలు అనవసరజోక్యం కలుగజేసుకోవడం కద్దు. ఈ అనవసర ప్రమేయంవల్ల అంతర్జాతీయకలహాలుకూడా వస్తూవుండేవి. అమెరికా ఖండాలలో శాంతివుండాలంటే యూరపుదేశాలు అమెరికావిషయాలలో జోక్యం కలుగజేసుకోకూడదని మన్రోమహాశయుడికి మనస్సులో నాటింది. అమెరికా ఖండాల రాజ్యాలన్నీ నిరంకుశ ప్రజాప్రభుత్వాలు. ఆ ప్రభుత్వాలతో సంప్రదించినాడు. సంయుక్తరాష్ట్రాల

ప్రభుత్వం పెద్దది. సామ్రాజ్యం సంపాదించాలనే కోరిక లేదు. అమెరికా ప్రభుత్వాలన్నీ సఖ్యంగావుండి మన వ్యవహారాలు మనమే ఎందుకు దిద్దుకోకూడదు? ఇతర దేశాలు మనమీదకి రాకుండా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం మిమ్మల్ని కాపాడుతుంది. అని వాగ్దానంచేసినాడు. అంతా అంగీకరించినారు. వెంటనే జేమ్సు మన్రో యూరపుఖండాన్ని దూరంగా వుండమని హెచ్చరికచేసినాడు. ఇకముందు యూరపు అమెరికా రాజకీయాలకు సంబంధంలేదన్నాడు. ఈసిద్ధాంతమే "మన్రోసిద్ధాంతం" అంటారు. అమెరికాలో ఇది అమలుపర్చడంవల్ల శాంతి చేకూరింది. యూరపులో ఆయుధసామగ్రులు తయారుచేసే దుర్మార్గుల ప్రభుత్వాలవల్ల బొలీవియా, పెరాగ్వే అనే రెండుచిన్న దక్షిణఅమెరికారాజ్యాలకుమాత్రం ఛాకో అనేసరిహద్దు ప్రదేశంకోసం చాలాకాలం యుద్ధంజరిగింది. అదికూడా ఇప్పుడు ఆగిపోయింది.

తీవ్రంగా ఆలోచిస్తే "మన్రోసిద్ధాంతం"లోనే శాంతిమార్గం వున్నదని బోధపడుతుంది. ఈసిద్ధాంతంవల్ల ప్రపంచంలో దాదాపు సగభాగమైన రెండుఖండాలలో శాంతిచేకూరింది. ఇకమిగిలినవి మూడుఖండాలు—ఆసియా (ఆస్ట్రేలియాతో సహా), ఆఫ్రికా, యూరపు. వీటిలోమాత్రం శాంతి స్థాపించడానికి మార్గంలభించదా? మన్రోసిద్ధాంతమే వీటికికూడా మందు.

అసలు ప్రపంచంలో అశాంతికి కారణం ఏమిటి? యుద్ధభయం యుద్ధమెందుకు? భూమి ఆక్రమించడానికి. భూమిదొరికితే బువ్వదొరుకుతుందని ఆశ. యుద్ధంకూడా ఒకవిద్యే. కోటివిద్యలూ కూటికోసమే. యుద్ధంకూడా అందుకే.

ఈనాడు లోకంలో తిండిలేదా? వున్నది. కావలసినవారికిమాత్రం అది లభించడంలేదు అమెరికాలో ధరలు పడిపోతే, అవి పెంచడానికి పంటనాశనం చేస్తున్నారు. ఆహారం ఉత్పత్తిచెయ్యడంలో ప్రపంచం లోపం చెయ్యడంలేదు. నిజానికి ప్రజలకిసరిపోయే ఆహారం వుండనే వున్నది. చలామణీకాక మూల కుళ్లిపోతున్నది. ఇదే కలిమిలో లేమి అంటే. లోపం వుత్పత్తిలో కాదు; పంపకంలో. పండించిన రైతుకు మిగిలేదిలేదు, సుఖంలేదు. పనిచేసే కూలివాడికి దొరికేది లేదు, తిండిలేదు. మరి ఇదంతా ఎవరనుభవిస్తున్నారు? పనిచెయ్యని సోమరిపోతులు. అమెరికాలోనూ అంతే, ఆస్ట్రేలియాలోనూ అంతే. ధనవంతుల స్వార్థంవల్ల దేశంలో కరువు, కాటకం కలుగుతున్నవి. ఆస్వార్థానికి మందు ఆలోచించలేక, వృద్ధిఅయ్యే ప్రజలకు తిండిలేదనే నెపంతో, నీరసంగావున్న దేశాలమీద పడడమే ఉపాయం ఆధునిక ప్రభుత్వాలకు. జపాను మంచూరియామీద పడితే ఇటలీ అబిస్సీనియామీద పడింది. జపాను వర్తక వ్యాపారానికి అడ్డులేకపోతే జపానుప్రజలకు కరువు వుండదు; జపానుమంచూరియాను ఆక్రమించవలసిన అవసరంలేదు. ఇటలీలో ఆర్థికదుస్థితి లేకపోతే ముస్సోలినీ యుద్ధప్రయత్నానికి అవసరంలేదు. ఈ కరువుకి, ఈ ఆర్థికదుస్థితికి కారణం ఏమిటి? దేశాలస్వార్థం. జాతీయోద్యమం అనే పేరుతో ఎగుమతి దిగుమతుల మీద అంతులేని సుంకాలువేసి, ఆర్థిక సంగ్రామం సాగించినవి ఆధునిక దేశాలు. ఆ సంగ్రామమే ఈ కలిమిలో లేమికి కారణం. నిజంగా సంగ్రామానికి దారి. ధనవంతుల స్వార్థం దేశంలో కరువుకి కారణం అయితే, బలవంతమైన దేశాల స్వార్థం లోకంలో కరువుకి కారణం. ఆకలిబాధకంటె తీవ్రమైన బాధలేదు. అది తీరకపోతే, దానికి కారకులైనవారి కేనాటికైనా మోసమే. ఆకలిగొన్న ప్రాణాల చేతుల్లో రష్యా సామ్రాజ్యం నాశనమైంది. ఏదోవిధంగా ఈ ఆకలి తీరకపోతే తక్కిన సామ్రాజ్యాలు కూడా కూలవలసిందే.

దేశంలో మనుష్యుల ఆకలివలెనే లోకంలో దేశాల ఆకలికూడా తీర్చాలి. లేకపోతే తిరుగుబాటు తప్పదు. వున్నవారికి కీడు. ఇటలీ అబిస్సీనియాను ఆక్రమించి దేశాలఆకలి ఎంతతీవ్రంగావున్నదో చూపించింది. జపాను మంచూరియాను తనవశం చేసుకొన్నదికూడ అందుకే. ఏదోవిధంగా ప్రపంచవ్యాపారం, వ్యవహారం, అందరికీ సరిసమానంగా పంపిణీజరిగే విధం అనుసరించకపోతే అబిస్సీనియా యుద్ధంతో కథ ఆగిపోదు. జాతీయ,

అంతర్జాతీయ ఆర్థికనిర్మాణం సరిచేస్తేతప్ప యుద్ధభయం పోదు. దేశాలు బాగుచెయ్యడానికి ఆసాముల బారి నుంచి పరిశ్రమలూ, వ్యాపారం తొలిగించి ప్రభుత్వమే అవి తీసుకోవాలి. అంతర్జాతీయ ఆర్థికస్థితి బాగుచెయ్యా లంటే సుంకాలు తీసేసి స్వేచ్ఛావ్యాపారంసాగనివ్వాలి. ఇవి రెండూ జరిగినతర్వాత రాజకీయశాంతి స్థాపించ డానికి ప్రయత్నించాలి. యుద్ధానికి ముఖ్యకారణమైన ఆర్థికసంగ్రామం రూపుమాపితే శాంతి సంస్థాపన సులువు.

ఇతర యుద్ధకారణాలలో ముఖ్యమైనది జాతి వైషమ్యం. మానవకుటుంబం అంటారు సాధారణంగా నిజమే. ఒకేజాతికిచెందిన జంతువులుకాబట్టి మానవు లంతా సఖ్యంగా వుండవలసిందే. కాని ఈపెద్దజాతిలో ఉపజాతులు చాలావున్నవి. మానవజాతి అయిదు ఉప జాతులుగా విభజింపబడింది. కాకేషియన్, మంగో లియన్, నీగ్రో, మలయా, అమెరికా జాతులు.

కాకేషియనుల్ని ఇండో యూరోపియనుజాతి అనికూడా వాడుతున్నారు. ఈజాతి శాస్త్రానుసారం తెల్లగావుండాలి, కాని అక్కడక్కడ మార్పులువున్నవి. యూరపుఖండవాసులు, పర్షియా దేశస్థులు, యూదులు, అరేబియావారు, ఆది హిందువులు, ఆఫ్ఘనులు, కొందరు ఉత్తరఆఫ్రికా వాసులు, ఈనాడు అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో నివసించే తెల్లజాతుల సంతతులు ఈతెగకు చెందినవారే.

మంగోలియాజాతి పసుపువర్ణముకలది. చీనా, జపాను, సయాము, బర్మా, టిబెట్, కొరియాదేశాల వారు ఈజాతికి చెందినవారు. రష్యాలో, టర్కీలో, ఉత్తరఆశియాలో ఈజాతివా రున్నారు.

నీగ్రోలు నల్లజాతివారు. ఆఫ్రికా ఆదిమనివాసులు నీగ్రోలు. అబిస్సీనియావారు నీగ్రోలు. ఆస్ట్రేలియాలో, మలయాద్వీపాలలో, టాస్మేనియాలో వుండే పూర్వ నివాసులు ఈ జాతికి చెందినవారే.

అమెరికాజాతివారంటే నేటి అమెరికనులుకారు. అసలు పేరు ఎర్ర ఇండియనులు. అమెరికాలో అనాదినుంచీ నివసించినవారు వీరు.

ఈ అయిదుజాతులలో తెల్లజాతి, అనగా ఇండో యూరపియనుల జనసంఖ్య అందరికంటె పెద్దది. వీరు ముఖ్యముగా యూరపు ఆశియాదేశాల నివాసులు. మొత్తం ౭౨౫,౦౦౦,౦౦౦. తరువాత పెద్దజాతి మంగో లియనులు. వీరి నివాసము ముఖ్యముగా ఆశియాలో. మొత్తం ౬౫౦,౦౦౦,౦౦౦. తరువాత పెద్దజాతి మలయాజాతి.

కాలక్రమంలో ఈ జాతులు ఒకదానిలో ఒకటి కలిసిపోయినవి. ఒకే కుటుంబంలో శరీరనిర్మాణాన్ని అనుసరించి రెండు మూడు జాతులు పరిశీలించవచ్చును. కాని రంగును బట్టి, నాగరికతనుబట్టి తెల్ల, నల్ల, పసుపు, ఎర్రజాతుల విభేదాలు పోలేదు. ఈనాడు రెండు జాతులు ఉచ్చదశలో వున్నవి. అవి తెల్ల, పసుపు జాతులు. ఒకదాని ముఖ్యస్థానము యూరపు. రెండవ దాని ముఖ్యస్థానము జపాను. తెల్లజాతి ఇతర జాతుల్ని తన వశం చేసుకున్నది; అందులో ముఖ్యముగా నీగ్రో జాతుల్ని. ఉపజాతిలో మళ్లీ చిన్న విభేదాలున్నవి. అట్టిదే యూదులకీ, ఆర్యులకీ వున్న భేదం. జర్మనీలో ఈ జాతి విభేదమే వైషమ్యంగా మారి హిట్లరుపరి పాలనకు తీరని కళంకంగా వున్నది. యూదుల హింస జాతి వైషమ్యానికి ముఖ్య దృష్టాంతం. అమెరికాలో ఎర్ర ఇండియనుల వినాశనము, నీగ్రోల హీనస్థితి, ఇవి కూడా జాతుల తగాదాలకు చెందినవే. ఇటలీ అబిస్సీ నియా యుద్ధం తెల్లజాతుల వైషమ్యం వృద్ధి చేసినది. ఇటలీ అబిస్సీనియా బదులు స్విట్జర్లాండుమీద యుద్ధం చేస్తే అంతర్జాతీయసమితి వూరుకునేదా? ఫ్రాన్సు బ్రిటను దేశాలు వూరుకునేవా? అబిస్సీనియా నల్లజాతి కాబట్టి అంత నిర్దయగా, నిర్లక్ష్యంగా విడిచిపెట్టినారు. దక్షిణాఫ్రికాలో భారతీయుల కష్టాలకు కారణంకూడా ఈ జాతివైషమ్యమే. ఇది చాలావరకు యుద్ధాలకుకారణ మైనది.

ఏజాతికి ఏదేశం అనుకూలమో, జన్మస్థానమో అక్కడ వుండకుండా ఇతరప్రాంతాలు ఆక్రమించడం వల్ల వచ్చిన కీడు ఇది. ఇందులో ఎక్కువ అపరాధం చేసింది కాకేషియను, అనగా యూరపుజాతి. తమకు

పనికిరాని దేశాలలో, వాతావరణాలలో బతుకుదామని ప్రయత్నం. ఆప్రయత్నంలో ఇతరజాతుల్ని నాశనం చేస్తున్నారు. వారు ఎదురుతిరిగితే అశాంతి అంటారు. ఈవిధమైన అశాంతి పోవాలంటే ప్రపంచంలో వున్న జాతులన్నిటిని విభజించి ఎవరి స్వదేశాలలో వారిని సద్దాలి. ఎవరికి ఏ వాతావరణం మంచిదో అక్కడ వార్ని వుంచాలి. ఆస్ట్రేలియాలో చాలాభాగం తెల్లదొరల నివాసానికి పనికిరాదు. ఆఫ్రికాకూడా అంతే. కాని అక్కడివారు తావేప్పుడ్చుకుని, నల్లజాతుల్ని బానిసలుగా వుపయోగించి పనిచేస్తున్నారు. అటువంటిప్రదేశాలు వారు స్వదేశీయులికి విడిచిపెట్టాలి. రంగునుబట్టిగాని, జాతినిబట్టిగాని ప్రభుత్వాలు యేర్పాటుచేసి అప్పుడు అంతర్జాతీయసమితిస్థాపిస్తే సార్థకం అవుతుంది.

జాతివిభేదాల తర్వాత పూర్వంనుంచీ యుద్ధాలకు కారణమైంది మతం. మధ్యయుగంలో క్రైస్తవులూ, మహమ్మదీయులూ యుద్ధాలుచేశారు. రెండు మతాలకూ పుణ్యక్షేత్రమైన మధ్యఆశియాలో కొంతభాగంకోసం చిరకాలం తగవులాడినారు. మానవచరిత్రలో కొన్ని పెద్ద యుద్ధాలు మతావేశంవల్ల జరిగినవి. "క్రూసేడ్సు" అనే క్రైస్తవ మహమ్మదీయ యుద్ధాలకు కారణం మతావేశమే. గజనీమహమ్మదు దండయాత్రలు ధనంకోసమేకాక హిందూమత విధ్వంసంకోసంకూడ చేసినాడు. శ్రీఛత్రపతి శివాజీ చేసిన యుద్ధాలు హిందూమతోద్ధరణంకోసమే. పుష్యమిత్రుడు దిగ్విజయంచేసి అశ్వమేధయాగం చేసింది బ్రాహ్మణమతం పునస్థాపితం చెయ్యడానికే.

మధ్యయుగంలో క్రైస్తవులు "క్రిసెండం" స్థాపించి అదే శాశ్వతంగా వుంటుందని భావించినారు. మతావేశ పరులైన క్రయిస్తవులు తిరిగీ ఆక్రీస్తురాజ్యం లోకంలో స్థాపించాలని ప్రయత్నిస్తారు. అప్పుడప్పుడు ప్రపంచశాంతిసంస్థాపనకు క్రీస్తుమతమే మార్గమని ప్రకటిస్తారు.

మహమ్మదీయులలోకూడా ఇటువంటిదే ఒకనమ్మకం వున్నది. ఏనాడో ప్రతిమహమ్మదీయుడు మతవ్యాపన చేసి శాంతిస్థాపించవలసిన అవసరం వస్తుందని వారి నమ్మిక. ఇందుకుగాను లోకంలోవున్న మహమ్మదీయ రాజ్యాలన్నీ కలిపి ఒకసంస్థ యేర్పాటుచెయ్యవలెనని ప్రయత్నాలుకూడా జరుగుతున్నవి. టర్కీ నాయకత్వం కింద, ఈజిప్టు, మధ్య ఆశియాలోవున్న ఇతరమహమ్మదీయ రాజ్యాలు కలిపి ఒకసంస్థ యేర్పాటు చెయ్యవలెననే ఆశయం కొందరు మహమ్మదీయ నాయకులికి ఉన్నది.

హిందూమతంలో కూడా కలికావతారంవచ్చి ధర్మసంస్థాపన చేస్తుందన్న నమ్మిక ఇటువంటిదే. బౌద్ధమతం హిందూమతంనుంచి విడిపోయినవారి మతమయినా, ఇతరమతాలకంటె హిందూమతంతోనే ఎక్కువసంబంధం కలది. జపానుమతం బౌద్ధమతం. చీనాకూడా చాలావరకు బౌద్ధమే.

ఇవే ప్రపంచంలో పెద్దమతాలు. క్రైస్తవులు మూడు తెగలు- రోమనుకేతలిక్కు, సనాతనకేతలిక్కు, ప్రోటెస్టెంటు. వీరిజనసంఖ్య వరుసగా ౩౩౧,౫౦౦,౦౦౦ — ౧౧౪,౦౦౦,౦౦౦ — ౨౦౬,౮౦౦,౦౦౦. వీరు అన్ని దేశాలలోనూ వున్నారు. ముఖ్యంగా అమెరికా యూరపుఖండాలలో. ప్రపంచంలో మహమ్మదీయులు ౨౫,౮౩,౨౩,౦౦౦. వీరుకూడా ప్రపంచం అంతా వ్యాపించివున్నారు. హిందువులు ౨౩౦,౧౫౦,౦౦౦; బౌద్ధులు ౧౪,౧౦౦,౦౦౦.

ఇంకా ఇతరచిన్నమతాలు వున్నవి. మతాలమూలంగా శాంతిసంస్థాపన చెయ్యవలెనంటే ఏమతస్థులికి ఆరాజ్యం ప్రజాప్రభుత్వంగా ఇచ్చేసి ఇతరులు జోక్యం కలుగజేసుకోకుండా వుండాలి. మతమే ప్రాధాన్యమైతే భారతదేశం యాజమాన్యంకింద తూర్పుఖండమంతా ఒక ఫెడరేషను చెయ్యవచ్చు. కీర్తిశేషురాలైన ఆనీబిసెంటు ఈసంగతే ఘోషించేది. మతాలకు పుట్టినిల్లయిన భారతదేశమే ప్రపంచశాంతికి మార్గం అవుతుందని దివ్యజ్ఞాన సామాజికులు కొందరినమ్మకం. అప్పుడు మధ్య ఆశియాలోవున్న మహమ్మదీయరాజ్యాలూ ఈజిప్టుటర్కీ యాజమాన్యంకింద ఒక ఫెడరేషను

ఏర్పాటుచెయ్యాలి. అమెరికా ఇప్పటి మాదిరిగానే వుంది, యూరపులో మాత్రం కేథలిక్కు, ప్రొటెస్టెంటు మతాలవారీగా రాజ్యాలు విభజించి కూటాలు ఏర్పాటు చెయ్యడం మంచిది. ఇతర చిన్న మతాలకు స్వతంత్ర ప్రదేశాలు ఇచ్చి, వారికి సన్నిహితమైన పెద్దమతసంస్థలకు అంటగట్టడం మంచిది.

ఈనాటి అశాంతి చాలావరకు రాజకీయాలు మతాలకు దూరం కావడంవల్ల సంభవిస్తున్నదని చాలా మందివాదన. భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలంటే అంతా మహమ్మదీయులు కావాలన్నాడు డాక్టరు భగవానుదాసు ఒకసారి. ప్రపంచశాంతి కావాలంటే అంతా క్రిస్టవులు కావాలన్నాడు. నిజానికి మతాలన్నీ ఒకటే తత్వం చెప్పినప్పుడు ఈ విభేదం ఎందుకనిపిస్తుంది "ఆకాశాత్ పతితం తోయం యథాగచ్ఛతి సాగరం, సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అని ప్రతిదినం పఠించే హిందువుల పెద్దలికి ఏ మతమైనా ఒకటే జ్ఞానంవుంటే భగవంతుడొకడే. కాని అజ్ఞానమే హెచ్చు నేటి లోకంలో.

ప్రస్తుత పరిస్థితులలో శాంతి అనేది అసంభవం. పశ్చిమ యూరపు దేశాల సమితి అనీ, తూర్పు యూరపు దేశాల సమితి అనీ సలహాలు వస్తున్నవి. దక్షిణ ఆఫ్రికా రాజ్యాలకు స్వాతంత్ర్యం ఇచ్చి ఆఫ్రికా సంయుక్త రాష్ట్రాలు నిర్మించాలని ఒకరి వాదన. అమెరికాఖండాల సమితి స్థాపించమని ఒకరి సలహా. తూర్పు ఖండం తనకు వదలమని జపాను కోరిక. నిజానికి చీనా జపాను వ్యవహారాలలో పాశ్చాత్యదేశాలు కలుగజేసుకోకుండా వుంటే తూర్పుఖండంలో శాంతిచేకూరుతుంది. దాన్నే జపాను మన్రో సిద్ధాంతం అంటారు.

అసలు లోపం స్వాతంత్ర్యం అస్వాతంత్ర్యం అనే పదాలలో వున్నది. అవ్యత్యాసంపోతేగాని శాంతి చేకూరదు. స్వతంత్రంగావున్న ఫిలిప్పైను ద్వీపాలు అమెరికాకు బలమని గ్రహించి అమెరికా ఆదీవులకి స్వరాజ్యం ఇచ్చింది. అల్లాగే ఈజిప్టు విషయంలో బ్రిటను ప్రవర్తించింది. ఈరీతిమాత్రే అచిరకాలంలో తక్కిన అస్వాతంత్ర్యదేశాలుకూడా తమహక్కులు పొందవచ్చునన్నే ఆశ కలుగుతుంది. ఫ్రెంచిసామ్రాజ్యం ఫ్రాన్సుకంటె ఇరవైరెండు రెట్లు ఎక్కువ. హాలెండు సామ్రాజ్యం హాలెండుకంటె అరవై రెట్లు ఎక్కువ వైశాల్యంగా వున్నది. బెల్జియంకంటె బెల్జియంకాంగో అనే రాజ్యం యెనభై రెట్లు పెద్దది. బ్రిటనుకంటె బ్రిటిషు సామ్రాజ్యం నూటనలభై రెట్లు పెద్దది. ఈవిధంగా పరిస్థితులు చిరకాలం వుండటం దుర్లభం అని చరిత్ర చెబుతుంది. అందరు మానవులకూ సమానహక్కులూ, అన్ని దేశాలకూ సమానహోదా వుంటేతప్ప ప్రపంచపరిపాలన దుర్లభం. అప్పుడే "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అన్నకోరిక సఫలమవుతుంది.



## మోటారుకారు సువర్ణోత్సవము

ఈ కాలంలో మోటారుకారులు ఊరూరా ఉన్నవి. ఇరవయియేండ్ల క్రితం చాలా ధనవంతులు ఏకొలదిమంది మాత్రమో విలాసవిహారాలకోసం వాటిని కొని ఉంచుకునేవారు. యాభయియేండ్లకు మునుపు



చిత్రము ౧ ౧౮౮౬ వ సంవత్సరంలో మొట్టమొదట చేయబడిన ౩, ౪, చక్రాల మోటారుకారులు.



చిత్రము ౨ నవీనతమమయిన బస్సు.

ప్రపంచంలో దాని పేరయినా లేదు. గుర్రాలు అక్కర లేకుండా, పట్టాలు అవసరం లేకుండా మామూలురస్తాల మీద గంటకు యాభయిమైళ్ల వేగంతో పోయే బండి ఒకటి ఏర్పడి యిలాగా ప్రపంచం అంతటా వ్యాపిస్తుం దని ఆకాలంలో ఎవరు కూడా కలలో నయినా అనుకొని ఉండరు. కారల్ బెన్‌వస్ అనే అతడు ౧౮౮౬ సంవత్సరం

అది మూడు చక్రాలతో నడిచేది. గట్‌లియర్ డైమలర్ అనే ఆయన ఆరేడే నాలుగుచక్రాలతో నడిచే మోటారుకారును తయారుచేశాడు. వీరిద్దరూ జర్మనీవారు. మొట్టమొదటి మోటారుకారు పుట్టి యీ యేటికి యాభయి యేండ్లయింది. కాబట్టి సువర్ణోత్సవం చేయబడింది.

ఉత్సవ సమయంలో మొట్టమొదటి బండ్లు రెండును, నేటి సరికొత్తబండ్లును ప్రదర్శింపబడినవి. ప్రదర్శింపబడినవాటిలో అన్నింటికంటె కొత్తది బస్సు. ఇది డిజిల్ మోటారుతో నడపబడుతుంది. దీంట్లో ౨౧ మంది యెక్కవచ్చును. గంటకు ౭౫ మైళ్ల వేగంతో ఇది నడుస్తుంది. (అను. [illegible])

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచధర్మపరిణామమునందు స్వస్తివచనములు సమరకార్యములు మహత్త్వమునకు ప్రమాణములైనవి. రాజ్యనీతికి మాయమాటలు, ముష్టి ప్రహారణములు పరమప్రమాణములు, జీవాయుధములు స్వస్తి వచనములు స్వార్థములందు మహాసంగ్రామ ప్రయత్నములు. ప్రపంచ వ్యవహారములందు ధర్మ ప్రతిష్ఠను బడసినవి. హారు, ఈడెను, బాల్డువిను, లావెలు మొదలగు నాయకుల ధర్మోపదేశములు ముస్సులోని హిట్లరు గారి ప్రగల్భములువలెను పరిహాసపాత్రములుగ నున్నవి. ప్రపంచ వ్యవహారములందు నానాజాతి సమితి ప్రతిష్ఠ యంతరించి ఆయుధధారణప్రతిష్ఠ వర్ధిల్లినది. రుష్యా, జర్మని, ఫ్రాన్సు, గ్రేటు బ్రిటను, ఇటలి, జపాను రాజ్యము లారాధించుచున్న ఆయుధ ధారణ విజృంభణము మహాప్రళయమునకును ధర్మ నాశనమునకును సాధనముగాగల విధమునకు స్పెయిను సంగ్రామము ఘోర వ్యాఖ్యానము. స్పెయినునందు ప్రజా స్వామ్యవాదులును, ఫాసిస్టు వాదులును చేయుచున్న స్వదేశ స్వబంధు సంహారము సర్వసంహార మార్గమును సూచించుచున్నది. యూరపు రాజ్యములందు ప్రజాస్వామ్యవాదులును, ఫాసిస్టువాదులును పరస్పరసంహారార్థము చేయుచున్న ప్రయత్నములు భయంకరములైనను అనివార్యములుగ నున్నవి. ప్రపంచ ధర్మ పరిణామమునందు నవధర్మస్థాపనమునకు నిర్మాణమువలెను ప్రళయమును పరమార్థ సాధనము. యూరపు రాజ్యము లారాధించుచున్న సంహార సాధనము పరమార్థమునకు గాకను పరమానర్థములకును సాధనముగాగల విధమును ప్రపంచవ్యాప్తమైన విప్లవోద్యమములు విశదముచేయుచున్నవి. ప్రాచీన స్వత్వ సంరక్షణార్థమై వ్యక్తులు, సంఘములు, జాతులు చేయుచున్న విశ్వప్రయత్నములు సర్వసంహారమునకు వినియోగపడగల విధమును అబిసీనియా స్పెయినుసంగ్రామములు వెల్లడిచేయుచున్నవి. ఇటలీ యవలంబించినవిజయయాత్రలును, స్పెయినుపూని న విప్లవమార్గమును సమాన ఫలమును గలుగజేయుట ప్రకృతి ధర్మము. యూరపు రాజ్యములందు తాండవమాడుచున్న విప్లవదేవత ప్రపంచమునందంతటను తన ప్రతిష్ఠను వ్యాపింపజేయుచు ప్రళయ తాండవమునకు సాధనభూత మగుచున్నది. స్పెయినునం దుపక్రమణమైన ఫాసిజముసంరంభము విశ్వవ్యాప్తమైన మహాసంగ్రామ పరిణామమును పొందుట యనివార్యము. యూరపు రాజ్యములందు వ్యాప్తమైన భావసంరంభము ఆసియాయందును విజృంభించుచున్న విధమును జపాను విజృంభణము, చీనా పలస్తీ

ను హిందూస్థాన విప్లవములున్ను విశదము చేయుచున్నవి.

* *

హిందూస్థాన పరివర్తనము

ప్రపంచవ్యాప్తమైన మానవ స్వాతంత్ర్యధర్మపరివర్తనము హిందూస్థానమునకును అనివార్యము. బ్రిటిషుప్రభుత్వాధికారులు, సంస్థానాధీశులు రాజ్యాంగసంస్కరణవ్యాజముననను స్వార్థరక్షణార్థము చేయుచున్న విశ్వప్రయత్నములు ప్రజానాయకుల లక్ష్యమును తాత్కాలికముగను విభేదములకు కారణములైనను పాశ్చాత్యరాజ్యములందువలెను మహావిప్లవమునకు మూలములగుట ప్రకృతిధర్మము. పసిపిల్లలకు "చందమామ రావె జాబిల్లి పోవె" యను పాటవలెను ప్రజానాయకులకు సంస్కరణములు సమ్మోహమును కలుగజేయుచున్నవి. స్వార్థసంరక్షణమునకై అనంతమైన పక్షములు బయలుదేరినవి. ప్రజాపక్షము, న్యాయపక్షము, డెమక్రాటికు పక్షము, జాతీయపక్షము, స్వతంత్రపక్షము మొదలయిన వనేకము కుక్కగొడుగులువలె దేశమునందుద్భవిల్లినవి. ఎలెక్షనులు దగ్గరకు వచ్చినకొలది ఇంకను ఎన్నియో పార్టీలు జన్మింపవచ్చు. ముఖ్యముగా మనరాష్ట్రములోని పక్షము లన్నియు వ్యక్తుల అపేక్షలను పునాదిగా కలిగి సంకుచితదృష్టిని కలిగి యున్నవి. ఆయా ప్రాంతములందు వ్యక్తులమధ్య నున్న పరస్పరవైరుద్ధ్యములే ఈ పక్షము లుద్భవించుటకు కారణము. వీరి కార్యక్రమముకూడ విశాలదృష్టిని ఏమాత్రమును వెల్లడించదు. అఖిలభారత సమస్యఅనునది వీరికి లేనేలేదు. మద్రాసు రాజధానిలో తప్ప ఈ పక్షములకు పలుకుబడి ఆవగింజంతయినను లేదు. కేపు కామరెన్ మొదలుకొని హిమాలయములవరకు కాంగ్రెసు తనసంస్థను ప్రతిగ్రామమందును నెలకొల్పి భారతదేశమునకు స్వాతంత్ర్యము సంపాదించుటకు ఏబదిసంవత్సరములనుండి పాటుపడుచు సర్వతోముఖమగు సేవను చేయుచున్నది. భారతజాతి భాగ్యమును దృష్టియందుంచుకొని అది కార్యసాధనకు కడంగును. వ్యక్తుల జేబులను నింపుకొని, సంఘశ్రేయమను పేరిట సంఘవిద్వేషముల రెచ్చగొట్టు పార్టీల సంకుచిత కార్యక్రమము కాదు కాంగ్రెసుది. అట్టి కాంగ్రెసు రాబోవు శాసనసభల ఎన్నికలందు పాల్గొనబోవుచున్నది. ఎన్నికల ప్రణాళిక ఇదివరకే ప్రచురింపబడినది. నూతనసంస్కరణలను భగ్నపరచి వాని స్థానే పూర్ణస్వరాజ్యమును స్థాపింపజేయుట కాంగ్రెసుఆశయము. కాబట్టి దేశభక్తిగల ప్రతిభారతీయుడును తనఓటును కాంగ్రెసున కిచ్చి సత్వరస్వరాజ్యసిద్ధికి తోడ్పడుగాక!

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.